పుస్తకం

# సుపర్తి అబ్బయామాత్యుని

## కృతుల పరిశీలనము




డా॥ వారణాసి వీరనారాయణ శర్మ

శ్రీ

'భక్తకవి'

# కనుపర్తి అబ్బయామాత్యుని కృతుల పరిశీలనము

ఉస్మానియా విశ్వవిద్యాలయమునుండి
డాక్టరేట్ పట్టము నొందిన
సిద్ధాంత గ్రంథము

డా॥ వారణాసి వీరనారాయణ శర్మ
ఎం. ఏ., ఎం. ఫిల్., పిహెచ్. డి., బి. ఇడి.
ఆంధ్రోపన్యాసకులు
ప్రభుత్వ కళాశాల, గద్వాల.

'BHAKTA KAVI'
KANUPARTI ABBAYĀMATYUNI
KRITULA PARISEELANAMU
Ph. D. THESIS

By **Dr. V. V. N. SHARMA**

ప్రథమ ముద్రణ : శ్రీ విభవ మాఘము 1989

ప్రతులు : వేయి





Price Rs. 60/-
... Copies
... Dept
... Sharma
...
Govt. College, SIDDIPET-502 103.

ముద్రణ : శ్రీ రామకృష్ణ ప్రింటర్స్
వినాయకనగర్,
మిర్యాలగూడ – 508 207

# అంకితము

"కుంభినీధవుఁ జెప్పెడు గురుడు గురుడు
తండ్రి! హరిఁ జేరు మనియెడు తండ్రి తండ్రి"

అను పోతనామాత్య ప్రణీత ప్రహ్లాద వచనమును మంత్రముగ
ఆచరణలో బోధించిన మత్ పితృపాదులు
భాగవత పురాణ ఫలరసాస్వాదన రసికభావవిదులు

**కీ॥ శే॥ వారణాసి నరసింహరామయ్యగారిని**

సంస్మరించుచు

తండ్రికిని దైవమునకు నభేదము పాటించి
మా కులదైవమైన

## శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామి వారికి

భక్త్యంజలితో
సమర్పణము

— గ్రంథకర్త.

ఈ గ్రంథము
తెలుగు విశ్వవిద్యాలయము వారి
ఆర్థిక సహకారముతో ముద్రితము.

వారికి కృతజ్ఞతలు.

డాక్టర్ కూరెళ్ళ విఠలాచార్య
ఎం. ఏ., ఎం. ఫిల్., పిహెచ్. డి., బి. ఇడి.,
అధ్యక్షులు
'సాహితీ స్నేహితులు'
సాహిత్య సాంస్కృతిక సంస్థ
రామన్నపేట - 508 113
జి. నల్లగొండ. (ఆం. ప్ర.)

# ఆత్మీయం

డాక్టర్ వారణాసి వీరనారాయణశర్మగారు, అందరూ వీరిని వి. వి. యన్. శర్మగారని అంటారు, మా నల్లగొండ పరిశోధకమండలి అధ్యక్షులు. మా పరిశోధక గ్రంథాలను మా అధ్యక్షుని 'అభినందనవచస్సు'తో ప్రకటించుకోవడం మా సంస్థ సంప్రదాయం. అది మా కానంద ప్రదం. అందులో మా శర్మగారు ఓ పలుకు పలికారంటే, ఓ పరమార్థ ముంటుంది. ఓ పంక్తి రాశారంటే, ఓ ప్రామాణ్య ముంటుంది. అటువంటి అసలుసిసలైన పరిశోధనాతపనులు డాక్టర్ వారణాసివారు. వారి సిద్ధాంతగ్రంథానికి నాలుగు మంచిమాటలు రాసే అదృష్టం నా కబ్బిందంటే- వీరు మా ఇంటిల్లిపాదికీ అత్యంతాప్తులు, వీరికీ నాకూ ముప్పదేళ్ళ సాహిత్యబాంధవ్య ముంది. వీరూ నేనూ ఎం. ఫిల్. లో సతీర్థ్యులం ఈ చుట్టరికమే నాకీ అర్హతను కలిగించింది.

డాక్టర్ శర్మగారు అనేక గ్రంథాలయాలు తిరిగి, అనేక గ్రంథాలను తిరగేసి, పదునెనిమిదవ శతాబ్దం మధ్యభాగాన ప్రబంధకవిగా ప్రకాశించిన శక్తికవి కనుపర్తి అబ్బయామాత్యుని గూర్చి, తెలుగు సాహిత్యంలో మణిపూసలు, తెలుగు భాషకు అలంకారాలైన ఆయన 'అనిరుద్ధచరిత్రం, 'కవిరాజమనోరంజనం' కృతుల గూర్చి ఈ సిద్ధాంతగ్రంథంలో సమగ్రంగా, సప్రమాణంగా పరిశీలించి చూపారు.

డాక్టర్ వి. వి. యన్. శర్మగారు ఉత్తమకవి, సద్విమర్శకులు, మంచివక్త, సంప్రదాయ సాహిత్యాభిమానియైనా, అన్ని నూతన ప్రక్రియలపట్ల ఆసక్తి గలవారు జాతక ముహూర్త సిద్ధాంతభాగాలు బాగా అభ్యసించినవారు, ఆధ్యాత్మిక తత్త్వాన్ని

ఆకళింపుకున్నవారు, ఎంత గహనమైన విషయాన్నైనా చమత్కారాన్ని రంగరించి, సులభంగా బోధపరచే అధ్యాపక వతంసులు. ఇలా సద్గుణసంపత్తిని సంతరించుకున్న ఉదాత్త సంస్కారులు మా ప్రియమైన నేస్తం ఈ డాక్టర్ గారు. వీరి అనవరతకృషికి, కఠోరదీక్షకు, నిరంతర పరిశోధనా వ్యాసంగానికి ఫలం "భక్తకవి కనుపర్తి అబ్బయామాత్యుని కృతుల పరిశీలనం". ఈ ఉత్తమకృతిద్వారా సాహితీలోకానికి క్రొంగ్రొత్త విషయాలనెన్నింటినో తెలియపరచిన సాహితీ తపస్వి డాక్టర్ వీరనారాయణశర్మ గారు ధన్యులు. వీరికి నా హృదయపూర్వక అభినందనలు. డాక్టర్ శర్మగారి పరిశోధనా పర్యవేక్షకులు పూజ్యులు ఆచార్య డాక్టర్ ఎమ్. కులశేఖరరావుగారు నాకూ గురుదేవులే. వారికి నా భక్తిపురస్సరంగా ప్రణామాలు.

డాక్టర్ శర్మగారు మా రామన్నపేటకు మిక్కిలి సన్నిహితులు. వీరి ఆచార్యకం ఇక్కడి నుంచే ప్రారంభమైంది. ఈ ప్రాంతంలో ఉపాధ్యాయులుగా, ప్రధానోపాధ్యాయులుగా ఉద్యోగం నిర్వహించడమే కాకుండా ఇక్కడి రాష్ట్రోపాధ్యాయసంఘశాఖకు అధ్యక్షులై అధ్యాపకుల సాధక బాధకాలల్లో పాలుపంచుకున్నారు. వీరికిక్కడ ఛాత్రులూ మిత్రులూ చాలా మంది ఉన్నారు. ఈ బలగమంతా వీరి సిద్ధాంత గ్రంథావిష్కరణ ఇక్కడ జరుగాలని కోరుకుంటున్నారు. ఈ ఆకాంక్షను డాక్టర్ శర్మగారు ఆప్యాయతతో అంగీకరించారు. ఈ ఉత్సవాన్ని ఈ మధ్యకాలంలో మా "సాహితీస్నేహితులు" సాహిత్య సాంస్కృతిక సంస్థ, రామన్నపేట ఆధ్వర్యాన నిర్వహించుకోబోతున్నామని తెలియజేయుటకు సంతోషిస్తున్నాం. ఈ సదవకాశం కలిగించిన సహృదయులు డాక్టర్ వారణాసి వీరనారాయణశర్మగారికి మా మనసార ధన్యవాదాలు చెప్పుకుంటున్నాం. వీరి సాహితీవ్యాసంగం ఉత్తమమైన, ఉత్కృష్టమైన, రచనలచే పెల్లివిరియాలని కోరుకుంటున్నాం. సరస్వతీదేవి కటాక్షించాలని వేడుకొంటున్నాం.

శుభాభినందనలతో

22-3-1989

కూరెళ్ళ విఠలాచార్య

# తొలిపలుకు

గురు ర్బ్రహ్మ గురు ర్విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః

ఆధ్యాత్మిక విద్యకైనను, సాహిత్య విద్యకైనను మరే విద్యకైనను గురువే మూలాధారము. పరిశోధన విద్యారంగమునఁ బ్రవేశింప నుద్యమించిన నాకు గురువును చూపిన గురువు అప్తులు ఆచార్య మొదలి నాగభూషణశర్మ గారు. వారి పరిచయ వాక్యములే ఆచార్య కులశేఖరరావు గారితో నాకు విడదీయరాని యనుబంధమును సాధించి పెట్టినవి. వారిరువురకు నేను సదా కృతజ్ఞుడను ఆచార్య కులశేఖరులతోఁ బరిచయమైన ముహూర్తము బలవత్తరమైనది. 1977_1987 దశాబ్ది పర్యాప్తమైన నా శిష్యరికము నాకు ఎం. ఫిల్. మరియు పిహెచ్. డి. పట్టములను ప్రసాదించినది. ఇది నాకు జీవితమున మరువరాని మధుర ఘట్టము. ఆచార్య కులశేఖరుల యాదరాభిమానములు నన్ను కృతార్థు నొనర్చినవి. అవ్యాజానురాగ విలసితములైన వారి యాదేశపూర్వక సూచనలే నాకు సకలార్థసిద్ధి ప్రదములైనవి. వారి సూచన మేరకే 'భారతోద్యోగ పర్వమున శ్రీకృష్ణ ప్రాముఖ్యమును' గూర్చి పరిశోధించి ఎం. ఫిల్. పట్టము పొందిన నన్ను 'కనుపర్తి అబ్బయామాత్యుని కృతుల' పరిశీలించుట కనుమతించి, పిహెచ్. డి. పట్టము నొందుట కర్హునిగా తీర్చిదిద్దిన సౌజన్యమూర్తి మా కులశేఖరార్యులు. వారి పర్యవేక్షణలో నేనెంతో సంతోషముగ నా యీ కృషిని కొనసాగించితినని చెప్పుకొనుటకు గర్వించుచున్నాను. నా యీ సిద్ధాంత వ్యాసము నేడిట్లు ముద్రణకు నోచుకొన్నదన్న నిది వారి యాశీర్వాదబలమే యని దృఢముగ విశ్వసించుచున్నాను. వారి ఋణముఁ దీర్చుకొనుటకు నే నశక్తుడను. శ్రీకృష్ణ సాన్నిధ్యమును గూర్చిన యగ్నిద్యోతనునకు, శ్రీరుక్మిణీసన్యపలె, మనసార నమస్కరించుటకన్న వేరు మార్గము తోచక స్తుతి పూర్వకముగ నమస్కరించుచున్నాను.

# గురుస్తుతి

శ్రీకృష్ణచరిత్రామృత పానరతులు శ్రీనివాస స్తుతినిరతులు
కావ్యానుశీలనవ్యగ్రులు పరిశోధితాంధ్రవచన వాఙ్మయ వికాసులు
సంపాదిత సింహగిరి వచనామరచరిత్రులు
కవన కుశలురు కార్యశూరులు
రుచిరాలోకనచక్షులు సదసద్విచక్షులు
విద్యావార్నిధులు శిష్య వాత్సల్య నిధులునగు
శ్రీ మడుపు కులశేఖరరాయలకు శతసహస్ర నమోవాకములు

సౌమ్యతాగుణమ్మున నెన్న సాటి బుధుడు
వరదయాగుణమ్మున విందుధరుడుసాటి
పరసగాంభీర్య గుణమున జలధిసాటి
అరయ విద్యాధికతసాటి గురువొకండె

పలుకు పలుకున మధురిమ పలుకరించు
చూపుచూపున ప్రేముడి చుట్టుకొనును
శిష్యవాత్సల్య గరిమ వశిష్ఠుబోలు
గురుని నుతి సేతు నతి సేతు కోరి కొలుతు

కాగల కార్య మేదయిన కాదన కాదట సేయనేర్చు, తా
వీగల విద్యలన్ సకలమీయగ నేర్చు నుదారబుద్ధి, భా
షాగరిమంబు చాలదు విచారము సేయగ నాకు, నిద్ధరన్
మాగురువంచు చెప్పికొన మా కులశేఖరరాయలే తగున్

'మొదలి' పరిచయమెంత సమ్మోదకరమొ
మూడు పూలారు కాయల ముచ్చటాయె
సాధుజన సంగమంబు ప్రజ్ఞాకరంబు
గురుకృపాయత్త చిత్తమద్గురుc దలంతు

ఎవ్వాని పరిచయం బింతంత వృద్ధియై
గురుశిష్య భావసంభరితమయ్యె
ఎవ్వాని విజ్ఞాన వీచీ పరిమళంబు
సాహిత్య శోధనాసక్తి గూర్చె
ఎవ్వాని ప్రేముడి విడనాడగా రాని
ప్రేమానుబంధమై పెంపునొందె
ఎవ్వాని వాత్సల్య మింతవానిగ దీర్చి
ఆత్మ విశ్వాసమ్ము నలవరించె

అట్టి గురునకు కులశేఖరార్య ఘనున
కెంతొ ఋణపడియుండి కాసంతయైన
తీర్చుకొనజాలనైతి, నానేర్చు విధము
రెండు చేతులు జోడించి దండమందు

— వారణాసి వీరనారాయణశర్మ

# అభినందనలు

— ఆచార్య ఎం. కులశేఖరరావు

డా॥ శ్రీ వి. వి. ఎన్. శర్మగారు రచించిన 'కనుపర్తి అబ్బయామాత్యుని కృతుల పరిశీలనము' అనే సిద్ధాంత వ్యాసం పూర్తిగా చదివే అవకాశం నాకు లభించింది డా॥ శర్మగారు ఎం. ఫిల్. చేస్తున్నప్పటి నుంచి, వారి పరిశోధనా వ్యాసంగాన్ని సన్నిహితంగా గమనించే అవసరం కూడ నాకు కలిగింది. వారి ఈ వ్యాసంగంలో, పరిశీలనాసక్తి, వివేచన మీద వారికున్న శ్రద్ధ, నూతన విషయాన్ని ప్రదర్శించడంలో వారు చూపించిన నేర్పు ఎప్పుడూ నన్ను ఆకర్షిస్తూనే ఉన్నాయి. అందుచేతనే వారి ఈ పరిశోధన వ్యాసం పరీక్షకుల ప్రశంసలను అందుకొన్నది.

రాయలవారు, ఆంధ్ర సాహిత్యంలోని స్వర్ణయుగంలో కావ్యాలను వ్రాసి, వ్రాయించి, ఆంధ్ర ప్రబంధాలను ప్రారంభించిన తరువాత, రెండుమూడు శతాబ్దాల పాటు అటువంటి కావ్యాల రచన జరుగుతూనే వచ్చింది. మానవ జీవితంలో లాగ సాహిత్య జీవితంలో కూడ పరిణామం సహజంగా ఉంటుంది. పెద్దనాది కవులు వ్రాసిన ప్రబంధాలను, వాటిలో ఉండే లోపాలను దర్శించిన తరువాతి కవులు, తరువాత పరిణామాత్మకమైన రచనలు చేసినారు. క్రీ.శ. 18వ శతాబ్దంలో నివసించిన కనుపర్తి అబ్బయామాత్యుడు పరిణత కృతులను రచించి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసినాడు.

అబ్బయామాత్యుడు ప్రబంధ సాహిత్యంలో చాల ప్రఖ్యాతినందినవాడు ఏమీ కాడు. కారణమేమంటే, అతని కాలం వచ్చేనాటికి తెలుగు పాఠకులకు ప్రబంధం అంటే వినడానికి, చదవడానికి అనక్తిపోయింది. బహుశా, అప్పటికి బహుళ సంఖ్యలో — అంటే దాదాపు ఎనిమిదివందలు — ప్రబంధాలు తెలుగులో

వెలువడి ఉండడమే కారణం కావచ్చు. అయినా యీ కవికి ప్రబంధ రచన పట్ల శ్రద్ధ ఉన్నది. నైపుణి ఉన్నది. నూతనత్వాన్ని, పరిణతిని ప్రదర్శించే శక్తి ఉన్నది. అప్పయామాత్యునిలో ఇన్ని మంచి గుణాలను పరికించి కాబోలు డా॥ వి. వి. ఎన్. శర్మగారు, పరిశోధకులు పూర్వం స్పృశించని ఈ విషయాన్ని గ్రహించి చక్కని పరిశోధన గ్రంథం వ్రాసి పిహెచ్. డి. పట్టా పుచ్చుకొన్నారు.

డా॥ శర్మగారి పరిశీలన, విశ్లేషణ కొత్త మార్గాల్లో అనుగమించింది. మొదటి ప్రకరణంలో వారు 18వ శతాబ్దంలోని ప్రబంధం, ఏ విధమైన రూపం సంతరించు కొన్నదో విశ్లేషణాత్మకంగా చర్చించినారు ఈ చర్చ చర్వితచర్వణం కాక, ఆనాటి సాహిత్యవాతావరణం తెలుగుదేశంలో ఏ విధంగా ఉండేదో ఆవిష్కరించ డానికి ఉపకరించింది. ఈ కవి అంతగా ప్రఖ్యాతుడు కాకపోవడం చేత తరువాతి ప్రకరణంలో శర్మగారు, కవి జీవిత విశేషాలను అనేకం సేకరించి, చారిత్రకంగా వాటిని పొందు పరచినారు. భావి పరిశోధకులకు, చారిత్రకులకు ఈ ప్రకరణం ఉపయోగకరంగా ఉంటుంది. నాలుగవ ప్రకరణంలో ఈ పరిశోధకుడు 'అనిరుద్ధ చరిత్రము-శ్రీవిద్య' అనే విషయాన్ని చర్చించినారు. యథార్థానికి ఈ భాగం ఈ గ్రంథానికి ప్రాణప్రదమైంది. శృంగార రసాన్వితంగా, అందునా, ఒక్కొ క్కప్పుడు అతివేలంగా ఉండేటట్లుగా వ్రాస్తున్న ప్రబంధకర్తలకు శ్రీవిద్యతో ఏమి అవసరం అనిపించకమానదు. కాని, సూక్ష్మరీత్యా శ్రీశర్మ గారు శ్రీవిద్యను నిర్వచించి, దానిని ఈ కథకు, అప్పయామాత్యుని మాటల్లోనే అన్వయించి నూత నత్వాన్ని ప్రదర్శించినారు. ఉషాదేవి గర్భవతి యైనది. 'అతివ గర్భాయాన నిశ్శ్వాస మంత్ర సముచ్చారణము సేయ, నాభివివరాంతసీమ యందుండి సాహస భావంబున నిర్గమించి సఫణంబై యాడు నీలాహిరీతి' రోమరాజి చెలువొందెనట. నారదుని నోట ఉషాకన్యను వర్ణించుచు, కవి, బాణుడు సహస్రబాహుఁడనుట, అతని కూతురు ఉషాకన్య రూపయౌవన భాగ్యలక్షణ కళావతి యని చెప్పుట ఈ విశేష మును సూచించుటకే. అధః సహస్రార స్థానీయుడగు బాణుడు సహస్రబాహుఁడనుట, ఉషాదేవి కళావతి యనుట, చిత్రము. యోగవిద్యానిరూఢిని చిత్రరేఖ, యనిరుద్ధుని గొంపోయినదనుట గమనించదగి యున్నది. ........ సహస్రార మండితంబునైన రథమెక్కి, పుండరీకాక్షు డపుడు కదలె సూర్య ప్రకాశుడగుచు .... ద్వారకా

పురము శ్రీసముదంచింతంబగుచు చెల్వొవహించె పురంబు నవ్యమై" ఈ విధంగా, దీనిలోని విషయాలను చెప్పి శ్రీవిద్యతో వాటిని సమన్వయం చేసిన శర్మగారి పరిశీలనాసక్తికి ఆశ్చర్యం కలుగకమానదు.

అబ్బయామాత్యుడు కవిరాజమనోరంజనం అనే పేరు కలిగిన పురూరవ చరిత్రను రచించినాడు. ఈ కథను, ఈ కవి ఎచటనుండి గ్రహించినాడో, ఈ పరిశోధకుడు సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించి ప్రదర్శించినారు. ఋగ్వేదము, శతపథ బ్రాహ్మణము, బృహద్దేవత, వేదార్థదీపిక, విష్ణుపురాణము, బృహత్కథ మత్స్య పురాణము, భాగవతము, భారతము, కథాసరిత్సాగరము మొదలైన గ్రంథాలు ఈ కథకు ఏ విధంగా ఆధారమైనవో సాదృశ్యసహితంగా చూపించి, "అబ్బయామాత్యుడు వివిధ పురాణములందున్న వస్తువును సేకరించి, తన కనువైన విధముగా కూర్చుకొని అనుసరణములకన్న కల్పనలే అధికముగా చేసి ప్రబంధరీతికి పట్టముగట్టినట్లు పురూరవశ్చరితమను నీ కవిరాజమనోరంజనమును నిర్మించెను." అని సిద్ధాంతీకరించినారు. ఈ సిద్ధాంతంలో తర్కబద్ధమైన ఆలోచన ఉన్నది. కాబట్టి ఇది సముచితంగా ఉన్నది.

ప్రబంధాలంటే నాయికల అంగాంగవర్ణనం మాత్రమే ఉంటుంది అనుకోవడం పరిపాటి. కొందరు కవులు ఆ పని చేసినారు కాబట్టి అట్లా భావించడంలో విచిత్రమేమి లేదు. కాని అబ్బయామాత్యుడు తన ప్రబంధాలలో ఎన్నో మంచి పద్యాలు వ్రాసినాడు. అందులో కథానాయకుని చిరునవ్వును వర్ణించే యీ పద్యం తెలుగు సాహిత్యం ఉన్నంతకాలం నిలిచి ఉంటుంది.

ఆ రాజేంద్రుని చెక్కుటద్దములపై వ్యాపించు లీలాదర
స్మేరజ్యోత్స్న విభాప్రసూన విలసజ్జిహ్వాగ్ర సింహాసన
ప్రారూఢస్థితి బొల్చు శారద మనోజ్ఞాకార శోభాసుధా
పూరంబుద్గతమైన చందమున నొప్పున్ లోచనానందమై

ఇంత మంచి పద్యాన్ని ఎత్తి చూపించి డా॥ శర్మగారు, ఈ గ్రంథానికి వన్నె పెట్టినారు. ఇటువంటి విశేషాలు ఈ గ్రంథంలో చాలా ఉన్నాయి. అవన్నీ డా॥ వి. వి. ఎన్. శర్మగారు చేసిన కృషికి, వారి విద్వత్తుకు ప్రదర్శకాలుగా ఉన్నాయి. వారికి నా అభినందనలు.

విజ్ఞానపురి – విద్యానగరం
హైదరాబాద్.
తేది. 24–2–89

సం/–
( ఎం. కులశేఖరరావు )

# కృతజ్ఞతలు

నా యీ పరిశోధనకు శ్రీకారము చుట్టి నా యెడ ననిదంపూర్వమైన యవ్యాజానురాగమున నన్నొక పరిశోధకునిగా తీర్చిదిద్దిన

మద్గురు శేఖరులు ఆచార్య కులశేఖరరాయలకు

ఆప్తులు ఆచార్య మొదలి నాగభూషణశర్మ గారికి

నా యీ కృషికి స్ఫూర్తినిచ్చిన

ఆచార్య బిరుదురాజు రామరాజుగారు

ఆచార్య సి. నారాయణరెడ్డి గారు

ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యము గారు

ఆచార్యా నాయని కృష్ణకుమారి గారు

ఆచార్య కీ॥ శే॥ కే గోపాలకృష్ణరావు గారు ప్రభృతి గురువర్యులకు —

పరీక్షక గురువులు

ఆచార్య ఎస్. వి జోగారావుగారికి

ఆచార్య గంధం అప్పారావుగారికి —

నా పరిశోధనలో సహకరించి ప్రోత్సహించిన

డా॥ యస్ వి. సూర్యనారాయణశర్మ

డా॥ నల్లందిగళ్ శ్రీనివాసాచార్యులు

డా॥ మాడభూషి రంగాచార్యులు

డా॥ కూరెళ్ళ విఠలాచార్యులు

డా॥ వారణాసి భిక్షమయ్యశర్మ

శ్రీ సరస్వతీభట్ల కృష్ణమూర్తి

శ్రీ పంతంగి శివరామశర్మ

శ్రీ వై. లక్ష్మీనరసింహ ప్రభృతి మిత్రులందరికి —

నా యీ కృషికి తోడ్పడిన వివిధ గ్రంథాలయ నిర్వాహకులకు —

ఈ పరిశోధన వ్యాసంగమున కనుమతించిన

ఉన్నత విద్యాశాఖ నిర్దేశక మహాశయులకు —

ఈ గ్రంథమును సకాలమున ముద్రించి యిచ్చిన శ్రీ రామకృష్ణ ప్రింటర్స్ ముద్రణాలయాధిపతి మిత్రులు శ్రీ సూలూరి శివసుబ్రహ్మణ్యము గారికి —

తాను నేనై నేను తానైన నా శ్రీమతికి —

# విషయసూచిక



శ్రీః

ఒకటవ అధ్యాయము

# ప్రబంధావిర్భావ వికాసములు

## 18వ శతాబ్దిలో ప్రబంధ స్వరూప స్వభావములు

ఆంధ్ర సాహిత్యమున పేరెన్నికగన్న కావ్యప్రక్రియ ప్రబంధము. పదునారవ శతాబ్దమున వెలసిన యీ ప్రక్రియ మూడువందల సంవత్సరములు తెలుగునాట కొనసాగి బహుముఖముల విస్తరిల్లినది.

ప్రకృష్టమైన బంధము ప్రబంధము. కాగా ప్రబంధమునకీ నిర్వచన మొక్కటియే సరిపోవుననుటకు వీలులేకున్నది. ఏది ప్రబంధమను విషయమింకను చర్చనీయాంశముగనే యున్నది. పలువురు పరిశోధకు లీమధ్య కాలమున ప్రబంధములను గూర్చి పరిశోధించి నిగ్గు తేల్చుటకు యత్నించిరి. కాని ఖచ్చితముగ ప్రబంధమన నిదియని సూత్రీకరింపఁజాలరైరి.

కందుకూరు వీరేశలింగము పంతులుగారు కనుపర్తి అబ్బయామాత్యుని గూర్చి యిట్లు వ్రాసి యున్నారు. "ఈ కవి యాఱువేల నియోగి బ్రాహ్మణుడు. రాయన మంత్రి పుత్రుడు. కౌండిన్య గోత్రుండు. ఈతని తల్లి నరసమాంబ. అన్న యోగానందము. ఈ కవి యనిరుద్ధ చరిత్రము, కవిరాజ మనోరంజనము అను

రెండు ప్రబంధములను రచియించెను." అని తెలిపి "అబ్బయామాత్యుడు పదునెనిమిదవ శతాబ్ది మధ్యమున నుండినవాడు. ఇతడు 1780 వ సంవత్సర ప్రాంతము వరకు జీవించియుండవచ్చును. ఈ కడా శతాబ్దమునందుండిన ప్రబంధ కవీశ్వరులందరిలోను మిక్కిలి ప్రౌఢుడు. వసు చరిత్రమునకు తరువాత నీతని కవిరాజ మనోరంజనముతో సరితూగఁదగిన ప్రబంధము లొకటి రెండు కంటె నెక్కువగా లేవు." అని వివరించి యున్నారు. ఈ వివరణనుబట్టి ప్రబంధములొక శాఖ కాగా, వసుచరిత్రాదు లాశాఖకు చెందినవని వారభిప్రాయ పడిరని స్పష్టమగుచున్నది.[1]

గురజాడ శ్రీరామమూర్తి గారు పెద్దన గూర్చి వ్రాయుచు: "శ్రీకృష్ణదేవ రాయలు కోరగా పెద్దన దానికి సంతసించి, "మనుచరిత్రం" అను నొక ప్రబంధము రచియించి తెచ్చెను. దానిని సాంతముగ విని కృష్ణరాయ డతనికి విశేష బహుమానంబు గావించెను. ఈ గ్రంథమునఁ బ్రబంధమునకు వలయు వర్ణన లన్నియు నున్నయవి" అని వివరించి యున్నారు. "ప్రబంధమునకు వలయు నన్ని వర్ణనలు" అనుటచే ప్రబంధము లొక శాఖగా వారును భావించినట్లు స్పష్టమగు చున్నది.[2]

శ్రీ కోవెల సుప్రసన్నాచార్యులు గారు 'మహాకావ్యము ప్రబంధము' అను వ్యాసమున ప్రబంధ స్వభావ స్వరూపముల గూర్చి విపులముగా చర్చించి యిట్లభిప్రాయ పడిరి. "ఈ మెలుపులన్నియు సంతరించుకొని తెలుగు భాషలో తొలి స్వతంత్ర మహాకావ్యము అల్లసాని పెద్దనతో నవతరించినది. ఆంధ్ర కావ్య చరిత్రలో దీనివలన పురాణేతిహాసముల యనువాదముల బాహుళ్యమునుండి మలుపు తిరిగినందున యాయన ఆంధ్రకవితా పితామహుడైనాడు. ఈ కావ్యమునకు దీని ననుసరించిన కావ్యములకు తెలుగు సారస్వత చరిత్రములో ప్రబంధమను పేరు రూఢముగా నున్నది." అని తీర్మానించి యున్నారు. ఇదియు నీసాహిత్య ప్రక్రియను, సర్వలక్షణ సహితమైన తొలి తెలుగు స్వతంత్ర మహాకావ్యమును,

1. శ్రీ కందుకూరి వీరేశలింగ కృత గ్రంథములు : 10 వ సం : ఆంధ్ర కవులు: పు: 444–447.

2. కవి జీవితములు : పుట–184.

ప్రబంధముగా చెప్పనట్లయినది.[1] తెనుగున సాహిత్య చరిత్ర రచయితలు పదునారవ శతాబ్దము నుండి సాహిత్య రంగమున వెలసిన మనుచరిత్రాదులనే ప్రబంధములని నిర్దేశించిరి. తమ నిర్ణయమునకు తగినవని తోచిన హేతువులను వారు చూపిరే కాని నిశ్చయముగ సిద్ధాంతీకరింపలేకపోయిరి. మొత్తముమీద తెనుగునాట ప్రబంధములన మనుచరిత్రాదులే యని రూఢియై నిలచినది. ఇట్టి ప్రబంధమును నిర్వచించునెడ పలువురు పండితు లేయే యభిప్రాయములు వెలిబుచ్చిరో గమనింపవలసియున్నది.

"పాణిని కాలమున సామాన్యార్థమున నుండిన ప్రబంధశబ్దము క్రమముగా కాళిదాసు కాలమునకు కొంత ముందే రచనార్థమును పొంది, మొదట పద్య గద్యోభయాత్మకమగు — దృశ్యకావ్యమునకును, పిదప గద్యరచనమగు కథా కావ్యమునకును, నటు పిమ్మట కేవల పద్యాత్మకమగు శ్రవ్య కావ్యమునకును, నా పిమ్మట గద్యపద్యోభయాత్మకమును, శ్రవ్యమునగు చంపూ కావ్యమునకును, ననంతరమున గేయాత్మక శ్రవ్యదృశ్య కావ్యములగు గీత గోవిందాదులకును, పిదప ద్వ్యర్థి చిత్ర కావ్యములకును నిది వాచకమయ్యెను. ఇట్లే శతకాద్యుప కావ్యములకు కూడ ప్రబంధ శబ్దము వర్తించెను. తుదకొక శ్లోకమునకు కూడ నీ ప్రబంధ శబ్దము వర్తించెను. ఇట్లే యిది యలంకార నాట్య వేదాంతాది శాస్త్ర గ్రంథములకును వర్తించెను. ఒక మాటలో చెప్పవలెనన్న సంస్కృతమున ప్రబంధ శబ్దము సమస్త లక్ష్యలక్షణ కావ్య ప్రక్రియలకును, శాస్త్ర ప్రక్రియలకును సమానముగా వర్తించు ప్రబంధమనగా గ్రంథమనదగి యున్నది.[2] అని డా॥ పల్లా దుర్గయ్యగారు తమ అభిప్రాయము తెలిపి, తుదకు నాలంకారికుల కావ్య విభజనమును గూడ పరిశీలించి, ప్రబంధమనగా సంస్కృతమున సర్గబంధమని భావింప వచ్చుననియు, సర్గబంధమే మహాకావ్యమనియును స్పష్టపరచిరి.

తెలుగు కవులు ప్రబంధమును గూర్చి వెలువరచిన యభిప్రాయములం బరిశీలింతము. నన్నయ భట్టారకులు కావ్యశబ్దమునే ప్రయోగించెను. తిక్కన కవీంద్రుడు తాను రచించిన మహాభారతమును ప్రబంధ మండలిగా నభివర్ణించి

1. సహృదయ చక్రము. పుట–51.
2. ప్రబంధవాఙ్మయ వికాసము : పుట–27.

యున్నాడు.[1] అతని యభిప్రాయమున నొక్కొక్క పర్వ మొక ప్రబ
కావుననే "సద్బృశంబులగు పుణ్య ప్రబంధములు దేవసన్నిధినిఁ బ్రశంసిం
నొక్క యారాధనావిశేష" మని తాను భారతము వ్రాయుటకు హేతువుగా
కొనినాడు.[2] పాల్కురికి సోమనాథుడు "బసవపురాణ ప్రబంధ" మ
నాతనికిని ప్రబంధము కావ్యవాచియే. ప్రబంధపరమేశ్వర బిరుదాంకి
యెఱ్ఱన తన నృసింహ పురాణమును ప్రబంధ మనెను. అతడును ప్రబం
కావ్యవాచిగనే వాడియుండెను. శృంగార నైషధ, కాశీఖండములు శ్రీనా
ప్రబంధములుగ వర్ణింపఁబడినవి. 'హరవిలాసము'ను శ్రీనాథుడు శైవప్ర
మనెను పిడుపర్తి సోమన శ్రీనాథుని 'పండితారాధ్య చరిత్రము' ను పద్య ప్ర
మనెను. ప్రబంధ శబ్దము తరువాతి కవులచేతగూడ కావ్యవాచిగనే ప్రయో
బడినది. మనుచరిత్రమునందు ఆశ్వాసాంతములందు 'మహాప్రబంధ'
పేర్కొనబడియున్నది. ఐనను దానిని పెద్దన కావ్యపర్యాయముగ వాడిన
ప్రబంధ కావ్య శబ్దములకు తెలుగు కవులు భేదము పాటించిరట్లు తోచదు.

తెలుగు లక్షణ గ్రంథకర్తలలో ప్రబంధమును గురించి చెప్పిన పిన్న
పెద్దన "నగర ముఖ్యాష్టదశ వర్ణనములచేతఁ బరగునదియు భవ్య ప్రబంధమన
అని చెప్పియున్నాడు. కావ్యములం దష్టాదశ వర్ణనలుండుట సంస్కృతాలంకా
నిర్ణయము. కాగా తెలుగు ప్రబంధము సంస్కృత మహాకావ్యములకన్న విశే
భిన్నించినది కాదు. మొత్తముమీద ప్రబంధమునకు కావ్యమునకు నం
భేదమున్నట్లు పూర్వాంధ్రకవు లెవ్వరును భావించినట్లు తోపదు. డా॥
దుర్గయ్యగారు "విద్యానాథుడు తన ప్రతాపరుద్రీయమున ప్రబంధ శబ్దమును విరి
ప్రయోగించిన తరువాతనే, పూర్వాంధ్రకవు లందరును తమ గ్రంథము
తరచుగ ప్రబంధములనుచును వచ్చిరి."[4] అని భావించిరి.

---

1. ఆంధ్ర మహాభారతము : విరాట- 1-8.
2. " " " 1-31.
3. కావ్యాలంకార చూడామణి : 3-91
4. ప్రబంధ వాఙ్మయ వికాసము : పుట. 61

ప్రబంధములను గూర్చి యాధునిక కాలమున పరిశోధకు లెట్లు భావించిరో అరసి చూడవలసియున్నది. కందుకూరి వీరేశలింగము పంతులుగారు "పురాణముల నుండి కథనుగైకొని, స్వకపోలకల్పనలను విశేషముగా జేర్చి పెంచి చెప్పిన, కేవలాంధ్రీకరణలు కాని రచనలు ప్రబంధములు"[1] అని తెలిపియున్నారు. "పురాణేతిహాసముల లోని యుపాఖ్యానములను చేపట్టి స్వకపోల కల్పనలచే దానిని పెంపుజేసి, యష్టాదశ వర్ణన లందుఁ జొప్పించి రసాభివ్యక్తికిని, పాత్ర చిత్రణము నకును, ఎక్కుడు ప్రాధాన్య మొసంగి, శబ్దార్థాలంకారసహితముగా సాగించిన రచన ప్రబంధ"[2] మని పింగళి లక్ష్మీకాంతము గారు అభిప్రాయపడిరి.

"పెద్దనాదులు పురాణముల నుండి ఇతివృత్తమును గ్రహించి వర్ణనాదులచే దానిని పెంచి ధీరోదాత్త నాయకములును, శృంగార రస ప్రధానములును, పంచమాశ్వాస పరిమితములును, ఐన కావ్యములను అలంకారికమైన శైలిలో వ్రాయుట కారంభించిరి. వీటికే ప్రబంధము లని పేరు" అని దివాకర్ల వెంకటావధాని గారభిప్రాయపడిరి.[3] "ఏకనాయకాశ్రయమై, పంచసంధి సంయుతమై శృంగార రస ప్రధానమై, యర్థాతిశాయియైన శబ్దమును గ్రహించి యాలంకారిక సాంకేతికము లకు విధేయమై, యనతి విస్తృతిగల యితివృత్తముతో భాషాంతరీకరణముగాక స్వతంత్రరచనయే యైన తెలుగు కావ్యము ప్రబంధము."[4] అని డా॥ కాకర్ల వేంకటరామ నరసింహముగారు అభిప్రాయ పడియున్నారు.

"రచనా విధానములో, కథా వస్తువులో, పాత్ర చిత్రణములో, రస పోషణములో, అలంకార వర్ణనాదికములో ప్రబంధము క్రొత్త రీతులను సంతరించు కొన్న కావ్యప్రక్రియ" అన్నారు డా॥ సి. నారాయణరెడ్డి గారు.[5]

---

1. ఆంధ్రకవుల చరిత్రము: భాగ-1. పీఠిక-పుట: XII
2. సాహిత్య సమాలోచనము: పుట-55
3. (ఆంధ్ర వాఙ్మయ చరిత్రము) సంగ్రహ విజ్ఞాన ఆంధ్రకోశము సం. I పు. 576.
4. ఆంధ్ర ప్రబంధములు-అవతరణ వికాసములు : పుట 13
5. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు :- పుట. 119

"నేడు విమర్శకులు చెప్పే ప్రబంధ లక్షణాలన్నీ ప్రబంధాలన్నిటికీ తూచా తప్పకుండా సమన్వయించేవి కావు. చాలావరకు లక్షణాలు వసుచరిత్రను లక్ష్యంగా పెట్టుకొని రూపొందించినవే. నిజానికి పెద్దనాదు లొక్కొక్కరూ, తమ తమ ప్రబంధాలలో ఒక్కొక్క నూతన ప్రయోగాన్ని చేశారు. ప్రధానంగా వస్తువులో రచనలో"[1] అని డా॥ జి. వి. సుబ్రహ్మణ్యము గారభిప్రాయపడియున్నారు.

"ప్రబంధానికీ పురాణానికీ తేడా కథనం, వర్ణన వీటి ఎక్కువ తక్కువల లో మాత్రమే" అని తెలిపి డా॥ వెల్చేరు నారాయణరావు గారు "శ్రోతల దృష్ట్యా చూస్తే పురాణానికీ, ప్రబంధానికీ రచనా రీతిలో వున్న తేడా స్పష్టంగా కనిపిస్తుంది. పురాణానికున్న ద్వికర్తృకత్వం ప్రబంధానికి లేదు. అంటే శ్రోతలకు చదివి వ్యాఖ్యానించ వలసినది కాదు ప్రబంధం" అని వివరించారు.[2] డా॥ యం. కుల శేఖరరావు గారు ప్రబంధ శబ్ద విచారమొనర్చుచు, దక్షిణ భారతమున అళ్వారుల చరిత్రములు దివ్య ప్రబంధములుగా పిలువబడెనని తెలిపిరి. వానిని చూచి అట్టి విష్ణుభక్తుల కథలనే కూర్చి శ్రీకృష్ణదేవరాయలు 'అముక్తమాల్యద' ను ప్రబంధ ముగా పేర్కొనిరనియు అవరుసలోనే ఆ కవి రాజు ననుసరించి ఇతర కవులు కూడ తమ కావ్యములను ప్రబంధములని చెప్పుకొనుట జరిగి యుండ వచ్చుననియు విపులముగా చర్చించి, తుదకు, "ఏది యెట్లయినను అముక్తమాల్యదా రచనము నుండియే పదునారవ శతాబ్దము నందలి కావ్యములను, తత్సన్నిభములైన తర్వాతి కావ్యములను, ప్రబంధములనుట పరిపాటియైనది. అదియే ఒక సాహితీ సంప్రదాయమైనది."[3] అని నిర్ణయించినారు.

సావధానముగ యోచించినచో తెలుగుదేశమున పదునారవ శతాబ్దమున వెలసిన మనుచరిత్రాదులు వినూత్న సాహిత్య ప్రక్రియను తెనుగునాట నెలకొలిపినవనుట యథార్థము. వీని కీ పేరు వచ్చుటకు, సంస్కృత సాహిత్య ప్రభావము కారణము కాదని సూటిగ చెప్పవచ్చును. కాగా డా॥ యం. కులశేఖరరావుగారి యభిప్రాయము

---

1. వివేచన : ప్రథమ సంచిక : పుట :
2. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం : పుట :
3. వివేచన : మూడవ సంచిక : పుట : 39

ననుసరించి ద్రావిడ ప్రబంధము పేరు స్థిరపడినదని నిశ్చయించుటయే సమంజస మనిపించును. ఐనను ప్రబంధముల తత్త్వమింకను తరచి చూడవలసియున్నది.

ప్రబంధములందలి వస్తువు, పాత్రలు, రచన, రసము అను నాల్గంశములను పరిశీలించినచో, ప్రబంధ లక్షణము మరికొంత స్పష్టము కాగలదు. ఇందు వస్తువున కన్న వర్ణనకు ప్రాధాన్యమెక్కువ. వస్తువున కనుగుణముగా వర్ణనసేయుట కవిత్రయము వారి నుండి వచ్చిన రీతి. కాగా ప్రబంధములందు వర్ణన కొఱకై వర్ణన చేయబడుటయు, వర్ణన కొఱకు వస్తువు కల్పింపబడుటయు జరిగినది. ప్రబంధము లందు వస్తువు సాధారణముగ మిశ్రమో, కదాచిత్తుగ కల్పితమోయై యుండును. మనుచరిత్రాదులందు ప్రఖ్యాతమగు వస్తువునకు కల్పన మధికముగా జోడించఁ బడుట కావ్పించును. కాగా కళాపూర్ణోదయము నందలి వస్తువు కల్పితమని భావింప బడినప్పటికిని, పరిశోధకు లీ విషయమును అన్యథా నిశ్చయించిరి. శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారు కళాపూర్ణోదయమునకు మూలమైన కథ లింగపురాణము నుండి గ్రహింపబడినదని ప్రప్రథమమున తెలిపిరి.[1] గుమ్మడం రామకృష్ణ రాయణం గారు "పింగళి సూరన కళాపూర్ణోదయముపై వాల్మీకి అద్భుత రామాయణ ప్రభావము కల"దని సమగ్రముగ చూపిరి.[2] కనుక ప్రబంధములందలి వస్తువు, ప్రఖ్యాతమైన స్వల్పాంశమునకు కల్పనాధిక్యము జోడింపబడి, రమ్యతరమొనర్ప బడినదని భావింపవచ్చును. పాత్రముల విషయమును నిట్టిదియే. ప్రబంధములందలి పాత్రలు కేవల పురాణ పాత్రలవలెగాక, సజీవములై సహజముగ కనిపించుట విశేషము. నాటి సామాజిక, నైతిక, రాజకీయ రంగముల స్వభావమును ప్రతి బింబించునవిగా తోచును. వీని యందు రచన శ్లేషకు, వక్రోక్తికి, చమత్కార మునకు ప్రాధాన్యమిచ్చి సాగినది. తెలుగు పద్యశిల్పము సమగ్రమై సర్వజనా హ్లాదియై పరిఢవిల్లినది. శబ్దార్థాలంకార ప్రయోగమునందు, కవి ప్రౌఢోక్తికి ప్రథమ స్థాన మీయబడినది. సంవిధాన కౌశలము, సంవాద శిల్పము, శాస్త్రార్థ సూచనము మొదలగువాని యందు విశిష్టఫణితులు సాధింపబడినవి. ఇక రసవిషయమున శృంగారమే సాధారణముగ అంగిరసమై యలరారినది. సంభోగ శృంగారము

1. భారతి : డిసెంబర్ ' 1941 పుట :-
2. " సెప్టెంబర్ ' 1975 పుట :-

విప్రలంభ శృంగారము, పూర్వరాగ శృంగారముతోపాటు శృంగార రసాభాసము సైతము వర్ణింపబడినది. ముఖ్యముగా శృంగార రసము పై విధ్యమును సంతరించు కొన్నదని చెప్పవచ్చును. మొత్తము మీద నొక్క మాటలో చెప్పవలయునన్న వస్తు, రచన, పాత్ర,రసాదుల యం దీ కాలమున పూర్వముకన్న భిన్నమైన ధోరణిని వినూత్న ప్రయోగము లొనర్పబడినవనియు, ప్రబంధము సరసజన హృదయాహ్లాద జనకముగ రూపొందినవనియు, నిశ్చయముగ చెప్పవచ్చును.

ప్రబంధమును గూర్చి సమగ్రముగ తెలియగ వలయునన్న దాని యావి ర్భావ వికాసములను గూర్చి పరిశీలింపవలసియున్నది. ఆది నుండియు కన్నడ సాహిత్యము, తెలుగు సాహిత్యము ఒకటి వెనుక నొకటి నడచి వచ్చుచున్నవి. వాని చరిత్ర ఇంచుమించు నొక విధముగనే సాగినది. కన్నడ సాహిత్యమునందు వచ్చిన మార్పులు కొలది కాలముగడచిన తదుపరి తెలుగు సాహిత్యమున గలుగుట, ఈ రెండు సాహిత్య చరిత్ర లెరిగిన యెల్లరకు సువిదితము. భారత రామాయణముల అనువాదము కావ్యరచనము, వచనగేయ వాఙ్మయ వికాసము మొదలగు వాని విషయమున పరిశోధకుల కాశ్చర్యకరమైన సామ్య మీ రెండు సాహిత్యములందు కాన్పించును.

యం. యస్. మహంతయ్య (రం. శ్రీ. ముగళి) గారిచే కన్నడ సాహిత్య చరిత్రలో, "వేయి సంవత్సరముల కర్నాటక ఇతిహాసమున నృత్య నాటక ప్రధాన మగు రంగభూమి యుండెనని తెలియుట కాధారములున్నవి. కాని 17వ శతాబ్ది యందలి సింగనార్యుడు రచించిన 'మిత్రవిందాగోవిందా' నాటకము వరకు వ్రాత పూర్వకమగు నాటకమేదియు గోచరించదు." అని వివరింపబడినది.[1] పైగ్రంథము నందే మఱియొకచోట గదాయుద్ధమునుగూర్చి ఇట్లు వ్రాయబడియున్నది. " 'గదా యుద్ధము' చదువదగిన కావ్యమై ఉన్నను, ప్రదర్శించుటకుపకరించు నాటక స్వరూపమును అనేక స్థలములలో దాల్చినది, అందులోనే దాని విశిష్టత ఉన్నది. పూర్తి కావ్యమును సుమారు పది దృశ్యములుగా విభజించవచ్చును.[2]" రాఘవాంకుని గూర్చి మరియొకచోట నిట్లున్నది. "రాఘ వాంకుని కావ్యసిద్ధికి గొప్ప నిదర్శనము,

1. కన్నడ సాహిత్య చరిత్రము ; పుట : 209, 210.

'హరిశ్చంద్ర కావ్యము' హరిశ్చంద్ర కావ్యమున ఎల్లెడల నాట్యప్రతిభ యద్భుత రమ్యముగా ప్రకాశించినది. అది మూల సత్యమున చాల ప్రభావయుతమగు నాటకమనునది నిజము. రన్న కవి తరువాత రాఘవాంకుడే గొప్ప నాటక గుణము గల కావ్యమును కన్నడమున కిచ్చినాడు."[1] రన్నడు పదియవ శతాబ్దము వాడు. రాఘవాంకుడు మధ్య కాలము వాడు. 12, 13 శతాబ్దములకు సంబంధించినవాడు. ఈ కవుల రచనలయందలి నాటకీయత సహితము తెలుగు కవులను సమాకర్షించి, ప్రబంధ రచనకు ప్రేరణ కలిగించి, యుండునని భావింపవచ్చును. "నన్నిచోడుడు అనుసరించిన ప్రబంధమార్గములకు, ఈ కాలపు కన్నడ కవులే మార్గదర్శకులని చెప్పవచ్చు. మార్గ దేశి మొదలైన పారిభాషిక శబ్దములు, చిత్ర కవితలు, అష్టాదశ వర్ణనలు, కావ్యానికి ప్రబంధమనే శబ్ద ప్రయోగం పంప కవి కాలము నుండే వాడుకలో ఉన్నాయి."[2] అని డా॥ ఆర్. వి. యస్. సుందరంగారు తెలిపిరి. పై దానినిబట్టి కన్నడ సాహిత్యము నుండియే నన్నిచోడుడు ప్రబంధ శబ్దమును గైకొని తన కుమార సంభవమును ప్రబంధముగా పేర్కొనెనని చెప్పవలసి వచ్చును. కాని ఆంధ్ర కవిలోకమా శబ్దమును కావ్య వాచిగనే గ్రహించినది. నన్నయాదుల మార్గము, నన్నిచోడుని మార్గము వేరగుట చేత ఆంధ్ర కవులా శబ్దమునాదరించి యుండక పోవచ్చును. నన్నయ భట్టారకుడు తనదైన నానారుచిరార్థ సూక్తి నిధిత్వముచే, అక్షర రమ్యతను, ప్రసన్నకథా కలితార్థయుక్తిని సాధించి మహాభారత బద్ధ నిరూపితార్థమేర్పడ, భారత సంహితా రచన గావించెను. ఇది బహుళాదరమునందినది. తిక్కనాదులీ మార్గమునే, స్వ ప్రతిభాసంపత్తిచే వ్యాప్తినతిశయించిరి. కాగా శ్రీనాథాదులు సంస్కృత కావ్యముల ననుసరింపఁబూనుకొనిరి. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, శ్రీనాథుని "శృంగార నైషధము" ననుసరించి, సంస్కృతము ప్రసిద్ధ నాటకమగు "అభిజ్ఞాన శాకుంతలము"ను, "శృంగార శాకుంతల"మను పేర కావ్యముగ మలచినాడు. ఏది యెట్లున్నను పెద్దనాదుల కాలము వరకు, సంస్కృత కావ్యములను, పురాణ కథలను అనువదించుటతోనే ఆంధ్ర కవిలోకము తృప్తినందినది. కాని సంస్కృత నాటకము

1. కన్నడ సాహిత్య చరిత్ర : పుట : 109
2. " " " " 78

లను తెలుగు నాటకములుగా ననువదించుట కెవ్వరును పూనుకొన లేదు. దానికి కారణము, వారికి శక్తి చాలక కాదు. నాటి సాంఘిక పరిస్థితులనుకూలముగ లేకుండుటయని నా యభిప్రాయము. తెనుగున నప్పటికే జనాహ్లాదకారియగు యక్షగానము వెలసినది. అది తెలుగు వాడి నాడి నెఱిగి రచించిన సత్ప్రబంధము. ఇక నాటి రాజులకో సంస్కృత నాటకములపై నున్న మక్కువ యెక్కువ. మధుర నాయక ప్రభువుల కాలము వరకు యక్షగానములకు రాజాదరణము విశేషముగా లభించినదనుటకు తగిన యాధారములు కనిపించుట లేదు. కాగా నాటక రచనము వలన కవికి రాదగినంత కీర్తి రావచ్చును, రాకపోవచ్చును. ఏలనన కావ్యము సంపూర్ణముగ కవి రచనా శక్తిపై నాధారపడి యుండునది. నాటకము వివిధాంగములపై (వాచిక, ఆంగిక, ఆహార్య, అభినయాదులు) నాధారపడి యుండునది. అందు కవి కర్తృత్వము పాదభాగమే. మిగిలినవన్నియు సమకూడి, సమర్థములైనప్పుడే కవి కృత నాటకమునకు పేరువచ్చును. బహుశః రాయల యుగము నాటికి, తెనుగున యక్షగానము ప్రచురమై, దేశి పద్ధతిని వ్యాప్తినంది యుండ నద్దానికి సమఉజ్జీగా, నాటకమును తీర్చిదిద్దుట జరిగి యుండకపోవచ్చును. కావుననే ఆంధ్ర కవి పుంగవులు సంస్కృతమున నాటకము నెఱిగిన వారయ్యును తెనుగున నాటక రచనకు పూనుకొనరైరని తోచుచున్నది. కాని వారికి నాటక రచనా స్పృహ (ఉత్సాహము) పుష్కలముగనుండి యుండును. అది ప్రబంధరూపమున వినూత్న సాహిత్య ప్రక్రియగా రూపొందినదని భావింపవచ్చును. కావుననే ప్రబంధములందు నాటకీయత కొట్టవచ్చినట్లు కాన్పించును. పూర్వ కావ్యములందీ నాటకీయత లేదా యన్నచో, ఉండినను, ఇంత స్పష్టముగ రూపు దిద్దుకొనలేదని చెప్పవలయును. కావుననే ఈ నాటకీయత ప్రసిద్ధ ప్రబంధములందెచ్చటెచ్చట గలదో, ఆయా ఘట్టములే నేటికిని పునః పునః సంస్మరింపబడుచు, పఠింపబడుచు, ఉదహరింప బడుచున్నవి. ఈ నాటకీయత, ప్రబంధావిర్భావమున కొక కారణము మాత్రమేయని నిర్ధరింప వచ్చును.

కన్నడ సాహిత్యమున 12 వ శతాబ్దము నాటికే, తెలుగు ప్రబంధ లక్షణములుగల కావ్యములు వచ్చినవి. కన్నడ కవి హరి హరుడు తన 'గిరిజా కల్యాణము'ను మహాప్రబంధమని చెప్పుకొనెను. విజయనగర సామ్రాజ్యమేర్పడిన పిదప క్రమముగా, ఆంధ్ర కర్ణాట భాషలు మరింత దగ్గరగా వచ్చినవి. ఆ సాన్నిహిత్యమే తెలుగు కవులపై కన్నడ సాహిత్య ప్రభావము మరింతగ ప్రసరింపగ జేసినది. దానికి తార్కాణముగ పారిజాతాపహరణ కావ్యమును పేర్కొనవచ్చును. కన్నడ కవియైన రుద్రభట్టకృత 'జగన్నాథవిజయం' లో పారిజాతాపహరణమునకు

మూలమైన కథ ఉన్నదని డా॥ ఆర్. వి. యస్. సుందరముగారు తెల్పియున్నారు.[1] కావున ప్రతిభావంతులైన తెలుగు కవులు, కన్నడ సాహిత్యమునందింతకు పూర్వమే ప్రచలితమైయున్న సాహిత్యధోరణులను గమనించి, వానికి తమ ప్రతిభా వ్యుత్పత్తులతో వన్నెబెట్టి వినూత్న ప్రక్రియా రూపమునిచ్చి, రసవత్ప్రబంధములుగా తీర్చిదిద్దిరనుటకిది యొక సూచన మాత్రమే. పెద్దనాదులు, వినూత్న ప్రక్రియాన్వేషణ తత్పరులగుటచే, కన్నడ సాహిత్యముచే నందలి ప్రబంధములు క్రొత్త స్ఫూర్తినీయగా, అద్భుతమైన రచనా నైపుణిచే కావ్యముల నిర్మించిరి. పూర్వాంధ్ర కవులు చెప్పుకొనిన రీతిని కావ్యవాచిగా కాక, క్రొత్త సాహిత్య ప్రక్రియగా ప్రబంధమును రూపొందించిరి. అ ప్రతిమ ప్రతిభా సంపన్నులైన పెద్దనాదులు తమ కావ్యముల నొక్కొక్కటి, యొక్కొక్క ప్రత్యేకరీతిని నిర్వహించిరి. కావుననే ప్రబంధము వినూత్న సాహిత్య ప్రక్రియగా రూపుదిద్దుకొనినది. డా॥ యం. కులశేఖరరవుగారు, ఆముక్తమాల్యదను ప్రబంధముగా చెప్పగా శ్రీకృష్ణరాయలననుసరించి నాటి కవులను, తరువాతి వారు, నాటి కవుల ననుసరించియు తమ కావ్యములకు ప్రబంధమను పేరు పెట్టుకొని యుందురన్న యూహ చేసిరి.[2] అది ఈ సందర్భమున పొంది పొసగి యున్నదన వచ్చును. ద్రావిడ ప్రబంధముల ననుసరించియో, మరి యొండు విధమునచో ప్రబంధమను శబ్దము మొదట కన్నడ సాహిత్యమున ప్రవేశించినది తదుపరి క్రమముగా కన్నడమున వికాసము నందినది. కర్ణాట భాషా సంపర్కముచే తెనుగునకు తరువాత నీ పదము తరలివచ్చినదని భావింపవచ్చును. ఏలనన అంతవరకు తెనుగు కవులు ప్రబంధ, కావ్య శబ్దములకు భేదము పాటించినవారు కారు. కనుక నీ శబ్దము కన్నడ సాహిత్యము నుండియే రాయల కాలమున, రాయల ద్వారా తెనుగు సాహిత్యమున క్రొత్తరీతి, క్రొత్తయర్థమున, ప్రవేశించి నిలదొక్కుకొన్నదని భావించుట సమంజసమని నిశ్చయింప వచ్చును. పెద్దనాదులు తెలుగు వాడి నాడి నెఱిగిన వారు

---

1. కన్నడ సాహిత్య చరిత్ర : పుట: 108.
2. వివేచన : సంచిక–3– పుట:– 39.

తెలుగు వారికి కల్పనలందిష్టమున్నను, అదరము తక్కువ. కావుననే స్వల్పముగ నైన ప్రఖ్యాతమగు వస్తువును గ్రహించుట తప్పనిసరియైనది. "కేవల కల్పనా కథలు కృత్రిమరత్నము లాద్య సత్కథల్ వావిరి పుట్టు రత్నములవారిక సత్కవి కల్పనావిభూషావహ పూర్వవృత్తములు సానలదీరిన జాతిరత్నముల్."[1] అని నాటి కవులు భావించి యుండుటచేత కొలదిగనైన వస్తువు ప్రఖ్యాతమే కావలయునను నియమ మేర్పడినది. కొలదిపాటి ప్రఖ్యాత వస్తువునకు కల్పనల నధికముగా జోడించి వ్రాయుట ప్రబంధమునకు మొదటి లక్షణముకాగా రెండవది నాటకము లందలి పాత్రలవలె, ఇందలి పాత్రలు హావ భావములు ప్రకటించినట్లు వర్ణించుట. అవసరమగుచోట నాటకమునందలి ఆంగిక, ఆహార్య, అభినయాది విశేషములన్నిటిని వర్ణనచే రూపు కట్టించుట. ఇక మూడవ లక్షణము అంగిరసము శృంగారమే కావలయునన్నది. నాల్గవది రచన నిజమున కిదియే ప్రధానమైనది. నన్నయాదులు చూపిన మార్గము ననుసరించుచునే, సమాస ఘటనమునందేమి, పద్యము నెత్తి కొనుటయందేమి, విరుచుట యందేమి, ముగించుట యందేమి, క్రొంగ్రొత్త పోకడలు పోయినవారు శ్రీనాథాదులు. కాని వారప్పటికి చేసినది క్రొత్తయేగాని సమగ్రము కాదు. వారు చూపిన మార్గముననే పద్య రచనా శిల్పమునందే దృష్టి నిడి రచన కొనసాగించినవారు ప్రబంధ కవులు కావుననే మనుచరిత్రాదులను ప్రబంధములని విశేషముగ చెప్పుకొనుట ఘటిల్లినది. ఈ పద్య శిల్పపు పోకడలు నన్నయాదుల యందు బీజ ప్రాయమైయుండ, శ్రీనాథాదుల యందవి యంకురించినవి. నాటి నుండి క్రమముగా పెరిగి పెద్దవై, ప్రబంధ యుగమునాటి కవికుసుమించి సుందరా రామముగ రూపొందినవి. కావుననే ప్రబంధములకొక ప్రత్యేకత దక్కినది. ఇంతియేగాక ప్రతీకాత్మకత కూడ అదనముగా చెప్పదగిన లక్షణము. మనుచరిత్ర మున విశ్వనాథవారు,[2] వసు చరిత్రమున డా॥ సుప్రసన్నగారు,[3] కళాపూర్ణోదయ మున డా॥ జి. వి. కృష్ణారావుగారు,[4] విజయవిలాసమున డా॥ జి.వి. సుబ్రహ్మణ్యము

---

1. మనుచరిత్ర 1-19
2. అల్లసాని వాని అల్లిక జిగిబిగి ; పుట;
3. వసుచరిత్ర పీఠిక; పుట ;
4. Studies in Kalapurnodaya

గారు[1] ప్రతీకాత్మకత యున్నదని సిద్ధాంతీకరించిరి. (ఆము క్తమాల్యద, పాండురంగ మాహాత్మ్యము, పారిజాతాపహరణము, కాళహస్తీశ్వర మాహాత్మ్యము వంటి ప్రబంధములందు విష్ణు లేక శివ పారమ్యమును ప్రతీకాత్మకతగా నిరూపించ వచ్చును.) ప్రతీకాత్మకత యనునది ప్రబంధమున కొక నిబంధన కాకపోవచ్చును. ఏలనన ప్రతీకాత్మకత కలవే ప్రబంధములన్నచో, వేనిని ప్రబంధములని మనము పలుమార్లు చెప్పుకొనుచున్నామో, వానిలో నూటికి తొంబది తొమ్మిది ప్రబంధములు కాక పోవలసి వచ్చును. కాని ఏ ప్రబంధములందీ విశిష్ట లక్షణమున్నదో వానికే ప్రసిద్ధి వచ్చినది. కావున నది యదనముగా నొక విశిష్ట లక్షణమని చెప్పదగి యున్నది.

ప్రయోజనము దృష్ట్యా కావ్యత త్త్వమును పరిశీలించినపుడు, ఆనందోప దేశములు రెండును ముఖ్యముగా మన యాలంకారికులచేత చెప్పబడినవి. కాగా ఇందేది ముఖ్యమను విషయము చిరకాలము చర్చింపబడినది. ఉపదేశము ప్రధాన మని భావించువారు కొందరు. కాదు కాదు ఆనందమే ప్రధానమనువారు కొందరు. కాంతాసమ్మితత్వము కావ్య ముఖ్యలక్షణ మనుట నిశ్చితార్థము. కాగా ఉపదేశము నకు కావ్య మొక్కటే మార్గము కాదు. వేద పురాణ శాస్త్ర గ్రంథముల ద్వారమున బహుముఖముగ ఉపదేశము సాధ్యము. కాంతా సమ్మితత్వముచే, కావ్యమునం దుపదేశము సువ్యవస్థిత మొనర్పబడవలయు ననుట యొక వాదము. పాశ్చాత్య అలంకారికులు సైతము సాహిత్యమునకు ఉపదేశమును ప్రధానముగా చెప్పి యుండలేదు. ప్రాచ్యపశ్చిమ్మతంబున రసము వేయిరెట్లు గొప్పది నవకథాదృతిని మించి" అని విశ్వనాథవారన్నారు. అనగా (కథ) వస్తువునకన్న రసము ముఖ్య మనుట, రసము పరిణామమున ఆనందమే. రసానందమే బ్రహ్మానంద సహోదరమని కదా పెద్దలు చెప్పుదురు.[2] "రసో వై సః" అని వేదము ఘోషించుచున్నది. అట్లనుటచే ఆనందమే బ్రహ్మమగుచున్నది. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" ఇత్యాది ఉపనిషద్వాక్యము లిట సంస్మరణీయములు. ఆనందమనగా ఇది లౌకికము కాదు. అలౌకికమైన సాత్వికానందమే బ్రహ్మము

1. వివేచన సంచిక_1 పుట;
2. కావ్యాలంకార సంగ్రహము: పుట_119

రససిద్ధియే ఆనందసిద్ధి. ఆనంద సిద్ధికి సాధనము కావ్యము. (సాహిత్యము). "భారతసంహితారచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్" అని నన్నయ, జగద్ధితమే తన కావ్య ప్రయోజనముగా చెప్పుకొనియున్నాడు. తిక్కన మహాభారత పర్వములను పుణ్యప్రబంధములుగా భావించినాడు. ఇట్లాలోచింపగా, ఆంధ్రకవిలోకమూర్ధము లెల్లరు జగద్ధితము నాకాంక్షించినవారే. అందువలన ఉపదేశమే ప్రధానమనవలసివచ్చును, యథార్థమున కట్లు కాదు. జగద్ధితమైన ఉపదేశము కావ్యానందము వేరుగా నుండునవి కావు. కాగా భారతాదులయం దుపదేశము వాచ్యముగ నుండును. శ్రీనాథాదుల కావ్యములందు ఉపదేశానందములకు సమప్రాధాన్య మున్నది. పెద్దనాదులు ఉపదేశమును వాచ్యముగా గాక వ్యంగ్యముగా ( ప్రతీకాత్మకతా రూపమున ) భాసింప జేయుచు కావ్యానందము ప్రధానముగా కావ్యరచన చేసిరి. కావుననే ప్రబంధములందు ఉపదేశమునకన్న (పైకి చూడ) ఆనందము ప్రధాన ప్రయోజనమైనది. ఇచ్చట వస్తు నాయక రస విషయములందు నన్నయాదులకు లేని స్వేచ్ఛ పెద్దనాదులకు లభించినది. ఆ కారణమున కవికిగల స్వేచ్ఛ కావ్యము నానందధామ మొనర్చుట కుపకరించినది. యథార్థమునకు లౌకికానందము బహుముఖము. కాని అలౌకికానందము లేదా కావ్యానందము ఏకముఖము. ఉపదేశము జగద్ధితార్థమైనచో నది ఆనందముకన్న భిన్నము కారాదు. ఏలనన జగద్ధితమును గూర్చునది ఆనందమెట్లగును? కావ్యానందము తాత్కాలికముగ బ్రహ్మానంద సహోదరముగా భాసించినను, నిరంతరాభ్యాస వశమున నది నిరంతరము సహృదయ హృదయ సుసాధ్యమై యుండునది. అది సాత్త్వికానందమగుటచేత సహృదయునికి క్షణకాలము, భాసించినను, చిరకాలము సుస్థిరమైనను, తత్త్వముచేత, బ్రహ్మానంద సహోదరత్వముచేత, అనుభవవేళ నంతగనే తన్మయీభవ స్థితిని గలిగించునది కావున కావ్యానందము సహృదయుని ఆనందింప జేయుటతో పాటు, అతని జీవతత్త్వమునందు సాత్విక లక్షణమును జీవింపజేయ సమర్థమై యున్నది. అది యతనిని సన్మార్గగామిగా రూపొం శక్తమైనది. అట్లగుటచేతనే జగద్ధితము సాధ్యమగుచున్నది. కావున ఆనందోపదేశములకు ద్వైతము చెప్పుట తప్ప నన్యము సమర్థనీయము కాదు. ఇట్టి కావ్యానందమును సహృదయుల కందించుటలో, కవికి స్వేచ్ఛ యుండుట అత్యావశ్యకము. "నిరంకుశాః కవయః" అను అభిజ్ఞోక్తి, ఇట్టిపట్లనే వర్తించును. నన్న

యాదులకు లేని స్వేచ్ఛ పెద్దనాదులకు లభించినది. నన్నయభట్టారకుడు రాజరాజ నరేంద్రుని యాదేశముచే "భారత సంహిత"నే యనువదింపవలసి వచ్చినది. కావ్యానందము కొఱకు వస్తువును మార్చునవకాశము కవికి లేకపోయినది. నన్నయ భట్టారకు ననుసరించిన, పురాణ కవులందరి స్థితియు నిట్టిదే. కాగా శ్రీనాథాదులు సంస్కృత కావ్యముల ననువదించిరి. వీరికిని అనువాద రూపమైన వస్తు నిబద్ధత కావ్యానంద సాధనా మార్గమున కొంతలో కొంత యాటంకమును కల్గించినది. ఈ విషయమున సంపూర్ణమైన స్వేచ్ఛ పెద్దనాదులకు లభించినది. దానికి నాటి సాంఘిక రాజకీయ పరిస్థితులే హేతువులు. నాటికి విద్యావంతులలో కావ్య స్పృహ సూక్ష్మ ప్రక్రియాసక్తత మిన్ను ముట్టినవి. మహమ్మదీయుల ప్రభావముకూడా పడినది. భోగ లాలసత్వము పెరిగినది. శృంగారమునెడ యాసక్తి విజృంభించినది. అట్టితరి రసరాజమైన శృంగారమునే అంగిరసముగా ప్రబంధము లావిర్భవించినవి. జాతిని భారతీయ సంస్కృతీ పరిచ్యుతులు కాకుండునట్లు సన్మార్గమునకు త్రిప్ప గల్గునవి; రసవత్ప్రబంధములు మాత్రమే. "భారతీయ కవులు, ప్రణయలహరి కాల క్రమమున విశుద్ధత జెందుచు ప్రవహించి, సంసార సాగరమున నెట్లు శాంత రసమున లీనమగునో అసదృశముగ జూపిరి. యౌవన ప్రభాసమున నావిర్భవించిన మోహము సంయతిచే శాంతిని, ధర్మధారణచే ధ్రువత్వమును, సంసారముచే మాంగల్యమును బొందినగాని, అయ్యది చంచలమును, ప్రతికూలమునగు జగత్తు నుండి తప్పించుకొని కృతార్థత జెందనేరదని నిరూపించిరి."[1] అని విస్సా కోట మాధవరావుగారు ప్రబంధ వాఙ్మయ స్వభావమును గూర్చి వ్రాసిరి. వీరి యభి ప్రాయము పై విషయములో పొంది పొసగి యున్నది. పెల్చేరు నారాయణ రావు గారు తమ సిద్ధాంత గ్రంథమున 'కవితా విప్లవాల స్వరూపము'ను గూర్చి చెప్పుచు శ్రోతల దృష్ట్యా పురాణములు ద్వికర్తృకములని, వానిని ఒకరు చదివి వ్యాఖ్యా నించగా నితరుల కవి రమ్యములై భాసించునని నుడివి యున్నారు. ప్రబంధము లట్టివికావని అవి ఏకకర్తృకములనిరి. అనగా శ్రోతలు (పఠితలు) తామే చదివి యానందించునట్టివని వ్యాఖ్యానించిరి. ప్రబంధ లక్షణమును నిర్వచించుటలో వారి వైఖరి భిన్నమైనది. వారు ప్రబంధమును ప్రజలకు దూరమైన గ్రంథముగా

---

1. ప్రబంధ వాఙ్మయ పరిణామము — పుట : 11

భావించిరి. లోతుగా నాలోచించి ప్రబంధ లక్షణమును తేల్చవలసియుండగా, వారి వ్యాస పరిధిలో, వారు పై నిర్ణయము చేయనంతవరకే సాగిరి. ఒక అడుగు ముందుకు వేసి యాలోచించినచో నొక విషయము స్పష్టము కాగలదు. వారు పురాణములను వ్యాఖ్యానించుట అవసరమనిరి. వాని యందలి సంపూర్ణార్థముసవి శ్రోతల కందింపవా యనగా నవి విద్యావంతులైన సహృదయుల కందింప సమర్థములే కాని (ధర్మ) ఉపదేశ ప్రధానములగుటచే, విద్యావంతులుకాని వారికి వ్యాఖ్యాతలు విప్పిచెప్ప వలసిన యవసరమేర్పడినది. ప్రబంధయుగము నాటికి సమాజమున సాహిత్య (కావ్య) స్పృహ పెరిగినది. వారికి ఉపదేశము ప్రధానము కాదు. (కావ్యమునందు) ఆనందము ప్రధానము. అది వ్యాఖ్యాతృ నిరపేక్షము కావున ప్రబంధము లేక కర్తృకర్త్వములగుట సంభవించినది. నాటి పండితులు, విద్వాంసులు, ప్రబంధములను చదివి యానందించుటయే ముఖ్యముగా భావించిరి. కాగా కవి తనదైన ప్రతిభా సామర్థ్యముచే నందు, ఉపదేశమును వ్యంగ్యముగా నొనర్చుటకు యత్నించెను. అది సాహిత్య వ్యాసంగమున, సమున్నత శిఖరాల నందుకొనుటయే. కవి భావనవెంట భావాంబర వీథిని విహరించి యానందవీచికల నుయ్యాలలూగుటకన్న కావలసిన దేమున్నది. కావుననే ప్రబంధములు ప్రత్యేక సాహిత్యప్రక్రియగా గుర్తింపబడుట. ఇక వీనికి ప్రజలతో సంబంధము తగ్గినదను కొనుటయు సమంజసము కాదు. పెరిగినదనియే భావించవలయును. కాకున్నచో అష్టదిగ్గజములు, భువన విజయము లెట్లు తెలుగునాట వెలయ గలిగినవి? సాహిత్య స్పృహ పెరిగిన సమాజమునకు వ్యాఖ్యాత లక్కరలేని సాహిత్యము వెలయుటే ప్రబల తార్కాణము కాదా? కావున ప్రబంధము తెనుగు సాహిత్యమున వెలసిన సమగ్రమైన కావ్యము. సంస్కృతమునందలి మహాకావ్యముని దీనిని సంభావించు టయు సమంజసమే.

శ్రీకృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యద', పెద్దనగారి 'మనుచరిత్ర', ముక్కు తిమ్మన 'పారిజాతాపహరణము', ధూర్జటి 'కాళహస్తీశ్వర మాహాత్మ్యము', తెనాలి వాని 'పాండురంగ మాహాత్మ్యము', మాదయగారి మల్లన 'రాజశేఖర చరిత్రము', అయ్యలరాజు రామభద్రుని, 'రామాభ్యుదయము', పింగళి సూరన, 'కళాపూర్ణోదయ', 'ప్రభావతీ ప్రద్యుమ్నములు', భట్టుమూర్తి 'వసుచరిత్ర', పదునారవ శతాబ్దిమున చెప్పుకొనదగిన మహా ప్రబంధములు. సంకుసాల నృసింహ

కవి 'కవికర్ణ రసాయన' మొకటి, యీ శతాబ్దమున వచ్చిన రసవత్ప్రబంధము. అతుకూరి మొల్ల రామాయణము కూడ లక్షణముచే ప్రబంధమనదగియున్నది. తరువాత 17 వ శతాబ్దములో చెప్పుకొనదగిన ప్రబంధములు, కందుకూరి రుద్రకవి 'నిరంకుశోపాఖ్యానము', అద్దంకి గంగాధర కవి 'తపతీసంవరణోపాఖ్యానము', సారంగు తమ్మయ 'వైజయంతీవిలాస' మను విప్రనారాయణ చరిత్రము మొదలగునవి, ఆంధ్రదేశమున వెలసినవి. తరువాత చెప్పుకొనవలసినది దక్షిణాంధ్ర యుగము నందలి కవులను గూర్చి. వీరిలో శ్రేష్ఠుడు చేమకూర వేంకటకవి. ఇతడు రచించిన ప్రబంధములు రెండు, సారంగధర చరిత్రము, విజయ విలాసమును. ఇందు రెండవది నిరుపమానమైన ప్రతిభాసంపత్తిచే, ప్రతి పద్య చమత్కృతిచే నూత్న పంథాననుసరించి రచింపబడిన రసవత్ప్రబంధము. కాళయ్య కవి కృత 'రాజగోపాల విలాస' మొకటి చెప్పదగిన శృంగార ప్రబంధము. "మధుర తంజావూరు రాజ్యములందు వెలసిన శృంగార ప్రబంధములకొక విధముగా నీ రాజగోపాల విలాసము మార్గదర్శకమని చెప్పవచ్చును." అని దివాకర్ల వేంకటావధానిగారనిరి.[1] రంగాజమ్మ, 'మన్నారుదాస విలాస ప్రబంధము', 'ఉషా పరిణయము' మున్నగు నైదు ప్రబంధములను రచించెను. ఇందు ఉషా పరిణయము శ్రేష్ఠమని చెప్పవచ్చును. చివరకు పేర్కొనదగినవి వేంకట కృష్ణప్ప నాయకుని 'అహల్యా సంక్రందనము'. శేషము వేంకటపతి 'తారాశశాంక విజయము', ఇక 18 వ శతాబ్దిమున దామర్ల వెంగళనాయకుని 'బహుళాశ్వచరిత్రము' ప్రౌఢమైన ప్రబంధము. కూచిమంచి తిమ్మకవి 'రసికజనమనోభిరామము' పిల్ల వసుచరిత్రమని ప్రసిద్ధి గాంచినది. అడిదము సూరకవి 'కవిజన రంజనము'నకు కూడ పిల్లవసుచరిత్రమని ప్రసిద్ధి. అట్లే కనుపర్తి యబ్బయామాత్యుడు 'అనిరుద్ధ చరిత్రము' 'కవిరాజ మనోరంజనము' నను రెండు ప్రబంధముల రచించెను. ఇందు 'కవిరాజ మనోరంజనము' పిల్లవసుచరిత్రమను ఖ్యాతికి తావలమై అబ్బయామాత్యునికి ప్రౌఢకవియను పేరు తెచ్చినది. అకలంకము కృష్ణకవి 'శకుంతలా పరిణయము' కూడ పిల్లవసుచరిత్ర మనిపించుకొనినది. రాయల యుగము తరువాత ప్రబంధము లెన్నియో వచ్చినవి కాని ప్రత్యేకతను నిల్పుకొనలేక పోయినవి. వసుచరిత్రమున రామరాజ భూషణుడు

---

1. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము—దక్షిణాంధ్రయుగము : పుట—84

వస్తువు నతి స్వల్పముగ గైకొని, రచనా వైవిధ్యముచే, పద్య శిల్ప రచనచే, శ్లేష చమత్కృతిచే, సన్నివేశ సంఘటనముచే, సంగీతశాస్త్ర నైపుణిచే, ప్రబంధ మన్న నిట్లుండవలయునని చూపించి యుండగా తరువాతి కవులు వసు చరిత్రకారు ననుసరించుట తోడనే తృప్తినంది, పిల్లవసుచరిత్రలను సృష్టించిరి. ఇంకను కొందరు కవియు సాధ్యము గాక, యసభ్య శృంగార ప్రబంధములుగ రచించిరి. ప్రతిభా లోపముచే అనుకరణ లౌల్యముచే క్రమముగ ప్రబంధములు క్షీణదశ నందినవి. ఆ క్షీణదశలో ప్రతిభా సంపన్నులైన నలుగురైదుగురు కవులు మాత్రమే మంచి ప్రబంధము లందించిరి. అవియే పిల్లవసు చరిత్రములని ప్రఖ్యాతిగాంచినవి. అవియును వసుచరిత్రకు దీటువచ్చునవి కావు కాని రసవత్ప్రబంధములని చెప్పదగి యున్నవి.



రెండవ అధ్యాయము

# కనుపర్తి అబ్బయామాత్యుని జీవిత విశేషములు

"కనుపర్తి అబ్బయామాత్యుడు కౌండిన్యస గోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. గుంటూరు మండలములోని కొండవీటికి రెండామడల దూరముననున్న కనుపర్తి యీతని నివాసస్థలము. నేటికిని కవివంశీయు లట నివసించుచున్నారు"[1] అని శేషాద్రి రమణ కవులు చెప్పియున్నారు. ఈ కవి తండ్రి రాయన మంత్రి. తల్లి నరసమాంబ. మంగళగిరి నృసింహస్వామి యీతని యిష్ట దైవము. ఈతని పూర్వీకులలో నొకరైన బసవప్రధాని "కొండవీటి పుర రాజ్యైశ్వర్యశాలి మంత్రిగా జేపట్టన్"[2] పేరొందినవాడు బసవన మంత్రి యని అనిరుద్ధ చరిత్రమున చెప్పియున్నాడు.[3] ఈ బసవన "కనుపర్తి ముఖ్యపురి ముఖ్య బహుగ్రామ స్వాస్థ్యానుభవ గ్రామణి"[4] యని అబ్బయామాత్యుడు చెప్పు

1. కవిరాజ మనోరంజనము—పీఠిక—పుట—1
2. " " 1—28
3. అనిరుద్ధ చరిత్రము : 1—28
4. కవిరాజ మనోరంజనము : 1—29

కొని యున్నాడు. ఇతని కాలమును గూర్చి స్పష్టమైన యాధారములు లభించుటలేదు. కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఈ కవి 18 వ శతాబ్దము మధ్య భాగమున నుండెడివాడని ఊహించి క్రీ.శ. 1750 లో ఉన్నట్లు చెప్పుట జరిగినది.[1] పాదుశహా, పేషువా అనే పదాలను వాడి యున్నాడు.[2] లక్ష్మణరావు పంతులుగారు కూడ ఇతని కాలము 18 వ శతాబ్దము మధ్యభాగముగా నిర్ణయించినారు.[3] శేషాద్రి రమణ కవులీ విషయమును గూర్చి చర్చించుచు, కనుపర్తి వారి వంశములో అబ్బయామాత్యుని నుండి 1924 వరకు ఆరు పురుషాంతరములు గడచినట్లు తెలిపి యున్నారు.[4]

కనుపర్తి అబ్బయామాత్యుని వంశవృక్షము :




1. ఆంధ్రకవుల చరిత్ర. భాగము-3 పుట: 115
2. అనిరుద్ధచరిత్ర 3-19
3. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము-సంపుటము-25 పుట : 154
4. కవిరాజమనోరంజనము. పీఠిక- పుట-2

వావిళ్లవారు 1929 లో ప్రచురించిన 'కవిరాజమనోరంజనమునకు' పీఠిక వ్రాయుచు శేషాద్రి రమణ కవులిట్లభిప్రాయపడిరి.

"కవి వంశజులలో నిప్పటి తరమున సూర్యనారాయణ యనువారున్నారు. ఈయన వయస్సు 42 సం॥రములు, ఆయన నుండి పురుషులను దీసికొన్నచో సుబ్బయ్య—శ్రీనివాసరాయడు—సుబ్బరాజు—వెంకన్న—పెద్దిరాజు — గ్రంథకర్తయగు అబ్బరాజు వంశవృక్షము వలనఁ గన్పట్టిరి. అనగా సూర్యనారాయణ గారికిఁ బ్రకృత గ్రంథకర్త ఆఱవ తరము వాడు. తరమునకు ముప్పది యేండ్ల వంతున లెక్కించి నచో, అబ్బయామాత్యు డిప్పటికి నూట యెనుబది యేండ్ల క్రిందట క్రీ.శ. 1750 ప్రాంతమున నుండెననుట స్పష్టము పై వివరణము సముచితముగనే యున్నది. బలవత్తరమైన యాధార మితరము లభించనంతవరకు, కృతికర్త 18 వ శతాబ్దము నడిమి వాడని నిశ్చయించుటయే యుక్తియుక్తము, సమంజసమును. అబ్బయ తన అనిరుద్ధ చరిత్రలో సమకాలిక హిందూస్థానీ పదములు వాడినాడు. ఉషాకన్య విరహమును వర్ణించు ఘట్టములో మదను 'పాదుషా' దగ్గర వసంత 'పీష్వా' మంత్రి అని అబ్బయ చెప్పినాడు.[1] క్రీ శ. 1740 నుండి 1761 దాకా పీష్వాగిరీ నడిపిన బాలాజీ బాజీరావు కాలంలోనే పూనా పీష్వాల ఖ్యాతి ఆంధ్రదేశానికి ప్రాకినది. పీష్వాను పేర్కొన్న అబ్బయ్య అంతకు ముందు వాడుకాడని లక్ష్మణ రావుగారు నిర్ణయించారు"[2] అని ఆరుద్ర తన 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో వివరించి యున్నాడు. ఇదియును కందుకూరి వారు నిర్ణయించిన 1750 ప్రాంతము నకు సరిపోయినది. కాని 1725 లో పుట్టి యుండవచ్చునన్నది ఆరుద్ర ఊహయే కాని సాధారమైన మాట కాదని చెప్పవలసి వచ్చుచున్నది. నిశ్చయముగఁ జెప్పఁ జాలని విషయమును గూర్చి యూహ సేయుట కన్న, 1750 ప్రాంతము వాడని భావించుటయే సమంజసమని చెప్పక తప్పదు. ఈ కవిని గూర్చి ఇంతకన్న విశేషా ధారములు మరి యేవియు లభించుట లేదు. దీనికి భిన్నమైన యాధారము లభించ నంతవరకు, పై నిర్ణయమే సరియైనదని భావించవలసి యున్నది. అతని రచన లైన 'అనిరుద్ధచరిత్ర', 'కవిరాజ మనోరంజనము', అను నీ రెండు గ్రంథములే,

1. అనిరుద్ధ చరిత్ర : 3–19
2. సమగ్రాంధ్ర సాహిత్యము : 12 సంపు : పుట: 196

ఈ కవిని గూర్చి చెప్పునట్టి పరమాధారములు. వీని యందలి అంతరంగిక సాక్ష్యము ననుసరించియే కవిని గూర్చి పరిశీలించవలసి యున్నది. అనిరుద్ధ చరిత్రలో

"భగవంతుని సద్గుణములు
పొగడు వివేకంబె తమ కపూర్వైశ్వర్యం
బగుట, నరస్తుతి సేయరు
జగతిన్ సత్కవులు తుచ్ఛసంపదకొఱకై" – 1–17. అని

ఈ కవి నరస్తుతి చేయరాదను యుద్దేశము గలవాడు. భగవంతుని సద్గుణములు పొగడు వివేకమే అపూర్వైశ్వర్యమని భావించిన మహనీయుడు. హరి నామాంకిత కావ్యము పుష్పమాలికలందలి దారము చందమున సజ్జనాదరణీయ మగుననియు, నర నామాంకితమైన కావ్యము హీన జాతి పురుషుని గైకొన్న వేశ్యవంటిదనియు తలంచిన సుధీమణి యితడు.[1] దేవతా స్తుతి యొనర్చెడు కవీశ్వరుల నాదరించెడి నరప్రభువులకు ఘన కీర్తి లభింపగలదని నిశ్చయించిన కవీంద్రుడితడు.[2] దాతలకు దాత, రక్షకుడునైన శౌరిని గాదని యిలాతలనేతల నుతించుట లాఘవ మని విర్ధారించు కొన్నవాడు.[3] మోక్షదాతయైన వాసుదేవుని కంకిత మిచ్చుటకన్న భాగ్యము లేదని విశ్వసించిన మహాభక్తుడు.[4] తిక్కన సోమయాజియై మహాభారత మును, నరాంకిత మొనర్చుట కిష్టపడక, హరిహరాంకిత మొనర్చినాడు. పోతన, ధూర్జటి, సంకుసాల నృసింహకవి వంటి సత్కవులు వోయిన త్రోవన, అబ్బయా మాత్యుడు కూడ తన కావ్యములను రెండింటిని హరినామాంకిత మొనర్చినాడు. మొదటి కావ్యమైన 'అనిరుద్ధ చరిత్రము'ను తన యిష్టదైవమైన మంగళాచల నృసింహుని కంకితమిచ్చి, రెండవదగు 'కవిరాజ మనోరంజనము'ను మంగళాచల నృసింహుని కోరిక మేరకు, శ్రీ రాజగోపాల దేవున కంకిత మిచ్చి ధన్యుడైనాడు. మంగళాచల నృసింహుని కృపచేత తనకు కవిత్వ మబ్బినదని చెప్పికొనినాడు.[5]

---

1. అనిరుద్ధచరిత్ర : 1–18
2. " 1–19
3. కవిరాజ మనోరంజనము : 1–15
4. " " 1–16
5. అనిరుద్ధ చరిత్రము : 1–32

ఈ కవి వినయశీలి. కాళిదాసాదులకైన గలవు తప్పులని పెద్దలనిరట. తానెనగ నెంత? తనయందు తప్పు గల్గినచో, బాలునకు బుద్ధి నేర్పిన భంగి, యొప్పుగాఁ దీర్పుడని సవినయముగా మనవి చేసి కొన్నాడు.[1] పరమేశుని కృపవలన నెవరి కెంత బుద్ధిగలుగునో దానిని బట్టియే వారి కవిత్వము రుచి యుండునట. తనకు నేరుపు చాలినను చాలకున్నను, నవ్వక తన కృతిని చేకొనుడని వర్తమాన కవుల నాతడు ప్రార్థించినాడు.[2] ఈతడెంత వినయశీలియో నంతగా నాత్మ ప్రత్యయము గలవాడు. దానికీ క్రింది పద్యమే తార్కాణము. "చతుర కవిత్వతత్త్వ పటు సంపద యొక్కరి సొమ్ముగాదు భారతిదయ సౌధవార్ధి కవిరాజుల మానసముల్ ఘటంబు, లాయతము కొలంది లబ్ధమగు నయ్యమృతంబటుగాఁదలంచి యద్యతన కవీంద్రులార! కృపఁదప్పక, మత్కృతి నాదరింపుఁడీ"[3] – అని వినయముగా చెప్పవలసిన దంతయుఁ జెప్పియున్నాడు. 'కృపదప్పక మత్కృతి నాదరింపుడీ' యనుటలో నొక విశేషమున్నది. 'కృపన్ తప్పక' అన్న విరుపుతో కృపవీడక యను యభ్యర్థనము తోపాటు, కృపతో తప్పక నాదరింపుడన్న చతురత యున్నది. చతుర కవిత్వతత్త్వ పటు సంపద యొక్కరి సొమ్ముగాదన్న యెత్తుగడ, అతని ఆత్మప్రత్యయము నెత్తిచూపుచున్నది.

సుకవుల యెడ నీతని కెనలేని భక్తి. సరసులైనవారు సుకవుల సూక్తులందు నెరసుల వెదుకబోరట. కుకవులు, వ్రణంబు బరికించు మక్షిక వితతులట. తెరలో కథ చొప్పున బొమ్మలాడగా, నొక కడ హాస్యపుంబ్రతిమ లుండునట. అట్టి వారు కుకవులు.[4] భగవదర్పిత కావ్యములందు నెరసులెన్నదగదట. అది కిరీటము ధరించిన తలను, సుళ్ళు లెక్క పెట్టుట వంటిదని యుపమించి, సమర్థించినాడు.[5]

1. కవిరాజ మనోరంజనము : 1–38
2. అనిరుద్ధ చరిత్రము : 1–10
3. " " 1–9
4. " " 1–12
   సుకవి మనోరంజనము 1–12
5. అనిరుద్ధ చరిత్రము : 1–11

ఈతనికి శివకేశవుల యందభేద ప్రతిపత్తి భాసించినను, కేశవుని యందే భక్తి నిలచినది.[1] తన కావ్యములందు రెండింటి యందున మొదట మంగళాచల నృసింహుని, శివుని, బ్రహ్మను, లక్ష్మిని, శాంభవిని, సరస్వతిని, గణపతిని క్రమముగా స్తుతించియున్నాడు. ఇతడు తన మొదటి కావ్యమును మంగళాద్రి నృసింహునికిని, అతని యాదేశానుసారము రెండవ కృతిని శ్రీ రాజగోపాల దేవునికి నంకిత మిచ్చుట చూడ నితనికి కేశవునియందే యధిక భక్తి యని నిశ్చయముగ తెలియుచున్నది. ఇదియును గాక నితడు శ్రీవిద్యోపాసకుడుగ కనిపించుచున్నాడు. శ్రీవిద్యా బగళాముఖీత్యాదిగా శాంభవిని వర్ణించుచు 'దివ్య న్మహామంత్ర యంత్రావిర్భూత నిజాంశల నాశ్రితుల కష్టైశ్వర్యముల్ చేయు చిద్భావాకారత నొప్పు"[2] నని వ్రాసి యున్నాడు. సరస్వతిని శ్రీ చింతామణి మంత్ర దేవతగా నభివర్ణించి యున్నాడు.[3] శ్రీవిద్యకే కుండలినీ యోగమని నామాంతరము. శక్తికి "చిత్" అని పేరు. ఆమె చిత్కలా "దేవః కలా సచ్చిదానందాత్మనో బ్రహ్మణ ఏకదేశ ఇవ యస్యాం సా, యద్వా అంతః కరణోపాధికం చైతన్యం నిరుపాధికాయాశ్చిత ఏకదేశ ఇతి" "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" ఇతి స్మృతేః- పద్మ పురాణేఽపి దేవీ మూర్తి గణనా ప్రకరణే, "చిత్తేషు చిత్కలా నామశక్తి స్సర్వశరీరిణా" మితి,[4] అని లలితా సహస్రనామముల వ్యాఖ్యానించుచు భాస్కరరాయలు వివరించి యున్నారు. ఈ కవి మొదట మువ్వురు మూర్తులను స్మరించి, వారి శక్తులను పిదప స్మరించి యున్నాడు. చివరకు గణాధిపుని "మునిరాణ్ణికురంబ మనోంబుజాత రోలంబు"[5] నిగా వర్ణించి యున్నాడు. ఇట్లనుటచే యోగి హృద్ధ్యానగమ్యుడన్న సూచన చేసి సిద్ధిదాయకునిగా నభివర్ణించుట, దరస్మిత కళాజిత శారద చంద్రబింబ అనుట మరియు నితని శ్రీవిద్యోపాసనా నిరతిని చాటుచున్నవి. త్రిమూర్తులను, త్రిశక్తులను, గణాధిపుని స్తుతించి, చివరకు కవీంద్రస్తుతి

1. అనిరుద్ధ చరిత్రము: 1_28
2. అనిరుద్ధ చరిత్ర 1_5
3. కవిరాజమనోరంజనము : 1_6.
4. శ్రీలలితా సహస్రనామ భాష్యము- పుట : 376
5. అనిరుద్ధ చరిత్రము- 1_7

మొనర్చినాడు. ఇదియు చిత్రముగా సాగినది. అనిరుద్ధ చరిత్ర మందు సంస్కృతాంధ్ర కవుల పదునారుగుర నెన్నుకొన్నాడు. అట్లే కవిరాజ మనోరంజనమున రెండు పద్యములందు సంస్కృతాంధ్ర కవులను మొత్తము మీద పదునారుగురనే స్తుతించినాడు. ఇట్లు రెండు గ్రంథములందును పదునారుగురు కవులనే స్తుతించుట విశేషమే.[1] కవుల నాతడు ఆ సరస్వతీదేవికి, అనగా చిచ్ఛక్తికి అంశలుగా భావించినాడని తలపవలసి యున్నది. శ్రీవిద్య, షోడశాక్షరి.[2] శ్రీశక్తికి పదునారు కళలు. ఆ విషయమును సూచించుటకే తన కభిమానులైన కవులు పెక్కురున్నను ఒక గ్రంథమునందొక కొందరిని చెప్పి, రెండవ గ్రంథమున మరికొందరిని చెప్పి మొత్తముసిచ పదునారు సంఖ్యను మాత్రము వీడకపోవుట యిచ్చట విశేషము (శ్రీ విద్యావిషయము ముందు వివరముగా పరిశీలింపబడును.)

అనిరుద్ధ చరిత్రమునకన్న కవిరాజమనోరంజనము ప్రౌఢముగా నున్నది. మొదటిది యౌవనారంభమున వ్రాసియుండును. రెండవ గ్రంథము కవిరాజమనోరంజనమే యమటకు '"మునుపనిరుద్ధ చరిత్రంబను కృతి రచియించి."[3] యను నా గ్రంథస్థపద్యమే తార్కాణము. "బాలునకు బుద్ధి నేర్పినభంగిఁగవులు తప్పు గల్గిన తీర్పుడీ యొప్పుగాను"[4] అని సవినయముగా చెప్పికొనుచు తన్ను బాలునిగా చెప్పికొనుట జరిగినది. కవిరాజమనోరంజనమునం దిదే ఘట్టమున కవి తన్నుగూర్చి చెప్పకొనిన తీరు వేరుగనున్నది. కవిత్వరుచినేరుపు చాలిన చాలకుండినన్ నవ్యక వర్తమాన కవినాథులు చేకొనుదని వేడుకొన్నాడు. ఇది వినయమును సూచించు చున్నది. కాని వెంటనే ఒక కవి చెప్పిన లక్షణము నింకొక్కడు చెల్లకుండ చేయు చున్నారనియు, ఛాందస విస్తరంబు సందిల్లినదనియు, కావ్య శంకలు తరుచయ్యె ననియుఁదెలిపి, తన యుల్లపు సౌధవీథిఁ గొలువున్న సరస్వతి సత్యవాణియని చెప్పుకొన్నాడు. ఆ తల్లి యొనంగు పల్కుల తప్పులసేయక చిత్తగించుడని

---

1. అనిరుద్ధ చరిత్రము : 1-8
   కవిరాజ మనోరంజనము : 1-8 & 9
2. శ్రీలలితా సహస్రనామ భాష్యము : పుట. 305
3. కవిరాజ మనోరంజనము : 1-25
4. అనిరుద్ధచరిత్రము : 1-10

మెత్త మెత్తగనే, తనగడుసుఁదనమును చాటు కొన్నాడు. తనవాక్కు సత్యవాణి యమచంతటి దిట్టతన మాతని కానాటికి లభ్యమయ్యె నన్నమాట. శబ్ద సంయోజన మందేమి, కథా కల్పనమందేమి, వర్ణనావైశద్యమునందేమి, కవిరాజ మనోరంజనము, అనిరుద్ధ చరిత్రమున కన్న మిన్నగా నుండుటచే, 'ననిరుద్ధ చరిత్ర' యావ నారంభవేళ రచించినదైనచో, 'కవిరాజమనోరంజనము', ప్రౌఢ నిర్భరవయః పరిపాకవేళ రచించినదై యుండుననుట నిశ్చయము. "ప్రౌఢిం జతుష్షష్టి తంత్ర మహాతంత్రకలాప లక్ష్యపరుడై."[1] కుంభాండుండు రాజిల్లెనని చెప్పుట, చిత్రరేఖ "తంత్రివలన మంత్ర తంత్రయోగ క్రియ"[2] లభ్యసించినదనుట చూడ, నీకవికి ఆయా విద్యల పరిచయమో, ప్రవేశమో యుండి యుండునని తోచుచున్నది. "సాధు సుదర్శనంబు వలవ స్మదన గ్రహమోక్షమయ్యె"[3] అని వ్రాయుటచే సుదర్శన మంత్రోపాసన మెఱిగినవాడేమో యను ననుమానమునకు తావిచ్చు చున్నది. ఇతనికి సాముద్రిక శాస్త్రమునందు,[4] జ్యోతిష శాస్త్రమునందు[5] చక్కని పాండిత్యమున్నదనుట కాధారములు గలవు ఇతడు సాలగ్రామార్చనము చేయువాడనుటకు సాక్ష్యమున్నది.[6] ఇతనికి సంగీత శాస్త్రమునందు నైతము చక్కని పాండిత్యము కలదు. క్రింది పద్యములను గమనింపుడు.

"ఘనసారసమును, సార ఘనము నాక్షేపించుఁ
గలిగి పల్కుల యింపు కచము సొంపు
.... .... .... .... .... ... ... .......... .......
సారె వర్ణింపఁదగును."– అనిరుద్ధ– 2–28

---

1. అనిరుద్ధ చరిత్రము : 2–81
2. " " 2–82
3. " " 3–60
4. " " 5–97, 98
5. " " 5–81
   కవిరాజ మనోరంజనము. 1–102
6. అనిరుద్ధచరిత్రము : 5–107

"మునుకారునను గారుకొని మీరు ఘన చారు
తను మారుకొని కేరుఁదరుణి కురులు
.... .... .... .... .... .. ... .... .... .... .... ....
ముదిత రూపంబు త్రిభువన మోహనంబు"- అనిరుద్ధ-2-30

పై వర్ణనముల గనిన, తన కవిత్వమును సైతము, త్రిభువన మోహన మొనర్చిన దిట్ట యని నిర్ధారణ మగును. ఇతనికి బహుశాస్త్ర పాండిత్యముతో పాటు, శ్రీవిద్యోపాసనయు నృసింహోపాసనయు సహజ సుందరమైన కన్యకలంకారముల వలె వన్నె తెచ్చినవి. శ్లేష, చిత్ర కవిత యితని సొత్తైనవి. చమత్కారము, లోకజ్ఞత, యితని కావ్యములకు సహజగుణములు కాగా, మంజుల శబ్ద సంయోజనము, ప్రౌఢ సమాస ఘటనా నైపుణి, వానికి మరింత వన్నెఁబెట్టినవి. ఇతనికి గల భగవద్భక్తి వీనికితోడై అతని కవిత రస వివేక నిధానమైనది.



మూడవ అధ్యాయము

# తెలుగులో హరివంశముల విస్తరణ వాని యందు

# ఉషానిరుద్ధుల కథావిశేషము

వేదవ్యాస భగవానుడు ప్రపంచమున కనుగ్రహించిన మహాప్రసాదము శ్రీమన్మహాభారతము. అష్టాదశపర్వ నిర్వహణ సంభృతమైన మహాభారతము, పర్వత్రయ విరాజితమగు హరివంశముతో పరిపూర్ణమై విలసిల్లుచున్నది. మహాభారతము పంచమవేదము కాగా, భారత పరాంశమైన "హరివంశము" వేదశీర్ష యనఁ దగియున్నది. 'హరివంశము' బహూపాఖ్యానములకు, బహుధర్మములకు బహువాధ్యాత్మిక విశేషములకు, బహువిధ హరిగాథలకు నిధానమై పరిఢవిల్లినది. హరివంశ పర్వము, విష్ణుపర్వము, భవిష్యపర్వము నను నీ మూడు ఖిల పర్వములు గలసి "హరివంశ" మైనది. ఖిలమనగా శేషము మరియు సారము కావుననే "హరివంశమును మహాభారతమునకు Appendix, Sudplement, Sequel అనియు, భారత పరాంశమనియు, సారగ్రంథమనియు, శేషగ్రంథమనియు, ఖిలపర్వమనియు కొందరు ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులు పేర్కొనిరి.[1]

---

1. తెలుగులో హరివంశము. పుట : 3

రమణీయమైన హరివంశమును గైకొని తెనుగున పలువురు కవులు తమ యభిరుచులమేరకు, అమూలాగ్రముగనో, కొన్ని కొన్ని భాగములఁ గైకొనియో యనువదించియున్నారు. కవిత్రయమునం దొకడైన ఎఱ్ఱన "హరివంశ పూర్వోత్తర భాగముల" రెంటిని రచించి, ప్రోలయ వేమారెడ్డి కంకిత మిచ్చియున్నాడు. అట్లే నవీనగుణసనాథుడగు నాచన సోమనాథుడు రసవద్ఘట్టములఁ గైకొని, విష్ణుప్రాశస్త్య మేర్పడునట్లు "ఉత్తర హరివంశము"ను రచించి హరిహరనాథునకంకిత మొనర్చినాడు. గూళికల్లు వేంకటరమణకవి యను నాతడు హరివంశమును రచించినట్లుగ తెలియవచ్చుచున్నదేగాని గ్రంథ మలభ్యము[1] తాళ్ళపాక తిరువేంగళనాథుడు కూడ హరివంశమును రచించెనట. కాని అదియును, అలభ్యము. నేమాని భైరవకవి యను నాతడు కోటగిరివంశభవుండగు శ్రీనివాస భూపతుని కోరికపై హరివంశమును రచించినట్లు తెలియగా, డా॥ పి. యశోదారెడ్డి, ఒక హస్తప్రతికను సాధించినట్లు తమ సిద్ధాంత గ్రంథమునందు పేర్కొనినారు.[2]

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు "ఆంధ్ర భవిష్య పర్వము" ను రచించిరి. తిమ్మరాజను మఱియొకరును "ఆంధ్ర భవిష్య పర్వము" ను వ్రాసినట్లు తెలియుచున్నది. శ్రీ విశ్వనాథ నరసింహ కవి గారు "హరి వంశము"ను యథా మూలముగ ననువదించిరి. కాని ఏడాశ్వాసముల గ్రంథము మాత్రము ముద్రణము నందినది. "హరి వంశము" ను వచన కావ్యముగా రూపొందించినవారును గలరు. "వాగ్వల్లి" యను పత్రిక యందు కొంతకాలము శ్రీ యస్. నరసింహాచార్యులు మఱి కొంత కాలము శ్రీ కొమాండూరు వేంకట రామానుజశర్మగారు రచించి ప్రకటించిరి. అట్లే హరీత శివశర్మ గారు "ఆంధ్ర వాణ పత్రిక"లో కొన్ని భాగములు ప్రకటించిరి. శ్రీమతి ఏలూరిపాటి లక్ష్మీసరస్వతి యను నామె పర్వత్రయ సహితముగ "హరివంశమును" వచన గ్రంథముగా ప్రకటించి యున్నది. శ్రీ పిలకా గణపతి శాస్త్రి గారు "ఆంధ్ర పత్రిక" (దినపత్రిక) లో ఆదివారపు సంచికలలో వచన హరివంశమును సంపూర్ణముగా ప్రకటించిరి.[3] మొత్తముమీద

1. తెలుగులో హరివంశములు : పుట–82
2. తెలుగులో హరివంశములు : పుట–83
3. తెలుగులో హరివంశములు : పుట–85

హరి వంశ కథనము పుణ్యప్రదమను భావనచే పలువురు కవులు హరివంశమును సంపూర్ణముగనో, లేదా తమకు నచ్చినంతవరకో, తెనుగున ననువదించిరి. అది హరివంశ ప్రశస్తిని చెప్పక చెప్పుచున్నది.

"ఆది పర్వము మొదలుకొని స్వర్గారోహణ పర్వము వఱకుగల గ్రంథము భారతమనియు, హరివంశముతో గలిపిన గ్రంథమును మహాభారతమనియు నందు రని శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు తెలిపిరి.[1] అనగా హరివంశము భారతము నకు ఖిలమని స్పష్టము. హరివంశము వ్రాయక మహాభారతము పరిపూర్తి కాదన్న మాట. నన్నయ, తిక్కనలు వ్రాయగా మిగిలిన అరణ్యపర్వ శేషము రచించిన ఎఱ్ఱన, హరివంశమును కూడ రచించుట, ఏతన్మహా భారత పరిపూర్తికి కంకణము కట్టుకొనుటయే. ఆమేరకు ఎఱ్ఱన హరివంశమును, సంస్కృత హరివంశమునకు చక్కని యనువాదము చేసి సమర్థుడనిపించుకొన్నాడు. నాచన సోమనాథుడు "ఉత్తర హరివంశము"ను మాత్రము వ్రాసి యున్నాడు. ఉత్తర హరివంశము విస్తృతి యందు జిన్నదయ్యును గుణసంపదధిక విశేషము గలది. ప్రధాన నాయకుని బురస్కరించుకొని యనౌచిత్యచ్ఛాయలనేని సోకనీయక యతి భద్రముగా నీ గ్రంథమును గాపాడుకొనుచు వచ్చిన మహాకవి నాచన సోమనాథుడు. ఇతడుత్తర హరివంశమందు, మూల హరివంశముకన్న వేఱుగా నొక క్రమమును పాటించి రచించుటవలన నుత్తర హరివంశము రెండు గుణ విశేషములనధికముగా సంతరించు కొనినది. సోమన పాటించిన క్రమము ననుసరించి, హరివంశ కథ లన్నియు నొక నియత మార్గమున నానుపూర్వ్యము లందు వైపరీత్యము లేక వింతగం బొనసిసాగి పోవుటయే గాక కావ్యము మంగళాంతకి ముగుటకుం దోడ్పడినది." యని డా॥ పి. యశోదారెడ్డి ఉత్తర హరివంశ ప్రశస్తిని గూర్చి వక్కాణించి యున్నారు.[2] భారత హరివంశములను వ్రాసియు శ్రీహరి పుణ్యకథా రచనయందు తృప్తి వహింపక వ్యాసుడు భాగవతమును వ్రాసియున్నాడు. అందు హరివంశ కథా కథనము దశమస్కంధమునుండి కొనసాగినది. తెనుగున పోతనగా రద్దానిని

---

1. "పూర్వత్రానుక్తం పరిశిష్టం వస్తు ఖిల శబ్ద వాచ్యమ్"
(బృహదారణ్యక-ఆనందగిరి వాఖ్య 5-1)
ఎఱ్ఱన హరివంశము పీఠిక: పుట : XXIII
2. ఉత్తర హరి వంశము: పీఠిక పుట. 22, 23

భక్తిరసగుళికగా రూపొందించియున్నారు. ఇట్లు హరివంశ కథా కథనము తెనుగు నాట బహుముఖముల విస్తరిల్లినది. ఈ హరివంశ కథలయం దనిరుద్ధుని కథకొక ప్రత్యేకత కలదు. అనిరుద్ధుడు రాక్షసరాజైన బాణుని కూతురగు యుషాకన్యను వివాహ మాడెను. సాధారణముగ నిట్లు జరుగుట చిత్రముగ కనిపించును. కావుననే పలువురు కవులు తెనుగున నీ యనిరుద్ధ చరిత్రమును కావ్యములుగా, యక్ష గానములుగా రూపొందించియున్నారు. ఎఱ్ఱన "హరివంశము" నందు, నాచన సోమనాథుని "ఉత్తర హరివంశము" నందు, పోతన భాగవతమునం దీ కథ యొక అంశముగా రచింపబడగా ఇతరులు ప్రత్యేక కావ్యములుగ వ్రాసియున్నారు.

17 వ శతాబ్దమున రంగాజమ్మ "ఉషాపరిణయ" మను పేరనొక కావ్యమునే రచించినది. ఇది ప్రస్తుతము నాలుగాశ్వాశములే లభించుచున్నవి. అందును నాల్గవ యాశ్వాసమునందు దెబ్బది పద్యముల వఱకే లభించుచున్నవి. ఈ గ్రంథము నామె విజయరాఘవనాయకుని కంకిత మిచ్చినది. కృతిభర్త కోరిక మేరకు "ఉషా పరిణయ కథ" తేటగాఁగ తెనుగు గావించినది.[1]

16 వ శతాబ్దమువాడైన తాళ్లపాక తిరువేంగళనాథుడు (తాళ్ళపాక చిన్నన్న) "ఉషా కల్యాణ" మను పేర ద్విపద కావ్యముగా రచించి, అలవేలుమంగకు నంకితముగా నిచ్చెను. పదునేడవ శతాబ్దమున దామెర అంకభూపాలుడు "ఉషా పరిణయము" నైదాశ్వాసముల శృంగార ప్రబంధముగా రచించి శ్రీరామచంద్రు నికి కృతి నిచ్చినట్లు తెలియుచున్నది.[2] పదువెనిమిదవ శతాబ్దమునందు కైప మాయన కవి (కైపామానయకవి) "ఉషాపరిణయము"ను రచించినట్లు తెలియు చున్నది. నాగినేని వెంకటప్పయ్య "ఉషాకల్యాణ" ప్రబంధమును, పి. వి. నరసింహ నాయుడు "ఉషానిరుద్ధుల వివాహము"ను కనుపర్తి అబ్బయామాత్యుడు "అనిరుద్ధ చరిత్రము"ను రచించిరి. ఉషాపరిణయమును యక్షగానముగా రచించినవా రిరువది యారుగురు గలరు. (అమ్మకూర్తి వెంకటసుబ్బయాదులు).[3] ఇంద రీ కథను బహ

1. ఉషాపరిణయము : 1-6.
2. తెలుగులో హరివంశములు : పుట. 94
3. తెలుగులో హరివంశములు : పుట. 95

ముఖములుగ రచించిరనగా, నిది యాకథా ప్రశస్తిని శకథా చాటుచున్నదన్నమాట.

కనుపర్తి అబ్బయామాత్యుడు ప్రబంధ కవుల కోవకు చెందినవాడు. ఇతని రచనము ప్రౌఢమై, వర్ణనా వైవిధ్యముచే నొప్పుచున్నది. అనిరుద్ధ చరిత్రము, కవిరాజ మనోరంజనమునను, రెండు గ్రంథముల నీతడు రచించెను. రెండును ప్రబంధములే. ఇతడు పెద్దనాది ప్రబంధ కవుల ననుకరించిన తావులు పెక్కులు. ప్రతిభావంతుడైన యీ కవి తన రచనా వైవిధ్యముచే, కల్పనా ప్రౌఢిచే, తన "కవిరాజమనోరంజనము"ను పిల్లవసుచరిత్రమను ప్రసిద్ధికి స్థానమొనర్చియున్నాడు. అతడు "అనిరుద్ధ చరిత్రము"ను రచించి మంగళాచలపతికి నంకితముగా నిచ్చినట్లు కవిరాజమనోరంజనమున చెప్పికొని యుండుటయు,[1] కవిరాజమనోరంజనము, అనిరుద్ధ చరిత్రముకన్న ప్రౌఢమై యుండుటయు, చూడగా నితని మొదటి రచన అనిరుద్ధ చరిత్రమ"ని స్పష్టమగుచున్నది. "The Southern School in Telugu Literature" అను గ్రంథమున నిడదవోలు వేంకటరావు పంతులు గారు, రంగాజమ్మ రచనము, అబ్బయామాత్యుని రచనముతో పోలదగు లేదని వ్రాసి యున్నారు.[2] కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధ చరిత్రమునకు మూల కథ హరివంశమునందలిదేయైనను, అతడు దేనిని యనుసరించెనో పరిశీలించవలసి యున్నది. ఉషానిరుద్ధుల కథను హరివంశము నుండి గ్రహించి, తెనుగున చంపూ కావ్యముగా ననువదించిన వారిలో ముఖ్యులు ఎఱ్ఱన, నాచన సోమనాథుడు, పోతన, రంగాజమ్మ. వీరు అబ్బయామాత్యునకు పూర్వులు కూడ. సంస్కృత హరివంశము వీని కన్నింటికిని మూలము. అనిరుద్ధ చరిత్రమునందలి వస్తువును పై గ్రంథములతో సరిచూచి పరిశీలించి చూచుట యెంతయు నావశ్యకమనిపించును. స్థూలముగ ననిరుద్ధ చరిత్రమున కథ యిట్లున్నది.

పరీక్షిత్తునకు శుకయోగి చెప్పినట్లు, శౌనకాది మునులకు సూతుడు చెప్పిన కథ. అనిరుద్ధచరిత్రమున మొదట ద్వారకాపుర వర్ణనమున్నది. శ్రీకృష్ణ ప్రభావము, ప్రద్యుమ్న విలాసము, అనిరుద్ధాభ్యుదయము, రుక్మలోచనా పరిణయము, నవ

1. కవిరాజమనోరంజనము : పీఠిక- 1. 25
2. అనిరుద్ధచరిత్రము : పీఠిక-పుట-8

దంపతుల కేళి యను ఘట్టములు, బాణాసుర వృత్తాంతమునకు ముందు కూర్చబడినవి. అప్పటికి ప్రథమాశ్వాసము పూర్తియగును. తదుపరి హరి వంశకథానరణి ననుసరించి బాణాసుర వృత్తాంతము చెప్పబడును. ఘట్టములుగా నుటంకించిన క్రమముగా నిట్లుండును.

శోణపుర వైభవము, బాణాసురునకుఁ బరమ శివానుగ్రహము, స్థాణునితో బాణుని కదన కుతూహలము, ఇందుధరుని మందలింపు, ఉషాకన్య సౌందర్య సౌకుమార్య వర్ణనము, ఉషాబాల కళాభిజ్ఞత, వసంతశోభ, వనవిహార క్రీడ, ఉషాకన్య కలలో మోహనాంగుని ప్రణయకలాపము, ఉషారమణి విరహ తాపము, మంత్రి కుమారి చిత్రరేఖ యుష నూరడించుట, ఉష చిత్రరేఖకు దెల్పిన ప్రేమోదంతము, చిత్రలేఖ చిత్రకళానైపుణ్యము, అనిరుద్ధుని చిత్రపటమును గాంచి యుష మేలుపడుట, అను ఘట్టములతో ద్వితీయాశ్వాసము ముగియును. సూర్యాస్తమయ వర్ణనము, అంధకార వర్ణనము, తారకా వర్ణనము, చంద్రోదయ వర్ణనము, మన్మథుని దండయాత్ర, ఉషకుఁ జెలులు శైత్యోపచారములు, మదనోపాలంభనము, యోగ మహిమచేఁ జిత్రరేఖ ద్వారకా ప్రవేశము, సమ్మోహన విద్యాప్రభావముచేఁ జిత్రరేఖ యనిరుద్ధునపహరించుట, ఉషనుగాంచి యనిరుద్ధుడనురక్తుడగుట, ఉషానిరుద్ధులు సమ్మదాంబుధి నోలలాడుట, ప్రభాత వర్ణనము, ఉషాగర్భధారణము, అంతఃపురద్రోహిని బంధింప బాణుని యాదేశము, అనిరుద్ధుడుక్కురక్కసుల నుక్కడంచుట, బాణాసురునకు అనిరుద్ధుడు పట్టువడుట, ఉషాకాంతదురంత సంతాపము, ద్వారకలో ననిరుద్ధుని యన్వేషణమనను ఘట్టములతోఁ దృతీయాశ్వాసము ముగియును. ద్వారకకు నారదమునీంద్రుని యాగమనము, నారదుడు శ్రీకృష్ణునకు అనిరుద్ధుని వృత్తాంతమును నివేదించుట, శోణపురిపై శ్రీకృష్ణుని సమరయాత్ర, సంగర రంగమున బాణునకుఁ బరమ శివుని సాహాయ్యము, హరి హరుల భీకరాహవకేళి, శ్రీకృష్ణుని సమ్మోహనాస్త్ర ప్రభావము, బాణాసురుని కదన విక్రమము, కోటరీ రాక్షసి వికృత చేష్ట, శాంభవ వైష్ణవ జ్వరముల సంరంభము, శాంభవ జ్వరము కావించిన శ్రీకృష్ణస్తవము, దండకము, అను వానితో చతుర్థాశ్వాసము ముగియును. పంచమాశ్వాసమున శ్రీకృష్ణ బాణాసురుల భీషణాహవము, బాణునిపై శ్రీకృష్ణసుదర్శనాయుధ ప్రయోగము, శివుడు కావించిన కేశవస్తుతి, బాణుడు శ్రీకృష్ణుని సన్నుతించి యుషానిరుద్ధుల నప్పగించుట, యను

నీ ఘట్టములు హరివంశమునకు సంబంధించి యుండును. తదుపరి పియ్యాల వారికిఁ క్రియోపచారములు, ఉషానిరుద్ధుల వీడుకోలు, ద్వారకకు ఉషానిరుద్ధుల యాగమనము, పురకాంతల పూలజల్లులు, అనిరుద్ధుని దక్షిణ నాయకత్వము, ఉషాసుందరికి కుమారోదయము, వజ్రకుమారుని శైశవ క్రీడలు, నారదముని వజ్రుని సాముద్రికా శుభ లక్షణములను గొనియాడుట, ఫలశ్రుతి యను నంశములు, అబ్బయామాత్యుడు ప్రబంధకవుల బాణిలో, నాటి సాంఘిక సాంస్కృతిక విషయములు ప్రతిబింబించునట్లు కూర్చిన కూర్పులు కాగా మూలహరివంశ కథకును ఇంచలి కథకును భేదము నరయవలసి యున్నది. మూలమునందు ఉషాకన్యకు పార్వతి వరమిచ్చినట్లున్నది. కాని అనిరుద్ధ చరిత్రమున, పార్వతి ఉషాకన్యకు సకల కళాభిజ్ఞతను గురువుగా బోధించినట్లున్నది. ఇది లోకరీతి కనుగుణము. చిత్రరేఖ యోగ మహిమచే ననిరుద్ధుని తెచ్చినట్లు, అనిరుద్ధ చరిత్రమున గలదు. మూలమున చిత్రరేఖ నారదదత్త విద్యామహిమచే ననిరుద్ధుని తెచ్చినట్లున్నది. మరియు నతనికి యుషాప్రణయమును గూర్చి తెలిపినట్లున్నది. అనిరుద్ధ చరిత్రము నందలి కల్పనము సుందర మనిపించును. ఉషా మందిరమున నామెను దర్శించి, ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై అనిరుద్ధుడామె యందనురక్తుడయ్యెననుట, సమంజసము గదా! గర్భధారణ విషయమును పోతన్న ననుసరించియే, అబ్బయామాత్యుడు కూర్చి యున్నాడు. ఇది మూలమున గాని, మరే గ్రంథమున గాని కానిపించదు. అనిరుద్ధుడు నాగపాశబద్ధుడు కాగా ఉషాదేవి సంతాపము నొందినట్లు మూలమున లేదు. నారదుడు అనిరుద్ధుని గలియుట, కాళికాప్రసాదమున బంధమోచనమైనట్లు మూలమున గలదు. అబ్బయామాత్యు డా విషయమును గ్రహింప లేదు. అశరీరవాణిని గల్పించి యౌచిత్యమును సాధించెను. “ వీనికి నిది జయకాలంబు పెనగ నేటికి? హరిచే నొదవు నపజయము వీనికిఁ; గదియు శుభము నీకు నచిర కాలమునందున ”.[1] అని అశరీరవాణి చెప్పగా విధికి బద్ధుడై, బాణప్రయుక్త నాగపాశబద్ధుడైనాడు. అనిరుద్ధుడు శక్రజిత్తుచే హనుమంతుని వలె బద్ధుడైనాడట. ఇది రమణీయమై, అబ్బయామాత్యుని కల్పనా చాతురిని చాటుచున్నది. శ్రీకృష్ణుని సమ్మోహనాస్త్ర విషయము మూలమున లేదు. ఇదియును భాగవతమునఁదప్ప మరి యొండు గ్రంథమున లేదు. కావున భాగవతము ననుసరించియే అబ్బయామాత్యు డీ యంశ

1. అనిరుద్ధ చరిత్రము : ఆ. 3–115

మును కూర్చెనని తోచును. సుదర్శనము ప్రయోగింపగా రెండు చేతులు తక్క తక్కినవి ఖండింపబడినట్లు మూలమున నున్నది. కాగా అబ్బయామాత్యుడు నాలుగు చేతులు మిగిలినట్లు వ్రాసి యున్నాడు. ఇదియు భాగవతము ననుసరించిన యంశమే. మరి యే గ్రంథమున నట్లు లేదు. పోతన నాలుగు భుజములు మిగుల్చుటచే, నాతనికి చతుర్భుజుడైన శ్రీమహావిష్ణువుతో సారూప్యము సిద్ధింపజేసెను. ఆ విషయమును, అబ్బయామాత్యుడు యథాతథముగ గ్రహించి తన గ్రంథమున నలంకరింపజేసెను. పరిశీలింపగా అనిరుద్ధ చరిత్రము మూలమునకన్న కథావిషయమున భాగవతమునకే సన్నిహితమైనట్లు తోచుచున్నది.

ఉషాకన్యకు పార్వతి వరమిచ్చుట యను నంశము మూలమునుండి గైకొని నాచన సోమనాథుడు తన ఉత్తరహరివంశమున చెప్పినాడు. రంగాజమ్మ మన్మథారాధనము నొక నూతనాంశమును ఉషా విరహ వర్ణన సందర్భమున చేర్చెను. దీని నితరు లెవ్వరును చెప్పియుండ లేదు. అది యామె స్వోపజ్ఞమే. రంగాజమ్మ చిత్రరేఖ యోగమును గూర్చి చెప్పి యుండలేదు. కాని నారదదత్త తామసీ విద్యను గూర్చి చెప్పియున్నది. ఈ విషయమున మూలముతో రంగాజమ్మ, నాచనసోముడు సంవదింతురు. అనిరుద్ధుడు సైతము కలగనినట్లు రంగాజమ్మ వర్ణించెను. ఇది అమూలకము. ఎట్టిన, అనిరుద్ధుడు బంధమోచనమునకై కాళికాస్తవ మొనర్చెనని చెప్పగా, రంగాజమ్మ దుర్గాస్తవమని చెప్పినది. ఇవి మూలముతో సంవదించును. కాని అనిరుద్ధ చరిత్రమునకు భిన్నములు. గరుడుని పై శ్రీకృష్ణ బలరామ ప్రద్యుమ్నులు శోణపురమునకు వచ్చినట్లు మూలము ననుసరించి ఎట్టిన, రంగాజమ్మ, నాచన సోములు వ్రాసిరి. సైన్యముతో వచ్చినట్లు అనిరుద్ధ చరిత్రము వర్ణించిన తీరు భాగవతముతో సరిపడుచున్నది. ఎట్టిన కోటరీరాక్షసిని గూర్చి వ్రాసియుండలేదు. మూలముతో, ననిరుద్ధ చరిత్రము భాగవతము సంవదించును. కాగా నాచనసోముడు అగ్నిక యని యొకమారు, కోటవి యని యొకమారు చెప్పి యుండెను. నాలుగు హస్తములు తక్క తక్కినవి ఖండింపబడినట్లు బాణుని స్థితిని గూర్చి, అనిరుద్ధ చరిత్రము, భాగవతము చెప్పుచుండగా, రెండు చేతులే మిగిలినట్లు మూలము ననుసరించి ఎట్టిన వర్ణించెను. కాని నాచనసోముడు మొత్తము చేతులు ఖండింపబడిన తదుపరి బాణునకు మరల రెండు చేతులు ప్రసాదింప బడినట్లు వర్ణించెను. బాణుడు శ్రీకృష్ణున కోడె ఉషానిరుద్ధుల నతని కప్పగించెను. అతడు

తుడుంపబడి ప్రమథశ్రేష్ఠుడుగా శివుని సేవించు వానిగా నియమింపబడినాడు. దానితో కథ సుఖాంతమైనది.

అబ్బయామాత్యుడు రచించిన అనిరుద్ధ చరిత్రమునకు మూలము హరివంశమే యైనప్పటికిని, అతడు తన కావ్యమున ననుసరించిన వస్తు సంవిధానమున భాగవతము ననుసరించిన తీరు, సుస్పష్టముగ గోచరించును. అత డుషానిరుద్ధుల వృత్తాంతమును ప్రబంధముగా రూపొందించి యున్నప్పటికిని ఇతర ప్రబంధ కవులవలె సందర్భోచితమగు కల్పనలు చేసినవాడు కాడు. ఆ విషయమునం దంతగా శ్రద్ధ చూపినట్లు కనిపించదు. సాధ్యమైనంత వరకు మూలమునే అనుసరించి నప్పటికిని, తెలుగులో ననువదింపబడిన ఇతర కావ్యములందలి అనిరుద్ధచరిత్ర భాగములతో బోల్చి చూచినప్పుడు, అతడు భాగవతమునే మాతృకగా భావించినట్లు స్పష్టమగుచున్నది. పార్వతి ఉషకు విద్యలగరపినదను విషయ మొక్కటి పోతన తన భాగవతమున చెప్ప యుండలేదు. ఈ విషయమున దక్క మిగిలిన విషయము లన్నిటి యందును భాగవతము, అనిరుద్ధ చరిత్రములలో భేద మిసుమంతయు గానరాదు. కావున వస్తు విషయమున అనిరుద్ధ చరిత్రమునకు భాగవతమే మూలమని భావింపవచ్చును. "భాగవత కథ పైనే యనిరుద్ధ చరిత్ర మెక్కుడాధారపడి యుండుటచే భాగవత కథ ప్రత్యేకముగ నీయబడలేదు." అని భాగవత కథకును హరివంశ కథకు తారతమ్య వివక్ష సేయుచు శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు 'అనిరుద్ధ చరిత్రము' నకు వారు వ్రాసిన పీఠికలో నుడివిరి.[1] ఇదియు పై యభిప్రాయమునే బలపరచుచున్నది. మరియొక విశేషము కలదు. అబ్బయామాత్యునికి పోతనయం దెనలేని భక్తి. అంతే కాదు అరాధనాభావమున్నది. కావుననే అతని యెడ తాదాత్మ్యమును భావించెను. పోతనగారు కౌండిన్యసగోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు.[2] అబ్బయామాత్యుడు కూడ కౌండిన్యస గోత్రుడే. ఆపస్తంబ సూత్రుడే. లోకమునందొకడు సుప్రసిద్ధుడుండగా నతని ననుకరించుట లోకసహజము. అట్టివాడు తమ గోత్రీకుడైనచో మరియు నాతనియం దాసక్తి మెండగును. పోతన వంటి భక్తకవి తమవాడను భావమే భక్తి తాత్పర్యముల గలిగించును. కావున అబ్బయా

1. అనిరుద్ధ చరిత్రము : పీఠిక ; పుట. 16.
2. ఆంధ్రభాగవతము : అ. 1_22

మాత్యుడు పోతన యెడ నట్టి భావనయే కలిగియుండెనని తోచుచున్నది. అంతియే కాదు తన కవసరమైన కథా వస్తువును భాగవతము నుండి గైకొనిన అబ్బయా మాత్యుడు పూర్వకవుల స్తుతించుచు పోతనామాత్యుని పేరైనా స్మరింప లేదు. అతనిని తానను కరించెను గాన నాపేరు చెప్పుటకు వెనుకాడెనని తలంప వీలు లేదు. అతని కట్టి అవసరమును లేదు. కాని పోతన పేరు చెప్పియుండలేదు.[1] "వినుతింతున్ హరిభక్తి నిష్ఠుల మహావిద్వత్కవి శ్రేష్ఠులన్" అని పలుకుచు పోతన పేరైన నెత్తలేదు. తెలుగునాట పోతన్నకన్న భక్తకవి యెవడు? గొప్పకవి యెవడు? అట్టి వానిని స్మరింపకుండు టేల? దీనికి హేతు వేమైయుండునా యని పరిశీలించినచో నొక విషయము స్ఫురింప గలదు. అతడు కావలయుననియే పోతన్న పేరు చెప్ప లేదు. హరిభక్తి నిష్ఠుడైన కవి ప్రవరుడెవరో తెలుగు వారికి తెలియదా? తెలియును. గుణ విశేషము చేతనే యొకడు తెలియబడుచుండగా నాతని పేరు చెప్పు నవసరమేల కలుగును? తానాతని యందంతటి తాదాత్మ్యభావన చేసెనన్నమాట. పోతన వ్రాసిన కథనే గైకొని ప్రబంధమును రచించితినని వ్యంజింపజేసిన సమర్థుడు అబ్బయా మాత్యుడు. అంతియే కాని పోతన్న యెడ భక్తిలేక కాదు. పోతన్న యెడ తనకు గల అభేద ప్రతిపత్తిని సూచించుటకొఱకే యింత ప్రయత్నము. ఇది యొక విశిష్ట ఫణితి. అబ్బయామాత్యుని రీతి యట్టిది.

---

1. అనిరుద్ధ చరిత్రము : అవతారిక : 1_8

## నాలుగవ అధ్యాయము

# అనిరుద్ధ చరిత్రము - శ్రీవిద్య

అనిరుద్ధ చరిత్రమునందలి వస్తువు సహజముగా రమ్యమైనది. ఏలనన రాక్షస కన్యయైన ఉషాకన్య స్వప్నమున నదియు పార్వతీ వరముచే, కృష్ణ పౌత్రుని సమాగమ మగుట, ప్రణయతీవ్రతచే విరహార్తయైన ఉషాకన్య కోరిక తీర్ప చిత్రరేఖ యంబర మార్గమున నేగి కృష్ణపౌత్రుడైన యనిరుద్ధుని గొనితెచ్చుట, ఉషానిరుద్ధుల ప్రణయకలాపము, తండ్రియైన బాణున కీ విషయము తెలియకుండుట, ఉషగర్భవతియగుట, రహస్య భంగమగుట, బాణుడు కోపించి యనిరుద్ధుని బంధించుట, కృష్ణుడు దండెత్తివచ్చి బాణుని మదమణచి ఉషానిరుద్ధులను ద్వారకకుఁగొంపోవుట అను నీవస్తుగత ముఖ్యాంశములు కథా కథనశీలుర కెల్లరకు మనసున కెక్కి మురిపించునవి. కావుననే తెలుగునాట పెక్కురు కవులు ఉషానిరుద్ధుల చరిత్రమును వివిధములైన సాహిత్య ప్రక్రియలుగా రచించిరి.[1] ఇందు రమ్యత నాపాదించు

1. తెలుగులో హరివంశములు : పుట : 95

హేతువులనరసి, ఇందొక మహావిషయ మున్నదని గ్రహించినాడు, అబ్బయా మాత్యుడు. దీనిని వస్తువుగా చేకొని తన యుపాస్య విద్యయైన శ్రీవిద్యను ప్రతీకగా నిలువవలయునను యాలోచన యాతనికి స్ఫురించినది. కావుననే దీనినట్లు దిద్దినాడు.

ఇచట శ్రీవిద్యను గూర్చి రెండు మాటలు చెప్పవలయును. "శ్రీవిద్యకే కుండలినీ యోగమని"[1] పేరు. శ్రీమాతృదేవీ మూర్తిగా పరమేశ్వరారాధన ప్రాచీన ఋగ్వేద సూక్తములతోనే ప్రారంభించుచున్నది. కాలక్రమేణ ఆ మాతృదేవతా ర్చనమే తంత్ర సంప్రదాయములలో శ్రీవిద్యోపాసనగా పరిణమించినది. దీనికే బ్రహ్మవిద్యయని వేరొక పేరున్నది. శ్రీమాత, ధర్మార్థ కామ మోక్షప్రదాయిని, మహాశక్తి స్వరూపిణి. అభీష్ట వర ప్రదాయిని. భక్తకోటి ప్రత్యక్ష కల్పలతిక[2] మూలాధారమునుండి ఉత్థాపనము చేయబడిన కుండలినీశక్తి సుషుమ్నా నాడిని ప్రవేశించి ఉత్తరోత్తరక్రమముగా స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, అజ్ఞా చక్రములను దాటుచు బోయి సహస్రార పద్మమును చేరి, అందు శివునితో సంయోగమును పొందును.[3] సంగ్రహముగా నిదే కుండలినీ యోగమని శ్రీ గుంటూరి శేషేంద్ర శర్మగారనిరి.

"శరీరమందు రెండు సహస్రార దళ పద్మములున్నవి. అవి అధః సహస్రా రము, ఊర్ధ్వ సహస్రారము, ఇవి రెండును శక్తి స్థానములు. మూలాధార నిలయ మైన అధః సహస్ర దళ పద్మమే 'కుల పద్మము' ఊర్ధ్వ సహస్రదళ పద్మము అకుల పద్మము క్రింది కుల పద్మము నుండి సుషుమ్నా మార్గమున మీది అకుల పద్మమునకు గొని పోయి మరల కులపద్మమునకు దించుటయే కులాచార మనెడి కుండలినీ యోగ సాధనము. ఊర్ధ్వాధః సహస్రదళ పద్మముల సంధానించు, నాళ మును బోలి, నడుమ బిసతంతు సన్నిభమైన సూక్ష్మ తమమైన మార్గమునకే కులమని, సుషుమ్న యని యోగశాస్త్రము వచించినది. శ్రీదేవి అవ్యక్తశక్తిగా

1. శ్రీలలితా సహస్రనామ భాష్యము. పుట :- 303

2. ,, ,, పీఠిక. పుట :- 29

3. షోడశి రామాయణ రహస్యములు : పుట :-

వర్ణింప బడినది.[1]. అని దివాకరుని వేంకట సుబ్బారావుగారనిరి. శ్రీమాత బిసతంతు తనీయసి.[2] అబ్బయామాత్యుడు నృసింహోపాసకుడే గాక, శ్రీవిద్యోపాసకుడు కూడ నని ఇంతకుమున్నే చెప్పబడినది. వివరింతును.

శ్రీదేవి కుండలినీ రూపమున మూలాధారమునందు మూడున్నర చుట్టలు చుట్టుకొని సర్పాకారమున నుండునని శాస్త్రము.[3] దానిని సూచించుటకే అనిరుద్ధ చరిత్ర, కవిరాజ మనోరంజనములను తన రెండు గ్రంథములందును ఇష్ట దేవతా స్తుతి రూపమున, అబ్బయామాత్యుడు మూర్తిత్రయమును, శక్తి త్రయమును స్తుతించి పిదప గణాధిపుని స్తుతించియున్నాడు. లక్ష్మీనారాయణు లొక వలయము. పార్వతీపరమేశ్వరులు రెండవ వలయము. సరస్వతీ చతుర్ముఖులు మూడవ వలయము. గణాధిపుడర్ధ వలయము. ఇది కుండలినిని సూచించుటకే ఇక నీశక్తికి షోడశి యని పేరు. 'శ్రీషోడషాక్షరీ విద్యా', అనియు దీనికే మరొక పేరు. పదునారు కళలుగల యీ దేవి మూలాధారమున సాదాఖ్య యను కళతో నుండి ఉత్థాపనము చేయబడి సహస్రారమును చేరు సరికి షోడశ కళాపూర్ణమగును. అది సూచించుటకే నీకవి తన రెండు గ్రంథము లందును సరస్వతీ మూర్తులైన పదునార్గురు కవులను స్తుతించి యున్నాడు. వీరా శక్త్యంశ సంభూతులని సూచన. అతని కారాధ్యులైన వారెందరో నుండగా నొక గ్రంథమున కొందరిని, రెండవ గ్రంథమున కొందరిని చెప్పి, మొత్తముమీద పదునారు సంఖ్యను మాత్రము మార్చలేదు. హరిభక్తి నిష్ఠుల మహా విద్వత్కవి శ్రేష్ఠులన్ వినుతించి యున్నాడు.[4] ఇదియును తాను శ్రీవిద్యోపాసకుడనని సూచించుటకే యని తోచుచున్నది. పీఠిక యందేగాక యీ కవి తన కావ్యమునందును శ్రీవిద్యా విషయమును ప్రతిపాదింప దలంచినట్లు తోచుచున్నది.

---

1. శ్రీవిద్య సుందర కాండ.

2. శ్రీలలితా సహస్రనామ భాష్యము. పుట : 88

3. ,, ,, పుట : 88

4. అనిరుద్ధ చరిత్రము : 1_8.

మూలాధార స్వాధిష్ఠానములకు రుద్రగ్రంథి (అగ్నిఖండము) అని పేరు. అట్లే మణిపూర అనాహతములకు విష్ణుగ్రంథి (సూర్యఖండము) అని, విశుద్ధ అజ్ఞా చక్రములకు, బ్రహ్మగ్రంథి (చంద్రఖండము) అనియు పేరు.[1] మూలాధారమున కుండలిని సుప్తయైయుండును శోణపురమున బాణాసురుడు మత్తుడై యుండుట యట్టిది. అతనికి ఉషోదయమైనది. కుండలినీ ఉత్థాపనమైన దనుటకు సూచన. ఆమె పార్వతీ పరమేశ్వరుల ప్రణయమును చూచి తానట్లు కాగోరుట, సహస్రార మున కుండలిని సదాశివునితో సంయోగము నొందగోరుట వంటిది. ఆమెకై చిత్ర రేఖ ద్వారక కేగుట కుండలిని సహస్రారమును చేరుట. అనిరుద్ధుని తెచ్చుట యనగా సహస్రారమున అమృతస్రావము కాగా తృప్తమైన కుండలిని మరలి వచ్చుట వంటిది. అనిరుద్ధుని వెదకుచు శ్రీకృష్ణుడు వచ్చుట బాణాసుర దమన మొనర్చుట యనగా, మూలాధారము నందలి యాసురీ శక్తులు దమింప బడుట యన్నమాట. ఉషానిరుద్ధుల వివాహము, కుండలిని తృప్త మగుటను సూచించును. ఉషానిరుద్ధులు ద్వారకకు చేరుట పూర్ణ యోగస్వరూపము. వజ్రుడు పుట్టుట యనగా బాణుని "కులము"ను ప్రకాశింప జేయుటకని సూచన. సహస్రారము నుండి స్రవించు ధారా రూపమైన అమృత వర్షము, శరీరము నందలి 72 వేల నాడుల సంతృప్త మొనర్చుట యనగా రాక్షస కులము ధన్యమగుట. ఇది "కులము" యమృత వర్షమున భాసించుటయని చెప్పవచ్చును.

స్థూలముగ నిందలి వస్తువునకు శ్రీవిద్యకుసుగల సంబంధమును గమ నించితిమి. ఇక కావ్యాంతస్సాక్ష్యము నవలోకింతము.

పీఠికయందు మంగళాద్రి నారసింహుని వర్ణించిన తీరు సైతము శ్రీవిద్యా సామ్యమును కల్గియున్నది. ఎగువ తిరుపతి, దిగువ తిరుపతులనుట, అకుల, కుల పద్మములకు సూచన. మంగళాద్రి జగదానందకరంబనుట, మోక్షపదవీ సోపాన మార్గమనుట యొక విశేషము. అంతియే కాదు. యోగిగణాకీర్ణ గుహాంతరమనుట, యోగవిద్యా సూచన. సహస్రారమున సదాశివునితో కుండలినీ సంయోగమైన పిదప అమృత వర్షము కురియును. దానికి సూచన, మంగళాద్రి నారసింహుడు

1. The Serpent Power P. 145

నిత్యము సేవించు గుడ జల ధారా సేచనము.[1] షష్ఠ్యంతములలో నారసింహుని "తామరసోద్భవాస్య కుముదేందునకున్",[2] అని పలుకుటలో బ్రహ్మ ముఖమును కలువతో బోల్చి, అట్టి ముఖమునకు చంద్రుడైనవాడా అనుటచేత, బ్రహ్మగ్రంథి పైన పూర్ణచంద్రాకారమున భాసించు సహస్రారస్థ కుండలినీ శక్తిని వర్ణించుటయే యని తోచును. కుండలినీ యోగమునందు ఆరోహణ, అవరోహణము లుండును. దానిని సూచించుటకేమో యన్నట్లు ఉషాదేవిని వర్ణించు సందర్భమున "ఘన సారమును సారఘనమును.........సారె వర్ణింపఁదగును"[3] అని రచించి యున్నాడు. దేవతలను ఆపాదమస్తకము, మనుష్యులను అమస్తకము వర్ణించుట ఆర్య సంప్రదాయము. ఆరోహిణియు, అవరోహిణియు ననుటచేత పైకి చూడ నిది సంగీత విషయముగ కనిపించును. రాగములకు ఆరోహణావరోహణములు సహజములే కదా! విశేషముగ నిట నీ కుండలినీ యోగమునందును మొదట ఆరోహణము, తదుపరి యవరోహణము జరుగును. కావున నదియు నిచ్చట గర్భితము. ఉషాదేవికి కలలో కాన్పించిన యనిరుద్ధుడు "మాణిక్య కుండల శోభాంచిత మందహాస రసవత్సుస్నిగ్ధగల్లద్వయీలలితాస్యుండు".[4] అని చెప్పుట యొక్క విశేషము. 'కుండలి', 'లలితా' శబ్దములు శ్రీవిద్యా స్ఫోరకము లనుట నిర్వివాదము. ఇక చిత్రరేఖ తండ్రి కుంభాండుడు. కుంభక మీ విద్యకు సంబంధించినదే. ఈ కుంభాండుడెట్టివాడో చూడుడు. "చతుష్షష్టి తంత్ర మహామంత్ర కలాప లక్ష్యపరుడట"[5] చిత్రరేఖ "తండ్రి వలన మంత్ర తంత్ర యోగ క్రియ లభ్యసించినది"[6] చిత్రరేఖా లిఖిత కృష్ణ పౌత్ర ప్రతిబింబము గాంచి, ఉషాదేవి "సంపూర్ణ పూర్ణిమా చంద్ర బింబోదయంబు గోరుచున్న చకోరకంబు కైవడి నున్నది.[7] ఇదియు శ్రీవిద్యా

---

1. అనిరుద్ధ చరిత్రము : 1_41
2. ,, ,, 1_46
3. ,, ,, 2_26
4. అనిరుద్ధ చరిత్ర : 2_63
5. ,, ,, 2_81
6. ,, ,, 2_82
7. ,, ,, 1_38

స్ఫోరకమే. చిత్రరేఖ సమ్మోహన విద్యచే జనులంనిద్రా మగ్నులం జేయుట.[1] అనిరుద్ధుని మోహము సదము లేందు నిభంబగుట[2] ఆమె పర్వరజనీంద్రు కళానన యనుట,[3] ఇది యంతయు చిత్రరేఖ యొక్క శుంభద్యోగ విద్యోన్నతి[4] సాధ్య మైన దనుట గమనింపదగి యున్నది.

ఉషాదేవి గర్భవతి యైనది. "అతివ గర్భాయాస నిశ్శ్వాస మంత్ర సముచ్చారణము సేయ, నాభి వివరాంతస్సీమ యందుండి సాహస భావంబున నిర్గమించి సఫణంబై యాడు నీలాహి రీతి"[5] రోమరాజి చెలువొందినదట. నారదుని నోట యుషా కన్యను వర్ణించుచు, కవి, బాణుడు సహస్రబాహుండనుట, అతని కూతురగు నుషాకన్య "రూప యౌవన భాగ్య లక్షణ కళావతి"[6] యని చెప్పుట యీ విశేషము సూచించుటకే. అధః సహస్రార స్థానీయుడగు బాణుడు సహస్రబాహు డనుట, ఉషాదేవిని కళావతి యనుట, చిత్రము. యోగ విద్యా నిరూఢిని చిత్రరేఖ యని రుద్ధుని గొంపోయినదనుట గమనింప దగియున్నది. ఈ విషయము తెలిసి బాణుని పైకి దండెత్తి వచ్చు, శ్రీకృష్ణుని రథవర్ణనము గనుడు. అహిత లోచన దుర్నిరీక్షతరాంశు మాలికోగ్ర సహస్రార మండితంబు నైన రథమెక్కి, పుడరీకాక్షుడపుడు కదలె శతకోటి సూర్య ప్రకాశుడగుచు"[7] శ్రీకృష్ణ రథము సహస్రార మండిత మనుట కన్న వేరుగా నేమి చెప్పవలయును. ఉషానిరుద్ధులు ద్వారకకు రాగా, ద్వారకాపురివాసు లెదురుకోళ్లు సేసిన విధము గనుడు. అప్పుడు ద్వారక, "శ్రీ సముదంచితంబగుచు చెల్వు వహించె పురంబు నవ్యమై"[8] శ్రీ సముదంచి

1. అనిరుద్ధ చరిత్ర : 3_46
2. ,, ,, 3_48
3. ,, ,, 3_63
4. ,, ,, 3_69
5. ,, ,, 3_101
6. ,, ,, 4_19
7. ,, ,, 4_26
8. ,, ,, 5_57

తంబిగుట విశేషము. నారద మునీంద్రుడు వజ్ర కుమారుని స్తుతించిన పిదప, యనిరుద్ధుని స్తుతించిన తీరు గమనింపుడు. "భగవత్స్వరూపుండవు. అది గర్భేశ్వరుండవు. బ్రహ్మజ్ఞాననిధివి"[1] అని వర్ణించుట చూడ, నిదియు పైవానితో నన్వయించుచున్నది. "చంద్రునకుఁ జంద్రుడనదగు సద్గుణముల చేత ననిరుద్ధుడు జగత్ప్రసిద్ధుడయ్యె"[2] ననుట మరింత స్పష్టముగ చెప్పుట. చంద్రుడే అమృతమయుడు. కాన చంద్రునకు చంద్రుడనుటచే సహస్రారాంతర్గత అమృత వర్షుడైన చంద్రుని ప్రశంసయేగాని మరొండుగాదు. ఆశ్వాసాంత పద్యమునందు సైతము నీ విషయము నబ్బయామాత్యుడు సూచించుట జరిగినది. శ్రీ మంగళాద్రి నారసింహుని, "శయనీభూత భుజంగ"[3] అని యభివర్ణించుట, కేవలము శేషశాయి యని చెప్పుట మాత్రమనకేనా, కాదు. అమృతస్రావమైన పిదప తృప్తమైన కుండలిని మరల మూలాధారమున సుప్తమగును. ఈ వర్ణనము కావ్యాంతమున నుండుట నద్దాని సూచించుటకే యని చెప్పవచ్చును. ఇట్లే కవి తన గ్రంథమం దంతటను శ్రీవిద్యా విషయమును ప్రతిపాదించి యున్నాడనుటకు నాధారములు కనిపించుచున్నవి. ఇది ఇందలి వస్తువుతో పొంది పొసగి యుండుట మరియు విశేషము. ఇది యాదృచ్ఛికము గాదు. కవి తా నాకాంక్షించి యెన్నుకొనిన కథావస్తు వాతని, ఆశయ స్థితికి సమర్థమగుట సహజము గదా!

దేవాంశ సంభూతుడైన శ్రీకృష్ణుని మనుమడు రాక్షస శ్రేష్ఠుడైన బాణకన్యను వివాహ మాడుట యనునది లోకోత్తర మైనది. సాధారణముగ నిది దుర్లభము. కాని అట్లు జరిగినది. ఇది లోకవృత్తము. ఇక యోగ విషయమును పరిశీలించి నచో, జీవుడు ఐహిక సుఖ లోలుడై పశుతుల్యుడై జీవించుచుండును. (కుండలిని సుప్తమై యున్నపుడు) బుద్ధి వికసింపగా (కుండలినీ యుత్థాపనము జరుగగా) క్రమముగా తమోగుణమును వీడి (రుద్రగ్రంథి దాటి) రజోగుణము నధిగమించి (విష్ణుగ్రంథిని దాటి) సత్త్వగుణము నతిక్రమించి, (బ్రహ్మ గ్రంథిని దాటి) శుద్ధ సత్త్వస్వరూపుడైన భగవానుని (సహస్రార మండిత సదాశివుని) దర్శనము చేసికొని

1. అనిరుద్ధ చరిత్ర : 5_101
2. ,, ,, 5_105
3. ,, ,, 5_113

'అహం బ్రహ్మాస్మి' యనుకొని (శక్తి సదాశివ సంయోగము) అమృతమూర్తియై (అమృత ధారాసిక్తుడై) లోకమున నిస్సంగుడై జీవన్ముక్తుడై ప్రకాశించును. (అమృత వర్షముచే తృప్త కుండలిని మరల మూలాధారమును చేరుట) అప్పుడు జీవుడు "సర్వం ఖల్విదం బ్రహ్మ" యని నిర్ధారణ చేసికొని, నిస్సంగత్వముచే జీవన్ముక్తుడౌను.[1] ఇట్లు జీవికి శుద్ధ సత్త్వ దర్శనము జరుగుట యెట్టిదో కుండలిని సహస్రారాంతర్గత అమృతవర్షధారాసిక్త మగుట యట్టిది. అట్లే కావ్యమున తమోగుణ ప్రధానమైన రాక్షస జాతి, సత్త్వగుణ ప్రధానమైన ద్వారకా నాథుని వియ్యముతో శుద్ధమై సర్వజనాహ్లాదకారణమైనది. అద్వైతము, కుండలినీ యోగము, పైకి భిన్నములుగా దోచినను ఫలసిద్ధి యందు అభిన్నములై భాసించు చున్నవి. కావుననే శ్రీ శంకర భగవత్పాదులు సైతము నీ విద్యను గూర్చి తమ సౌందర్య లహరియందు సూచించి యున్నారు.

సుధాధారా సారైశ్చరణ యుగళాన్త ర్విగళితైః
ప్రపంచం సిఞ్చన్తీ పునరపి రసామ్నాయ మహసః
అవాప్య స్వాంభూమిం భుజగనిభ మధ్యుష్ట వలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుణ్డే కుహరిణీ.[2]

చిత్రరేఖ చేతఁ జిత్రింపఁబడిన యనిరుద్ధుని సౌందర్య విశేషమును జూచి ఉషారమణి, రుచిరావలోకనంబులు పరమశాంతుని హృదయంబునుంబోలెఁ దత్సౌం దర్యలహరీ మగ్నంబై యానందలహరిం దేలుచున్న వని వర్ణించుచు, సౌందర్య లహరీ, ఆనందలహరీ శబ్దములఁ బ్రయోగించుటచే నీ సందర్భమున శ్రీ విద్యా విషయమును వ్యజ్యమాన మొనర్చినాడని చెప్పఁదగియున్నది.

అబ్బయామాత్యుడు కావ్యారంభమున పీఠిక యందు వ్రాసిన క్రింది పద్యము గనుడు.

---

1. అంతరార్థ రామాయణము. పుట : 33, 34
2. సౌందర్య లహరి. శ్లో॥ 10

"భగవంతుని సద్గుణములు
పొగడు వివేకంబె తమ కపూర్వైశ్వర్యం
బగుట, నరస్తుతి సేయరు
జగతిన్ సత్కవులు తుచ్ఛ సంపద కొఱకై"

—అనిరుద్ధ-1-17.

ఇక చివరన ఫలశ్రుతిగా వ్రాసిన పద్యము గనుడు.

"జననాథ! యిట్లు నాచే
వినిపింపఁగఁబడిన రస వివేక నిధానం
బనిరుద్ధ చరిత్రము, వ్రా
సినఁ జదివిన వినిన నరునిఁ జెందు శుభంబుల్" -5-110

రెండును కందములే రెండింటి యందును వివేక శబ్దము వాడబడినది. మొదటిది అతని లక్ష్యము. రెండవది సిద్ధి. ఇది వివేకము వలన సిద్ధించినది. కావ్యము ద్వారా కూడా కనుక రస వివేక నిధానం బనిరుద్ధ చరిత్రమని స్పష్టము.

ఐదవ అధ్యాయము

# అనిరుద్ధ చరిత్రము - కవితా విశేషములు

ప్రబంధము తెలుగునకు పేరు తెచ్చిన ప్రక్రియ. ప్రబంధ కవులందరు, ముఖ్యముగ పెద్దనాదులు కవితాశక్తులైన ఊహ, కల్పన, భావనలకు ప్రాధాన్యము నిచ్చి ప్రబంధ రచనమున పరిణతిని సాధించిరి, కొందరు వారిననుకరించిరి. కొందరు వర్ణన వైవిధ్య సంవిధానమునకే పట్టము గట్టిరి. ఆ కోవకు చెందిన వారిలో కవికర్ణ రసాయన కర్త సంకుసాల నృసింహ కవి యొకడు. రెండవ వాడు కనుపర్తి అబ్బయా మాత్యుడు.

కనుపర్తి అబ్బయామాత్యుడు వర్ణన విషయమున పలువురు ప్రాచీన కవుల ననుకరించెను. అనుకరించెననగా అప్పట్లనా కవుల యెడగల గౌరవ భావమే గాని మరియొండు గాదు. స్వతంత్రింప సామర్థ్యము లేకనుగాదు. అనిరుద్ధ చరిత్రము నీ కవి యౌవనమందే వ్రాసి యుండెను సాధారణముగ పెద్దలైన పూర్వకవుల ననుకరించి వారివలె తానును విశిష్టవర్ణనా నైపుణి వెలార్ప గల్గితినని

చెప్పుకొను సంలాటను యౌవనమందుండుట సహజముగ కనిపించును. అబ్బయామాత్యునికి పింగళి సూరనను, రామరాజభూషణుని యనుసరింప వలయునను కోరిక మెండు. కథా విషయమున పింగళి సూరన ననుకరించు ప్రయత్నము; కవిరాజ మనోరంజనమున కానిపించును. రచనా విషయమున రామరాజభూషణు ననుకరించిన విషయము స్పష్టముగా కనిపించును. కాని అనిరుద్ధ చరిత్రము రచించు నాటికి అతని దృష్టి పెద్దనపై నిలచి యున్నది. "ఆలోచింపగా మనుచరిత్రమును దృష్టిలో నుంచుకొని యనిరుద్ధ చరిత్రమును రచించినట్లును, వసు చరిత్రమును దృష్టిలో నుంచుకొని 'పురూరవశ్చరిత్రము' ను (కవిరాజ మనోరంజనము) రచించి నట్లును గన్పట్టు చున్నది. అనగా రస ప్రధానముగ పురూరవశ్చరిత్రమును రచించె నని భావింపవచ్చును".[1] అని పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారభిప్రాయ పడిరి. అంతే కాదు రమ పీఠికలో పెద్దన మనుచరిత్రమునకు, అనిరుద్ధ చరిత్రమునకు పోలికలు చూపుచు సమర్థించిరి. వర్ణన విషయమున నితడు పలువురు పూర్వకవుల ననుసరించెను. వారిపైన నతనికిగల యభిమానమే, అతనిచే వారి పోకడల ననుకరింప నుద్యుక్తు నొనర్చినదని భావింపవలెను. అనుకరణము లన్నియు మూలమున కన్న మిన్నగా నుండక పోవచ్చును. కాని కొన్ని పట్ల ఈ కవి వసు చరిత్రము లోని వర్ణనమున కన్న మెఱుగైన వర్ణన చేసినరీతి కనిపించును. అబ్బయామాత్యుడు ద్వారకా నగరమును వర్ణించిన తీరు గనుడు.

"ఉదయ నగేంద్ర మెక్కి యినుఁ డున్నతమై గగనంబుఁ దాఁకుఁ ద
త్సదమల హర్మ్యము ల్గని రథంబున కడ్డము నిల్చునంచుఁ దా
మదిఁ దలపోసి తిన్ననగు మార్గమునం జనఁ డంత కంతకున్
జవలమునిక్కి యవ్వలిదెసం దిగిపోవుచునుండు నిచ్చటన్" 1-59

ఇట్టిదేయైన ఘట్టమున వసుచరిత్ర యందలి వర్ణన చూడుడు.

"అలఘుతర గ్రహంబుగుణి తాగణితాభిమతాగ్ర రత్నకం
దళరుచిఁ దాల్చు వీటివరణంబు గతావరణం బొనర్చు ని
చ్చలు నల కోటకొమ్మ బలుసందుల పొందుల నేగఁగా జూచి
యలవరచెం బతంగు డసహాయరథాంగముగా శతాంగమున్" 1-95

1. అనిరుద్ధ చరిత్రము :- పీఠిక : పుట : 17

వసుచరిత్ర యందలి యధిష్ఠానపుర వర్ణనముఁజూచియే అప్పయామాత్యుఁడు ద్వారకా నగర వర్ణన మొనర్చియుండును. వసుచరిత్ర యందలి వర్ణన మత్యంతము రమణీయము, కాదనుటకు వీలులేదు. కాని కోట కొమ్మల పందులమూఁడి వోవుట కన్న, వక్రమార్గమునఁ జదలను ఁక్కిఁక్కి వెళ్లుట వలన, నిరంతర ప్రభా ప్రకాశనమున కవకాశము, మిక్కుటము గదా ! కిపుననే అప్పయామాత్యుఁడు కొద్దిగామార్చి యొక విశేషమును ప్రదర్శించినాఁడు. ఇట్టిదే మరి యొక్కటి.

"స్వైరవిహారధీరలగు ..................నీకు తెల్పఁగన్" వసు_2_55.

పద్యమునందు రామరాజభూషణుడు నేయార్థమును ప్రయోగించినాడు. "సారవ లోచనలు" రస భంగమైనచో, సాలోచన లగుదురని సాభిప్రాయముగ వచించినాడు ఆ వరుసలోనే అప్పయామాత్యుఁడు రుక్మలోచలానిరుద్ధుల ప్రథమ సమాగమమును వర్ణించిన తీరు గనుఁడు.

"అధిక ప్రయత్న సంశిథిల నీవీ బంధ
మభిముఖ కుంచి తాస్యాంబుజాత
మాలస్య కర గృహీ తాంచిత కుచ కుంభ
మనురాగ రస నిగూ ఢాంతరంగ
మాయాస లబ్ధ బాహా లతా పరిరంభ
మాకుంచిత భ్రూ యుగాభిరామ
మామోద బాష్పధారా పూరి తాంబక
మలఘు సీత్కార మోహన నినాద

మచిర సంభూత మదన తోయ ప్రవాహ
మవగ తోష్ఠాంగజాత ఘర్మాంబు కళిక
మాత్మ పరవశ జనిత నిద్రాభిలాష
మగుచు నయ్యింతి ప్రథమ సమాగమంబు"_1_115

ఇందు ప్రథమ సమాగమము సహజ రమ్యముగ చిత్రింపఁబడినది. నేయార్థము విశేషమై భాసిల్లుచున్నది. ప్రథమాక్షరమైన "అ" సమాగమమున వనగా, "మ" అను నక్షర మాగమింపగా, దానితో గూడుకొని సమాగమమైనది. ప్రతి పీవపాద

ఖండాదియందును ఎత్తు గీతియందు ప్రతి పాదాదిని, మకార మాద్యక్షరమైన "అ" కారముతో కలసి పోయినది. (నిత్యసంధి కలిగినది) అకార మకారములనగా, ప్రతి సమాసము నందలి ఆది అంత్యములను కలిపి వారిరువురట్లే సమాగమ మైరని యొక చమత్కారమును సాధించినాడు. అంతియే కాదు, అందలి యొక్కొక్క యమకపదము వెంట వెంట కలిగిన పనుటను, వారి సమాగమము నిరంతరాయముగ కొనసాగిన పనుటనుగూడ ఈ విధముగ వ్యంజించినట్లయినది మరియొక విశేష మేమన, అవ్యక్షరమైన "అ" కారమును విష్ణువని యర్థము చెప్పుట వేదాంత పరి భాషలో సిద్ధము అట్లే "మ" కారము జీవునికి చెల్లును. వారి సమాగమము జీవాత్మ పరమాత్మల సంయోగము వంటిదనుటతో పాటు విశిష్టానందదాయకమని ధ్వని. వార శృంగారవతుల వర్ణనము (1-67) పుష్పలావికల వర్ణనము (1-68) ప్రబంధ కర్తలవెల్ల కలదోపి యనుకరించినవే. అనిరుద్ధుని వర్ణించుచు, అతని రూపవైభ వము, "వారస్యల యోగ విరహ మొదవించె" (1-81) నని చెప్పిన తీరు పెద్దన గారి మనుచరిత్ర యొరవడిని సాగినదే. ఉషాదేవి కలలో కాన్పించిన అనిరుద్ధుడు "మాణిక్య కుండల శోభాంచిత మందహాస రసవత్సుస్నిగ్ధ గల్ల ద్వయా లలితా స్యుండు, సుగంధ బంధుర సుమాలంకార నీలోత్పలోజ్జ్వల ధమ్మిల్లుఁడు" అను వర్ణ నము (2-63) రంకంటి పాపరాజు చేసిన శ్రీరామచంద్ర వర్ణనమును గుర్తుకు తెచ్చుచున్నది. "ఎన్నడు లేని ... కోమలీ" (2-85) అను పద్యము పోతనగారి "సమ్మతి నా మనంబున........శర్వరీ" (భాగ-10-1741) యను పద్యమును బోలి యున్నది.

చిత్రరేఖ తాను గీచిన చిత్రములందలి యందగాండ్రను వర్ణించి చెప్పు టను,[1] శ్రీనాథుని శృంగార నైషధము నందలి దమయంతీ స్వయంవర ఘట్టమును తలపించుచున్నది. ఇందలి శ్రీకృష్ణ వర్ణనము (2-126) పోతన వర్ణనరీతిని పుణికి పుచ్చుకొనినది.[2] అట్లే అనిరుద్ధుని గూర్చి "వీడు గదమ్మ" (2-138) యను పద్యము, పోతనా మాత్యుని "వీడటే......."[3] యను పద్యమును పోలియున్నది.

1. అనిరుద్ధ చరిత్ర : 2-103 నుండి 128 వరకు
2. భాగవతము : 10-1013
3. ,, ,, 10-1248

ద్వారకానగర వర్ణన చేయుచు "కాంచెన్.........ద్వారకన్" (3-40) పద్యము చేమకూర ద్వారకాపుర వర్ణనమును పోలియున్నది.[1] "శ్రీకంఠ చాపఖండన.........రామ నృపాలా"[2] యను పోతన పద్యము, "శ్రీ కల్యాణగుణోజ్జ్వల.........మంగళాద్రి నివాసా" (అని-5-1) అను పద్యముగా రూపొందినదని చెప్పవచ్చును. "అయ్యా! మాయనిరుద్ధు డెంచఁగెనో......... (అని-4-16) అను పద్యము, శ్రీ కాళహస్తి మాహాత్మ్యమునందలి, "అయ్యా! ఎక్కడనుండి యిక్కడకు........."[3] అను పద్యము పోకడను గుర్తుకు పుచ్చుకొనినది. ఇతడు ముఖ్యముగా మనుచరిత్రము నందలి పెద్దన రీతులను అపైన శృంగార నైషధ, వసుచరిత్ర, పారిజాతాపహరణము, భాగవతము, కాళహస్తి మాహాత్మ్యము, విజయ విలాసము మున్నగు గ్రంథములందలి పూర్వకవుల పోకడల నెన్నిటినో గ్రహించి స్వోపజ్ఞచేత, వానిని తన యనిరుద్ధ చరిత్రము నందచ్చటచ్చట ముచ్చటగా నేర్చికూర్చియున్నాడు.

ఇతని బహుశాస్త్ర పరిజ్ఞాన మించింతనరానిది.

"ఘనసారమును సారఘనము నాక్షేపించు
కలికి పల్కుల యింపు, కచము సొంపు
.... ................................................
సారె వర్ణింపఁ దగును" - (అని-2-26)

ఇట కవి తనకుగల సంగీత సాహిత్య పరిజ్ఞానములను రమ్యముగ జోడించిన తీరు ప్రశంసనీయము. క్రమాలంకారము. ఆరోహణ అవరోహణములను వ్యజించుటకు చక్కని యాధారమైనది. ఇందలి విశేషములు, ఆరోహణ, అవరోహణములవలె సారె సారెకు ఉషా సౌందర్య దర్శనాభిలాష నిబ్బడి ముబ్బడి చేయుచున్నవి. ఇట్టిదే మరియొకటి

---

1. విజయవిలాసము : 1-1
2. భాగవతము : 10-1
3. కాళహస్తి మాహాత్మ్యము : 1-58.

"సుమకాదు ననుగారుకొని మీరు ఘన చారు
తను మారుకొని కేరుఁ దరుణి కురులు
.... .... .... .... .... .... .... .... .... .... ....
సుదతి రూపంబుఁ ద్రిభువన మోహనంబు" 2-30.

ఇది నిజముగ సర్వ జన సమ్మోహనమే. ఆతని జ్యోతిష పరిజ్ఞాన మపారము.

"పాపయుత త్రిషష్ఠము......... వినుతింప నయ్యెడన్" 4-25

ఎట్టి ముహూర్తమున యుద్ధమునకు వెడలుట శ్రేష్ఠమో చూడుడు. పాపగ్రహములు మూడింట, ఆరింట నుండవలెనట. శుభ గ్రహములు కేంద్రమునందుడవలెనట. లగ్నము శరాసన లగ్నము (ధనుర్లగ్నము) చంద్రహోర. నక్షయము పుష్కరాంశము యుద్ధమునకు సుముహూర్తము. ఇక చెప్పవలయునా ? విజయము తథ్యము. ఇట్టిదే వ్రజకుమారుని జనన కాల లగ్నము.

"స్వక్షేత్రంబున.... ......... హరిపూర్ణాంశావతీర్ణాంగునిన్" 5-81

లక్షణాంశను చంద్రు జూచుచు, దినేశాదులు చరింపగా రాజాంశతో, వజ్రుడు పుట్టెనట. ఇట శ్రీవిద్యా విషయ స్ఫూర్తి కలదు. చంద్ర, రాజశబ్దముల ప్రయోగము, హరి పూర్ణాంశావతీర్ణాంగు డనుట విశేషము. పురుషసూక్త పఠనము (5-20) సాముద్రిక శాస్త్రము (5-98, 99) నాట్యశాస్త్రము (5-104) అనిరుద్ధమూర్తి సాలగ్రామార్చనము (5-107) శ్రీవిద్యా (5-105, 113) మొదలగు ననేక శాస్త్ర విషయముల నాతడు సమయోచితముగ నుపయోగించి కావ్యమునకు వైశిష్ట్యమును చేకూర్చినాడు. ఇతడచ్చటచ్చట స్వతంత్రించి కొన్ని ప్రయోగములొనర్చి యున్నాడు. అవి సాధువులు గాకపోయినను రమ్యములే. చేసుక (1-119) చింతామయం బయ్యెట్టున్నది. (4-16) మొదలగునవి గమనింపదగినవి. ఆతడు శబ్దాలంకారములను, అర్థాలంకారములను పెక్కులు వాడియున్నాడు. ఉదాహరణమునకు, అంత్యానుప్రాసము (2-4) ముక్తపదగ్రస్తము (2-12) శబ్దాలంకారముల లోను, ఉపమా (3-24, 25) ఉత్ప్రేక్ష (3-6, 7) రూపక (2-29) అర్థాలంకారములలోను విదురవ్యమై కావ్యమునకు వన్నె తెచ్చినవి. ఆతని వర్ణన చమత్కృతి

యొక్కటే, యితనిని ప్రబంధ కవుల పజ్జన మహాసనస్థుని జేయ సమర్థమైయున్నది. వివరింతును

"అల్ల సుధాపయోధి............వేడ్కలకుం గొబంతమే" 4_55

లక్ష్మీదేవికి, సుధాపయోధి వటపురంతర లవణాబ్ధి యందలి ద్వారక యత్తవారిల్లగుట చేత నామెకు, పుట్టిన యిల్లును, అత్తవారిల్లును ఏకదేశ మైనదని చెప్పుటలోని చమత్కృతి గనుడు. ఏకదేశమనగా నొకటే స్థానమని సామాన్యార్థము. ఇక వ్యాకరణ పరిభాషలో నేకదేశమనగా సంధి జరిగినప్పుడు పూర్వపర స్వరములకు బదులుగా పరస్వర మొక్కటే నిలుచును. ఇది అచ్చముగ తెలుగు భాషలో చిన్నయసూరి సూత్రమును స్మరింపించుట.[1] ఇట పుట్టినిల్లు మొదటిది. అత్తవారిల్లు రెండవది. రెంటికిని బదులు అత్తవారిల్లు ఏకదేశము ఇది చమత్కృతి ఏకదేశమును శబ్దమును పరిష్కరించిన తీరాతని ప్రజ్ఞావిశేషమునకు మచ్చుతునక.

"కలవాక్కీర హయంబు............రతిరాజస్యందన ప్రక్రియన్" 2_23

ఆమె కలవాక్కు, మన్మథునకు కీరహయము (ఆమె పలుకులు చిలుకపలుకులవలె రమ్యమైనవనుట విశేషము) గల్ల మకరీ కస్తూరికా పత్రము, సల్లలితాంకము (మకరి మన్మథుని చిహ్నము వక్షస్థలముపై మకరికా పత్రములు వ్రాయుట సౌందర్య సాధనము. అవి కస్తూరిచే పరిమళ భరితము) నితంబ బింబములు, పటు లీలా చక్రములు. (రథచక్రములను రమ్యమైనవి. ఆమె నడచినచో నందముగా సుందరమనుట విశేషము). భ్రూలతాయుగము, చాపము (వాని వక్రతా సౌందర్యము సూచితము) ఆలోకనాంచల బాణములఁ బరపునవి (అవి చూపఱగుండెల నవియ జేయునవి. అవి తాపహేతువులని సూచన). ఆమె విగ్రహము (శరీరము) మన్మథునికి స్యందన ప్రక్రియన్ శోభిల్లినది. అనగా నామె శరీరము రథమనుటపై మాట విగ్రహమనగా యుద్ధము. ఇది స్మరసమరమని సూచన. స్యందనము వలె నన చోట, 'ప్రక్రియ' అనుటచేత విశేషమైన సాధనమనుట. ఏలన నీ స్యందనమ విశేషముగా విలక్షణముగా తాపము గొల్పు బాణౌఘమును స్యందింప జేయునది.

1. బాలవ్యాకరణము : సంధి–1.

కావుననే కోకిల్లి నదనుట. రతిరాజ శబ్దమునకు మన్మథుడనియేగాక శ్రేష్ఠ రతియనియు చెప్పినచో, మిగుల నాసక్తి గొల్పునదని విశేషము. ఇక ఆమె జలజాతానన. జలజాతము మన్మథబాణముగదా! ఆమె ముఖదర్శనమే బాణపాత సమమై, మన్మథతాపము గొల్పుటచే నిది చెప్పనక్కరలేదనుట. చమత్కృతి యనదది. మరి యొక చమత్కృతి గనుడు.

"విభుని కౌగిటికై వెదజెందు మేనికిఁ
జందన పంకము లందనేల?

...... ......

మందులకై మందులానరించి రిందుముఖులు" 3_24

చెలికత్తె లుషాకన్యకు విరహతాపోపశమనార్థము శైత్యోపచారములు సేయఁ బూను కొన్నారు. చందనము నలందినారు. చందనము తాపమును గలిగించినదని, పన్నీట గడిగినారు. పన్నీటి బాధకు కప్పురపు పొడిని, కప్పురపు తాపమునకు చాఁక్రంత మును పీచి, తాపోపశమనమునకై ప్రయత్నించి విఫలులైనారు. నేరని వైద్యుడు తగుమందు తెలియక, తానిచ్చిన మందువలన గలిగిన బాధా నివృత్తికై మరల మందుల నిచ్చినట్లున్నదట, ఆ చెలికత్తెల సేవలు. ఇదియొక చమత్కారము. నాడును నేరని వైద్యులుండిరి కాబోలు! అసమర్థులైన వైద్యులకిది చెంపపెట్టు. అనిరుద్ధసమాగమముగాక మరియొకటి తాపోపశమన సమర్థము కాదని ధ్వని.

చేమకూర వేంకటకవివలెనే, అబ్బయామాత్యుడు కూడ, పదములను, పద బంధములను విరచి, చిత్రమైన యర్థమును సాధించుటకు యత్నించినాడు ఉషా నిరుద్ధులు ద్వారకకురాగా, అచటి కాంతలు ఉషాకన్య సౌందర్యమును ప్రశం సించుచు ఆమెకన్నులు సాటిలేనివని వర్ణించిన యీ పద్యమును చూడుడు.

"కలువలు చేప పేరుగానగా కుసుమమ్ములు....
............కన్నులఁ బోలనేర్చునే" 5_70

ఉషాకన్య నయన సౌందర్యమునుగూర్చి వారు ముచ్చటించిన తీరెంత ముచ్చటగ

నున్నదో గమనింపుడు. ఆమె కన్నులకు సాటివచ్చువానికై వారువెదకిరి. కలువ పేరు పేరుకొనవలయు ననుకొనిరి. అవి కుముదములని (కుత్సితమైన ముదము నిచ్చునవి) నిరాదరించిరి. మన్మథాంబకముల నెన్నుదమాయని తలచిరి. అవి విషమములు. (విరహి జనుల బాధించునవి) కాన లెక్కింపరైరి. కమలమ్ముల సాటి పోల్చుదమనుకొని, వాని పుట్టుపూర్వము తెలియగా నవి పంకజాతములని తెలిసినవి. (బురదలో పుట్టినవి హీనజాతి) కాన సాటిరావని నిరాకరించిరి. మెఱుగు తీగల నుపమింతమని తేరి కనుగొనగా నవి చపలములని స్పష్టమైనది. (అస్థిరమైనవి) కనుక వానిని తిరస్కరించిరి. ఇట్లు ఉషాకన్య నయన సౌందర్యమునకు సాటివచ్చునదేదియు గనరాకుండుటచే, నిరుపమానములని భావించిరి. ఇట కవి, పేరు పేరుకొనగా (చెప్పుటకు) గణుతింపగా (లెక్కించుటకు) పుట్టుపూర్వములు తెలియగా (పుట్టుక తెలియగా) తేరి కనుంగొనగా (స్పష్టముగ చూడగ) ననుచోట్ల శ్లేషించి చక్కని రామణీయకతను సాధించియున్నాడు. గొప్పగా చెప్పుచున్న కలువలకు, కుముదములను వానికున్న పేరే వాని లక్షణము మంచిది గాదని తెల్పుచున్నది మన్మథుని బాణములైన అశోకము, అరవిందము, చూతము, నీలోత్పలము, నవమల్లికల లెక్కబెట్టగా బేసి సంఖ్యగలవి అను నర్థమున విషమములు. విరహిజన ప్రాణహారకములనుట. కమలములు సుందరమైనవేగాని వాని పుట్టుక మంచిదికాదు. బురదలో పుట్టినవి. తక్కువజాతి యనుట. తేరి కనుగొనుట యనగా సాటివచ్చునది లేదే యని, సౌందర్య సాధములైన సుమములన్నియు లోకువకాగా, విచారముతో తలవంచి ఆలోచించుకొని, ఆ విచారమునుండి తేరి, కనుంగొనగా, పైకిచూడగా, అనగా భూమిపై సామ్యము లేకుండుటచే నాకసము వంక చూడగా, ఆకసమున మెఱుగు తీగలు సాటివచ్చునేమో యనిపించినది. కాని యవి చపలములు స్థిరముగా నుండవు. మొదట చూతుము. మరల తేరి కనుంగొనగా నవి కనిపించవు. కావున నవి యామె కన్నులవలె నేర్చునే? అనగా పోలవనుట. అవి నిరుపమానములు. అతి మనోజ్ఞములనుట, ఆమె కన్నులకు సాటిలేనట్లే, ఇచటి వర్ణనరీతికి కూడ సాటిలేదని చెప్పవచ్చును ఇట్టి పద్యములెన్నియో, అనిరుద్ధ చరిత్రమునకు వన్నె తెచ్చినవి గలవు. (1-34, 1-80, 1-82 1-89, 1-90, 2-18, 2-133, 3-25, 3-75, 3-89, 3-119, 5-43, 5-74, 5-86)

ఇతడు తన కావ్యమునుగూర్చి వ్యంగ్యముగా చెప్పుకొనిన తీరుగనుడు (ఫలశ్రుతి)

ఆరవ అధ్యాయము

# కవిరాజమనోరంజనము - వస్తుకల్పనము, ఆధారములు, విశేషములు

## కవిరాజ మనోరంజనము (పురూరవశ్చరిత్రము)

### వస్తువు :—

కనుపర్తి అబ్బయామాత్యుడు కవిరాజ మనోరంజనమునకై, పలుచోట్లనుండి వస్తువును సేకరించెను. ఇందలి కథ యే యొక్క గ్రంథ మాధారముగ వ్రాయబడ లేదు. కొంత కల్పనము గలదు. ఇది ప్రబంధ పద్ధతికి ననుగుణముగనే సాగినది. కావున వస్తుస్వభావమును పరిశీలించుట ప్రథమ కర్తవ్య మైనది. మొదట నిందలి వస్తువును సమగ్రముగ నిత్తును.

ప్రథమాశ్వాసము :- ప్రతిష్ఠాన పురవర్ణనముతోఁ గథా ప్రారంభమగును. విచిత్ర విభవసురుచిర మా పురము. కలశాంబురాశిగతి నన్నగరంబు కరంబు చెలువగు నది. రాజమార్గములచే, క్రీడాశైలములచే, ధేయ హర్మ్యోపవనములచే భువనంబు లభినుతింప నెగడున దా పురము. సమర్థులైన చాతుర్వర్ణ్యులచే నలలారుచుండును. అన్ని విధముల నుత్తమంబైన యా నగరమున కధీశ్వరుండు పురూరవుండు. అతడు

తపోనిష్ఠుడై పుణ్యాశ్రమున వసించెను. పురూరవుడు రాజ్యాభిషిక్తుడై, ప్రశస్త పద్ధతిని రాజ్యమేలి ప్రజ కానందము గూర్చెను. అతడు తన పరాక్రమము ప్రకటింపనెంచి దిగ్విజయమునకై పూనుకొని సమస్త భూపాలని జయించి, అద్వితీయాతపత్రుడై జగముల నేలెను. వైవస్వత, సుద్యుమ్న, పురూరవుల వృత్తాంతం తము నిట్లు నారదమునీంద్రుడు దేవసభ నుగ్గడింపగా, విని, దేవేంద్రాదులు హర్ష పులకిత గాత్రులైరి. అప్సరసలెల్ల పురూరవుని సద్గుణాళిని విని యతనియందత్యంతము ననురక్తలైరి కాని వారికా రాజశేఖరు డలభ్యుడుగా నెంచి నిర్లిప్తలైరి. శ్రీమన్నారాయణుని యూరువున జనించిన యూర్వశి యాతనియందే లగ్నమానసయై విరాళిగొన్నది. ఆ విరహ మిట్టిదని చెప్పరానిది. చెలులు శిశిరోపచారము లెన్నియో చేసిరి. మన్మథపూజ యొనర్పఁజేసిరి. ఆమె విరహ మింతింతనరాని దగుటచే మన్మథోపాలంభన, చంద్రోపాలంభన, మలయానిలోపాలంభన, కోకిలాద్యుపాలంబనఁ జేసియు ఫలితంబుగానక తుదకు నెట్లో యూరడించుటకై యత్నించిరి కాని యదియు నిష్ఫలమైనది. అట్టియెడ నొక శుకాంగనతో శుకమనోహరు డా యూర్వశీ వృత్తాంతమును తెలుపుట తటస్థించినది. చెలికత్తెలచే ప్రార్థింపబడి త్రైలోక్యవర్తిని యను నా శుకోత్తము డా యూర్వశి పురూరవదత్త చిత్తయై విరాళి గొన్నదని తెలిపి, ఊర్వశీ పురూరవుల కచిర కాలంబున సమాగమంబు సిద్ధించునని పలికి వారల నూరడిల్ల జేసినది. ఆ మాటల కా యూర్వశియు నూరడిల్లి, తన కా రాజేంద్రునితో పొందు సమకూడునన్న విశ్వాసమున, మనసు దిట్టపరచుకొని మసలుచున్నది.

చతుర్థాశ్వాసము :- మిత్రావరుణులు శివుని గూర్చి గొప్ప తపము చేయుచుండిరి. తన యాధిపత్యమేమగునోయని మహేంద్రుని కదురు పుట్టినది. ఏ విధముగనైన వారి తపంబునకు విఘ్నంబాచరింప వలయునని నిశ్చయించుకొని, ఇంద్రుడూర్వశిని మిత్రావరుణుల తపోభంగ మొనర్పుమని నియోగించెను. ఇంద్ర నియోగము, పురూరవ సమాగమ హేతువగునని యెటింగిన దౌట, యూర్వశి మహేంద్రు నాజ్ఞ నానందముగ నామోదించి భూస్థలి కేతెంచినది. మిత్రావరుణుల తపోభూమిని తన చెలికత్తెలతోగూడి విహరించినది. మధుర మోహనముగ వీణాగాన మాలపించినది. ఆ గానమును విని యా మునీంద్రులు తపము వీడి యామె సోయగమును గాంచి భ్రాంత చిత్తులైరి. వారిరువు రామె విభ్రమ విలాసముల

విష్ణునారాధనము చేసి స్తుతించెను. విష్ణువు ప్రత్యక్షమై, ఆ కూతురే కొడుకగునని వరమిచ్చి యంతర్హితుండయ్యెను. విష్ణు వరదాన మహిమచే, ఇలా కన్య పురుష రూపమును బొందినది. మను వాతనికి వశిష్ఠుని మతంబున సుద్యుమ్నుడని నామం బిడి అఖిల విద్యా పారంగతునిఁ జేసెను. కొంతకాలమున కొకనాడు సుద్యుమ్నుడు వేటయందాసక్తుడై యడవి కేగి, వేటసేయుచు చని చని, పార్వతీ పరమేశ్వరులు విహరించెడు కుమార వనమునుఁ బ్రవేశించెను. ఆ వనమును జొచ్చినవా రీశ్వ రాజ్ఞచే స్త్రీలగుదురు. ఆ కారణమున సుద్యుమ్నుడా వనమునఁ బ్రవేశించినంతనే, నవమోహనాంగి యాయెను. తాను స్త్రీగా మారుటచే సిగ్గిల్లి నగరమున కేగక అచ్చటచ్చట తిరుగాడు చుండెను. అట్టియెడ బుధుడా సుందరాంగిని జూచి మోహిం చెను. బహువిధసరసోక్తులాడిన యతని గని యామెయు ననురక్తయై తన్నేలు కొమ్మన్నది. అతఁడసుందానందమున నా యతివను రతి ప్రసంగమునకు తిగిచి సమాగమ సుఖంబులందెను. అంతట నా యతివ గర్భము దాల్చినది. నవ మాస ములు మోసి యొక శుభముహూర్తమున నామె యొక పుత్ర రత్నమును గాంచినది. అతడే పురూరవుడు. కొన్ని దినములకా సుందరాంగి, తన స్త్రీరూపమునకు వగచి వశిష్ఠుని తలచుకొనినది. ఆమె యెడ ప్రసన్నుడై వశిష్ఠుడు శివుని ధ్యానించినాడు. శివుడు ప్రత్యక్షముకాగా, బహుభంగుల చిత్రగతుల వశిష్ఠుడు స్తుతించినాడు. శివుడు ప్రసన్నుడై యా రాజసుతుడు మాసము పురుషుడుగా, మాసము తరుణిగ నుండ గలడని కరుణించి, యంతర్ధానము నొందెను. శివకృపా విశేషముచే నా కాంత, పురుషాకృతి నొంది రూపరేఖాజిత ప్రద్యుమ్నుండన సుద్యుమ్ను డాయెను. అతడు తన కుమారుడగు పురూరవునితో, వసిష్ఠునితో ప్రతిష్ఠాన పురమునకు తిరిగి వచ్చెను. వారిరాక యా నగర వాసుల కమందానందము నొడగూర్చినది. వశిష్ఠుడా సుద్యుమ్న పురూరవుల వృత్తాంతమును మనువున కెఱింగించి, పురూరవుడు శ్రీమన్నారాయ ణాంశోద్భవుడని వివరించి, మనువు కోరికపై, పురూరవునకు సమస్త విద్యల నుపదేశించెను. ఆ తరువాత, వైవస్వత, సుద్యుమ్న, పురూరవులు నమస్కరించగా, వారల దీవించి వెడలిపోయెను.

తృతీయాశ్వాసము :- వైవస్వత మనువు సుద్యుమ్నుని రాజుగాపింపగా నా సుద్యుమ్నుడు ప్రజకు నానందముగ బహుకాలము పరిపాలించి, వార్ధక్య మున భోగములు మాని విరాగియై, పురూరవుని యందు రాజ్యభారము నుంచి

తపోనిష్ఠుడై పుణ్యాశ్రమున వసించెను. పురూరవుడు రాజ్యాభిషిక్తుడై, ప్రశస్త పద్ధతిని రాజ్యమేలి ప్రజ కానందము గూర్చెను. అతడు తన పరాక్రమము ప్రకటింపనెంచి దిగ్విజయమునకై పూనుకొని సమస్త భూపాలని జయించి, అద్వితీయాతపత్రుడై జగముల నేలెను. వైవస్వత, సుద్యుమ్న, పురూరవుల వృత్తాంతం తము నిట్లు నారదమునీంద్రుడు దేవసభ నుగ్గడింపగా, విని, దేవేంద్రాదులు హర్ష పులకిత గాత్రులైరి. అప్సరసలెల్ల పురూరవుని సద్గుణాళిని విని యతనియం దత్యం తము ననురక్తలైరి కాని వారి కా రాజశేఖరు డలభ్యుడుగా నెంచి నిర్లిప్తలైరి. శ్రీమన్నారాయణుని యూరువున జనించిన యూర్వశి యాతనియందే లగ్నమానసయై విరాళిగొన్నది. ఆ విరహ మిట్టిదని చెప్పరానిది. చెలులు శిశిరోపచారము లెన్నియో చేసిరి. మన్మథపూజ యొనర్పఁజేసిరి. ఆమె విరహ మింతింతనరాని దగుటచే మన్మథోపాలంభన, చంద్రోపాలంభన, మలయానిలోపాలంభన, కోకిలా ద్యుపాలంభనఁ జేసియు ఫలితంబుగానక తుదకు నెట్లో యూరడించుటకై యత్నించిరి కాని యవియు నిష్ఫలమైనది. అట్టియెడ నొక శుకాంగనతో శుకమనోహరు డా యూర్వశి వృత్తాంతమును తెలుపుట తటస్థించినది. చెలికత్తెలచే ప్రార్థింపబడి త్రైలోక్యవర్తిని యను నా శుకోత్తము డా యూర్వశి పురూరవదత్త చిత్తయై విరాళి గొన్నదని తెలిపి, ఊర్వశీ పురూరవుల కచిర కాలంబున సమాగమంబు సిద్ధించు నని పలికి వారల నూరడిల్ల జేసినది. ఆ మాటల కా యూర్వశియు నూరడిల్లి, తన కా రాజేంద్రునితో పొందు సమకూడునన్న విశ్వాసమున, మనసు దిట్టపరచుకొని మసలుచున్నది.

చతుర్థాశ్వాసము :- మిత్రావరుణులు శివుని గూర్చి గొప్ప తపము చేయు చుండిరి. తన యాధిపత్యమేమగునోయని మహేంద్రుని కదురు పుట్టినది. ఏ విధ ముగనైన వారి తపంబునకు విఘ్నంబాచరింప వలయునని నిశ్చయించుకొని, ఇంద్రుడూర్వశిని మిత్రావరుణుల తపోభంగ మొనర్పుమని నియోగించెను. ఇంద్ర నియోగము, పురూరవ సమాగమ హేతువగునని యెంచిన దౌట, యూర్వశి మహేంద్రు నాజ్ఞ నానందముగ నామోదించి భూస్థలి కేతెంచినది. మిత్రావరుణుల తపోభూమిని తన చెలికత్తెలతోగూడి విహరించినది. మధుర మోహనముగ వీణా గాన మాలపించినది. ఆ గానమును విని యా మునీంద్రులు తపము వీడి యామె సోయగమును గాంచి భ్రాంత చిత్తులైరి. వారిరువు రామె విభ్రమ విలాసముల

కచ్చెరువంది, సమ్మోహితులై చొక్కిన వీర్యపతనమైనది. వారప్పుడు తమకు తపోభంగము వాటిల్లినదని యెఱింగి, మానవ స్త్రీగా నుండుమని యూర్వశిని శపించిరి. అప్పుడామె యెంతగనో వేడికొనగా, కొంతకాలము భూమిపై నుండిన పిదప నమరావతి కరుగగలవని శాప మోక్షమును తెలిపిరి. వారి నియోగమున ప్రస్థలిత శుక్రమును కుంభక్షిప్తము చేయగా నందుండి, అగస్త్య వశిష్ఠులుద్భవించిరి. ఇంతలో నాట్యమేళకర్తలగు గంధర్వు లూర్వశిని తోడ్కొని పోవుటకై వచ్చి, యామె హృదయ మెఱిగి, పురూరవుని కోరుచున్నదని తెలిసినవారగుటచే, క్రీడార్థంబామె పెంచిన జోడు తగళ్లను చోర మృగాద్యుపద్రవములం బొరయకుండునట్లును, వివస్త్రతాకారంబు గాని తెరంగున తనకడ మెలంగునట్లు, పురూరవుని యొడంబరచు నవని, యర్థించి యొప్పించుకొని యయ్యింతిని వీడ్కొని చనిరి. అంత మాఘ స్నానార్థమై పురూరవుడు గంగానదీ ప్రాంతమునకు వచ్చియుండెను. అత డేకాంతమున నొక్కనాడు ధ్యానమునుండి లేచుసరికి, అతని భక్తికి మెచ్చి, శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయ్యెను. అంత నా రాజేంద్రుడు శ్రీమహావిష్ణువు ననేక విధంబుల స్తుతించి నమస్కరించిన, శ్రీ మమహావిష్ణువు తద్దయు దయాళుడై, దివ్యవనితా లాభము, పుత్రోత్పత్తి, తుది ననపాయ మహాసుఖము లభింపగలదని యాశీర్వదించిన పురూరవుడు కృతార్థుడై తన పురమునకు తిరిగివచ్చెను.

పంచమాశ్వాసము :- ఊర్వశి, పురూరవ సమాగమాకాంక్షియై, విరహ మనుభవించుచుండ, త్రైలోక్యవర్తి నామ శుకమట కేతెంచినది. ఊర్వశి చిత్రపటము వ్రాయించి, పురూరవునకు దృగ్గోచరమగునట్లుంచ వలయునని సూచించినది. ఆ సూచన ననుసరించి, చిత్రకళా నిపుణయైన యొకచెలి యూర్వశి చిత్రపటము వ్రాసి, పురూరవుడు విహరించు నుద్యాన వనంబున నుంచినది. వనపాలకు లా పటమును గని, యేలికకు కానుకగ నిత్తుమని యెంచి యద్దానిని పురూరవున కర్పించిరి. చిత్రపటము నందలి యూర్వశీ రూపలావణ్య విలాసముల గాంచి పురూరవుడు సమ్మోహితుడాయెను. విచారించి చూచి, నారదునిచే మున్ను వర్ణింపబడిన యూర్వశి లక్షణము లందుండుట గమనించి చిత్రస్థ సుందరి యూర్వశి యని నిశ్చయించి, యామె పొందుగోరి విరాళి నొంది యుండెను. ఇంతలో నొకనాడు చారులువచ్చి బహువిషయము లెఱింగించి, విశేషముగ నొక యుద్యానవనమును గూర్చి వర్ణించిరి. తా మా వనమును ప్రవేశించి చూడగ, దేవ వనితా సంచార మట

గలవని తెలిపినట్లు వారు వివరించిరి. వారిమాట లాలించి, యా చిత్రమేమియో జూతమని పురూరవు డావనమున కేగెను. అచ్చట నతనికి యూర్వశి తారసిల్లినది. పురూరవుడు చెలికానిద్వారా తన వృత్తాంతము నూర్వశికి తెలియ జేసెను. ఆమె పురూరవు డచటికి వచ్చుటెఱింగి, చెలియద్వారా, తాను పురూరవ దత్త చిత్త యని యెఱుకపరచినది. ఊర్వశీ పురూరవులు పరస్పరానురక్తులైరి. ఊర్వశి తన జోడుతగళ్లను తెప్పించి చూపి, వానిని రక్షింపను, తనకు వివస్త్రుడై కనిపింపకుండునట్లును, నియమము చేసి యతని నొడంబడ జేసినది. వారెల్లరు ప్రతిష్ఠానపురము చేరిరి. ఊర్వశీ పురూరవులు పరస్పరానురాగ పరివర్ధితులై సుఖోపభోగముల ననుభవించుచుండిరి. కొంత కాలమట్లు గడువగా నింద్రుని పంపున గంధర్వులు భూలోకమునకు వచ్చిరి. ఊర్వశీ పురూరవులు సంభోగ పరవశులై యున్నవేళ, గంధర్వులు జోడుతగళ్ళ నపహరించుకొని పోయిరి. అవి భీతితో నరచినవి. తగళ్లపై ప్రేమతో నూర్వశి వానిని రక్షింపుమని పురూరవుని త్వరపెట్టినది. నిద్రాభంగ వికారముచే నతడు తన వస్త్రము వీడినదని తెలియక, వివస్త్రుడై గంధర్వులం దాకిన వారు తగళ్ళనువీడి పలాయనము చిత్తగించిరి తగళ్ళ రక్షించి యిచట కాపుంచెంచియు, నతని వివస్త్రుగా గాంచి యూర్వశి సమయము గుర్తుచేసి, దైవనియతికి చింతించి, యతనిని వీడి స్వర్గమునకు పోయినది. అతడామెనే తలంచుకొనుచు, పురంబు చొరక యామెకై యన్వేషించుచు తిరుగుచుండగ, నతనిని జూచుటకయి వచ్చి యూర్వశి సరస్వతీ తటంబున కనిపించినది. అతడామెను చూచి నిష్ఠురము లాడగ యతని నిష్ఠ కేళిం బరితృప్తుం జేసి, అతనికడ పూర్వమువలె నుండదగదని తెలిపి, మరునాటి రాత్రికి రమ్మనిన, దేవమానంబున వత్సరంబని యెఱింగి, పురంబునకుం జని, పురూరవుడు పురపురం బొక్కుచుండెను. అంత నూర్వశి గర్భము ధరించి ఆయువను కుమారుని ప్రసవించినది. అతని గలసి యుండు నిమిత్తము గంధర్వుల వేడుకొమ్మని యొక యుపాయము తెలిపినది. అతడు గంధర్వులం బ్రార్థించగ, వారు ప్రత్యక్షమై, యూర్వశి నిచ్చుట తగదని భావించి, యూర్వశిం బోలిన యగ్నిస్థాలి యను నలివేణినిచ్చిన సంతసించి పురూరవుడామెతో సుఖించుచు, ఆమె యూర్వశి గాదని శంకించి, ఆమెనట విడచి, నిజపురంబునకుం జని రాజ్యమేలుచు నూర్వశికై పరితపించుచుండెను. త్రేతాయుగము ప్రవేశించు టెఱింగి, యాగవిధి నొనరింప నుత్సుకుడై, అగ్నిస్థాలి కడ కేగి, శమీగర్భ జాతమైన యశ్వత్థమును గాంచి, అంచరణులు రెండు గొని,

పూర్వారణి యూర్వశియనియు, ఉత్తరారణి దానని భావించి, నడుమ పుత్రుండుగా దలంచుచు దొడరి మంత్ర ముచ్చరింపగా, హవ్యవాహనుడు తనయుడై యుద్భవిల్లెను ఆ పితిహోత్రుని యాగశాలాంతర కుండంబుల నునిచి యనుష్ఠించి, శ్రీమన్నారాయణ స్వామింగూర్చి యనేక యాగంబు లొనర్చెను. అంత పురందర ప్రముఖ దేవతలు ప్రసన్నులై యతనికి నభీష్ట వరములిచ్చి, ఊర్వశీ కాముకుం డగుట, యవ్విలాసిని నిచ్చి చనిరి. అట్లూర్వశిని తిరిగి పొంది, పురూరవుం డా యువునకు సహోదరులుగా శ్రుతాయువును, సత్యాయువును, జయుండును, విజయుండును నను నేవురు పుత్రులం బడసి, పుత్ర పౌత్రాభివృద్ధిగ, చంద్రవంశ పరంపరాభి వృద్ధిగ రాజ్యమేలెను.

## ఆధారములు :-

కనుపర్తి అబ్బయామాత్యుడు రచించిన పురూరవశ్చరిత్ర మను నీ కవిరాజ మనోరంజన కావ్య వస్తువున కాధారములు పెక్కులున్నవి. పురూరవుని ప్రసక్తి ఋగ్వేదముతోపాటు బహుపురాణము లందుగలదు. క్రమముగ పరిశీలింతును.

1. ఋగ్వేదము :- పురూరవుని ప్రసక్తి ఋగ్వేదములో మనువుతోపాటు గావించబడినది. అతడగ్ని దేవునకు స్నేహితుడనియు, ఉదార స్వభావుడనియు, ఆ సందర్భమున వర్ణింపబడినది. మరియొక చోట యితని ప్రసక్తి ఊర్వశితో పాటు వచ్చినది. అతడూర్వశిని తనతో మరల కలిసికొని సుఖింపుమని కోరినట్లు కలదు. దీని వలన ఊర్వశితో అంతకుముందొక సారి కలిసికొని సుఖించిన యవకాశ మాతనికి లభించినట్లు స్పష్టమగును. మరియొక సందర్భమున పురూరవుని ఋషి పుత్రునిగా దేవతలు పేర్కొనినట్లు కలదు. తమను కానుకలచే సంతృప్తి నొనర్చినచో, తమతో స్నేహభావమున నుండవచ్చునని, ఇంద్ర భోగముల ననుభవించ వచ్చుననియు పలికి యుండిరి. వేదమునందీ మాత్రమే ప్రసక్తి కలదు. కాని అదియు తల తోక లేని విధముగ అర్థముకాని రీతిలోనున్నది.[1]

---

1.

2. శతపథ బ్రాహ్మణము :- ఇందూర్వశీ పురూరవుల ప్రసక్తి గలదు. పురూరవు డూర్వశితో కలసి యుండెను. పురూరవుడు తనకు నగ్నముగా కనిపించ కుండునట్లును, తన యురణకముల రక్షించునట్లును ఊర్వశి యొడంబడిక చేసికొని యుండెను. గంధర్వుల కపటోపాయమున, వారిరువురు యథేచ్ఛగ విహరించు చోట, ఉరణకముల దొంగిలించిరి. ఊర్వశి కఠినముగా మాట్లాడినది. వానిని రక్షించు త్వరలో పురూరవుడు నగ్నముగా వెడలి గంధర్వులనుండి ఉరణకముల రక్షించెను. కాని గంధర్వులు మెఱుపులు గల్పించిరి. ఆ మెఱుపుల కాంతితో నతడూర్వశికి నగ్నముగ కనిపించెను. నియమము ననుసరించి యూర్వశి యతనిని వీడి చనినది. కురుక్షేత్రమున మరల నతనికామె కనిపించినది.[1]

3. బృహద్దేవత :- రాజర్షియైన పురూరవుడూర్వశితో సుఖించుచుండెను. ఇంద్రుడది సహింపక వారికి వియోగము కల్పింపనెంచి, యతనిపై వజ్రమును ప్రయోగించెను. ఆ కారణమున పురూరవుడున్మత్తుడాయెను. ఊర్వశిని సరస్సునందు పక్షిపరివృతగ పురూరవుడు గాంచెను. ఆమె యతని యందలి ప్రీతిచే స్వర్గమున మరల గలియుదమని చెప్పెను.[2]

4. దేవార్థ దీపిక :- మిత్రావరుణు లూర్వశీసౌందర్యమునకు వశులైరి. వారికి వీర్యస్ఖలనమైనది. అది కుంభమునందు నిక్షిప్తముగావింపబడినది. వారామెను మనుష్య భోగ్యముగా శపించిరి. మనుపుత్రుడైన ఇలుడు గిరిసుతచే శపించబడిన వనమందు ప్రవేశించి స్త్రీయై బుధుని పొంది, పురూరవుని పుత్రునిగా బడసెను. ఆ పురూరవుడూర్వశి పెట్టిన నియమములకు కట్టుబడి యామెను తన ప్రతిష్ఠాన పురమునకు తీసికొని పోయెను. గంధర్వ కృత తంత్రముచే, అతడూర్వశికి నగ్నముగా కనిపించి, ఆమెవలన వియోగమును పొందెను. అతడు ఉన్మత్తుడై, ఆమెకై యన్వేషించుచు మానస సరోవర తీరమున మరల నామెను గలసి సుఖించెను.[3]

1.

2.

3.

5. విష్ణుపురాణము :— విష్ణుపురాణము నందీ గాథ యెన్నియో మారులు వచ్చినది. ఇంద్రుని సభలోని అప్సరస, ఊర్వశి, స్వర్గభోగము నుండి దూరమగునట్లుగను, మానవులతో చరించునట్లుగను శపించబడినది. ఊర్వశి అతి లోకసుందరిగా భూలోకమునం దవతరించ, చంద్రవంశజుడగు పురూరవు డామెను జూచి కామించెను. ఊర్వశి యతనిని వరించుటకు రెండు నియమముల విధించెను. రెండు పొట్టేళ్ళను తన అధీనమున నుంచుకొని వాని నెక్కడికి పోకుండ జూచుట ఒకటి, ఎప్పుడును దిగంబరముగ కనిపించగూడ దనునది రెండవ నియమము. స్వర్గవాసులు ఊర్వశీ వియోగమున బాధనొందుచు, శాపము పూర్తియైనంతనే ఆమెను మరల దేవలోకమునఁ జేర్చుటకు సంకల్పించిరి. గంధర్వు లీ కార్యమున కంగీకరించిరి. ఒకనాటి రాత్రి రాజుగారి శయనమందిరమునకు వచ్చి గొఱ్ఱెపోతులను వదలిరి. అవి "మే మే" అని అరచుటతో రాజునకును ఊర్వశికిని మెలకువ వచ్చినది గాఢాంధకారము క్రమ్మెనని, ఊర్వశికి కనిపించదను భ్రమలో రాజు వివస్త్రుడై యుండియే వెంటబడెను. గంధర్వు లా క్షణముననే మెఱుపును గలిగించిరి. ఊర్వశి రాజును నగ్న స్థితిలో జూచినది. రాజు నియమభంగ మొనర్చెనని తత్‌క్షణమే గంధర్వులతో నదృశ్యమై ఇంద్రుని సభ కేతెంచినది. పురూరవుడు మూర్ఛావస్థ నుండి తేరుకొని ఆమెకై విచారించెను. ఊర్వశీ వియోగమున తపించి ఏండ్ల కొలది ఆమెకై తిరిగి తిరిగి ఒకసారి కురుక్షేత్రమునం దొక సరోవరమును చేరెను. అచ్చట ఊర్వశి ఇతర అప్సరసలతో చెలికత్తెలతో సంచరించుచుండెను. రాజు ఊర్వశిని గుర్తించి తనవెంట రమ్మని యెంతయో బలవంతము చేసెను. ఆమె అందుల కంగీకరించలేదు. రాజ్య వ్యవహారములం దనాసక్తుడై పరిభ్రమించనిచో సంవత్సరమున కొకసారి మాత్రము వచ్చి అతనితో నుండుటకు సమ్మతించెను. ఇట్లు ఏడాది కొకసారి రాకపోక లొనర్చి పురూరవునితో కాపుర మొనర్పగా నాతనికి ఆరుగురు పుత్రులు కలిగిరి. పెద్దవాడు ఆయువు. పురూరవు డామె వియోగమున మాత్రము విచలిత మనస్కుడై యుండెను. గంధర్వు లాతని స్థితిని జూచి దయ దాల్చి ఒక అగ్నిపేటిక నిచ్చిరి. అందు అగ్ని ప్రజ్వరిల్లుచుండెను. అభీష్టముల నెరవేర్చు యజ్ఞము చేయుట కది తోడ్పడుననిరి. దాని నాతడొక పొదలో నుంచి ఊర్వశికై అన్వేషించుచు అరణ్యములోనికి వెళ్ళెను. కాని ఆమె కనిపించలేదు. తిరిగి వచ్చునరికి అచ్చట అగ్నిపేటికకు బదులు రెండు చెట్లను చూచెను. ఒకటి

శమీ వృక్షము, రెండవది అశ్వత్థము. పురూరవుడు రెండు చెట్ల నుండి ఒక్కొక్క కొమ్మను తెంచి తెచ్చి అరణులుగా చేసి, రాజప్రాసాదమునకు వచ్చి, ఆ రెండింటిని రాపిడిచేయ నందుండి అగ్ని పుట్టెను. దానితో నాతడెన్నియో హోమము లొనర్చి, గంధర్వ పదవి నందుకొనెను. దేవలోకమున ప్రియురాలి సహవాసము లభించెను.[1]

బృహత్కథ: పురూరవుడు విష్ణుభక్తుడు. ఇంద్రుని నందన వనములో విహరించు సందర్భము నందాతనికి ఊర్వశి కనిపించినది. ప్రథమ దర్శనముననే వారికి ప్రణయ మంకురించినది. విష్ణువు ఈ సంగతి తెలిసికొని ఊర్వశిని పురూరవున కొసగవలసినదని ఇంద్రునికి నారదుని ద్వారా కబురంపెను. ఇంద్రు డట్లే చేసెను. ఊర్వశీ పురూరవు లిరువురు సుఖముగ నుండిరి. దేవలోకము నందొకసారి జరిగిన యుద్ధములో దేవతలకు పురూరవుని బాహుబల సహాయము వననే జయము లభించినది. ఇంద్రుని సభయందీ విజయముపట్ల ఆనందోత్సవములు వైభవముగ జరిగినవి. అప్సరసల గురువగు తుంబురుని అధ్వర్యమున రంభ నృత్య మొనర్చినది. నాట్యము చేయు తరి రంభ అడుగు తప్పుట చూచి పురూరవుడు నవ్వెను. తుంబురున కిది దుస్సహమైనది. విష్ణువు ననుగ్రహము నొందు నంత వరకు ఊర్వశితో వియోగము ననుభవింపుమని అతడు పురూరవుని శపించెను. పురూరవునకు మూర్ఛ నుండి తెలివి వచ్చు లోపల గంధర్వు లూర్వశిని తీసుకొని వెళ్ళిరి. పురూరవుడు ఖిన్నుడై తపమొనర్చి నారాయణుని అనుగ్రహము నొందుటకై బదరీనాథ్ వెళ్ళెను. విష్ణువు సంప్రీతుడై పురూరవుని కోరికను మన్నించెను. అతనికి ఊర్వశి లభించినది.[2]

మత్స్యపురాణము:— సోమునకు తారవలన జన్మించిన వాడు బుధుడు. సోము డాతనికి విశ్వముపై అధిపత్యము నొసంగెను. బుధునకు "ఇల" వలన కలిగిన కుమారుడు నూట ఇరువది అశ్వమేధ యజ్ఞము లొనర్చెను. ఈతడే పురూరవుడు. హిమాలయ శిఖరములందాతడు విష్ణుపూజ లొనర్చుచుండెను. భూలోకము నందలి ఏడుగురు పురూరవుల కాతఁ డధిపతియయ్యెను. కేశి మొదలగు

1.

2.

దైత్యులను సంహరించెను. ఊర్వశి ఈతని సౌందర్యమున కాకర్షితయై పరిణయ మాడెను. ఒకనాడు సద్వర్తనము, ధనము, ఇంద్రియ సుఖములను వారు ముగ్గురును కలసి పురూరవుని వద్దకు వచ్చి, అతని దృష్టిలో తమలో ఎవరు గొప్ప అనునది తెలిసికొన జూచిరి. పురూరవుడు వీరినందరిని ఆదరించి గౌరవించెను. సద్వర్తనమున కాతడధిక గౌరవము నొసంగెను; అది ధనము, ఇంద్రియ సుఖములకు కోపావేశము కలిగించినది. అతడు దురాశవలన భ్రష్టుడగు గాక అని ధనము శపించెను. ప్రియురాలితో వియోగమునొంది కుమారవనములోని గంధమాదన పర్వతమున తలగొట్టుకొనచు తిరుగుమని ఇంద్రియ సుఖము గూడ శపించినది. కాని సద్వర్తనము మాత్రము సత్ప్రవర్తనతో దీర్ఘాయురారోగ్యముల నొందు నట్లుగను, ఆ చంద్రార్కముగ నాతడు సతీ సుతులతో సుఖించునట్లుగను, విశ్వము పై అధిపత్యము నొందునట్లుగను, అనుగ్రహించెను. అనంతర మీ ముగ్గురును అదృశ్యము నొందిరి. పురూరవుడు ప్రతిదినము ఇంద్రుని దర్శనమున కేగుట పరిపాటి. ఒకనాడు రథారూఢుడై సూర్యునితో పాటు దక్షిణాయనమున సంచరించు చుండ కేశి దైత్యుడు అప్సరసలగు చిత్రలేఖను మఱియు ఊర్వశిని పట్టుకొని వెళ్ళుచుండుట గాంచెను పురూరవుడు తత్‌క్షణమే వాయు బాణము నేసి, అతనిని సంహరించెను. అప్సరో భామినులను రాక్షసుని క్రూర హస్తముల నుండి కాపాడుటే గాక, కేశి హస్తములతో చిన్నాభిన్నమైన సింహాసనముపై నింద్రుడు స్థిరముగా నుండునట్లు తోడ్పడెను. సాహసోపేతములైన ఈ కార్యములకు, ఇంద్రుడు సంతుష్టాంతరంగుడై పురూరవునితో స్నేహమొనర్చెను. పురూరవుని అధిపత్యము, భుజబలము, భోగైశ్వర్యము లితోధికముగ పెంపొందునట్లు, ఇంద్రుడను గ్రహించెను. ఒకనాడు నాటకోత్సవ సందర్భమున ఇంద్రుడు పురూరవు నాహ్వానించెను. లక్ష్మీ భర్త నెన్నుకొను గాథ దీనిలో ప్రదర్శింపబడనుండెను. భరత ముని కృతరూపకమిది ఊర్వశి, మేనక, రంభలు దీనిలో పాల్గొనుట కాదేశింపబడిరి. ఊర్వశి లక్ష్మీపాత్ర ధరించెను. కాని రాజును జూచినంతనే మైమరచి రంగస్థలముపై తానేమి చేయవలయునను అంశమే మరచిపోయెను. భరతు డీ సన్నివేశమునకు కుపితుడై, రాజుతో వియోగము నొందునట్లుగను, ఏబదియైదేండ్ల వరకు ద్రాక్షతీగయై యుండునట్లుగను శపించెను. రాజు నిరంతరము విచారించిన తరువాత మరల ఆమె యథాస్థితి నొందున ట్లనుగ్రహించెను. ఊర్వశి రాజును

పరిణయమాడి, నియతకాలము వరకు వియోగము నొందినది. తదనంతర మామెకు నెనమండుగురు పుత్రు లుదయించిరి. వారు మానవాతీతమైన శక్తి సమన్వితులు. ఆయువు వారిలో నగ్రజుడు [1]

భాగవతము :— "సోముని పుత్రుడు బుధుడు. బుధుని కిలయందు పురూరవుడు కలిగెను. మిత్రావరుణుల శాపముచే నరలోక వాసము విధింపబడిన యూర్వశి, పురూరవుని సౌందర్యమును గని ప్రేమించినది. పురూరవు డామె యందనురాగమును గనబరచి, తనతో సుఖింపు మని కోరెను. వివస్త్రుడుగా కని పించరాదనియు, తన పొట్టేళ్ళ జంటను కాపాడవలయు ననియు నియమముంచి, ఊర్వశి యతని వశమైనది. వారు చాలకాలము సుఖముండిరి. ఊర్వశీ రహితముగ తన సభ శోభింపుట లేదని పలికి, ఇంద్రుడు ఊర్వశిని తెండని గంధర్వుల నియోగించెను. వారు పొట్టేళ్ళ జంట నపహరింపగా, ఊర్వశి పురూరవుని, వానిని రక్షింప లేదని పరుషము లాడినది. అతడు మిక్కిలి బాధపడి, వివస్త్రుడై పొట్టేళ్ళ రక్షింప నేగెను. గంధర్వులు పొట్టేళ్ళను వదలి, మెఱుపు మెరయునట్లు చేసిరి. వివస్త్రునిగా నతనికి జూచి, ఊర్వశి యతనిని వీడి చనినది. అత డామెను వెదుకుచు కురు క్షేత్రమున నొకనా డూర్వశిని జూచి, నిష్ఠురము లాడెను. ఆమె సంవత్సరమున కొకమారు కలియుదునని చెప్పినది. అట్లు వారు భోగింప, ఊర్వశి గర్భవతియై పుత్రవతియైనది. పురూరవుని విరహబాధను జూచి, దయగొని, గంధర్వులు, అతనికి అగ్నిస్థాలి నొసంగిరి. అతడగ్నిస్థాలిని వనమందుంచి, ఊర్వశిని వెదుక నేగెను. అతడు మరలి వచ్చునరికి, స్థాలీ స్థానమున అశ్వత్థ శమీకములు నిలచి యుండెను. వాని కొమ్మలనుండి, అరణిని సిద్ధము చేసి, అధరారణి యూర్వశి యని, ఉత్తరారణి తానని భావించి మథింపగా అందుండి జాతవేదుడను నగ్ని పుట్టినది. ఆ యగ్నితో యజన మొనర్పగా, యజ్ఞేశుడైన యధోక్షజుడు ప్రసన్నుడాయెను. పురూరవుడు గంధర్వలోకమును పొంది ఊర్వశితో సుఖించెను. [2]

కథాసరిత్సాగరము :— పరమ వైష్ణవుడైన పురూరవుడు భూ స్వర్గములందెల్లెడల తిరుగ సమర్థుడు. అత డొకనాడు, ఊర్వశిని చూచి, యామె

1. మత్స్య పురాణము : 24
2. సంస్కృత మహాభాగవతము. 11—14 అధ్యాయము.

సౌందర్యమునకు వశుడై విరహము నొందెను. విష్ణువాతని యందలి వాత్సల్యముచే, ఊర్వశిని పురూరవున కిమ్మని నారదుని ద్వార వార్త పంపెను. ఇంద్రుడూర్వశి నీయగా, ఊర్వశీ పురూరవులు సుఖముండిరి. ఒకానొక రాక్షసుని వధ సందర్భమున ఇంద్రునికి పురూరవుని సహకారము లభించెను. అత డా సంతోషమున నొక యుత్సవము నిర్వహింపగా, ఆహ్వానితుడై పురూరవుడు స్వర్గమునకు వెళ్ళెను. తుంబురుని యాచార్యకమున రంభ యా సందర్భమున నర్తించెను. ఆమె అడుగు తప్పు వేయగా, పురూరవుడు నవ్వెను. దివ్య నృత్యమును మానవుడవైన నీవేమి యెఱుంగుదువని తుంబురుడు పరుషములాడెను. ఊర్వశీ సంగమున తా నెఱుంగుదునని పురూరవుడు ప్రతి సమాధానమిచ్చెను. ఆ మాటలకు తుంబురుడు కుపితుడై, ఊర్వశీ వియోగము నొందుమని శపించెను. ఊర్వశీ విరహమును భరింపలేక, పురూరవుడు బదరికావనమున హరిని గూర్చి తప మొనర్చెను. విష్ణువు కృపచే శాపము తొలగి ఊర్వశీ పురూరవులు భూలోకమున బహుసుఖముల నొందిరి.[1]

ఆంధ్ర మహా భాగవతము :— మూల భాగవతమున 52 శ్లోకముల తోడి పదునాల్గవ అధ్యాయమునందు వర్ణింపబడిన, చంద్రవంశజుల కథలను, పోతనగారు సైతము నట్లే వర్ణించిరి. కాని 46 గద్య పద్యములతో సరిపెట్టిరి. పురూరవ జనన వృత్తాంతము, సంస్కృతాంధ్ర భాగవతము లందును, నవమ స్కంధారంభముననే కలదు. సంస్కృతమున 42 శ్లోకములతో సాగిన కథ, ఆంధ్రమున 32 గద్య పద్యములతో ముగిసినది. రెండు చోట్లను పోతన్న వ్యాస భగవాను ననుసరించియే కథ వర్ణించెను.

ఆంధ్ర మహా భారతము :— వివస్వతునకు వైవస్వత మనువు పుట్టెను. అతని కూతురైన 'ఇల' యను దానికి సోము పుత్రుడైన బుధునికి, పురూరవు డుద్భవించెను. అతడు చక్రవర్తియై పరిపాలించుచు, ధనలోభముచే నొకప్పుడు విప్రధనము నపహరించెను. అది మానుమని తెలుపుటకు సనత్కుమారుడు మునిసంఘముతో రాగా, పురూరవుడు వారికి దర్శనం బీనొల్లక పరిహరించిన, వా రలిగి పురూరవుని యున్మత్తునిగా శపించిరి. ఆ పురూరవుడు గంధర్వలోకమున నూర్వశి

1. కథాసరిత్సాగరము. 3–3.

సహితుడై యుండెను. అట్టి పురూరవునకు నూర్వశికి ఆయువు, ధీమంతుడు, అమావసువు, దృఢాయువు, వనాయువు, శతాయువు అను నారుగురు కొడుకులు పుట్టిరి.[1]

## 3. విశేషములు:

కవిరాజ మనోరంజన కర్త పై వివరించిన వస్తువును తనకనువైన చోట ననువైన రీతిని మలచుకొనెను, కొన్నిచోట్ల పూర్తిగా కల్పన చేసి కథ పెంచెను. ఆయా ఘట్టములందు గల భేదసాదృశ్యముల పరిశీలించినగాని, అతని కావ్య వస్తు స్వభావము సువ్యక్తము కాదు.

పురూరవుని కడకు నారదుడు వచ్చి, రాజనీతి ప్రసంగము చేసి, తుదకు నాత్మవిద్యోపదేశమొనర్చుట యను ప్రథమాశ్వాసమునందలి వస్తువు సమస్తము అబ్బయామాత్యుని స్వకపోలకల్పితము. నారదుని ముఖమున నాతడు ప్రపంచించిన యాత్మవిద్యా వైదగ్ధ్యము ప్రశంసనీయమైనది. అది కావ్య పరమార్థము. ఇది యిట్టిదని చెప్పక, నారద పాత్ర ముఖమున తన సిద్ధాంతమును చాటించినాడు. అద్దానిని పురూరవుని చేత సాధనము చేయించి, సిద్ధించునంత వరకు రసవత్కావ్య నిర్మాణము చేసి చూపి యున్నాడు. ఈ విషయము సందర్భము వచ్చినప్పుడు వివరముగ చర్చింపబడును.

ద్వితీయాశ్వాసమునందు తారాశశాంక ప్రణయ వృత్తాంతము కలదు. ఇది మత్స్య పురాణమున వర్ణింపబడినది. దానిని ప్రబంధీకరించి, శృంగార రస గుళికగా సిద్ధము చేసిన ప్రతిభాశాలి అబ్బయామాత్యుడు. తారా శశాంకుల ప్రణయ ఫలముగా బుధు డుద్భవించుట యను నంశము గూడ మత్స్య పురాణమున గలదు. బుధుని కోరికపై వసిష్ఠుడు విష్ణువును స్తుతించుట యనునది కవి కల్పితము. అది అబ్బయామాత్యుని విష్ణుభక్తిని వెల్లడించు నద్భుత ఘట్టము. ఇలా కన్య జననము, పురుషుడుగా మారుట మత్స్య పురాణమున నున్న యంశమే. పురుషుడైన ఇలా కన్య, సుద్యుమ్న నామమున వ్యవహరించుచు నీశ్వర శాపమున (కుమారవన ప్రవేశ హేతువుచే) స్త్రీగా మారుట యన్నది వేదార్థ దీపిక యందు గలదు. సుద్యుమ్నుడు

1. ఆంధ్ర మహాభారతము: 1—89 నుండి 92 వరకు.

స్త్రీయై బుధుని మోహించుట పురూరవుని గనుట యను నంశములు వేదార్థ దీపికా, మత్స్యపురాణ, భాగవతములందు గలవు. తృతీయాశ్వాసమునకు సంబంధించి, పురూరవుని జైత్రయాత్ర, అబ్బయ కల్పనమేయైనను రఘువంశ ప్రభువుల జైత్ర యాత్రా వర్ణనమును బోలి ప్రశస్తముగ నున్నది. ఊర్వశి పురూరవుని కొఱకు విరహార్తి నొందుట యను నంశము మత్స్య పురాణమునందు గలదు. మన్మథోపాలంభన, మలయానిలోపాలంభన, కోకిలాద్యుపాలంభనములు ఊర్వశిని సఖులూరడించుట యనునవి అబ్బయ కల్పనలు. ప్రబంధమార్గమున నతడు కనబరచిన వర్ణన వైదగ్ధ్యమునకు వన్నె తెచ్చిన ఘట్టములని చెప్ప వచ్చును. త్రైలోక్యవర్తి యను చిలుక తన చెలికి యూర్వశి వృత్తాంతమును చెప్పుట, గ్రీష్మ వర్షర్తు వర్ణనలు, ఋషుల తపో విఘ్నమునకై యింద్రు డూర్వశిని బంపుట, ఊర్వశి మిత్రావరుణుని కడకు వచ్చుట, పుష్పాపచయ జలకేళీ వర్ణనములు మున్నగునవి అబ్బయామాత్యుని కల్పనలే. మిత్రావరుణు లూర్వశిని శపించుట యను నంశము వేదార్థ దీపిక యందున్నది. హేమంత శిశిరర్తు వర్ణనము, పురూరవుడు మాఘ స్నానము చేయుటకు నేగుట, తనకు ప్రత్యక్షమైన విష్ణువును రాజు స్తుతించుట, వసంతర్తు వర్ణనము, మున్నగునవి చతుర్థాశ్వాసము నందలి ఘట్టములు. ఇవి అన్నియు అబ్బయ కల్పనలే. పంచమాశ్వాసము నందలి ఘట్టములలో త్రైలోక్యవర్తి యుపదేశానుసారము, ఊర్వశి చిత్ర పటమును వ్రాయించి పురూరవు నుద్యాన వనమున పెట్టించుట, చారులు పురూరవునకు విచిత్ర వన వృత్తాంతమును తెలుపుట, పురూరవుడు చిత్రవనము చూడ నేగుట, పురూరవు డచ్చట ఊర్వశి యుండుట తెలిసి చెలికాని ద్వారా తన ప్రేమ తెలియజేయుట, పురూరవు డూర్వశిని నిజ పురంబునకు వెంటబెట్టుకొని వచ్చుట, సూర్యాస్తమయాది వర్ణనము అనునవి కవి కల్పనములే. పంచమాశ్వాసమునం దుత్తర భాగమున చాలా వఱకు, ఊర్వశీ పురూరవుల గూర్చి పురాణములందు ప్రసిద్ధమైన వృత్తాంతమునే అబ్బయ స్వీకరించెను. ఇంద్రుని పంపున గంధర్వు లూర్వశికై భూలోకమునకు వచ్చుట యను నంశము విష్ణుపురాణ, భాగవతములందు కలదు. గంధర్వులు తగళ్ళ నపహరించుట యనునది శతపథ బ్రాహ్మణమునందును, భాగవతమునందును గలదు. విష్ణు పురాణమున విపులముగా గలదు. తగళ్ళపై యభిమానముచే నూర్వశి, వానిని రక్షింపజాలమికి పురూరవుని బహువిధ పరుషములాడుట యనునది శతపథ

బ్రాహ్మణ, భాగవత, విష్ణుపురాణములందు కలదు. విష్ణుపురాణమున మరింత స్పష్టముగ వర్ణింపబడినది. పురూరవు డూర్వశి నిష్ఠురాలాపములకు రోషించి, విపన్నుడై తగళ్ళ రక్షింపనేగుట యను ఘట్టము శతపథ బ్రాహ్మణ, వేదార్థదీపికా, విష్ణుపురాణ భాగవతములందు వర్ణింపబడినది. ఈ గ్రంథములం దీ సందర్భమున, ఊర్వశి పురూరవుని విపన్నునిగా చూచి, నియమ భంగమునకు వగచి, అతనిని వీడి స్వర్గమునకు వెడలినట్లును గలదు. అంతే కాదు పురూరవు డూర్వశికై విరాళిగొని, అన్వేషించుచుండ సరస్వతీ తటంబున, ఊర్వశి యతని నరయుచు వచ్చి కనిపించుట తన్నామె వదలి వెడలినందుకు, అత డామెను నిష్ఠురము లాడుట, దుఃఖించిన తరువాత ఆమె మరుసటి యేడు రేయి వత్తునని చెప్పి వెడలుట యను నంశములు కూడ పై గ్రంథములం దీ సందర్భమున గలదు. కాని కొంత భేదమున్నది. కురుక్షేత్రమున నూర్వశి మరల కనిపించినదను నంశము మాత్రము శతపథ బ్రాహ్మణమున, భాగవతమున గలదు. పురూరవు డున్మత్తుడై యుండి, మానస సరోవరము కడ నామెను చూచినట్లు వేదార్థదీపిక యందు కలదు. కురుక్షేత్రమున సరోవరము కడ పురూరవున కూర్వశి కనిపించినట్లు విష్ణు పురాణమున గలదు. తాను గంధర్వుల యాజ్ఞచే మెలగు దానననని చెప్పి, యూర్వశి గంధర్వుల వేడుకొమ్మని పురూరవుని ప్రోత్సహించుట యను నంశము కవి కల్పనముగా దోచుచున్నది. పురూరవుడు గంధర్వుల ప్రార్థింపగా వారాతనికి ప్రత్యక్షమై అగ్నిస్థాలి నిచ్చుట యను నంశము విష్ణు పురాణ, భాగవతములందు గలదు. విష్ణుపురాణమునందగ్ని పేటిక యందగ్ని ప్రజ్వరిల్లుచుండెనని గలదు. భాగవతమున కేవల మగ్నిస్థాలి నిచ్చిరని యున్నది. అబ్బయ అగ్నిస్థాలిని నీలవేణి యని కల్పన చేసి, యూర్వశికి ప్రతిరూపమని చమత్కరించినాడు. తరువాత అగ్నిస్థాలి యూర్వశిగాదని గుర్తించుట, అగ్నిస్థాలిని వీడి ఊర్వశీ విరహార్తుడగుట యను నవి కల్పనలే. త్రేతాయుగము రాగా, పురూరవుని బుద్ధికి అమ్నాయములు కర్మబోధకంబు లగుచు, త్రివిధంబులై దోచి, యాగ విధుల నొనర్ప దలంపు గలిగినదని వ్రాసిన వ్రాత అబ్బయ శేముషీ విభవమే. ఏది యెట్లున్నను మొదట జాతవేదుడను పేర నగ్నిని కల్పించి యజ్ఞము లొనర్చినవాడు పురూరవుడనుట సుస్పష్టము. భారతదేశమున అగ్న్యారాధన మారంభించిన వాడు పురూరవుడను నంశము ఈ గాథ వలన స్పష్టమగుచున్నదని విల్సన్ పండితుడు భావించెను. అగ్నిస్థాలి యున్న చోట శమీగర్భ భూతమైన యశ్వత్థమును పురూరవుడు గాంచి, అరణులు రెండు గొని, పూర్వారణి

యూర్వశి యని, ఉత్తరారణి తానని వాని నడుమ నగ్నిపుత్రుడై పుట్టెనని అబ్బయ వర్ణనము. ఈ గాథ కాధారము విష్ణుపురాణ భాగవతములు. యజ్ఞ విధిచే పురూరవుడు గంధర్వుడాయెనని విష్ణుపురాణము చెప్పగా, పురూరవుడు గంధర్వలోకమును పొందెనని భాగవతము చెప్పుచున్నది. ఇందేమంత భేదము లేదు. రెండు నొక్కటి యనియే చెప్పవచ్చును. అట్లుద్భవించిన యగ్నిచే యజ్ఞము లొనర్పగా, ఇంద్రాది దేవతలు ప్రసన్నులై పురూరవునికి, ఊర్వశీ విలాసిని నిచ్చి, నర సుర లోకంబుల యథేచ్ఛా విహారంబుల జరియించునట్లు దివ్యత్వము నొసంగుట అబ్బయామాత్యుని కల్పనమే.

ఇట్లు అబ్బయామాత్యుడు వివిధ పురాణములందున్న వస్తువును సేకరించి తన కనువైన విధముగా కూర్చుకొని, అనుసరణమునకన్న, కల్పనయే అధికముగా చేసి ప్రబంధరీతికి పట్టము గట్టినట్లు, పురూరవశ్చరితమను నీ కవిరాజ మనోరంజనమును నిర్మించెను.

ఇతడు వస్తుకల్పనము నందు పెద్దన నాదర్శముగ బెట్టుకొనినట్లు తోచుచున్నది. ప్రసిద్ధేతివృత్తమునందలి వస్తులేశమును తీసుకొని, కల్పనలు జోడించుట యను మార్గము నారంభించిన వాడు పెద్దన యని చెప్పవచ్చును. ప్రబంధకవు లెల్ల రనుసరించిన విధానమదియే కాగా పెద్దన్న తన మనుచరిత్రమున మూడు తరముల కథను గైకొని స్వారోచిష మనుసంభవమును రచించి యుండెను. అబ్బయామాత్యుని కీ విషయమున పెద్దన యాదర్శము. ఇతడు తన మొదటి కావ్యమైన 'అనిరుద్ధ చరిత్రము' నందు శ్రీకృష్ణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ చరిత్రములను వర్ణించెను. అట్లే కవిరాజ మనోరంజనమునందు చంద్ర, బుధ, పురూరవుల గూర్చి యొకవంక, వైవస్వత, సుద్యుమ్న (ఇలా) పురూరవుల గూర్చి మరియొక వంక యభివర్ణించి మూడు తరముల కథ చెప్పుట యను నాదర్శమును పాటించెను. అంతేకా దీతనికి కళాపూర్ణోదయ కర్తయైన పింగళి సూరన్నతో కూడ స్పర్ధ కలదనుట కన్న నభిమానము మెండని చెప్పవచ్చును. కావుననే యచ్చట మూడు జన్మల కథలో స్త్రీ పురుషుడగుట, పురుషుడు స్త్రీ యగుట యను నంశమును గాంచి ముగ్ధుడై, తన కవిరాజమనోరంజనమునందు మూడుతరముల కథను గైకొనుటే గాక, స్త్రీ పురుషుడగుట, మరల స్త్రీ యగుట, మాసము మాసము మారుచుండుట

యను మూడు రకముల విచిత్రానుభవములకు లోనైన పాత్రగల వస్తువు నెన్నుకొనుట మిగుల విశేషము. అంతేగాక కళాపూర్ణోదయ కర్త కల్పనము చేయగా, అబ్బయామాత్యుడు పురాణములందు ప్రసిద్ధమైన యట్టి కథనే గైకొని కావ్య రచనకు పూనుకొనుట చూడ నతనికి పూర్వకవుల యెడగల ప్రతిభాస్పర్ధ స్పష్టమగుచున్నది. వసుచరిత్రకారు డన్నట్లు కల్పనలు గాజు పూసలనియు, పూర్వ కథలు పుడి మాణిక్యములనియు, పూర్వ కథలకు చక్కని కల్పనము జోడించుట సానలుదీరిన రత్నముల సృకించుటకనియు, అబ్బయామాత్యుడును భావించినట్లు తోచును. అతడు వస్తువును కల్పించుటయం దాసక్తి చూపలేదు. వర్ణనల జేయునెడ తన కల్పనా శక్తిని ప్రదర్శించెను. బహు పురాణముల నుండి వస్తువును సేకరించి, విశిష్ట వర్ణనల జోడించి కవిరాజ మనోరంజనము నందలి వస్తువును కూర్చి ప్రబంధమన నిది యని చూపుట కా యన్నట్లు తన ప్రతిభా పారమ్యమును చాటెను.

ఇంతకు పూర్వ మిదే వస్తువును గైకొని కవికులగురువు కాళిదాసు 'విక్రమోర్వశీయము' ను రచించి యుండెను. అం దాతడు మూల కథ కెన్నియో మార్పులు చేర్పులు చేసి యుండెను. ఈ సందర్భమున వానిని గూర్చి పరిశీలించుటయు నవసరము. "పురూరవుని వివాహము కాశీరాజు దుహితయగు పద్మజతో జరిగినట్లే పురాణమునను లేదు. కాని కాళిదా సీ కల్పనకు క్రొత్త యూపిరి నిచ్చి, ద్వితీయ తృతీయాంకములం దొక విధమైన యౌత్సుక్యమును కలిగించెను, భారతనారీ హృదయమును, వారి స్వచ్ఛమైన ప్రణయము, అనురాగము, అనునయము, అలుక మొదలగు నంశములను రమణీయముగ చిత్రించెను. భరతుని శాప ప్రభావము, ఇంద్రుని యనుగ్రహముచే తొలగింప జేసి ప్రేయసీప్రియుల సమాగమమునకు మార్గమును సుగమ మొనర్చెను. చివరకు నన్నియు సమకూడినవి కాని విచార మేఘము లావరించినవి. ఏదియో తీరని బాధ వలన, ఆశవలన నందరు నొకరి ముఖము నొకరు చూచుకొను చుండిరి. ఈ దశలో నకస్మాత్తుగ నారదుని యాగమనము, ఇంద్రుని యాజ్ఞను వినిపించుట, క్షణములో విషాదపూరిత వాతావరణము కల్యాణోత్సవముగ మారుట యను సన్నివేశములు కాళిదాసుని కల్పనా వైభవమును దర్శింప జేయును. నాయికా నాయకులు, కొన్ని సన్నివేశములు తప్పఇత రాంశములన్నియు కాళిదాసుని యుదాత్తమైన యాలోచనాత్మకమైన కల్పనలే. ఊర్వశీ

ప్రణయరీతులు, స్వచ్ఛమైన ప్రేమ, చిత్రలేఖ యభిమానము, అనురాగము, ఊర్వశితో విదూషకు డొనర్చిన పరిహాసము, అతడు ప్రతి యంశమునందును భోజన ప్రియత్వమునే వ్యక్తమొనర్చుట, నిపుణిక చతుర సంభాషణము. రాణిగారి రాజనీతి, గౌరవము, అభిమాన దర్పము, పురూరవుని సాహసపరాక్రములు, దేవతల విధేయత, చివరికి పుత్రదర్శనముతో సంచలితులగుట మొదలగునవి యన్నియు కాళిదాసుని కల్పనలే. కాళిదాసిన్ని కల్పనలు చేసి తన దృశ్యకావ్యమును రసరమ్యమొనర్పగా, అబ్బయామాత్య డిందుండి యొక్క కల్పనమైన గైకొనక నిరాకరించెను. బహు పురాణములందున్న వస్తువును, తన కనుపైన చోటు నుండి గైకొని నిబంధించెనేగాని, పూర్వ కవి కృత కల్పనల జోలికి పోలేదు. తానైనను కల్పనము చేయలేదు. ఇది చర్చింపవలసిన యంశమై యున్నది.

కాళిదాసు కొన్ని కల్పనలు చేసి యుండ వానినే గైకొనుట కాతని యాభిజాత్య మడ్డుపడి యుండును. అట్లను కొందమన్న, తానే స్వయముగ కల్పనలు చేయవచ్చునే యన్న సందేహము గలుగక మానదు. అతనికి కల్పనలపై నాదరము లేదనుకొనుటయే సమంజసము. ఇది యాతని మతమా ? పూర్వాంధ్ర కవులివ్వట్టున నేమి చేసిరని పరిశీలించ వలసి యున్నది.

నన్నయభట్టారకులు శకుంతలోపాఖ్యానము వ్రాయుచు, నప్పటికే సుప్రసిద్ధమైన 'యభిజ్ఞాన శాకున్తల' నాటకమునందలి, అభిజ్ఞేత్యాది కల్పనలను నిరాదరించి సత్యప్రకటనమే పరమావధిగా భావించి, దుష్యంతుని పాత్రకు కొంతన్యూనత కలుగుచున్నను, అతడు తాత్కాలికముగ నైన యసత్యవాదియని చిత్రించి, తన సత్యనిష్ఠను చాటుకొని యున్నాడు. మరియొక విధముగను భావింపవచ్చును. దృశ్య కావ్య విషయమున నాటి కవులు "అన్యథా వా ప్రకల్పయేత్" అను అభియుక్తోక్తిని పాటించి, నాయకుడు ధీరోదాత్తుడే కావలయునను విధిననుసరించి, కించిద్దోష మున్నను నిరాకరించి, నాయకుని విషయమున కల్పన చేయుట తప్పు కాదని భావించి యుందురు. దానికి కారణ మది దృశ్యకావ్య మగుటయు, లోకమునందు ప్రదర్శింపగా నందు నాయకుడే యసత్యవాదియని (తాత్కాలికముగనైన) సామాజికులయందు సత్యనిష్ఠ కొంత కొఱవడు నవకాశ మున్నదని యెంచి. నాయకుడు విశుద్ధవర్తనుడే కావలయునని, అవసరమగుచో నా విషయమున కల్పన

చేసినను తప్పుకాదని భావించి యుండుట సహజమే. కాని శ్రవ్య కావ్య విషయమున నది వర్తింపదు. అందునను నన్నయభట్టారకులు, ధర్మప్రబోధమే ప్రధాన లక్ష్యముగ పంచమ వేదమైన మహాభారతమును తెనుగున ననువదించుటకు పూనుకొన్న ధీశాలి కనుక సత్యప్రకాశమే వారి పరమావధి. ఇక తరువాతి కాలమున పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు కూడ తన 'శృంగార శాకుంతలము' నందు కాళిదాసుని కల్పనలకు తావీయలేదు. దీనినిబట్టి పరిశీలింపగా, ఆంధ్ర కవులు పూర్వసంస్కృత కవుల కల్పనలను చేకొనక మూల కథ యేయే పురాణములందున్నదో దానినే తమ కనువైన రీతిని, అనువైన మేరకు గైకొని తమదైన స్వతంత్ర విధానమును చేపట్టిరి. కావుననే అబ్బయామాత్యుడును, పూర్వాంధ్ర కవుల రీతినే పుణికిపుచ్చుకొన నెంచెనా యన్నట్లు కాళిదాసకృత కల్పనల జోలికి పోక, తనదైన మార్గమున, కవిరాజ మనోరంజనము నందలి వస్తువును తనరీతి నెన్నుకొని, దానినొక ప్రత్యేక పద్ధతిలో నిబంధించి ప్రబంధ రచనమునందొక వినూత్న ఫణితిని ప్రవర్తించెను. ఊర్వశీ పురూరవుల వృత్తాంతము వేదములు మొదలుకొని బహు పురాణములందు బహు విధములుగ వర్ణింపబడి యుండగా, అబ్బయామాత్యుడు వేదము లందలి కథను వదలక, అచ్చటచ్చట తగు మార్పులను ప్రబంధరీతి కనుగుణముగ కల్పించుకొనినాడు. ప్రథమాశ్వాసమంతయు నతని కల్పనమే. ద్వితీయాశ్వాసము నందలి కథను మత్స్య పురాణము నుండి గైకొని తారాశశాంక ప్రణయ కథగా తీర్చిదిద్ది యున్నాడు. ఇలా కన్య వృత్తాంతమునకు మత్స్య పురాణ భాగవత మాధారములు కాగా, తృతీయాశ్వాసమందలి వస్తువు చాలావరకు అబ్బయామాత్యుని కల్పనయే. చతుర్థాశ్వాసమునందలి మిత్రావరుణుల తపోభంగ వృత్తాంతము వేదార్థ దీపికయం దుటంకింపబడినదే యైనను దానిని తన కల్పనలచేత వర్ణనాతిశాయియైన ప్రతిభ చేత రసరమ్యమొనర్చి అబ్బయామాత్యుడు తనదైన ప్రబంధరీతి నవలంబించి యున్నాడు. పంచమాశ్వాసము నుత్తరభాగము నందలి వస్తువున కాధారమైనవి, ముఖ్యముగ శతపథ బ్రాహ్మణ, విష్ణుపురాణ, భాగవతములు. మొత్తము మీద పర్యాలోచనము సేయగ, అబ్బయామాత్యుని కావ్య వస్తువునకు పురాణము లాధారముగ నున్న భాగము తక్కువయే యని చెప్పవలయును మిగతా భాగమంతయు నతని స్వోపజ్ఞమే. ముఖ్యముగ వర్ణన రీతి కొనియాడ దగినది. అతడు పూర్వాంధ్ర కవులందరితో ప్రతిభా స్పర్ధ గలవాడు. కావుననే యొక్కొక్కరిని ఒక్కొక్క

యెడ ననుసరించుచు తనదైన ప్రత్యేకతను నిలుపుకొనుచు 'పురూరవశ్చరిత' మను నామాంతరముగల యీ తన కావ్యమును అతడే చెప్పుకొనినట్లు 'కవిరాజమనోరంజన' మను పేరు సార్థక మగునట్లు రచించి యున్నాడు. కావుననే దీనికి రసజ్ఞులు "పిల్ల వసుచరిత్ర" మని పేరిడి యున్నారు.

వ్యాసమున నింతదనుక వస్తువున కాధారముల గూర్చియే చర్చించుట జరిగినది. ఇత డీ కావ్యమున పూర్వాంధ్ర కవులతో నెచ్చెలిచ్చట యెట్లెట్లు స్పర్ధించి, తన కవితా సామర్థ్యమును వెల్లడించెనో పరిశీలింపవలసి యున్నది.

ప్రబంధము మొదలిడుచునే పూర్వ ప్రబంధకవుల యొరవడినే ప్రతిష్ఠాన పురవర్ణన మొనర్చినాడు. ఆ పిదప కథా నాయకుడైన పురూరవుని సౌందర్యాతిశయమును, పదునెన్మిది పద్యములలో రమ్యముగ వర్ణించినాడు. ఇదియు ప్రబంధ కవులు ప్రారంభించిన ఫణితియే. తరువాత పురూరవుని కడకు నారదుడు వచ్చి బహువిధ రాజనీతి పద్ధతులు వచించి, ఆత్మవిద్యోపదేశము సైతము చేయుట యను ఘట్టము కలదు. మరి యే గ్రంథము లందును నారదాగమన విషయ మభివర్ణింప బడలేదు. ఇది కేవలము అబ్బయామాత్యుని కల్పనము. యథార్థమున కీ ఘట్టము లేకున్నను మూలకథకు భంగము లేదు. ఈ ఘట్టమున పురూరవున కాత్మవిద్యోపదేశము చేసి, నారదుడు తరువాత స్వర్గమునకేగి యచ్చట పురూరవుని గుణగణమ్ముల నభివర్ణించుట జరుగును. అది విని యూర్వశి పురూరవునికై విరాళిగొన్నది. ఈ విధముగ పురూరవుని సౌందర్యాతిశయము, సద్గుణములు ఊర్వశికి తెలిసి యామె పురూరవునియం దనురక్త యగుటకీ నారదాగమన ఘట్టము కొంత తోడ్పడిన దనవచ్చును. అంతియేగాని, ఈ ఘట్టము లేకున్నను పురూరవుని సౌందర్యాతిశయమును మరేదియో మార్గమున నూర్వశికి తెలియునట్లు చేయవచ్చును. లేదా యొకనాడు నారదమునీంద్రుడు భూలోక సంచారము ముగించుకొని వచ్చి యచ్చటి రాజులలో పురూరవు డుత్తమోత్తముడని వర్ణించు ఘట్టము తోడనే ప్రారంభింపవచ్చును. అప్పుడు ప్రథమాశ్వాసము నందలి కథ యంతయు నవసరములేక పోవును. కాని అబ్బయామాత్యుని దృష్టి వేరుగ నున్నది. సన్నివేశ కల్పన మొనర్చి, నారదాగమనము నభివర్ణించుట యతడు కావలయుననియే చేసెను. ఇట్టి ఘట్టములు పూర్వప్రబంధములందు పెద్దనాదు లొనర్చియున్నారు. తానును

వారికి పైఁ దోడనిపించుకొన గోరువాడగుటచే నత డీ కల్పనము చేయవలసి వచ్చి నది. పరిశీలింతము. పెద్దన తన మనుచరిత్రమునందు సిద్ధాగమనమును వర్ణించెను.

"మడిచిన యొంటి కెంజెడ మూయ మువ్వన్నె
మెగము తోలు కిరీటముగ ధరించి
కకపాల కేదార కటక ముద్రికపాళి
గుఱుచ లాతాముతోఁ గూర్చి పట్టి
యైణేయమైన యొడ్డాణంబు లవలి చే
నక్కళించిన పొట్ట మక్కళించి
యారకూటచ్ఛాయ నవఘళింపగ జాలు
బడుగు దేహంబున భస్మ మలది

కట్టుపమ్మెన విడు యోగ పట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్షపోగులు చవుకళింపఁ
గావి కుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహ మౌషధీ సిద్ధుఁ డొకడు" —మను. 1-59

నందితిమ్మన తన 'పారిజాతాపహరణము' నందు నారదాగమమును వర్ణించి నాడు.

"సరిగమపదనిస సంజ్ఞస్వరంబుల
మహతి నభోవాయు నిహతి మొరయ
భాగిరథీ పయః పరిపూర్ణ మణికమం
డలువు హస్తంబునఁ జెలువు మిగులఁ
బ్రణవమంత్రావృత్తి పావన స్ఫటికాక్ష
వలయంబు కర్ణ శష్కులిక ప్రేల
సమర నృత్యోచిత చమర వాలంబును
గక్షపాలయు భుజాగ్రమున మెఱయ

దేహకాంతు లకాలచంద్రికల నీన
జడలు మోక్షద్రుమ పల్లవశంక సేయ

గగనమున నుండి వచ్చె నాకస్మికముగ
నారివేడంపుఁ దపసి దైత్యారి కడకు" —పారిజాత. 1_44

ధూర్జటి తన "శ్రీ కాళహస్తిమాహాత్మ్యము" నందు ఈశ్వరుడు జంగమ దేవర యైనాడు. ఈ జంగమ దేవరయే యాదవ రాజునకు, శ్రీ కాళహస్తి మహత్వము చెప్పిన ట్లభివర్ణించినాడు.

"అగుడు నెత్తమ్ముల నపరంజి పావాలు
కరమునఁ గేదార కంకణంబు
బంగారు వ్రాత చెఱంగుల గోణాము
గళమున రుద్రాక్ష కంఠమాల
యొకకేల భసిత భస్త్రిక తోడి బెత్తంబు
నందిగట్టిన తరుణేందుధరుడు
మాణిక్యరుచుల యొడ్డాణంబు, భూతిపైఁ
బెట్టిన కస్తూరి బిళ్ల బొట్టు

సార్వకాలిక తాంబూల చర్వణార్ద్రి
రాగ సౌభాగ్యమునఁ బద్మరాగమణులఁ
దృణముగాఁ జూచు దంతపంక్తియును గలిగి
యంగజారాతి యొక మిండజంగ మగుచు" 1_30

వసుచరిత్రయందు భట్టుమూర్తి వసురాజు కోరికపై నతని మంత్రి జడదారిగా మారినప్పు డతని వర్ణించిన తీరు గనుడు.

"కనకవల్లి మతల్లి కలపెంపు జడగుంపు
పుష్ప పరాగ సంభూతి భూతి
కమనీయ శాఖా ప్రకాండంబు దండంబు
తరుణ పల్లవకోటి ధాతుశాటి
వల్కల ఘట్టంబు వరయోగ పట్టంబు
జాలక ప్రసరంబు జపసరంబు

ఫలరసాసారంబు పాత్రాంబు పూరంబు
కింజల్కములచాటు పొంటినూలు
సేయఁ జాలిన యమ్మహా శిఖరి శిఖర
రుచిరసురరాజి రాజిచే నుచిత వేష
మెనసి నరపాల నిరపాయ హిత విహార
హరి గడిదేరి యొక జడదారి యయ్యె" — 2-79.

కళాపూర్ణోదయ కర్తయైన పింగళి సూరన కూడ నారదుని ప్రమేయము లేకుండగ కథ నడుపలేదు.

ఇట్లు ప్రధాన ప్రబంధకర్త లందరు నారదుని వర్ణించి యుండగా వారితో స్పర్ధించిన యబ్బయామాత్యు డెట్లూర కుండగలడు. కావుననే సందర్భమును తానే కల్పించుకొని, దానికై ప్రథమాశ్వాసము నంతయుఁ గల్పించినాడు అబ్బయామాత్యుని నారద వర్ణనము గనుడు.

"లాఛనంబు సముజ్జ్వల భుజాంతరస్థితి
మహతి రూపంబున రహివహింప
నమృతంబు విష్ణు నామాక్షరమధుర గాం
ధర్వ రూపంబునఁ దరగలెత్తఁ
జంద్రిక ల్ధళధళాచ్ఛ శ్వేత శారీర
కాంతి రూపంబునఁ గ్రమ్మికొనగఁ
జల్లఁదనంబు శశ్వత్కృపారసపూర్ణ
దృష్టి రూపంబునఁ దేటపడగ
మనుపడైన పూరూరవ క్ష్మాతలేంద్రుఁ
జూడ నేతెంచు చంద్రుని జాడ దోప
నరుగు దెంచె నభోమార్గ యానమునను
నారదుడు మూర్తిజిత శరన్నారదుండు." — కవిరాజ :— 1-106.

మనుచరిత్రమునందు సిద్ధాగమనము లేక పోయిన కథ ముందుకు సాగదు. అతడు రావలయును ప్రవరాఖ్యు డతనిని సేవింప వలయును. ఇతని తీర్థగమ

నాభిలాష నాత డెఱింగి, యౌషధము నిచ్చి పోవలయును. అప్పుడు గాని ప్రవరాఖ్యుడూరు వదలి హిమవన్నగములఁ జేరబోడు, అట్లైననే వరూధినీ ప్రవరాఖ్యుల సమావేశము సంభవమగును. అది అరువాతి కథకు నాందీ ప్రాయమై యుండుట స్పష్టము.

అట్లే పారిజాతాపహరణము నందు నారదుడు వచ్చుట, నాకమునుండి పారిజాత సుమమొక్కటి తెచ్చుట, అద్దానిని రుక్మిణి కిప్పించుట, ఎకసక్కెములాడి సత్యకు కోపము కలిగించుట, తుదకది పారిజాతాపహరణమునకు దారి తీయుటయను సన్నివేశ క్రమమునకు నారదాగమనమే బీజము.

శ్రీకాళహస్తి మాహాత్మ్యమునందును శివుడు జంగమదేవరగా మారి వచ్చుట యనునది కథకు బీజము.

వసుచరిత్రమునందు సన్నివేశము కొంత భిన్నముగ నున్నను, అదియు కథ ముందుకు సాగుటకు వీలుగల్పించునదే. సుమంత్రి కుమారుడు యతి వేషమున నేగి గిరికా వృత్తాంతము నెఱింగి, గిరికా వసురాజుల సమాగమమునకు భూమిక నేర్పరచుట చేత, నచ్చటి యతి వర్ణనము కూడ పై ప్రబంధముల వంటిదే యని చెప్పవచ్చును. కళాపూర్ణోదయమునందు నారదాగమనము తప్పనిసరి. అతని శిష్యుడే మణికంధరుడు. అతనిచే కథానాయిక యైన కలభాషిణిని రంభను మించిన దానిగా వర్ణింపఁజేసి రంభ కీర్ష్య కలిగించి, ముందు జరుగబోవు మాయారంభో దంతమునకు బీజము నిక్కడనే వేసినవాడు నారదుడే కనుక నిచ్చట నారద పాత్రకు తగు స్థానమే యున్నది. ఇవి యన్నియు పరిశీలించిన, అబ్బయామాత్యుడు తన ప్రబంధమునం దీ సన్నివేశ ముండి తీరవలయునని నిశ్చయించుకొని, నారదాగమనముతో పాటు, ఆత్మవిద్యోపదేశమను నొక క్రొత్త యంశమును కూడ చేర్చి తన ప్రత్యేకతను నిలబెట్టుకొనినాడు. ఏతత్పాత్ర కల్పనము నందాతనికి స్పర్థ కలదనుటకు మరికొన్ని తార్కాణములఁ జూపెదను

తీర్థయాత్రాచణుడైన సిద్ధుని ప్రవరాఖ్యు డడిగిన తీరు.

"ఏయే దేశములన్ జరించితిరి మీ రేయే గిరుల్ చూచినా
రేయే తీర్థములందుఁ గ్రుంకు లిడి రేయే ద్వీపముల్ మెట్టినా

రేయే పుణ్యవనాళిఁ ద్రిమ్మరితి, రేయే తోయధుల్ డాసినా
రాయా చోటులఁ గల్గు వింతలు మహాత్మా! నా కెఱింగింపవే" [1]

ఆ వరుసలోనే అబ్బయామాత్యుని వర్ణనయు నడచును. నాకము నుండి విచ్చేసిన నారదునికి పురూరవుడు స్వాగతము పలికి ప్రశ్నించిన తీరు.

"ఏ లోకంబున సంచరించితిరి మీరేయే విశేషస్థలం
బాలోకించితి, రే ప్రసంగమున మీ కచ్చోట విన్నాళ్ళుఁ దా
గాలక్షేపముజెల్లె సంశ్రవణముం గావింప శ్రోతవ్య వా
ర్తా లాలిత్య వచస్సుధారస సుధారాపూర్తినో నారదా" 1_195

పెద్దన ననుసరించుచునే, తన యభిరుచిని ప్రకటించుచునే తన ప్రత్యేకతను నిలుపుకొన్న వా డబ్బయామాత్యుడు. దాని కీ పద్యమే తార్కాణము. ఈ పద్యము నెత్తికొన్నప్పుడు పెద్దన ననుకరించినట్లు కనపడును. నడుమ కొంత మార్పు చేసి చివర కొక సుదీర్ఘ సమాసము నొక దానిని జతపరచి, తనదైన యొక మార్గమును ప్రకటించుకొన్నాడు కవిరాజమనోరంజన కర్త.

పురూరవుడు జైత్రయాత్రకు వెడలినట్లు పురాణములందు గాని మరెచ్చటను గాని చెప్పబడలేదు. ఐనను అబ్బయామాత్యుడు పురూరవుడు జైత్రయాత్రకు బయల్వెడలినట్లు వర్ణించి, యానాటి రాజ్యములను, రాజ్యాధీశులను తెలియపరచి యున్నాడు. రఘువంశమునందు కాళిదాసు సూర్యవంశజులైన రాజులెల్ల దిగ్విజయ మొనర్చి చక్రవర్తులైనట్లభివర్ణించి యుండుటచే తానును తన కావ్యము నందు దిగ్విజయ యాత్రను వర్ణించెనని తోచుచున్నది. చంద్రవంశజుడైన పురూరవుడు కూడ దిగ్విజయయాత్ర వెడలెనని వర్ణించుట యౌచిత్యవంతముగ కనిపించు చున్నది. పురూరవుడు చక్రవర్తియగుట లోకవిదితము. [2] ప్రేయసీ ప్రియుల నడుమ పరస్పరానురాగము కలిగించి, వారి సమాగమమును సుకర మొనర్చుటకు

---

1. మనుచరిత్ర. 1_68

2. హరిశ్చంద్రో నలో రాజా, పురుకుత్సః పురూరవః
సగరో కార్తవీర్యశ్చ, షడైతే చక్రవర్తినః ॥

దూతికయో, దూతయో దౌత్యము నెఱపుట లోకసహజమే కాగా రాజాంతఃపుర ములు పోతుటీగ కైన చొరరానివి కనుక నట్టి పట్ల, అంతఃపుర కన్యలకు ప్రియ వార్తా శ్రవణ మొనర్చుటకు, పక్షుల నుపయోగించుటయు గలదు. ఒకప్పుడు పావు రముల ద్వారా లేఖలు పంపుట జరిగినదే గదా! కవులు సైతము తమ కావ్యములం దిట్టి ఘట్టముల పక్షిరాజములు ప్రణయ దౌత్యము నెరపినట్లు వర్ణింపబడుట యందందు కానిపించుచున్నది యథార్థమున కిది ఆదికవియైన వాల్మీకి నుండియే ఇతర కవులకు సంక్రమించిన దనవచ్చును శ్రీరాముడు సీతాదేవి కడకు హను మంతుని దూతగా పంపియుండెను. ఆ హనుమద్దౌత్యమే కాళిదాసుని మేఘదూతము నకు మూలమైన దనవచ్చును. నలదమయంతుల నడుమ దౌత్యము నెరపినది దివ్యమైన నొక స్వర్గ హంస. ఆ హంసను గూర్చి గుంటూరు శేషేంద్ర శర్మగారు 'స్వర్గహంస' యను నొక చక్కని పమర్శనము చేసి, ఆ హంస యొక్క ప్రాశ స్త్యమును వెల్లడించినారు.[1] శృంగారనైషధ పీఠికలో విశ్వనాథ వారు కూడ ఈ హంస శివరూపమని భావించి దాని యొక్క వైశిష్ట్యమును వర్ణించి యున్నారు.[2] కావ్యపరముగ చర్చించినచో, నా హంసయే పూనుకొనకుండిన నలునికి, దమ యంతీ సౌందర్య ప్రాశస్త్యము తెలిసెడిది కాదు. అట్లే ఆ హంసయే తెలుప కున్నచో దమయంతికి నలునియం దనురాగ ముదయించెడిది గాదేమో. ఇట్టి హంస నాయికా నాయకులను పరస్పరానురాగవంతులు నొనర్చి, కథ కొక వైశిష్ట్యము నాపాదించినది.

ప్రభావతీ ప్రద్యుమ్నము నందు శుచిముఖి యను దేవహంసి కీ యవ కాశము లభించినది. అది ప్రభావతీ ప్రద్యుమ్నుల నడుమ రాయబారము నెరపి తన జాణతనముచే వారిని పరస్పర మనురక్తుల నొనర్చి, వజ్రనాభ వినాశమను దేవకార్యము నిర్వహించుట యందు కృతకృత్య మైనది[3] అట్లే కళాపూర్ణోదయము నందలి చిలుక, కలభాషిణికి మణికంధరుని ఘోర తపస్సును గూర్చి వివరించి యతని తపస్సు చెరుప, నింద్ర నియోగంబున రంభ యచ్చటికిపోయి యున్న

1.
2.
3. ప్రభావతీ ప్రద్యుమ్నము : 3-77 నుండి 83 వరకు.

దనిచెప్పి, తరువాతి కథ నడిపించి, కలభాషిణీ మణికంధర సమాగమమునకు మార్గము సుగమ మొనర్చినది.[1] ఇట్లు చిలుకలు, హంసలు ప్రణయ దౌత్యము నెఱపుట చమత్కార హేతువులగును. పూర్వకవులయెడ స్పర్ధగల, అబ్బయామాత్యుడు తన కవిరాజ మనోరంజనము నందును పక్షిదౌత్య ముండవలయునని నిశ్చయించుకొని యుండును. కావుననే సందర్భము కుదురగానే త్రైలోక్యవర్తి యను నొక చిలుకను ప్రవేశ పెట్టెను. ఊర్వశి, పురూరవుని యెడ నత్యంతానురక్తయై విరాళిగొని యున్నది. చెలు లామెకు వివిధ శిశిరోపచారములు లొనర్చు చుండిరి. ఫలితము లేకుండెను. అప్పు డీ త్రైలోక్యవర్తి పురూరవ గుణ గాన మొనర్చినది. ఇంద్ర నియోగమున నూర్వశి భువికేగ గలదనియు, అచ్చట పురూరవుని గాంచగలదనియు, వారిరువు రనురక్తులై, సమాగమము సిద్ధించు ననియు, చంద్రవంశము వారి కారణమున వర్ధిల్లుననియును, చిలుక ద్వారా విని యూర్వశి మన మూరడిల్లినది. తాపము శమించినది. పురూరవ సమాగము లబ్ధికై తరివేచి యున్నది.

ఇట్లీ ఘట్టమున చిలుక చేత నూర్వశీ విరహతాపము శమింపఁ జేయుట యొక విచిత్ర కల్పనము. పూర్వకవి స్పర్ధనెక్కొనగా, అబ్బయామాత్యు డిద్దాని నీ విధమున గూర్చి, తన యభిరుచిని ప్రదర్శించి యున్నాడు. ఊర్వశీ పురూరవుల సమాగమము వెంటనే సమకూడునది కాదు. మిత్రావరుణులు ఘోర తపస్సు చేయగా, వారికి తపోభంగము కలిగింపనెంచి ఇంద్రుడు ఊర్వశిని పంపవలయును. అప్పుడుగాని ఊర్వశి భూమండలమునకు పోజాలదు. పోయినగాని పురూరవ దర్శనము, ప్రణయము, సమాగమము ననునవి సిద్ధించవు. అవి ఎప్పుడో ఘటిల్లునవి. నారదునిచే పురూరవ గుణ సౌందర్యముల విన్నప్పటి నుండియే, ఊర్వశి విరాళి గొని యున్నది. అంత వరకు ఊర్వశి విరహానలమున యసువులు వీడదా? అందువలన తాత్కాలికోపశమనమునకు మార్గము నన్వేషింప వలసి యున్నది. నారదాగమన మొక కల్పనము. దాని కారణమున ఊర్వశి విరాళి గొనుట మరియొక కల్పనము. కల్పనమునందు సైతమొక క్రమ ముండవలయును గదా! అందుచేత తాత్కాలికముగ విరహతాపము తొలగించుటకు, పురూరవ సమాగమము తథ్యమన్న

1. కళాపూర్ణోదయము : 2-161 నుండి 188 వరకు.

యాశ కలిగించుట మరియొక కల్పనము. దానికై త్రైలోక్యపర్తి యను చిలుక నొక దానిని కల్పించి, అబ్బయామాత్యుడు తన చిత్ర కల్పన పారీణతను ప్రదర్శించి నాడు.[1] సమర్థులు, తమ సామర్థ్యమును వెల్లడించుటకు, సందర్భమును తామే కల్పించు కొందురనుట కీ ఘట్ట మొక్కటి యుదహరించినఁ జాలును.

మిత్రావరుణులు ఊర్వశీ సౌందర్యమునకు మోహితులై రేతఃపతనమయి నట్లు ఉత్తర రామాయణమున గలదు. మరి యే ఇతర పురాణములం దీ కథ చెప్పబడి నట్లు లేదు. పురాణము లందు మునీంద్రులు ఘోర తపము లొనర్చుటయు, ఇంద్రు డద్దానిని భంజించుటకై యప్సరసల నియోగించుటయు నచ్చటచ్చట కలదు. విశ్వామిత్రుని తపోగ్రతకు తట్టుకొనలేక ఇంద్రుడు మేనకను నియోగించుట, మేనకను జూచి మోహితుడై విశ్వామిత్రుడు తపస్సు మాని, అమెయం దత్యంత సౌఖ్యమును బొందుట, శ్రీమద్రామాయణ, భారతము లందు ప్రసిద్ధమే గదా ! ఈ ఘట్టము అబ్బయామాత్యునికి రసపత్తుగ తోచినది. వెంటనే తన కావ్యమున దీని నెచ్చట కూర్చవలయునా యని చింతించి యుండును. సందర్భము వచ్చినది. ఊర్వశి భూతలమునకు వచ్చినగాని ఊర్వశీ పురూరవ ప్రణయ ఘట్టమునకు బీజావాపనము కాదు. అమెను భూమికి రప్పించుటకీ చిన్న యంశము నాత డుత్తర రామాయణము నుండి యెన్నుకొని, యొక సుందర రసపత్రండికనే తీర్చిదిద్ది యున్నాడు. ఊర్వశి, మిత్రావరుణుల తపోభంగ మొనర్చు ఘట్టము కడు రమ్యముగ వర్ణింపబడినది. పుష్పావచయ వర్ణనము, జలకేళీ వర్ణనము, వీణాగానము సరస సమ్మోహనముగ నున్నవి. కావుననే మిత్రావరుణులు పరవశులై యామెయం దనురక్తులైరి. మదనవ్యథా భిన్నహృదయులైరి. మోహవేశ మినుమడింప వారికి రేతఃపతన మైనది. అప్పుడు గాని వారు తెలివొందలేదు. తపోభంగమునకు దుఃఖించి తద్ధేతువైన ఊర్వశిని మానవ మానవతీ స్థితితో నుండుమని శపించిరి. అ శాపమే, ఊర్వశికి పురూరవ సమాగమ హేతువైనది. ఇట్టి ఘట్టము వింతగా కల్పించినను, అది మూల కథతో పొంది పొసగి తరువాతి కథతో నతికినట్లుగా గాక, సహజముగ నమరి పోయినది. ఇట్టి యద్భుత కల్పన మొనర్చ సమర్థుడగుటచేతనే అబ్బయ మాత్యుని కవి స్పర్థ యశస్కరమై పరిఢవిల్లినది. సహజముగ నొక్క లోకోత్తర

1. కవిరాజ మనోరంజనము. 3_153 నుండి 183 వరకు.

కల్పనము చేయఁజాలియున్న యభిరుచికి తోడు అబ్బయామాత్యునికి, పింగళి సూరన తన కళాపూర్ణోదయమునందు, ఇంద్రుడు రంభను వినియోగించి మణికంధరుని తపస్సును విఘ్నమొనర్చిన ఘట్టము[1] స్మృతి యందు మెదలి యుండును. తాను తపోభంగ వృత్తము నేల వర్ణింపరాదని భావించి, యీ సుందర కల్పనము చేసి యుండవచ్చునని భావించినను తప్పులేదు.

రామరాజభూషణుని 'వసుచరిత్రము' నందు వసురాజు గిరికను తనయందను రక్తను గావించుకొనుటకై తన మంత్రి కుమారుని పంపు ఘట్టమున్నది.[2] అహ్లేషియ విలాసమునందు చేమకూర వేంకటకవి, అర్జునుని నియోగమున యతని చెలికాడు చిత్రాంగద కడకేగినట్లు వర్ణించి యున్నాడు. ఇట్టివి యితర కావ్యము లందును గలవు. అయీ ఘట్టములను తెలిసినవాడగుట చేత అబ్బయామాత్యుడు సందర్భము కల్పించుకొని, చిత్రవనమునందు ప్రవేశించియు, ఊర్వశియున్న నెలవెరింగి, తన చెలికానినంపి, తన ప్రణయవార్త నందించును.[3]

అగ్నిస్థాలి యున్నయెడ శమీగర్భభూతమైన యశ్వత్థమును గాంచి పురూరవుడు, రెండరణులుగొని పూర్వారణి యూర్వశి యనియు, ఉత్తరారణి తాననియుఁ దచ్చుగా నందుండి నడుమ నగ్ని పుత్రుడై పుట్టినట్లును, ఆ యగ్నితో యజన మొనర్పగా పురూరవుడు గంధర్వలోకమును బొందెనని భాగవతము చెప్పుచున్నది.[4] అబ్బయామాత్యుడు క్రొత్తగా మరియొక కల్పనము చేసెను. ఆ యగ్నిహోత్రముచే యజ్ఞము లొనర్పగా, ఇంద్రాది దేవతలు ప్రసన్నులై యాతనికి ఊర్వశీవిలాసిని నిచ్చి, నరసుర లోకంబుల యథేచ్ఛా విహారంబులఁ జరియించునట్లు దివ్యత్వంబు నొసంగిరని వర్ణించెను,[5] గంధర్వుల యాజ్ఞకు కట్టుపడి యుండు ఊర్వశి, పురూరవుడు గంధర్వుడైనంత మాత్రమునగాని, గంధర్వ

---

1. కళాపూర్ణోదయము : 2–176 నుండి 182 వరకు.
2. వసుచరిత్ర : 2–19
3. కవిరాజ మనోరంజనము : 5–98 నుండి 106 వరకు.
4. భాగవతము : 9–14 వ అధ్యాయము.
5. కవిరాజమనోరంజనము : 5–293.

లోకమున నున్నంత మాత్రముననేగాని, అతని కిష్టావాప్తిగాదు. గంధర్వలోకాధిపత్య మిచ్చుట యన్నది కుదరదు. వారింద్రునికి యాజ్ఞావశవర్తులు. కావున ఇంద్రాది దేవతలు, అతని కిష్టమైన యూర్వశీ విలాసినిని నాతనికి దత్తముగా నొనర్చి, దివ్యత్వ మొసంగుట తత్ఫలముగ నతడు యథేచ్ఛా విహారంబు నర సురలోకంబుల సుఖముండుట యను కల్పనమే మిక్కిలి యౌచిత్యవంతమై రసజ్ఞులకు మోదకారణమైనది.

పురూరవశ్చరితయను నీ కవిరాజ మనోరంజన మందలి వస్తువును బహు గ్రంథముల నుండి యేర్చి, కూర్చి, నడుమ నడుమ హృద్యములైన కల్పనలం జేసి అబ్బయామాత్యుడు తనదైన కల్పనాపై చిత్రిని, కవితాపై శిష్ట్యమును చాటుకొన్నాడు.



ఏడవ అధ్యాయము

# కవిరాజ మనోరంజనము : వర్ణన వైచిత్రి

తెలుగు సాహిత్యమున కవిరాజ మనోరంజన మొక యపూర్వ ప్రబంధము. కనుపర్తి అబ్బయామాత్యు డీ ప్రబంధము నిర్మించుటయందు కథా కల్పనమునకు యత్నింపక వివిధ పురాణముల నుండి యథాతథముగ గైకొని, దానిని తన వర్ణన చమత్కృతిచే ధగద్ధగాయమాన మొనర్చి యున్నాడు. ప్రబంధములు వర్ణన ప్రధానమైన కావ్యములు. కవి యీ గ్రంథమున చేసిన వర్ణనములు కొన్నిచోట్ల పూర్వకవులను స్పర్ధచే ననుసరించినను, అపూర్వముగ తీర్చిదిద్ది యున్నాడు. స్వతంత్రించిన సందర్భములు, పూర్వకవుల ననుసరించిన వానికన్న రమ్యముగా నున్నవని, ఈ గ్రంథమునకు పీఠిక వ్రాసిన శేషాద్రి రమణ కవులు యభిప్రాయ పడియున్నారు.[1] అది యథార్థము. మంగళాచల నృసింహుని వర ప్రసాదమున కవిత చెప్పిన వాడగుటచేత, కవిత్వము ప్రౌఢముగ నుండి సహృదయ హృదయ రంజకముగ నున్నది.

---

1. కవిరాజ మనోరంజనము : పీఠిక : పుట. 11.

ప్రబంధములం దష్టాదశ వర్ణనము లుండుట సాధారణ విషయమే. వర్ణన విషయమున పలువు రలంకారికులు భిన్నాభిప్రాయములు తెల్పియున్నారు.

"పుర వారాశి మహీధ రర్తు శశభృ త్సూర్యోద యోద్యాన పు
ష్కర కేళీ మధుపాన మోహన వియోగ క్షేమ యాన స్వయం
వర పుత్రోత్సవ మంత్ర దూత్య రణ దోర్వైక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశ వర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యం బిలన్"

అని తన కావ్యాలంకార చూడామణి యందు విన్నకోట పెద్దన లక్షణము చెప్పియున్నాడు.[1]

అప్పకవీయము నందు ప్రబంధమునం దుండవలసిన వర్ణనముల గూర్చి యిట్లున్నది.

"పురమును ఋతుచతుష్కమును ప్రయాణంబును
శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
దూత్యంబు పిదప నద్భుత రణంబు
విజయంబు మద్యపాన విహారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు

పద్మమిత్రోదయంబును పరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననగ నిరువది రెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయును ప్రబంధము శ్రీనివాస" అప్పకవీయం; 1-28

ఇందు వర్ణనముల సంఖ్య యిరువది రెండుగ పెరిగినది. అవి యమునవిమిదా :

1. కావ్యాలంకార చూడామణి :

ఇరువది రెండా? లేక మరియొకటా యన్నది ప్రశ్నకాదు. "నిరంకుశాః కవయః" అను అభియుక్తోక్తిని స్మరించినచో నవి యెన్నియైనను కావచ్చును. సందర్భోచిత ముగ్గు రమ్యముగ నుండుటే ప్రధాన లక్షణము. అబ్బయామాత్యుడు లెక్కకు మించిన వర్ణనలు చేసియున్నాడు. పరిశీలింతము :

## 1. పుర వర్ణనము :

కావ్యనాయకుడైన పురూరవుని రాజధానీ నగరము ప్రతిష్ఠాన పురము, దాని పై కవిమెట్టిదో చూడుడు.

"పుర నానామణి హర్మ్య దేశ చర దంభోజాంబ కాస్యాచ్ఛ సుం
దరత లూచిన కన్నులన్ నిహిత తద్ద్వారస్థలాదర్శ వి
స్ఫురి తాత్మప్రతిబింబము ల్గని సుమీ పూర్ణప్రభా పూర్ణిమా
హరిణాంకుడు వివర్ణుడై యరిగి కార్శ్యం బందు నంతంతకున్" 1-61.

పూర్ణిమ తరువాత కృష్ణపక్షమున చంద్రుడు క్షీణించుట సహజము. దానినే కవి చమత్కరించిన తీరు కడురమ్యము. ప్రతిష్ఠానపుర హర్మ్యములందు తిరుగాడు పూబోడుల ముఖ సౌందర్యము గని, తన ప్రతిబింబము నా భవన ద్వారములందలి యద్దములం గని, పోల్చి చూచికొని సిగ్గిల్లిన చంద్రుడు వివర్ణుడై క్రమముగా కృశించినాడని వర్ణింపబడినది.

వసుచరిత్రమున పెద్దనార్యుడు, అరుణాస్పద పురమును వర్ణించుచు, "వప్రస్థలీ చుంబితాంబరమై"[1] యున్నదని వర్ణించియున్నాడు. విజయవిలాసమున వేంకటకవి ఇంద్రప్రస్థమును వర్ణించుచు "ఉన్నమరేలఁ దత్పురము పొంతనెపో శిఖరాళిదాఁకి విచ్ఛిన్నగతిన్ సుధారసము చింది వయిం దిగవాఱనంతనుండి న్నెల సన్నగిల్లు"[2] అని వర్ణించియున్నాడు. వప్రస్థలి అంబరమునుఁ దాకుటకన్నను చంద్రుడు శిఖరాళి తాకుటకన్నను, చంద్రుడు ప్రతిష్ఠానపుర హర్మ్యములందలి

1. వసుచరిత్ర. ఆశ్వా. 1-49
2. విజయవిలాసము. ఆశ్వా. 1-72

యద్ధములందు తన ప్రతిబింబమును గని అందలి పూబోడుల ముఖ సౌందర్యమును దర్శించి సిగ్గిల్లి కార్శ్యమునందె ననుట, మిగుల రమ్యమై యున్నది. శిఖరాళి దాకి సుధారసము చిందుటచే, పదార్వన్నె పసిండి మేడలకు సౌధనామము గల్గినదని విజయవిలాస కర్త వర్ణింపగా, దానిని-మించి వర్ణింప నెంచి అబ్బయామాత్యుడు చేసిన కల్పనము కనుడు.

"అల మృగాంకునికి వాతాయ నాంతరములఁ
దూఱి పోవుచుఁ జరియించు కారణమున
లీలఁ బుర హర్మ్యములు చంద్రశాలలయ్యెఁ
దత్సుధాసేచనమున సౌధంబు లయ్యె" 1_82

సౌధము లగుటతోపాటు హర్మ్యములు చంద్రశాలలైనవని మఱియొక విశేషమును జోడించి, తన వర్ణన పైచిత్రిని నెరపినాడు.

## 2. ఋతు వర్ణనము :

వసంతము :

"అంత నతాంత నితాంత ల
తాంత వసాంత ర్నిశాంత హరి వంత సమా
క్రాంత రవ కాంత ముదితా
నంత శకుంతము వసంత మాగత మయ్యెన్" 5_35

వసుచరిత్రకారుడు ప్రసిద్ధమైన "లలనాజనాపాంగ........"[1], ఇత్యాది పద్యమున వసంతమును వర్ణించుచు, "అతికాంత సలతాంత లతికాంతర నితాంత రతికాంతరణ తాంత సుతనుకాంతము" అని ఒక పాదమే బిందుపూర్వక తకారముతో కూర్పగా, అబ్బయామాత్యుడది నచ్చి కవిరాజులు మెచ్చునట్లు పై కంద పద్యమునందంతటను

1. వసుచరిత్రము : ఆశ్వా. 1_126

మచ్చముడింగి యింటిపని నుమ్మర మెల్లను దీర్చి ప్రక్కకున్
వచ్చిన ప్రోడయాంధ్ర కురుపంపుడు బల్చనుకొండలూన టొ
మ్మిచ్చి కవుంగలించి సుఖియించిరి ప్రౌఢగృహస్థు లజ్జడిన్" 4–29

శ్రీకృష్ణదేవరాయల "ఆముక్తమాల్యద" లో నిట్టిదే యొక పద్యము గలదు. పరిశీలింపుడు.

"గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముంగూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావి కుట్టారు గో
గిరిము ల్మెక్కి, తమిం బసు లొల్పము వోఁ గ్రేపు ల్మెయి న్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్" [1]

రాయలు వర్ణించిన తీరు రసరమ్యమైనదే. రెడ్లజ్జడిన్ ప్రభుత్వైకాప్తి కుంపటి మంచమెక్కిన తీరు సహజముగనుండి వర్ణన కెక్కినది. అబ్బయామాత్యుని వర్ణనము మరియొక్క మెట్టెక్కినది. ప్రౌఢగృహస్థులజ్జడిన్, మంచమెక్కిరో లేదో తెలియదు గాని ప్రక్కకున్ వచ్చిన (తమ సాన్నిధ్యమునకు వచ్చిన/తమ పడకను చేరిన) ప్రోడయాంధ్రను కవుంగలించి సుఖియించిరనుట విశేషము. పురుషులను "ప్రౌఢగృహస్థులు" అని సంస్కృత శబ్దముచే వర్ణించి, స్త్రీలను ప్రోడయాంధ్ర" అని వైకృతమున వర్ణించుటచేత సంస్కృతమునకన్న, వైకృత మైన యాంధ్రము సుందరమని సూచించినట్లయినది. రాయలు రెడ్ల ప్రభుత్వై కాప్తిని వర్ణించుటకు మత్తేభముగైకొనగా, అబ్బయామాత్యుడు శృంగారరసా నుగుణమైన యుత్పలమాలను గైకొనుటయు నౌచిత్యతా విలసనమే. రాయల వర్ణనలో లేని ప్రియాసంగమ విషయము, అబ్బయామాత్యుని వర్ణనలో నధిక మగుటచేత కాబోలు పద్యము పంచపాదియై తన యాధిక్యమును చాటుచున్నది. పంచబాణ విలసనమునకు పంచపాది కావలయునని కవి తలంచెనేమో తెలియదు.

అబ్బయామాత్యుడితర కవుల ననుసరించినప్పటి కన్న, స్వతంత్రించి వర్ణించిన చోటులందే రమ్యతరముగ కవిత్వము నల్లియుండుట గమనింపవచ్చును.

---

1. ఆముక్తమాల్యద : ఆశ్వా : 4–134.

భంగ్యంతరముగ వర్షర్తువును వర్ణించుచు మరొక చోట చెప్పిన పద్యము గనుడు పురూరవుని కడకు నారద మహర్షి రాకను వర్ణించుచు

"స్వాంతములు పల్లవించెను సత్కదంబ
ములకుఁ బంకజాతమ్ముల పొంక మెడలె
భువనము శుభోదయస్ఫూర్తిఁ బొలుపు మిగిలె
నారదాగమమున కది నైజమ కద" 1_107

నారద మహర్షి రాగా విద్వాంసులకు హృదయములు పల్లవించినవి. (పంకజాతమ్ములు) నీచ జన్మ గలవారి పొంక మెడలినది. ఈ జగము (భువనము) పొలుపు మిగిలినది. ఇది ప్రస్తుతాంశము. ఇక వర్షర్తు వర్ణనము అప్రస్తుతము. వర్షర్తువురాగా, కడిమి చెట్లకు (సత్కదంబములకు) హృదయములు పల్లవించినవి. పద్మముల (పంకజాతమ్ముల) పొంక మెడలినది. జలము (భువనము) శుభోదయ స్ఫూర్తి పొలుపు మిగిలినది. ఇట శ్లేష చేత వర్షర్తువును వర్ణించుట యొక విశేషము. వర్షములు కురిసినగాని కర్షకులు బీజములు విత్తి, క్రమముగ పెంచి కాలాంతరమున ఫలమును (పంటను) గైకొందురు. అట్లే జ్ఞాన బీజముల నాటుటకు నారదుడు (నార=జ్ఞానమును, ద=ఇచ్చువాడు) భూలోకమునకు రాగా సజ్జనులైన పండితు లానందించిరి. నీచులు డీలు పడిరి. జగము శుభోదయ స్ఫూర్తి వహించినది. వర్షాగమము సస్యముల వృద్ధి కెట్లో నారదాగమనము సుజ్ఞాన వ్యాప్తి వికాసముల కట్టిదని సూచింపబడినది. ఇట్లీ వర్ణనము నందలి వర్షోపమానము పై చూపునకు అప్రస్తుతమై అలంకారప్రాయముగ తోచినను, లోతుగ పరిశీలించినప్పుడు అబ్బయామాత్యుని వ్యంగ్యచాతురికి నిదర్శనముగా నిలిచినది. లోక కల్యాణార్థమై ఆకాశము నుండి నారదుడు (జలదుడు/జ్ఞానదుడు) వచ్చుట యేరికి హర్షదాయకము కాదు? అబ్బయామాత్యుడు పదహాఱు గద్య పద్యాలలో వర్షర్తువును వర్ణించినాడు.[1]

హేమంతము :

"చలికి వెగడొంది మేరువు చాటుఁ జొచ్చి
యెట్టకేలఁకు గాని రాఁ డినుఁడు వెడలి

1. కవిరాజమనోరంజనము : ఆశ్వా. 4_21 నుండి 38.

పెడలి పరువెత్తి యపరాద్రి వెనుక కేగు
నితర జనముల శీతార్తి యెన్న నేల" 4_138.

చలికి బెదిరి సూర్యుడు త్వరగా నుదయింపడు. అంతేకాదు పగటి వేళ త్వరపడి అపరాద్రి జేరుటకు ప్రయత్నించును. ఇది చక్కని యుత్ప్రేక్ష. శీతాకాలమున రాత్రి యెక్కువ. అందుచే సూర్యు డాలస్యముగ నుదయించును. పగలు తక్కువ. అందుచే త్వరగా సూర్యు డస్తమించుటయు కలుగును. సహజమైన యీ ఋతు ధర్మమును కవి చలికి సూర్యుడు బెదరినాడన్న యుత్ప్రేక్షతో రమ్యతరముగ చిత్రించి, ఇతర జనుల శీతార్తి యెన్న నేలయని, హేమంత ప్రభావమును ఐదు పద్యములలో వర్ణించినాడు. [1]

శి శి ర ము :

ఇతర కవుల ననుసరింపక స్వతంత్రముగ వర్ణించిన సుందర ఘట్టము మరి యొకటి.

"వర తుహినబిందు సాంద్రో
దరము లగుచు నాగవల్లి దళములు దనరున్
సురతాంత శ్రమ జలకణ
భరిత శ్యామా కపోల ఫలకాభములై" 4_143

తుహినబిందువుల తోడి నాగవల్లి దళములు సురతాంతశ్రమజల కణాళితోడి శ్యామా కపోల ఫలకములను పోలియున్నవని తెలుపుటలోని రసికత యెంతటిదో గదా! ప్రకృతి పరిశీలనము, పరవశీకరణము రెండును కవికి సహజ సామర్థ్యములై యున్నవి. ఐదు పద్యములలో శిశిరము వర్ణింపబడినది. [2]

వ స న్త ము :

శరదృతువును గూర్చి అబ్బయామాత్యుడు రచించిన వచనము (4_81) శరదృతువు వర్ణనములకెల్ల మేల్బంతి. అంతియేగాదు అందలి ఉపమా తోరణము,

---

1. కవిరాజమనోరంజనము : ఆశ్వా. 4_135 నుండి 139.
2. " " " 4_141 నుండి 145.

కవిజన మనోహరణము. శరత్తు అనగానే కవికి శరన్నవరాత్రులు గుర్తుకు వచ్చినవి కాబోలు చక్కని పద్యమొకటి రచించి యున్నాడు.

"భేరీ శంఖ మృదంగ కాహళరవోపేతంబులై ధూప ధూ
మారబ్ధోరుసుగంధబంధురములై యత్రాంత నైవేద్య వి
స్తారోదారములై ప్రదీపకళికా సాంద్రంబులై దేవతా
గారంబుల్ నవరాత్రులం దనరె విఖ్యాతిన్ శరద్వేళలన్" 4_57

ఈ శరద్వర్ణనము ఐదు గద్య పద్యాలలో వర్ణింపబడినది.[1]

## 3. ప్రయాణము:

పురూరవుడు జైత్రయాత్రకు బయలుదేరిన తీరును కవి వర్ణించిన విధము మహోద్ధతమై కడు రమ్యముగ నున్నది.

"అ సన్నాహము చూడ నొప్పెఁ బ్రకటాహంకార ఘోర ద్విష
త్త్రాసోత్పాదక పాంచధార విచల త్కాంభాణ సంఘాత రిం
ఖా సంఘట్టిత గహ్వరీ జనిత రంగ ద్ధూళీ పాళి చ్ఛలో
ద్యాసాధీశ మహనుహోదహన ఖుంభ ద్ధూమరేఖాంకమై" 3_15

"అ మ్మహీశ్వరు విజయయాత్రాధ్వసీమ
నవని చతురంగ పదహతి నవని యయ్యె
రణిత భేరీ ధణం ధణం ధణ రవంబు
వినిన యంతనె విమతులు విమతు లైరి" 3_16

జైత్రయాత్రా సన్నాహము మహోద్ధతమని సూచించుటకు ప్రయోగించిన దీర్ఘ సమాస జటిలమైన శైలిని గమనింపదగును. అవని అవనియైనదనియు, విమతులు విమతులైరనియు శ్లేష వైభవముచే యాత్ర విజయ విధానమని సూచించుట జరిగినది. ఓజోగుణ ప్రధానమై సైన్యసన్నాహ సంరంభమును వర్ణించుటలో రసౌచిత్యమును సాధించుట జరిగినది.

---

1. కవిరాజమనోరంజనము : ఆశ్వా. 4_57 నుండి 61

## 4. వేట:

ఆంధ్రకవితాపితామహుడు తన ప్రబంధమున మృగయా వినోదము వర్ణించుటచే నదియునొక విధిగా ప్రబంధములందు వర్ణింపబడుచు వచ్చినది. రాజులకు వేట ముఖ్యధర్మము కనుక దాని వర్ణించుటయు ప్రబంధ సహజమైనది.

అబ్బయామాత్యుడు కూడ తనకావ్యమునందు మృగయా వినోదమును విపులముగ వర్ణించి యున్నాడు. ఇలాకన్య పురుషుడిగా మారి సుద్యుమ్న నామధేయుడై, రాజధర్మ పరిపాటి నొకనాడు వేటకు వెడలినాడు. ఇరువది నాలుగు పద్యములలో సాగిన మృగయా వినోద వర్ణనము కడురమ్యము. వేటకు బయలుదేరు సన్నాహము, వేటకుక్కల భయంకర స్వరూపము, వానికి పెట్టిన పేర్లు, పందివేట, పులివేట, ఏనుగువేట, మొదలగు బహువిధ జంతువులను వేటాడినతీరు స్వభావోక్తి రమ్యముగ వర్ణించబడినది. ఆవేట యెంత యుద్ధతమో తెలుపుట కీ క్రింది పద్యము చాలును.

"ఖర ధారా శర భగ్న సింహ శర భోగ్ర వ్యాఘ్ర కీలాల పీ
తరజఃపుంజ వనావలిన్ శబలి తోద్యద్భద్రదంతావళో
త్కర కుంభోదయ మౌక్తికావళుల రంగ ద్రంగవల్ల్యాకృతిం
గర మొప్పన్ మృగయావినోదపరుఁడై గాంధర్వయానోద్ధతిన్" 2-102

## 5. శైలము:

శైలవర్ణనము సైతమీ కావ్యమున చోటు చేసుకొనినది. అంతేకాదది బంగారుకొండను గూర్చిన వర్ణన మగుట మరియు శ్రేష్ఠము.

"అమరులకెల్ల నిల్లు త్రిపురాంతకుచే విలుసిల్లు విల్లు లో
కములకుఁ బట్టుగొమ్మ మణి కాంచన సంపద తావలమ్ము గ్రా
వములకుఁ జక్రవర్తి భగవత్కృశయై తగు పుణ్యమూర్తి యీ
సముచిత వర్ణనీయగుణ చారుప్రమేరు వటంచు నెంచుచున్" 2-105

ఇల్లు, విలసిల్లు పిల్లు, పట్టుగొమ్మ, తావలమ్ము, చక్రవర్తి పుణ్యమూర్తి, గుణ చారువు, మేరువు శబ్దముల పొందిక, ధారాశుద్ధి, ప్రసాదగుణభరితమైన వర్ణనము సమధిక వర్ణనీయమనుట కన్న నింక నేమని చెప్పగలము.

## 6. సాగరము:

ఈ కవి బహువిధ వర్ణనల నొనర్చినను సాగర వర్ణనము చేయకుండుట చిత్రముగా నున్నది.

## 7 మౌనీంద్ర పుణ్యాశ్రమము:

మిత్రావరుణుల తపస్సును వర్ణించు సందర్భమున అబ్బయామాత్యుడు మునులపై గురిపిన వర్షభవనీర వర్ణనము మిగుల చమత్కారావహముగ నున్నది. ఆశ్రమ వర్ణనమునకన్న, కవి తపోవర్ణనమునకే ప్రాధాన్యమిచ్చినట్లు కనిపించును.

“తత జటామండ లాంతస్సీమ నిండుచో
భాగీరథీజూటుఁ బ్రమథనాథుఁ
గండభాగంబులఁ గాల్వలై పాఱుచో
దానధారాకటోత్కట గజంబు
దివ్యవిగ్రహముల దిగఁజాఱు చోట
నిర్ఝర సానుపైన గోత్రాధరంబుఁ
జరణాంబుజంబులఁ బొరయుచో వియదాప
గా ప్రసూపదుఁ ద్రివిక్రమ సమాఖ్యుఁ

బోల్పఁ దగి రమ్మహామునుల్ భూరి జలద
భవ నిరర్గళ ధారాళ బహుళ వృష్టి
జలముచేతఁ దద్వార్షిక సమయమునను
వారి మహిమాతిశయ మనిర్వాచ్య మిరయ” 4_33

“వారి మహిమాతిశయమనిర్వాచ్య” మని చమత్కారముగ పలికిన తీరు గమనార్హము. మహామునుల మహిమాతిశయమును పొగడుట యొకటి వారా వర్షావేశమూడ తపము

మానలేదని వారి తపోనిష్ఠను ప్రశంసించుటయైనది. ఇక వారికి పైన చెప్పిన యుపమానముల చేత, ప్రమథనాథత్వము, గజత్వము, గోత్రాధరత్వము, త్రివిక్రమత్వము సిద్ధించినది. ఇది వారి మహిమ అనగా జలమహిమ యని రెండవ విధము. ఆ జలమట్లు వర్షించు సందర్భములందు మునుల అంగాంగముల యందు నిలుచుటచేత వారి కా మహత్వసిద్ధి కలిగినదని సూచన. ఇట్టి వర్ణనము కడు రమ్యమై మిత్రావరుణుల తపోమహిమను వర్షభవనీర మహిమను, కవికిగల వర్ణన మహిమను చాటుచున్నది.

# 8 మంత్రము:

పురూరవుడు కొలువు దీటిన వైభవమును వర్ణించుచు కవి చెప్పిన పద్యము గనుడు.

"సత్త్వసంగంబు దనర నార్జవము గలిగి
కడఁగి తగు చోటులను గురు కవి బుధాదు
లుండ సింహాసనస్థుఁడై యుండె నినుఁడు
ధారణీప్రజ కానందకారి యగుచు" 1_102

విద్వాంసులతో ప్రసంగించుట, అర్జవము కలిగియుండుట, తగుచోట్ల గురువులు, కివులు, బుధులు (పండితులు) ఉండగా పురూరవుడు (ఇనుడు = రాజు) ధారణీ ప్రజ కానందకారియై సింహాసనస్థుడై యున్నాడని వర్ణనము. రాజున కుండ వలసిన సద్గుణములన్నియు మూటగట్టివట్లున్నవి. మఱియు నొక విశేషమున్నది. పురూరవుడు రాజ్యాభిషిక్తుడైన సుముహూర్త ప్రాశస్త్యమును కవి అర్థాంతరముచే ధ్వనింపజేయుచున్నాడు. ఇనుడు (సూర్యుడు) సింహాసనస్థుడు (సింహరాశియందుండగా, అనగా స్వరాశియందుండగా) గురు (బృహస్పతి) కవి (శుక్రుడు) బుధుడు (బుధగ్రహము) తగుచోట్ల (శుభస్థానముల) నుండిరి. సత్త్వసంగము (నక్షత్ర సంబంధము చేత నాకాశము సూచితము) ఆకాశమునందు దాయా ముఖ్య గ్రహములు శుభస్థానము లందుండగా, సింహాసనస్థుడైన ప్రభువు, సద్గుణశీలియై

ధారుణీప్రజ కానందము కలిగించగలడని భావము. ఆయా గ్రహము లాకాశమునందు శుభస్థితి నొందినచో భూమి యందలి ప్రజలకు సకలవిధ శ్రేయములు కలుగ గలవని జ్యోతిషశాస్త్రము. కవి తనదైన శబ్దప్రయోగమార్మికత చేత, అటు పురూరవుని సత్ప్రభుత్వ లక్షణములను తెలుపుచునే, మరియొక వంక తనకుగల జ్యోతిష శాస్త్ర పరిజ్ఞానముచే, నా ముహూర్తము శుభప్రదమని సూచించుచున్నాడు. ఇట్టి వర్ణనము మరే ప్రబంధమున గనజాలము. ఇట్లు వర్ణించి యా రాజు గురు కవి బుధులతో సత్ప్రసంగము చేసెడివాడని చెప్పుటచే నతడు మంత్రము నిర్వహించు తీరు బహుధా ప్రశంసనీయమైనదని తోచును.

ద్వాదశీ తిథిని తైలముతో తలయంటుకొని స్నానము చేయుట పాపమని తెలిసి దానిని బాపికొనుట కాతడు ఆప్తులగు బ్రాహ్మణ ముఖ్యులను సంప్రదించెను మాఘస్నానము దానికి నివారణోపాయమని వారు సూచించిరి. ఇదియు నతని మంత్రాలోచన తత్పరతను తెలుపుచున్నది. రాజైనవాడు ధర్మము నాచరించుట కర్తవ్యము గదా! అతడే నియమ హీనుడైనచో ప్రజకు క్షేమము కాదు. కనుక తన యందలి దోష నివృత్తికై మార్గము తెలిసికొని దాని నాచరించినాడు.

విచిత్ర వనవృత్తాంతమును తెలుపుటకు చారులు వచ్చిన సందర్భమున కొలువున్న పురూరవుని వర్ణించిన తీరు గనుడు.

"ఒకనాఁ డా నృపశేఖరుండు తపనీయోద్యత్సభామండపా
ధికశోభామణిభద్రపీఠమున నుద్దీప్తిన్ సుఖాసీనుఁడై
సకలామాత్య సుహృత్పురోహిత వయస్య ప్రౌఢవిద్వత్కవీం
ద్ర కళావద్వనితాద్యనేక పరివారస్ఫూర్తి వర్తిల్లగన్" 5–49

పేరోలగమన్న నిట్లుండవలయును. అందమాత్యులతోపాటు మిత్రులు, పురోహితులు, చెలికాండ్రు, ప్రౌఢులైన విద్వత్కవులు, వేశ్యలు, అనేకులు పరివార ముండిరి. ఇట్టి సభ నుండగా చారులు వచ్చి, విచిత్ర వనవృత్తాంతమును తెలుపగా ప్రభువు మంత్రాలోచనము చేసినట్లు వర్ణింపబడినది. ఈ వర్ణనము పురూరవుని మంత్రాలోచన రీతిని విశదపరచుచున్నది.

## 9. అద్భుత రణము :

పురూరవుడు రాజ్యాభిషిక్తుడైన పిదప జైత్రయాత్రకై బయలుదేరి వివిధ రాజ్యాధీశుల జయించిన విధమును కవి ఘనముగ ఇరువది గద్య పద్యములలో వర్ణించి యున్నాడు. చమత్కృతిలేని పద్య మొక్కటియు గానరాదు. రణానంతర స్థితిని వర్ణించు పద్యము గనుఁడు.

> "భంగముఁ జెంది సింధుపతి పాఱె నుతించెను మాగధుండు కా
> ళింగుఁడు మానమెల్ల వదలెన్ వనవాసము చేసె మత్స్యుఁ డా
> త్మాంగ బలంబు లేమి బెగడందె విదేహుఁడు కుంతలుండు దా
> నింగిత మెంచి చిక్కువడియెన్ నరనాయకు మేటిధాటికిన్ " 3_18

పురూరవుని దాటి కాగజాలక రాజులెల్ల కకావికలై యోడిరనుట, అతని అద్భుత రణపాండితికి చిహ్నము. కాగా శబ్దచమత్కృతిచే కవి సాధించిన విశేషము ప్రస్తుతింపఁదగి యున్నది. సింధుపతి పాఱెను (సింధువునదికడా పాఱుట సహజము.) మాగధుడు (మగధదేశాధీశుడు/స్తోత్ర పాఠకుడు) నుతించెను. కాళింగుడు (కళింగదేశాధీశుడు/శ్రీకృష్ణునిచే పరాభవింపబడిన కళింగనాగుడు) మానమెల్ల వదలెను. మత్స్యుడు (మత్స్యదేశాధీశుడు/చేప) వనవాసము చేసెను. (అడవిదాగుట/నీటనుండుట) విదేహుడు (విదేహదేశాధీశుడు/మన్మథుడు) ఆత్మాంగబలము (సైన్యము/శరీరబలము) లేమి బెగడందెను. కుంతకుడు (కుంతల దేశాధీశుడు/తలవెంట్రుకలు) చిక్కువడియెను. ఇట్లీ వర్ణనము శ్లేషచేత విశిష్టార్థద్యోతకమై వారట్లు భంగపడుట సహజమే యనిపించును. పురూరవుని బలపరాక్రమము లట్టివిపరి.

## 10. విజయము :

పురూరవుడు సప్తద్వీపములను జయించి తనకు సాటి మరియొకరు లేరను ప్రశస్తిని పొందినాడు. ఆతనికి విశ్వఖ్యాతి గలిగినది.

> "చక్రాకార ధరాధరేంద్రము జయస్తంభాకృతిం బొల్చె ది
> క్చక్రాంతస్థలిఁ దన్నృపాలక జగచ్ఛాఖ శ్శతాంగ స్ఫుర

చ్చక్రానాహత సంభ్రమ భ్రమణ చంచ ద్ధాటికావ్యాప్త భూ
చక్రావ ధ్యపసూచకం బగుచు విశ్వఖ్యాతి సంధిల్లఁగన్" 3_35.

## 11. వ న వి హా ర ము :

పురూరవునిపై విరాళిగొన్న యూర్వశి విరహతాపమును భరింపజాలక నలతి పాదుకలు తొడిగి వనమునకేగినది. అచట చెలులు బహువిధ శైత్యోపచారములు చేసిరని కవి విపులముగా నా లలనామణి వన విహారమును పదిహేను గద్య పద్యములలో వర్ణించినాడు. మన్మథోపాలంభన, చంద్రోపాలంభన, మలయాని లోపాలంభన, కోకిలా ద్యుపాలంభనములు చేయబడినవి.

పై ఘట్టమునంచంతంగా వన విహరము వర్ణింపబడలేదు. కాని తరువాత, మిత్రావరుణుల తపోభంగ మొనర్చుటకై ఇంద్రునిచే ప్రేరితయై యూర్వశి, ఆ ఋష్యాశ్రమ వన ప్రాంతమున విహరించిన తీరు కడు రమ్యముగ వర్ణించ బడినది. ఆ విహరమును పదిహేను గద్య పద్యములలో కవి రసవత్తరముగ వర్ణించి యున్నాడు. అందలి తీగెయూయలల నూగెడు ఘట్టము ప్రత్యేకముగ చెప్పదగినది.

"అరవిందాక్షులు దీఁగయుయ్యలలల నొయ్యారంబుగా నూఁగఁజొ
చ్చిరి పాదాబ్జము లవ్వనీకిసలయశ్రేణిం దల ల్దన్న సుం
దర శోభా నఖపఙ్క్తి చుక్కగమిపై దండెత్త మంజీర పుం
జ రవం బభ్రధునీ మరాళముల వాక్స్తంభంబు గావింపఁగన్" 4_77.

తీగె యుయ్యలల నూగెడి యరవిందాక్షుల పాదాబ్జములు, అవ్వనీకిసలయశ్రేణిని తలదన్నుచున్నవి. ఊఁగినప్పుడు పైకి సాగుటచే నట్లున్నవనుట యొకవిధము. వానికన్న మృదువులు, రాగరంజితములునని విశేషార్థము. వారి పాదనఖపంక్తి ఆకాశమునందలి చుక్కల గుంపపైదండెత్తినవి. అనగా ధావళ్యరేఖచే వానిని జయింపగలవని ధీమా గలవి. వారి పాదములందలి మంజీరరవంబు, ఆకాశగంగ యందు తిరుగాడు మరాళములకు వాక్స్తంభము కావించినవట. మంజీరధ్వని హంసధ్వనికన్న శ్రవణపేయముగ నుండుటచే, మరాళములు సిగ్గిల్లి కూయుటమాను

కొన్నవని విశేషార్థము. ఈ వర్ణనము కళాపూర్ణోదయమునందలి సూరన్న వర్ణనను మించవలయునని చేసినది. మణికంధరుడు కలభాషిణి దోలావిహారమును వర్ణించిన విధము గనుడు.

"తమిఁ బూదీగెలఁ దూగుటుయ్యెలల బంతాలాడుచుం దూగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్ చక్కగా జాఁగి మిం
టిమొగంబై చనుదెంచి కీవిఁ గనుగొం టే దివ్యమౌనీంద్ర నా
కమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్ సాఁచులా గొప్పెడున్"[1]

నాకమృగీనేత్రలపైకి కాల్ సాఁచు టొక్కటే విశేషము కాగా అబ్బయామాత్యుడు తన వర్ణనమునందు మూడు విశేషములు సాధించి మించినా డనిపించును.

## 12 వారికేళి :

మిత్రావరుణుల తపోభంగమొనర్చుటకై భువికి దిగి వచ్చిన వేల్పు వెలయాంధ్ర జలకేళిని కవి ఇరువది గద్య పద్యములలో మనోహరముగ వర్ణించియున్నాడు. సరోవర వర్ణనమే సరస జన మనోహరముగ నున్నది.

"సరసాతిశయ సార సరసామభవధీర
తరసారఝుంకార కరమదాళి
కలనాదకృత తాళకలనాయుత మరాళ
లలనా పురుషజాల లలితకేళి
రటదాగమాభంగ వట దాతత తరంగ
ఘటదాకృతి రథాంగ పటలశాలి
పవనార్భక వినోద జవనాట్యకృ న్మోద
భువనాద్భు తామోద కువలయాళి

ప్రకట నికట తట స్ఫుట పటు పటీర
విటపి పరిమళ మిళిత నవీనమృదుల

1. కళాపూర్ణోదయము. 1-43.

జలకేళికా తరు విగళిత కలిత శిశిర
జఃపులినపాళి యొక్క కాసారమాళి" 4_85

జలకేళికై యొక కాసారమాళినే సృష్టించినాడు అబ్బయామాత్యుడు. ఇది వసు చరిత్రలోని ప్రసిద్ధవర్ణనముతోఁ బోలియున్నది కనుడు.

"లలనా జనాపాంగ వలనా వసదనంగ
తులనాభికా భంగ దోఃప్రసంగ
మలసానిల విలోల దళసాస వరసాల
ఫలసాదర శుకాల పన విశాల
మలినీ గరు దనీక మలినీ కృతధునీ క
మలినీ సుఖితకోక కులవధూక
మతికాంత సలతాంత లతికాంతర నితాంత
రతికాంత రణతాంత సుతను కాంత

మకృత కామోద కురవికా వికల వకుల
ముకుల సకల వసాంత ప్రమోద చలిత
కలిత కలకంఠ కులకంఠ కాఃకలీ వి
భాసురము వొల్చు మధుమాస వాసరంబు" వసుచరిత్ర. 1_126

పై రెండింటియందు సంగీతశాస్త్ర పాండిత్యము కొట్టవచ్చినట్లు కనిపించుచున్నది. వసువు ననుసరించుట అబ్బయకు మిగుల ఇష్టము. జలకేళిఁ దేలియాడిన యచ్చర లేమల, తడిసిన వల్వలతోఁ జూచి కవి వర్ణించిన తీరు గనుడు.

"తడిసిన వల్వెపయ్యెదలు దాకొని పైపయి నంటి యుండగా
నుడువ నగోచరం బగు వినూత్న విలాసత నొప్పె నప్పుడ
ప్పడఁతుల గుబ్బచన్గవలు ప్రౌఢ కవీంద్రులచే రచింపఁగా
బడు మృదు గూఢ పాకరస బంధుర కావ్యవచ స్సమంబులై" 4_102

పడతులగుబ్బ చన్గవల నూత్న విలాసమును వర్ణించిన తీరు కడురమ్యమే కాదు నాన్యతో దర్శనీయము. అవి ప్రౌఢ కవీంద్రుల మృదుగూఢ పాకరసబంధుర కావ్య

వచస్సమములని చెప్పుటఁజూడ కవిత్వమన్న నిట్లుండవలయు నన్నట్లు సూచించిన విధము తోచెడిని.



"ఘనతర ఘూర్జరీకుచయుగ క్రియ గూఢము గాక ద్రావిడీ
స్తనగతి తేటగాక నరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవరీతి గూఢతయు చాటుదనంబును దోపనీక చె
ప్పిన యదిపో కవిత్వమనిపించు నగిం చటుగాక యుండినన్"



అని పెద్దనగారు చెప్పిరని చాటువు కలదు. బహుశః అబ్బయ దానికి మెఱుగులు దిద్దుచు, తానొక పద్యము నిటగూర్చెనేమో యనిపించును. ఈ రెండింటియందును చన్నవకు, కవిత్వమునకు పోలిక యున్నది. గూఢము, తేటయని యొకరు వ్రాయగా మరియొకరు "మృదుగూఢ పాకరస బంధురమ" ని రెండిండిని కలిపి చెప్పి మెఱుగులు దిద్దునట్లు తోచును. ఆర్ద్రవస్త్రలైన పడతుల గుబ్బ చన్నవలు గనిపించినంతనే అబ్బయామాత్యుడు పూర్వ చాటువును మనస్సునం దిడుకొని దీనినిట్లు రమ్యతరముగ గూర్చె ననిపించును.

## 13 కన్యాంగ సౌందర్య కథనము :



కన్యాంగ సౌందర్య కథనము కావ్యమునం దచ్చటచ్చట పలుమారులు కలవు. మచ్చున కొకటి రెండు పరిశీలింతును.

"తెలుప నీవు కటాక్షదృష్టిఁ జూచినఁ గాము
కాండముల్ తృణమునఁ గట్టరాదె
నాతి నీ వించుక నవ్వినఁ బూర్వచం
ద్రికల జాడ్యంబు నొందింపరాదె
భామ నీవుఁ బ్రియోక్తిఁ బలికినఁ జిలుకలఁ
బట్టి బందిగములఁ బెట్టరాదె
లోలాక్షి నీవు కెంగేలుపైఁ జేర్చినఁ
జిగురాకులఁ జలింపఁ జేయరాదె

లేమ నీ దయ నా మీఁద లేమి నింత
వెతల పాల్పడవలసెను వీనిచేతఁ
గాక నీ ప్రాపు గలిగినఁ గడఁగి వీనిఁ
బట్టి పల్లార్తుఁ గాదె నీ పాదమాన" 2_157

కాముకాండములు (పూవులు) తృణమున గట్టబడుట, పూర్వ చంద్రికలు (అమావాస్య వెడలిన వెంటనే వచ్చెడి లేత వెన్నెలలు) జాడ్యంబు నొందుట, చిలుకల, బట్టి బందిగముల (పంజరముల) బెట్టుట, చిగురాకులు (అల్లలనాదుటచేత) చలింపఁజేయుట, లోకమున సహజములైన విషయములే వానిని చమత్కరించి, అవి వియోగవేళ తన్ను బాధించుచున్నవని, బుధుడు తమకమునఁదన ప్రేయసితో వాపోయినాడు. ప్రేయసి ప్రాపుగలిగినచో నిక వానిని పట్టి పల్లార్తునను చున్నాడు. ఏలనన యామె సౌందర్య విశేషమట్టిది. సహజములైన వానిని చమత్కరించి విశేషములుగా భాసింపఁజేయు కవి సామర్థ్యము ప్రశంసనీయము.

"కొమ్మ చేతులు చూచి కుత్తుకబంటితో
నున్నది గాదె పయోజ వనము
విమలాంగి మాటలు విని పండ్లు గొఱుకుచు
నున్నదిగాదె కీరోత్కరంబు
వనిత చూపు దలంచి పైషమ్యగతి నున్న
యదిగాదె మదన సాయక సమాజ
మతివ యానము గాంచి యప్రియస్థితి నున్న
యదిగాదె మఱి రాజహంస కులము

చలము సాధింప నిప్పుడే సమయ మనుచు
విప్రలంభ భరంబున విహ్వలించు
వెలది నలయించుచున్నది విషమసంధిఁ
గీడొనర్చుట హీనుల జాడగాదె" 3_93

కుత్తుకబంటి, పండ్లుకొఱుకు పైషమ్య గతినుండి, అప్రియస్థితినుండు నను పద బంధములను ప్రయోగించి కవి సాధించిన చమత్కృతి విశిష్టమైనది. ఇట్టి ప్రతిభ

విజయ విలాస కర్త యందు గానిపించును.

"శిపుడిటు రమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి తుగ్రపై
భవమునఁ జూచుచో నడుగు వట్టితి." [1]

అని చంద్రుని, సుభద్ర చెలు లుపాలంభించిన సందర్భమున వేంకటకవి. తల కెక్కు అను తలపైనెక్కు, మిగుల గర్వించునను రెండర్థములతోఁ బ్రయోగించి యున్నాడు. అట్లే "కాము తూపులు వెంట్రుకఁ గట్టబడును." [2] అని మన్మథ బాణ ములను తిరస్కరించు సందర్భమున వెంట్రుకఁ గట్టబడుట (తలలోఁ దురుమబడుట) సులభముగా కట్టివేయ వచ్చునను రెండర్థములలోఁ బ్రయోగించుట జరిగినది. ఇది గమనించియే సందర్భము వచ్చినప్పుడు నాల్గు పదబంధములను విశిష్టార్థమున ప్రయోగించి తన రచనా చమత్కృతిని చాటుకొన్నాడు.

## 14. హి మ క రా భ్యు ద య ము :

ప్రబంధములందు చంద్రోదయమును వర్ణింపని కవి కానరాడు.

"చలువ వెలుంగు వేల్పుల రసాయనపుం దొన పాలవెల్లిలో
మొలచిన ముద్దు పావఁడు కుముద్వతి వేడుకకాఁడు తమ్మిలోఁ
గిలిగల చంద్రబింబముఖికిన్ నయిదోడు చకోరభోజనం
బుల నెలదాత చందురుఁడు పూర్వదిశాస్థలి నొప్పె నయ్యెడన్" 5-180

"అంత కంతకు రాగంబు నపనయించి
శుచి వహించి నత్సంగతి సొంపు గాంచి
విష్ణుపద మాశ్రయించి యా ద్విజవిభుండు
సుగతి గైకొని జగములు పొగడఁ దనరె" 5-181

మొదటి పద్యమునందు కవి అలతి యలతి యచ్చ తెలుగు పదములను, సంస్కృత పదములను గూర్చి ప్రసన్న సుందరముగ చంద్రోదయమును వర్ణించి

---

1. విజయవిలాసము : 3-51.
2. " " 3-67.

యున్నాడు. రెండవ పద్యమందలి వర్ణనము "నభూతో నభవిష్యతి" యనఁదగి యున్నది. చంద్రుడప్పుడే తూర్పున నుదయించినాడు. క్రమముగా రాగము నవన యించినాడు. (ఎఱుపు దనమును వీడుట / మమకారమును వీడుట) శుచి వహించి నాడు (తెల్లదనము గనుట / పవిత్రత గనుట) సత్సంగతి (నక్షత్రయుతి నొందుట సజ్జనమైత్రి నొందుట) పొంపుగాంచినాడు. విష్ణుపద మాశ్రయించినాడు. (ఆకాశము నంటుట / విష్ణుపాదము లేక వైకుంఠప్రాప్తి నందుట) ఆ ద్విజ విభుండు (చంద్రుడు / బ్రాహ్మణుడు) సుగతి గైకొనె (మంచి నడకను పొందెను / మోక్షము నందెను) చంద్రోదయ మేడ? మోక్ష పదవి గను టేడ? రెంటికిని తనదైన వాగ్వైభవము చే, శ్లేష చమత్కృతిచే అబ్బయామాత్యుడు రసవత్తర మైన సంయోజన మొనర్చినాడు. ఇది చంద్ర కళాయోగము. తాను ధన్యుడై నాడు తెలుగు లోకమును ధన్యమొనర్చినాడు. "జగములు పొగడఁ దనరె" ననుటలో విశేషము గలదు. చంద్రుడు పొగడఁబడుట ప్రస్తుత కథా సందర్భమునకు సరిపడినది కాని శ్లేష చేత సాధించిన (అప్రస్తుతమైన) మోక్షపదవి నందిన ద్విజ విషయము మరెవ్వరికో సంబంధించినది కాదు. ఆ ద్విజుడు తానే. మంగళాచల నృసింహుని కృపచే అనిరుద్ధ చరిత్రమును వ్రాసి యాతని కంకితమిచ్చినాడు. తరువాత నా స్వామి యాజ్ఞమేరకు "మృదుగూఢ పాకరస బంధురమైన" కవితను గుప్పించి "కవిరాజ మనోరంజన" మను నీ గ్రంథమును రచించి రాజగోపాలుని కంకిత మిచ్చి ధన్యుడైనాడు. జగములు పొగడఁ దనరె" నన్నది సార్థకము, సాభి ప్రాయమునునై భాసించుచున్నది.

## 15 విప్రలంభము :

నారదమునీంద్రుడు పురూరవుని గుణశీల సౌందర్యా దులను గూర్చి ఇంద్ర సభలోవర్ణింపగా విని, యూర్వశి పురూరవునిపై మరులుగొన్నది.

"ఏటికిఁ జెప్పెఁ దాపసి నరేంద్రుని పెంపు సురేంద్రుతోడ నే
నేటికి వింటిఁ దద్గుణము లెల్లఁ బరా కొకయింత లేక నా
కేటికిఁ బుట్టె వానిపయి నెంతట నంకెకురాని ప్రేమ న
న్నేటికి నప్పగించెఁ గుసుమేషుని బారికి దైవ మక్కటా" 3_60

ఊర్వశి విరాళిగొన్న తీరట్టిది, అతని గుణగాన శ్రవణముచేత నామె యట్లయినది. ఎంతటనంకెకురాక యామె మానసము పురూరవుని యంద బద్ధానురాగమై యున్నది.

"నాకం బెక్కడ ధరణీ
లోకం బెక్కఁడ దలంపులో ముచ్చట య
య్యేకచ్ఛత్రాధీశ్వరు
డాఁకొను టది నాకు నెట్లు దొరకెడు నకటా" 3_61

అని నిస్పృహకు లోనైనది. ఈ పద్యము పెద్దనగారి క్రింది పద్యమును పోలి యున్నది.

"ఎక్కడి యరుణాస్పద పుర
మెక్కడి తుహినాద్రిః క్రొవ్వియే రాదగునే
యక్కట మును సనుదెంచిన
దిక్కిది యని యెఱుగ పెడలు తెరు పెయ్యదియో" 2_15.

తరువాత నాయూర్వశికి విరహ తాపము మించినది.

"ఎన్నఁడు చూడఁగల్గెడినో యిందుకులాగ్రణి ముద్దు మోము నా
కన్నులు చల్లఁగా నతనిఁ గౌఁగిటఁ జేర్చి సుఖాప్తిఁ జొక్కు భా
గ్యోన్నతి కల్గునో కలుగదో వల పెంతట నేమి సేయఁగా
నున్నదొ దైవయోగ మెటు లున్నదొ దీని కుపాయ మెద్దియో" 3_62

ఊర్వశి చింతనా ధోరణి చూడ పోతన్నగారి రుక్మిణిజ్ఞప్తికి వచ్చును.

"ఘను డా భూసురు దేగెనో నడుమ మార్గశ్రాంతుడై నిల్చెనో
విని కృష్ణుం డిది తప్పుగా దలచెనో, విచ్చేయునో యీశ్వరుం
డనుకూలింప దలంచునో తలపడో ఆర్యామహాదేవియున్
నను పాలింప నెఱుంగునో యెఱుగదో నా భాగ్య మెట్లున్నదో" [1]

1. ఆంధ్రమహాభాగవతము : 10_1724.

క్రమముగ పెరిగిన విరహతాప మూర్వశిని వేధింపగా, చెలులు చేయదగిన శిశిరోప చారములు చేసిరి. కాని ఫలితము లేకపోయెను. ఉద్యానవనమునకు దీసికొని పోయిరి. అచ్చట వారొనర్చిన శిశిరవిధులు సొన్యతో దర్శనీయములు.

"రాజీవ రాజీవరాజి రాజితములై
కెలఁకుల కొలఁకులు దొలఁకుచోట
ఘనసార ఘన సారఘనులైన ఘనటచ్ఛ
దచ్ఛటా కదళికా తరుల క్రేవ
సంతాన సంతాన సంతతాతాంతత
శృంగార పాదప శ్రేణి నడుమ
మాధుర్య మాధుర్య మధు రస ఫల గుచ్ఛ
వల్లుల పందిటి చల్ల నీడ

శీతకర శీతకరశిలాంచిత వితర్ది
సీమ సీమంతవతులు లేఁ జిగురుశయ్య
సమర సమరకళా పతి విధి వసింపఁ
జేసి చేసిరి సముచిత శిశిర విధులు" 3_101

సంగీత సాహిత్యములు పెనవేసిన కవన చాతుర్య మిట్టిది. వసుచరిత్రకారు ననుస రించిన ఘట్టములలో నిదియు నొకటి.

"కలికి చన్నుల మీఁద గర్పూర మిడుచు బిం
బీర ఫల భ్రాంతి బెదరె నొకతె
పికవాణి కురుల సంపెఁగదండ చుట్టుచుఁ
జంచరీక భ్రాంతి జడిసె నొకతె
యింతి కన్నులయందు హిమజలం బునుపుచు
వికచాంబుజ భ్రాంతి వెఱచె నొకతె
చెలి మోవి మధురాంబువు లొసంగుచును మధు
సారపూర భ్రాంతి జంకె నొకతె

యతివ కుపచార మపచార మయ్యె ననుచుఁ
దావ మెచ్చుట కులికి సద్వస్తుఘటన
మాన రుపమేయముల నుపమానములుగ
భ్రమసి ముగ్ధసఖుల్ తదంగములయందు" 3_104

ఉపచారములన్నియు నపచారములైనవి. చెలులకు సర్వము భ్రాంతిమయమైనది. వారికేమి చేయుటకును తోచలేదు. దీనితోఁ బోలిన వసుచరిత్రకారుని వర్ణనము గమనింపదగును.

"మోహపదేశ తమో ముద్రితములైన
కనుదమ్ముల హిమాంబు లునుపరాదు
శ్రమబిందు తారకాగమ ఖిన్న కుచకోక
ములఁ జంద్రసామంబుఁ దలపరాదు
శీర్య దాశావృంత శిథిలితా సులతాంత
మసియాడ వీవన ల్విసరరాదు
పటతాప పుటపాక పరిహీనతను హేమ
మింక పల్లవ పుటా ర్పిడగరాదు

లలన కానఁగకీలి కీలాకలాప
సంతతాలీఢ హృదయపాత్రాంతరాళ
పూరిత స్నేహ పూరంబు పొంగి పొరలఁ
జల్లని పటీర సలిలంబుఁ జల్లరాదు" వసు. 3_180

వసుచరిత్రకారుని చక్కని పద్యము చదివిన పిదప తానును నట్టిదే యొక పద్యము వ్రాయవలయునని తలచినాడు అబ్బయామాత్యుడు. తన యింగితమును సూచింప నెంచియే కాబోలు "కను దమ్ముల హిమాంబువులునుపరాదు" అను భాగమును తాను మరల గైకొని మిగిలిన పద్యమును పూరించినాడు. వసుచరిత్రలోని వర్ణనమునకు కవిరాజమనోరంజన మందలి యిచ్చటి వర్ణనము సాటిరాకున్నను, పోలియున్న దనుటలో నతిశయోక్తి లేదు. అనుసరించినచోట్ల అబ్బయ కవిత యంతగా రాణించినట్లు తోపదు. స్వతంత్రించిన చోట్ల స్వచ్ఛమై భాసించుట తోచును. ఆ

తరువాత మన్మథోపాలంభనము, చంద్రోపాలంభనము, మలయానిలో పాలంభనము కోకిలాద్యుపాలంభనము వర్ణింపబడినవి. ఊర్వశిని చెలులెంతగా యూరడించినను విరహవేదన తగ్గలేదు. త్రైలోక్యవర్తి యను శుకము పాకశాసన నియోగమున నూర్వశి భువికేగ గలదనియు అచ్చట పురూరవుని కూర్మి లభించగలదనియు తెలిపినది. అప్పుడుగాని యూర్వశి యూరటజెంద లేదు. ఆ శుభవేళకై వేచి యున్నది. ఈ కావ్యమున నిట్లపూర్వముగ నూఱు పద్యములలో విప్రలంభ శృంగారము వర్ణింపబడినవి. ఇది తృప్తినీయక కాబోలు మరల పంచమాశ్వాసా రంభమున నొక సుదీర్ఘమైన వచనములో నెనిమిది పద్యములలో విప్రలంభ శృంగారమును వర్ణించుట జరిగినది. విప్రలంభ శృంగారము రసావహ మగుట యాలంకారిక మతము గదా!

# 16. పద్మమిత్రోదయము:

చంద్రవంశజుడైన పురూరవుని కథ కనుక నేమో ఈ కావ్యమునందు సూర్యోదయ వర్ణనము కానిపించదు. సూర్యవర్ణనము లేక పోలేదు. అదియు పురూరవునికి వన్నె తెచ్చునదే యైయున్నది. ప్రతిష్ఠాన పుర వర్ణన సందర్భమున చెప్పిన వీ క్రింది పద్యములు.

"కమలబంధుండు మధ్యాహ్న కాలమునను
దా మహేశ్వరుడైన చందంబు దెలుపు
రజత కుధరాధరాకార ప్రకార
హీర సౌధాగ్ర సీమలఁ జేరి పురిని." 1_84.

"మీన కర్కట మకర సంస్థాన మగుచు
నొరిదిఁ బ్రతిబింబ మిషమున సూర్య చంద్ర
తారకాదులు తనయందుఁ జేరియుండ
గగనమును బోలి యొప్పు నన్నగరి పరిఘ" 1_85,

"చనునెడ దక్షిణాయనమిషంబునఁ గొన్ని దినంబు లుత్తరా
యణమునఁ గొన్ని నాళ్ళు గగనాంతరసీమ మెలంగుచుం బురిం

గనఁబడు చోద్యము ల్గలయఁ గన్గొనుచుండుదు రెల్లకాలమున్
ఘనమగు దర్శనేచ్ఛలను గై రవిణీ నలినీ మనోహరుల్" 1_88

మొదటి పద్యమున పురప్రశస్తిచేత సూర్యునికి మహేశ్వరత్వము సిద్ధించినది. తరువాతి రెండు పద్యములలో పురప్రశస్తియే గాని సూర్యవైశిష్ట్యము వర్ణింపబడ లేదు. కవి కావలయుననియే సూర్యోదయమును వర్ణించక, కథా సందర్భమును బట్టి (4_170 నుండి 173 వరకు) సూర్యాస్తమయము, సాంధ్యరాగము మాత్రము ఘనముగ వర్ణించెను.

## 17. పరిణయము :

ఈ కావ్యమునందలి పరిణయము లన్నియు గాంధర్వ విధిని నిర్వహింప బడినవి. బుధుడు ఇలా కన్యను గాంధర్వ పద్ధతినే భార్యగా చేకొన్నాడు.

"నిన్నుం జూచిన వేళనుండి తరుణీ నీ రూపరేఖా విలా
సౌన్నత్యంబులు నా మదిం దగిలి మోహభ్రాంతి పాలైతిఁ" 2_164

అని బుధుడు పలుకగా

"నా హృదయము చంద్రకాంతమణి యిందుకరాప్తిఁ గరుంగునట్లు
సమ్మద రసపూరమయ్యె ననుమానము సేయక యేలుకొమ్మ" 2_169

అని ఇలా కన్య తన యామోదము తెలుపగా వారు గాంధర్వవిధిని సుఖించిరి.

ఊర్వశి పురూరవులును గాంధర్వవిధినే వివాహమైనట్లు తోచుచున్నది. గంధర్వుల మొత్తుగడ కూడ నిందుండుటచే నీ వివాహము గాంధర్వమనుట మరియు విశేషార్థ సంయుత మగుచున్నది. పురూరవుని గుణశీల సౌందర్యాదులను గూర్చి నాకలోకాధీశు సభలో నారదుని నోట విన్ననాటినుండియే ఊర్వశి పురూరవాయత్త చిత్తయై యున్నది. ఇక పురూరవుడు చిత్రపటమున నామె రూపరేఖావిలాసముల గన్న నాటి నుండి యట్టి తలోదరి నెట్లు పొందగలనా యని యామె యందే లగ్న మానసుడై యున్నాడు. చారులవలన తెలిసి, ఊర్వశి యున్న కడకేగి, చెలికానితో

వార్త బంపి, ఊర్వశిని వర్ణించిన పురూరవు డామె సౌందర్యాతిశయమును బహు విధముల స్తుతించి, తుదకు

"అనుమాన మేల నిఁక నే
నిను మానఁగఁ జాల నీవు నెఱజాణవు పై
కొనుమా నను఼ జల్లఁగ గను
గొను మానసకమల మెత్తి కువలయనయనా" 5–139

అని నిలువోపమి వేడుకొన్నాడు. ఆమెయు పురూరవుని సౌందర్యతా గుణమును ప్రస్తుతించి "ఒన్నగోనెల్లొన గూడునో యనుచుఁ గాంక్షఁ దైవము న్వేఁడుకొందు నిమేషం బొక యేఁడుగాఁ గడుపుచు"[1] నుంటినని యతని యెడ తనకు గల ప్రేమను వెల్లడించి, జోడు తగళ్ళ రక్షించు బాధ్యత నొప్పగించి అతనితో నుండుట కామోదము తెలిపినది. నెఱజాణతనము నెఱపినది. పురూరవుడెప్పుడు గట్టినోగాని ఊర్వశి మెడ బంగరు తాళి గలదు. [2] తెలుగు కవియైన అబ్బయామాత్యునకు, తాళియైన లేకున్ననేమి పెళ్ళి యనిపించిన దేమో కల్పించినాడు.

## 18 సురతము:

ప్రబంధ కవులు సురతము గూడ వర్ణించిరి. అబ్బయామాత్యుడు కూడ సరసముగ సురతమును వర్ణించి యున్నాడు. తారా శశాంకుల సురతమును వర్ణించిన తీరు కొంత వచ్చి శృంగార మనిపించును. జారవొందుగదా.

"బొప ముడిపెట్టు మాత్రమె కాని ప్రియుడు పా
లిం డ్లొత్తిపట్టుట కిచ్చగించుఁ
గసరు మాత్రమె కాని కాంతుఁ డాయము లెత్తి
వెసఁబల్కుట కపేక్ష వీను లొగ్గు
కొంగుపై నిడుకోఁ బెనంగు మాత్రమె కాని
విటుఁడు గోప్యములు జూచుటకుఁ గోరు

1. కవిరాజమనోరంజనము. 5–145.
2. " " 5–205.

సీత్కృతు ల్వెడపెడఁ జేయు మాత్రమే కాని
పతి మోవి నొక్కు సంగతికి నలరు

"సొలయు మాత్రమె కాని నెచ్చెలిమికాఁడు
కఠినరతి సల్పుటకు సముత్కంఠ దాల్పఁ
బులక హర్షాశ్రు సుఖజలోద్భూతగరిమఁ
దన వలపు జారునకు దెల్పు దరుణి యపుడు" 2_29

ఇలాబుధుల సురతము మరియొక విధము సరసముగ సాగిన వర్ణన గనుడు.

"వనితం గౌఁగిటఁ జేర్చి బింబఫలనవ్యంబైన కెమ్మోవి ప
ల్మొనల న్నొక్కుచుఁ జెక్కుటద్దము లొగి న్ముద్దాడుచు న్మోహన
స్తనకుంభంబుల నెమ్మొనల్ స్పృశుకుచున్ సంభోగ చాతుర్య ఖే
లనుఁడై సల్పె రతిప్రసంగము మహోల్లాసంబు సంధిల్లఁగన్" 2_172.

మొదట సరసముగ నట్లుసాగి యాసురతము సమరతి యైనదట. ఇలాబుధులట్లు మకరకేతన పూజ్య సామ్రాజ్య మూర్ధాభిషిక్తులైరి, అది యౌచిత్యమే యని కవి వర్ణించిన తీరుగనుడు.

"అతని కన్యాసమాగమ స్థితి తదీయ
మిథునవర్తనమును బెంపు మిగిలియుండె
బుధుని కన్యాసమాగమ మిథునవర్త
నములు పెంపు వహించుట నైజము కద" 2_177.

అతడు సుందరుడు. ఆమె సుందరి, వారిద్దరట్లు సురతసౌఖ్యము నందుట యుచితమే యని సమర్థించుటకు కవి తన జ్యోతిష శాస్త్ర పరిజ్ఞానమును చక్కగా వినియోగించు కొన్నాడు. కన్యా మిథునములను రాశులకధిపతి బుధుడు. కావున బుధుని కన్యాసమాగమ మిథున వర్తనములు పెంపువహించుట నైజమె కదాయని చమత్కరించినాడు. వారికి కలుగబోవు సంతానము కావ్య నాయకుడైన పురూరవుడు కావున వారి సమాగమము సముచితమని స్థాపించుట కవి యుద్దేశమై

యుండనోపును. ఊర్వశీ పురూరవుల సురతము మరియు శోభాయ మానముగ వర్ణింపబడినది.

„కృత సంపర్క మనోజ్ఞ హార లతికా శ్రీరోమరేఖా సితా
సితయై బంగరు తాళి యే ల్పసిమితోఁ జెన్నొందు శోభానమ
న్విత కాంతా కుచమధ్యం బను త్రివేణీ సంగమం బొచ్చి భూ
పతి సంకల్పము కాంచె మన్మథపరబ్రహ్మైక్యతానందమున్” 5_205.

హారములు సితములు, రోమరేఖ యసితము, బంగరు తాళి గౌరవర్ణము, ఇవి మూడును త్రివేణీ సంగమముపలె గాని పించినవి కవికి. గంగసితవర్ణ, యమున అసితవర్ణ, సరస్వతి గౌరవర్ణ. సురతము నందును పవిత్రతను దర్శించుట కవి యౌదాత్యము, పురూరవుని సంకల్పము, ఈ త్రివేణీ సంగము జొచ్చుట కారణ ముగా, మన్మథ పరబ్రహ్మైక్యతానందమును బొందినది. ధర్మబద్ధమైన శృంగా రమునకన్న పవిత్ర కార్యము మరియొండు లేదని చాటిన విశిష్టగుణ సంపన్నమైన వర్ణనమిది. సాధారణముగ వివాహముజరిగి యున్నచో ఎదురుకోలు, వాద్య ఘోష, మంగళసూత్రము, తలంబ్రాలు, లగ్నాష్టక పఠనము, బొత్తుల భుజించుట మొదలగు వేడుకలెన్నియో జరిగెడివి. కాని వీరిది గాంధర్వ వివాహము. కనుక నవియేవియు లేవు. లేవనుచింత వారికుండరాదని కవి చమత్కారముగ నీక్రింది సురత వర్ణనమున. గూర్చెను తెలుగు చూడుడు,

“ఎదురుకోలు ఘటించె నితరేతర ప్రఫుల్లాంబ కాంభోజ వృగంచలములు
వాద్యఘోష మొనర్చె వరరత్న కింకిణీ కంకణకిణీరుణత్కారణరవము
మంగళసూత్రసంపద చెల్వెఁ బతి చేయు లలితాంగి కంఠావలంబనంబు
తలంబ్రాల ముత్తియంబుల యంద మొందె జల్లులరాలు కచపుష్పసముదయంబు

పలుకు లగ్నాష్టకము లద్యో గళరవములు
బొత్తుల భుజింపు వేడుకబొలుపు దాల్చెఁ
బిక్వ బింబాధరామృతపానలీల
త న్మిథున కేళి పరిణమోత్సవమునందు.” 5_209

ఇట్టి సురత లీలా విలాసము మరెందును గానము.

## 19. సుత జననము :

సుత జననము సర్వజనానంద కారిణి. కవిరాజ మనోరంజనమునందు మూడుచోట్ల సుత జనన వర్ణనము గలదు. మొదట తారా శశాంకులకు పుత్రోత్పత్తియైన సందర్భమున గర్భవతియైన తారను వర్ణించు విధము గనుడు.

"రతిబంధ ప్రతిబంధకం బురు పరీరంభ క్రియా స్తంభ నం
బతి హేలామణి తాంతరాయము నిజప్రాణేశ కేళీజిదా
యత మీనధ్వజ యుద్ధతంత్ర పటు తాహంకార శం కాంకురం
బతులస్ఫూర్తి నెసంగె గర్భము నవ వ్యాకోచ పద్మాక్షికిన్" 2-39

రతిబంధ ప్రతిబంధకంబగు గర్భము ధరించి తార నవమాసములు మోసి, అశేష విశేష గుణాంబుధిన్ బుధుని గన్నది. ఇట కవి యంత విశేషముగ వర్ణింపలేదు. కావ్య నాయకుడైన పురూరవు డుద్భవించు వేళ వర్ణన మట్టిది కాదు.

"ముక్తామణి ధరణాంచిత
శుక్తి ప్రతిమాన మగుచు సుదతీమణికిన్
నక్తంకర జాతకళా
యుక్తంబై గర్భమమరె నుజ్జ్వలలీలన్" 2-179

"చెక్కుల తెలుపును జిగిచను
ముక్కుల నలుపును నపాంగములఁదేలికలౌ
దృక్కుల సొలపును నెడనెడ
వాక్కుల యలపును ఘటిల్లె వనితామణికిన్" 2-180

ఇట్లెంతో ఘనముగ వర్ణించుటేగాక, నవమాసములు మోసిన సతికి పుత్రోదయమగు వేళ సుముహూర్తమని కవి సూచించుచున్నాడు.

"సూచిం చెంబరమొచ్చ భాగ విహరత్సువ్యక్త వర్గోత్తమ
ప్రాచుర్యోచిత దృక్సమేత శుభదారం భగ్రహానుగ్రహం

బాచక్రాచల ధారుణీవలయ రాజ్య శ్రీయుతైశ్వర్య వి
ద్యా చాతుర్య గుణాది భావిఫలముల్ తజ్జన్మ కాలంబునన్" 2-186

పురూరవు డుదయించిన సుముహూర్త మట్టిది. గ్రహానుగ్రహము గొప్పగా నున్నది. గ్రహములు పరమోచ్ఛ భాగములలో విహరించుట, వర్గోత్తమాంశయం దుండుట, శుభదృష్టితో కూడి యుండుటయును విశేష శుభలక్షణము లన్నియు నా జన్మ లగ్నమునందున్నవి. ఆ కాలమున పుట్టిన పుత్రుడు ఐశ్వర్యాది శుభగుణ యుతుడై ధారుణీవలయము నంతటిని పరిపాలించగలవాడగును. సరిగా పురూరవు డట్టివాడే యగుట విశేషము. కవికి గల జ్యోతిష శాస్త్ర పరిజ్ఞానము రచనా చమత్కృతికి తోడై బంగారమునకు తావి యబ్బి నట్లయినది. పురూరవు డుద్భవింపగా దేవతలెల్ల హర్షించి పుష్పవర్షము గురియించిరి. బుధుడు దారముదావహా చిత్తవృత్తిం బుత్రోత్సవములు నిర్వహించినాడు. అఖండ సంపత్సముపేతుడై నయపద్ధతి, సుధాంశుకులవర్ధనుడై, యనేక సంవత్సరములు ధర నేలగలడని యోగిజనంబులు నిర్ణయించి, అనురాగముతో మంగళాశాసన మొనరించి పురూరవు డని నామకరణము చేసిరి. ఇది యంతయు కవి విశేషముగ తెనుగువారి సంప్రదాయమును చాటుటకే యన్నట్లుదాత్తముగ వర్ణించినాడు. ఇక మూడవ చోట పురూరవునికి ఊర్వశి యందు కలిగిన పుత్రోత్పత్తిని గూర్చి విశేషముగ నేమియు వర్ణించలేదు.

"అయ్యూర్వశీ పురూరవస్సులకు నగ్రసుతుండై జనియించిన యాయువునకు సహోదరులయి క్రమంబున శ్రుతాయువును సత్యాయువును రయుండును జయుండును విజయుండును నన నేవురుపుత్రు లుదయించిరి. తత్కుమారషట్కంబు వలనం గ్రమక్రమంబునం బుత్రపౌత్రాభివృద్ధియయి చంద్రవంశపారంపర్యంబు జగద్విదితంబయి వెలసె" 5-298. అని వర్ణించుట జరిగినది. దీనిని బట్టి బుధ జననము, తారా శశాంకుల యక్రమ సంబంధజనితమగుట చేత గాబోలు కవికంతగా నచ్చి యుండలేదేమో. అంతగా పొగడలేదు. వారి సహజ భావములకుం దగినట్లుగ "రతిబంధ ప్రతిబంధనంబు గర్భమని వర్ణించినాడు. ఇక పురూరవుడన్ననో విశ్వవిఖ్యాత చక్రవర్తి. ఆతని జననమును సమగ్రముగ సుందరముగ వర్ణించినాడు. పురూరవునికి పుత్రోత్పత్తియైన సందర్భమున, కావ్యాంతమని భావించెనో, లేక

చంద్రవంశపారంపర్య వికాసముల జెప్పదలచిన వాడగుటచే నతనికి యారుగురు పుత్రు లుద్భవించిరనియు పుత్ర పౌత్రాభివృద్ధి యందు చంద్రవంశము జగద్విదిత మైనదని చెప్పిన జాలునని భావించెనో వివరముగా వర్ణించుటకు పూనుకొన లేదు. పురూరవ జననము మాత్రము పూర్వకవి కృత సుత జనన వృత్తాంతము వలెనే రమ్యతరముగ వర్ణించి యుండుట, ఔచిత్యతా లక్షణమును వెల్లడించు చున్నది. ఒకే విషయము మూడు చోట్ల వర్ణింపవలసి వచ్చినచో నెచ్చట యెంత యెట్లు వర్ణింపవలయునో తెలిసి వర్ణించిన ధీవరు డబ్బయ.

## 20 పుష్పలావికలు:.

ప్రబంధములందు పుష్పలావికల వర్ణించుట యొక సరస వర్ణనముగ పరిపాటియైనది. నాటి రసికుల వాక్చమత్కృతి పుష్పలావిక సౌందర్యాతిశయముల తోడి ప్రత్యుక్తి కవి ప్రౌఢోక్తికి యాటపట్టులై విరాజిల్లు చున్నవి. అబ్బయ చేసిన పుష్పలావికా వర్ణనము అనిదంపూర్వముగ సాగినది. పూర్వ కవికృత వర్ణనముల జూచి యంతకు మించి పోవలయునను స్పర్థచే నొనర్చిన వర్ణనములలో నీ పుష్పలావికా వర్ణన మొకటి. ఆముక్తమాల్యదలో శ్రీకృష్ణదేవరాయలు పుష్పలావికల వర్ణించిన విధము గనుడు.

"వెలది యీ నీ దండ వెలయెంత? నా దండ
కును వెలఁబెట్టు నెవ్వని తరంబు?
కలువఁ దాపులుగానమలికదంబకవేణి?
కలువ తావులు వాడక యకలుగునే?
కడి పోదు నాకిమ్ము పడతి యీ గేదంగి
ననఁ గడిపోమ ముందటికిఁ జూడు
జాతు లే వంబుజేక్షణ? పద్మినులు పైత
మును నున్న యెడజాతులునికిఁ యురుదె

యనుచుఁ దొలినుడి నభిలాష లెనయమూఁగి
పలుకు తోడనె నర్మగర్భంబుగాఁ గ

సత్తరము పల్లవశ్రేణి కొనగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున"[1]

పై పద్యము ననుసరించె ననుటకు వీలులేదుకాని, అబ్బయామాత్యు డీ వర్ణననంది పుచ్చుకొని, తనదైన ప్రతిభా నైపుణ్యములచే నీ క్రింది వర్ణన మొనర్చెననుటలో సందియము లేదు.

పెలకుఁ జూపవు పొన్నవిరి యంత గోప్యమా ?
    యది యరంటుల లోయనయ్యెఁజుమ్ము
కప్పుకొనేల బంగారమా పువుబంతు
    లవి సువర్ణలతోదయములు సుమ్ము
మూసిపెట్టెదు మల్లెమొగ్గ లింత బ్రమా
    యవి సుధారాశి చేరువవిసుమ్ము
దాఁచుకొంటివి యరుదా నల్లఁగలువపే
    రదియ గాథ సరోవహనము సుమ్ము

టంపు పసిమసి నగవు లన్యోన్యవచన
మంజుల వ్యంగ్య చాతురీ వ్యంజకములు
గా విటుల కమ్ముదురు విరు ల్కాముకైక
జీవికలు పుష్పలావిక ల్సలగి పురిని" 1_81

శ్రీకృష్ణదేవరాయలు చెప్పినవి నర్మగర్భములు. అబ్బయవి మంజుల వ్యంగ్య చాతురీ వ్యంజకములు. కృష్ణరాయల వర్ణనమునం దొక్కొక్క పాదమునందు పల్లవశ్రేణి యభిలాష, పుష్పలావికల సమాధానము నర్మగర్భముగా నున్నది. అబ్బయ తన రచనలో సమాధానమును కూర్చునప్పుడు ఒకటి యడుగగా అది యట్లగుటకు హేతువును తెలుపుచు మరియొక యంగము యొక్క సౌందర్యాతిశయమును వర్ణించుచు, పుష్పలావికల యంగాంగ సౌందర్యముతో పాటు, వారి వాక్చమత్కృతిని, అది సూచించుటకా యన్నట్లు మంజుల వ్యంగ్య చాతురీవ్యంజ

1. ఆముక్తమాల్యద. 1_19

కములైన ముసిముసి నగవులను వర్ణించి అబ్బాయి యొక్క మెట్టుపైననే నిలిచినట్లు స్పష్టపరచినాడు.

## 21 నాయకవర్ణనము:

కావ్య నాయకుడైన పురూరవుని వర్ణించు నెడ కవి చూపిన ప్రతిభ విశేషముగ గొనియాడదగి యున్నది.

"ఆ నృపాలుని యసమ సాయకతఁ జూచి
వాని సుమహిత కార్ముకత్వంబుఁ జూచి
మనుజు లవ్విభుఁ జోకకుమారుఁ బోల్తు
రతని సౌందర్యమును శౌర్య మట్టిదగుట" 1-89

అసమ సాయకత (సాటిలేని బాణములు కలిగియుండుట / బేసి సంఖ్య బాణములు గల మన్మథత్వము) సుమహిత కార్ముకత్వము (గొప్ప మహిమగల ధనుస్సును కలిగియుండుట / పూవులచే మేలైన ధనుస్సు కలిగి యుండుట) అను రెండు లక్షణములను జూచి జనులు, ఆ రాజునకు సాటి (అవ్విభుజోక కుమారు/అవ్విభుజోకకు మారు) దేవ సేనానియైన కుమారస్వామిని (శౌర్యమునకు) మారుని (సౌందర్యమునకు) పోల్తురట. శ్లేషచేత రెండు లక్షణముల నొక్కటి జెప్పిన తీరు రమ్యతరమైనది. అంతే కాదు అవి రెండును, అతని యందే నిలిచియుండుట యందలి సామంజస్యమును చాటుచున్నవి. ఒక మారు "చూచి" యన్నం జాలును. కాని కవి రెండు పాదముల చివర చూచి యని రెండు సారులు వ్రాసి రెండు పర్యాయము లీ పద్యమును చదువవలయునని సూచించుచున్నాడు. సౌందర్య వర్ణనము నెడ, అసమ సాయకత, సుమహిత కార్ముకత్వము కానిపించి, అతని జోకకు మారుడు తగియుండును. శౌర్య వర్ణనము నెడ, అసమ సాయకత, సుమహిత కార్ముకత్వము కానిపించి, అతని జోక కుమారుడు తగి యుండును. సరళమైన విరుపుతో సరసమైన యర్థమును సాధించిన తీరు ప్రశంసనీయము.

ప్రబంధములందు పురుష సౌందర్య వర్ణనమును ప్రౌఢముగా నొనర్చిన కీర్తి మొదట పెద్దనార్యునిదే. ఎందరి యెడనో స్పర్ధ వహించిన అబ్బయ సందర్భము వచ్చినచో తన ప్రతిభను ప్రదర్శింపకుండునా ! నాయకుని చిరునవ్వు నింత యందముగ వర్ణించుట యరుదు.

"ఆ రాజేంద్రుని చెక్కుటద్దములపై వ్యాపించు లీలాదర
స్మేరజ్యోత్స్న జపా ప్రసూన విలస జ్జిహ్వాగ్ర సింహాసన
ప్రారూఢస్థితిఁ బొల్చు శారద మనోజ్ఞాకార శోభా సుధా
పూరం బుద్గతమైన చందమున నొప్పున్ లోచనానందమై" 1-92.

అహ ! కవి యేమి చేయలేడు ? ఆ రాజేంద్రుని చెక్కుటద్దములు, దానిపై యతని చిరునవ్వులను వెన్నెల ప్రతిఫలించి లోచనానంద మొనర్చుచున్నది. ఇక నా చిరునవ్వెట్టిది ? మోదుగు పూవువలె ప్రకాశించు నాతని జిహ్వాగ్రమనెడు సింహాసనమున ప్రారూఢస్థితి శారద నిలిచియున్నది. ఆయమ మనోజ్ఞాకార శోభ యనెడు అమృత ప్రవాహము పెదవులపై చిమ్ముకొని రాగా నది లీలాదర స్మేరమైనది. ఇక నేమి చెప్పవలయును ? అతని చెక్కులు అద్దములవలె నుండి లీలాదర స్మేరము ప్రతిఫలించుటచే మిక్కిలి శోభావంతముగ నున్నవి. ఆ చిరునవ్వు వెన్నెలవలె తోచుటకు హేతువు అతని జిహ్వాగ్రమున శారద నిలిచి యుండుటయే. ఇట్లనుటచే అతని సౌందర్యాతిశయమునకు అఖిల విద్యాప్రౌఢియు తోడై లీలాదర స్మేరమైనదని వర్ణన. ఇట్టి వర్ణనము మఱి యెచ్చటను గానము. ఇతరుల ననుసరింపక స్వతంత్రించిన అన్ని సందర్భములందును అబ్బయ ఇట్టి యపూర్వ వర్ణనములే యొనర్చి యున్నాడు.

అబ్బయామాత్యు డీ సందర్భమున శృంగార నైషధకర్తయైన శ్రీనాథుని కవితను సైతము ననుసరించి, తన ప్రత్యేకతను శ్రీనాథుని యెడ తనకు గల యభిమానమును వెల్లడించుకొనినాడు. చూడుడు.

"పటు భుజాస్తంభాగ్రఘటిత విశ్వంభరా
భరలాఘవిత మహాఫణిఫణుండు

నవకీర్తి నర్తకీ నాట్య రంగావధీ
కృత చక్రవాళ ధాత్రీధరుండు
సంత తౌదార్య సిద్ధాంత తార్థపూర్వ
క్షీ భవ త్కల్పక ప్రాభవుండు
బిరుదాంక రచిత గంభీరగీత ప్రసం
గాళాప సంజీవనాంతకుండు

నిశిత నిరుపమ నిజకర నీరజాత
నిహిత నిస్త్రింశ నిర్భిన్న నిష్ఠురారి
పలల నైవేద్య తృప్త ఋంభ ప్రతాప
ఘోరతర భైరవుండు వీరూరవుండు" 1–87

శృంగార నైషధ కావ్య నాయకుడైన నల చక్రవర్తి వర్ణనమును చూడుడు.

"తపనీయ దండైక ధవళాతపత్రితో
ద్దండ తేజఃకీర్తి మండలుండు
నిర్మల నిజక థానిమిషకల్లోలినీ
క్షాళితాఖిల జగత్కల్మషుండు
వితత నవద్వయ ద్వీప నానాజయ
శ్రీవధూటీ సమాశ్లిష్ట భుజుడు
నిఖిల విద్యానటీనృత్యరంగస్థలా
యతనాయమాన జిహ్వాంచలుండు

ప్రస్తుతింపంగదగు సముద్భట కఠోర
చటుల గుణ టంక్రియాఘన స్తనితఘోష
చాప నీరద భవ శరాసార శమిత
బలవ దహిత తేజో దవానలుండు నలుడు" శృం. నై. 1–46

శబ్ద సంయోజనము, పద్యము నెత్తుకొను తీరు ముగించు రీవి సర్వము శ్రీనాథుని నుండి అబ్బయ తా నందిపుచ్చుకొన్నవే యని పై పద్యములఁ బరిశీలించిన

స్పష్టము కాగలదు. స్పర్ధ చేత శ్రీనాథుని యనుసరించిన మఱొక పద్యమును చూతము. అదియు నాయక దాతృత్వగుణ ప్రశంసా సందర్భమే.

"అయ మర్థి జన యంచు యాచక లలాటాంత స్థలిన్ బ్రహ్మ ని
ర్ణయతన్ వ్రాయ పఠించునట్టి లిపి యర్థంబున్ విశేషాన్వయ
క్రియగా నర్థ మవారిగా నొసఁగి యర్థిం జేయు వాగీశు వ్రాఁ
తయు నాత్మీయవితీర్ణియు న్నిజముగా ధాత్రీశు నేర్పెట్టెడో" 1-98

"ఇతడు దరిద్రుడౌ ననుచు నేర్పడ నర్థి లలాటపట్టికన్
శతధృతి వ్రాసినట్టి లిపిజాల మనర్థముగాని యట్లుగన్
వితరణ ఖేలనా విభవ విభ్రమ నిర్జిత కల్పభూరుహుం
డతడు దరిద్రతా గుణమునందు దరిద్రుని జేయు నాతనిన్" శృ. నై. 1-67

శ్రీనాథుడు, అబ్బయ ఇద్దరును విధి వ్రాతను గౌరవించువారేగాని, వారి కావ్య నాయకుల దాతృత్వగుణ ప్రశంసా విషయమున మాత్రము దానిని విశేషాన్వయముతో విధికి విరుద్ధముగాకుండ, యాచకు డఖిలార్థముల బొందునట్లు సేయుట యందు సమర్థులే. శ్రీనాథు డద్దానిని వ్యతిరేకార్థమున అనగా దరిద్రతా గుణమునన్ దరిద్రునిఁ జేయునని చమత్కరింపగా, అబ్బయ "దరిద్ర" శబ్దమే తిరస్కరింప దగినదిగా భావించి, అర్థిని విశేషాన్వయముచే (అర్థము గలవారు అను బహువ్రీహిగా మార్చి) సదా దాతృత్వమహిమచే శ్రీమంతు నొనర్చినాడు. మరియు నొక చిన్న విశేషమున్నది. శ్రీనాథుడు శతధృతి వ్రాసిన లిపిజాలమును. అనర్థము గానియట్లు నలుడు చేసినాడని చెప్పుటలో అనర్థము కాకుండునంతవరకే పొసగినది. ఇది గ్రహించిన అబ్బయ బ్రహ్మలిపి యర్థంబున్ విశేషాన్వయ క్రియగా మార్చుట చేత శ్రీనాథుని వ్రాతకేగాదు, బ్రహ్మవ్రాతకే మెఱుగులు దిద్దినాడన్నచో నతిశయోక్తిగాదు.

## 22 ధనము :

అబ్బయామాత్యుడు నారదునినోట నరిపించిన ధనము యొక్క నిరర్థకతను గూర్చిన వర్ణనము నాన్యతో దర్శనీయము.

"కామరోగాది దుష్కర శత్రువర్గ ప్ర
తాప ప్రధాన సాధనము ధనము
జన్మపరంపరా సంపాది తానేక
ఘనకర్మజాల వర్ధనము ధనము
కైవల్యసంప్రాప్తి కారణ వైరాగ్య
ధర్మమా ర్గావరోధనము ధనము
సకలావగుణపుంజ సంశ్ర యాశారూప
ధారుణ నిగళ బంధనము ధనము

గలిగి గర్వంబు దొట్టి దుఃఖంబు మదికిఁ
జెనుచు నజ్ఞాన పాపేంధనము ధనము
స్వప్నలబ్ధ పదార్థంబు చందమునను
దలఁచి జూడంగ వట్టి దంధనము ధనము" 1–133.

యమక, అంత్యప్రాసము పోయిన పోకలు చమత్కృతికి పెట్టని కోటలై నిలచినవి. వర్ణింపదలచినది ధనము యొక్క నిరర్థకత. లోకము "ధనమూఽ మిదంజగత్తు" ని నమ్మి యున్నది. దాని కన్నులు తెరిపించవలయును. ధనము యొక్క లక్షణమును బట్టబయ లొనర్చిన నదిసాధ్యమగును. మొదటి రెండు పాదములందు "సాధనము" "వర్ధనము" అను శుభ్రపదములైన వానిలో ధనము చేరియుండుటచే, ఫలము (పాదార్థము) వ్యర్థమైనది. మూడవ నాల్గవ పాదము లలో "అవరోధనము" "బంధనము" అను దుఃఖపదములగు శబ్దములందు "ధనము" చేరియుండుటచే (పాదార్థమున) ఫలము నిష్ఫలమైనది. ఆ తరువాత నెత్తుగీతి యందు "ఇంధనము" "దంధనము" అను శబ్దములు తటస్థములైనవి. వీటి యందును ధనముచేరి యుండుటచే (శబ్దగతము) నవియు నిరర్థకములైనవి. అన్నియుఁబరిశీలింపగా, ధనము వట్టిదంధనము (మాయ/మిథ్య) యని నారదుడు, కావ్యనాయకుడికి, ఆత్మోపదేశము చేసిన సందర్భమున చెప్పినట్లు వ్రాయుటలోని సామంజస్యము శతథా ప్రశంసనీయము. నారదుడు దేవర్షి. అతని నోట వ్యర్థవాక్కులు వచ్చునా? రావు. కావున ధనము మాయ యని కవి వర్ణించిన తీరు "రత్నాలమూట" యమకమును, అంత్యప్రాసమును ఇట్లు విశిష్టార్థవ్యంజకముగ రచించుట మరియొకచోట గానము.

## 23. పూర్ణకుంభనృత్యము:

నారదుని నోట చెప్పించిన యోగి లక్షణమును వర్ణించిన తీరు మఱియొక పద్యము చూడుడు.

"అమితములై ఘటించు విషయానుభవంబుల భోగియయ్యు ను
త్తముఁడగు యోగి బ్రహ్మమయి తన్మది రంజిలుచుండు గీత నృ
త్యములను దాళమానవశుఁడయ్యు శిరస్థిత పూర్ణకుంభము
సమధికయుక్తి నిల్పికొనఁ జాలిన నాట్యధురీణు కైవడిన్" 1_169

విషయానుభవముల భోగి యయ్యు, యోగి బ్రహ్మమయి రంజిలు చుండునని చెప్పి దృష్టాంతముగ పూర్ణకుంభ నృత్యము చేయు నాట్యధురీణుని జెప్పుట మిక్కిలి యుచితముగా నున్నది. ఇద్దరి యందును ఏకాగ్రత లక్ష్యశుద్ధి యవసరము. తెలుగునాట కూచిపూడి నాట్యమునందు పూర్ణకుంభ నృత్యము, అతని భావవీథి నిలచెగాఁబోలు. స్థితప్రజ్ఞని గూర్చి గీత యందలి క్రింది శ్లోక భావమే దీని యందు ప్రతిఫలించినట్లు తోచుచున్నది.

"రాగ ద్వేష విముక్తైస్తు విషయా నింద్రియైశ్చరన్।
ఆత్మవశ్యై ర్విధేయాత్మా ప్రసాద మధిగచ్ఛతి"॥ 2_64

స్వాధీనమైన మనస్సు గలవారు రాగద్వేష రహితములును, తనకు నధీనములై యున్న, ఇంద్రియములచే (దేహ యాత్రోపయుక్తములు) అన్న పానాది విషయముల ననుభవించుచున్న వాడైనను, మనోనిర్మలత్వమును (మనశ్శాంతిని) పొందు చున్నాడు. అట్టి యోగి లక్షణములను పూర్ణకుంభ నృత్యముతో పోల్చి కవి తెలుగు నాట ప్రసిద్ధమైన నృత్యరీతికి పవిత్రత నాపాదించినాడనుట నిర్వివాదాంశము. "కవి రేవ ప్రజాపతిః" అను నార్యోక్తి ఇప్పట్టుల మరియు సమంజసమని తోచును.

## 24. చతురర్థి:

శ్లేష చమత్కృతి చేత నాలుగర్థములు సాధించి వానిని ప్రస్తుతమున కన్వయించిన ప్రతిభ, తారా సౌందర్య వర్ణనమున గానిపించును.

"సారంగ మదహారి సంపన్నత వహించు
ఘనసారసచ్ఛాయఁ గడు రహించు
సారంగ మదహారి సంపన్నత వహించు
ఘనసారసచ్ఛాయఁ గడు రహించు
సారంగ మదహారి సంపన్నత వహించు
ఘనసారసచ్ఛాయఁ గడు రహించు
సారంగ మదహారి సంపన్నత వహించు
ఘనసారసచ్ఛాయఁ గడు రహించు

బాలికామణి తనుమధ్య నీల చికుర
చారు దీర్ఘ విలోచన సరసహాసన
తరుణ మోహనమూర్తి సౌందర్యవదన
నవ్య సౌరభ సురుచిర నఖరలీల" 2—10

సారంగము = ఏనుగు, గజమదమును హరించునది సింహము. సింహ మధ్యము సంపన్నతను వహించునది, ఆమె తనుమధ్యము.

సారంగము = హరిణము. హరిణము మదమును హరించు సంపన్నత (చంచల నయనత) వహించునది, యామె చారు దీర్ఘ విలోచనములు.

సారంగము = తామర. తామరపూవు మదమును హరించు సంపన్నత వహించు తరుణ మోహనమూర్తి.

సారంగము = తామర. తామరపూవు మదమును హరించు సంపన్నత వహించు (పరిమళముచే) నవ్యసౌరభ.

ఘనసారము = చిక్కని మేఘము యొక్క కాంతిచేఁ గడురహించు నీల చికుర

ఘనసారము = కర్పూరము వలె తెల్లనైన నవ్వు కలది (సరసహాసన)
ఘన సారసచ్ఛాయ = గొప్ప తామరపూవు కాంతిచే రహించు సౌందర్యవదన.
ఘనసారసచ్ఛాయ = కర్పూరపు కాంతిచే రహించు సురుచిర నఖరలీల.

సారంగ మదహారి, ఘనసారసచ్ఛాయ శబ్దముల యందు నాల్గర్థములు సాధించి సరళముగా, తారాకాంతసర్వాంగ సౌందర్యమును వర్ణించుట యొక చిత్రము.

## 25 నాయికచూపులు :

చూపులలో నిన్ని రకములుండునని, అవి యింత చూడ సొంపుగ నుండునని, ఈ క్రింది వర్ణనము చూచినగాని తెలియదు.

"పలుచని చూపునఁ బరిపాటిగాఁ జూచు
నల్లార్పుఁ జూపున నదటి చూచు
నరగంటి చూపున నలస రీతిని జూచు
మఱుపెట్టు చూపున మరలి చూచు
నొడలెల్లఁ జూపుగాఁ గడు నచ్చబడి చూచు
సొగయ నొయ్యారంపుఁ జూడ్కిఁ జూచు
భయ మింత లేక తప్పని చూపుచేఁ జూచుఁ
జూచి చూడని యట్టి చూడ్కిఁ జూచు
సొలపు పలపునుఁ దిలకించు చూడ్కిఁ జూచు
నాటుఁ జూపున మరులుకొనఁగఁ జూచు
దార తారామనోహరు పలవిధాప
లోకనంబుల మోహవిలోల యగుచు" 2_13

ఇందొక విధమైన సంగీత స్ఫూర్తియు గలదు.

## 26 మధుపములు :

"కుసుమ మయ్యెనె వీనికిఁ గు సుమ మహహా
యీ రసం బయ్యెనే వీని కీరసంబు
కాంచనము కానచనమ్మ్ గా నెంచుకొనవు
తలఁప మధుపంబులకు నెట్లు తెలివి కలుగు" 2_112.

కుసుమము, కు సు మ ము ; ఈ రసము, ఈ ర స ము అను విరుపులతో యమకము చెప్పి, తుమ్మెదలు సంపెంగలను చెడుపూలగా భావించె

ననియు, వానియందలి మధువు, వానికి ఈరసమైనదనియు, చమత్కరించి, కాంచనము (సంపెంగ) ను కాంచనమ్ముగా (బంగారముగా/శ్రేష్ఠముగా) తలపవు అని మధుపముల నెత్తి పొడుచుటేకాదు అవి మధుపము లగుటచేతనే (మధుపాన మత్తములనుట) తెలివి లేనివైనవని సమర్థించుకొన్నాడు. ఇందొక కవి సమయ మున్నది. తుమ్మెదలు సంపెంగపులయెడ విముఖములు. ఆ విషయమును చెప్పు చునే, అప్రస్తుతమైన మరొక యంశమును కవి యిచ్చట వ్యంగ్యధోరణిలోనెత్తి పొడుచుచున్నాడు. మధుపాన మత్తులైన వారు తెలివి లేనివారని వారిని విమర్శిం చుచున్నాడు. మధుపానము వివేక హైన్యహేతు వనుట లోక విదితమే గదా!

## 27 రత్నరాశి:

స్త్రీ యైన సుద్యుమ్నునిఁజూచి బుధుడు మోహించిన సందర్భమున యామెను దర్శించిన తీరు గనుడు.

"ఆ యరవింద రాగరుచిరాధర నా హరినీలవేణి నా
శ్రీయుత మౌక్తికద్యుతివిశేషదరస్మితనా నవప్రవా
ళాయతపాణిపాదయుగ నా వరహీరనఖాళిఁ గాంచి యా
హా యిది రత్నరాశి వనితాకృతి దాల్చి మెలంగెడుం జుమీ" 2_152.

ఆమె యధరము, పద్మరాగము. ఆమె ఇంద్రనీల వేణి. ఆ దరస్మితము మౌక్తిక ద్యుతి గలది. ఆమె పాణిపాదయుగము ప్రవాళాయతము. ఆమె నఖములు వరహీరములు. ఇట్లామె సర్వాంగములు రత్న సదృశములు. కనుకనే బుధుడు ఆమెను వనితాకృతి దాల్చిన రత్నరాశి యని భావించినాడు. అతడు చంద్ర కుమారుడు. ఆమె సముద్రము నుండి పుట్టినచో (రత్నరాశి) అతనికి మేనత్తవరుస యగును. కావున బుధున కామె వరణీయ యని చమత్కారము.

## 28 మృదంగధ్వని:

మనుచరిత్ర యందలి క్రింది పద్యమును గమనింపుడు.

"మృగమద సౌరభ విభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ
ద్ధగి తేతర పరిమళమై
మగువ మోలుపు దెలుపు నొక్క మారుత మొలసెన్"

పై పద్యమునందలి నాలుగవ చరణమును మృదంగ పరిభాష లోనికి మార్చినపుడు "తకిట తకిట తకిట దీంత తాకిట తకతోం" అని కావచ్చునని శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారభిప్రాయపడిరి.[1] మరియు వసుచరిత్రము నందలి క్రింది పద్యమును గమనింపుడు.

"ఉద్ధత రిపువిద్ధ తపన
పద్ధతి కరిభవనదవని పటదంబుధి సం
పద్ధరణ సముద్ధరణ స
మిద్ధ రణ రజోవ్రజోద్యదిభమద సృతికిన్" వసుచరిత్ర. 1_89

"పై పద్యములో "సంపద్ధరణ, సముద్ధరణ, సమిద్ధరణ" అను చోట మాత్రమే స్పష్టిగా మృదంగ పరిభాష యున్నదనుచున్నాను. 'తద్ధీత్త కిట తద్ధీత్త కిట తద్ధీత్త కిట' అని మూడుసార్లు వలుకుచున్నది"[2] అని శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల వారభిప్రాయపడినారు. ఈ పద్యము విషయముననే శ్రీ యస్. రాజన్న కవి గారిట్లభిప్రాయ పడియున్నారు. ఈ పద్యమున,

తద్ధి తకిట తద్ధిత ఝుణు
తద్ధిరుతకు తకిట దికిట తకతోం కిట తాం
కుత్త ఝుణు కఝుంత ఝుణు కు
కూంత దిరు తఝోంత కూంత తకుత దిగిణి తోం

అను మృదంగ "తత్కార" వాద్యధ్వని ఎంత మనోహరముగ ఆదితాళలయ ప్రధానముగ వ్యక్తము చేసెనో సహృదయైక వేద్యము" అన్నారు.[3] ఇట్టిదే అబ్బయామాత్యుని దొక పద్యము గనుడు.

---

1. వసుచరిత్ర సంగీత సాహిత్యములు పుట_8
2. " " " "_9
3. " " " "_22

"యతి యతి నియతికి గిరిజా
సతిపతి మతి సంతసించి సాగుణ్య నిజా
కృతి శ్రుతి తతి నుతి పాత్ర
స్థితి ధృతి యుతి దర్శితంబు చేసె న్మనికిన్" 2_201

## 29 లేములు దాగిన చోట్లు :

పురూరవుడు రాజ్యాభిషిక్తుడై ధర్మపద్ధతిని రాజ్య మేలగా లోకులందరు ధనవంతులైరట. ఇక లేములకు దిక్కేది ?

"అలనృపుధర్మ పద్ధతి సమస్తజనుల్ ధనవంతు లౌటఁ గా
ల్నిలువఁగఁజోటులేక భువి లేములు లేమల బల్ పిఱుందుల
న్నెలచనుగట్ల నందులను నెన్నడుసీమల నీఁగె ఖానుమం
డలరుచిఁ దూలి గొందుల నడంగిన చీకటికై వడిం దగన్" 3_10.

లేములు దిక్కు తోచక నామ సామ్యత చేతఁగాఁచోలు లేమల నాశ్రయించి, ం పిఱుందుల సందుల, చనుగట్ల నందుల, నెన్నడు సీమల నీఁగెనని క. చమత్కృతి. అదియు చీకటి. సూర్యునికి జడిసి చీకటి, గొందులలో దాగినట్లు ఆ రాజు రాజ్యమునందలి లేమలు పీనస్తనులు, గురు జఘనలు, గగనమధ్యలు నని చెప్పక చెప్పినట్లయినది. ఇట రాజు వితరణ శీలియనుటను వర్ణింపగా, నా రాజ్యము నందలి లేమలు సౌందర్యవతులని చెప్పుటయు నన్యాపదేశముగ ఘటిల్లినది.

## 30 విరహము :

ముక్తపదగ్రస్తము పోయిన పోకడల గనుడు,

"చిలు విషముఁ గూతఁ గోయిల చెవుల ఁజిలుక
జిలుక పగవారి చుట్టమై చెదరఁ బలుకఁ
బలు కలువ యూరె దారి దా వలఁచె నలుక
నలుక నొందెను జెలి బాష్పజలము లొలుక" 3_78

ఊర్వశి పురూరవ లగ్నమానసమై విరహార్తి నొందిన ఘట్టమది. కోయిల చిలు విషప్రకూతఁ జెవులఁ జిలికినది. చిలుక (శుకము) పగవారి చుట్టమై చెదరఁబలికినది. పలు కలువ యూటె దారి తా నలచినది. అలుక (తాపము) తోన్ జెలి బాష్పజలము లొలుక నార్తి నొందినది. ముక్తపదగ్రస్తమున నిట్లు చిత్రించుటచే ఒకటి తర్వాత నొకటిగా గాక, నన్నియు వెంట వెంట నొక్కటిగా పగగొని చెలిని బాధించినవని సూచన. వదలక బాధించినవని చమత్కృతి.

## 31 ప్రపాగేహ విలాసినులు :

అది తీవ్రమైన వేసవి. గ్రీష్మము తీవ్రముగ నుండెను. పాంథులకు నోరెండుకొని పోవుచుండగా ప్రపాగేహము గానిపించినది. వారికి ప్రాణములు లేచి వచ్చినవి. నీరు త్రాగుట కట కేగిరి. చూడగా చల్లటి నీరు వోసెడి విలాసినుల సోయగము, కనులు చల్లగ నున్నవి.

> "మోహకర స్తనోచ్చలనముల్ గనిపింపఁగ వేసవిం బ్రపా
> గేహ విలాసినుల్ పసిఁడి గిండ్ల జలంబులు దేరఁ బాంథు లో
> హో హో లసత్పయోధరము లున్నతపుం గలశంబు లంగ భూ
> దాహముఁ దీర్చుకొందుము గదా దయచేసిన నంద్రు నవ్వుచున్" 4_14

వారికి కవిత్వము పుట్టుకొని వచ్చినది. ఎంత సరసము!

## 32 నాసిక :

> "మువిత యొక్క తె సంపెంగ మొగ్గ తావి
> కొనుటకై నాసికా ద్వారమునకుఁ జేర్పఁ
> గోరి సౌందర్య భిక్షకై చేరఁ బోలు
> వాకిటికి న.చు నవ్వేరి వనిత లెల్ల" 4_71

నాసికను సంపెంగతోఁ బోల్చుట కవులకుఁ బరిపాటి. కాని వసుచరిత్రకారుడు "నానాసూనవితాన వాసనల నానందించు సారంగ మేలా నన్నొల్లదటంచు" భావించి తపస్సొనర్చి, నాయికామణి నాసికగా జన్మించినట్లు వర్ణించిన విధము చూచియే

అబ్బయ పై వర్ణనము చేసినాడనిపించును. తపస్సుచే పునర్జన్మనంది నాసికగా మారిన సంపెంగ (గంధఫలి) "పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంము లిర్వంకలన్" అని చెప్పుటచే, సంపెంగకు తపస్సు సార్థకమైనట్లు తోపదు. కావున సంపెంగ, అబ్బయామాత్యుని కావ్యనాయికయైన యూర్వశీ తలోదరి నాశ్రయించినది. ఆమె నాసికా సౌందర్య దర్శనముచే సమాకర్షింపబడిన సంపెంగ భృంగముల నాకర్షించు కోరికతోఁ గాబోలు, ఊర్వశీ నాసికాశ్రయ నెపమున సౌందర్య భిక్షకై నిలిచినదట. తపస్సు చేసి పునర్జన్మలో గూడ సాధింపజాలని సౌందర్యమును, ప్రస్తుత జన్మము నందే సిద్ధించుట విశేషము గదా!

# 33 వీణావాదనము :

సంగీత వాద్యములందు వీణ శిరోమణి. అట్టి వీణవాదనమును గూర్చి వర్ణించుచు వసుచరిత్రకారుడు రాగములను గూర్చి సరసమైన యూహచేసి యుండగా అబ్బయ చేపట్టిన మార్గము భిన్నముగా నున్నది. మిత్రావరుణుల తపోభంగమొనర్ప నేతెంచిన యూర్వశి వీణ వాయించిన విధము గనుడు. "మంద్ర మధ్యమ తారకాసాంద్ర సరిగమ, పదని స్వరానుస్వర మాధురీధరీణ గీత ప్రబంధ ప్రమాణ ఫణితి" ని గాన ప్రవీణ యగుచు వీణవాయించినది.[1] అంతకు ముందు చేసిన వర్ణనము చూడుడు.

"గవిసెనఁ బాయఁగా దివిచి కైకొని సారెలు చక్కనొత్తి మా
ర్దవ ఫణితిన్ శ్రుతుల్ గలియఁ దంత్రులు చక్కఁగ మేళగించి చ
న్గవపయి నొక్క కాయ యొకకాయ నిజాంకమునందు నుంచి ప
ల్లవ మృదు లాంగుళీహతి కలక్వణితంబుగ వీణ మీఁటుచున్" 4–108

ఇట రతి ప్రసంగస్ఫూర్తి కొంత ప్రస్ఫుట మగుచున్నది. బహుశః మిత్రావరుణుల వశీకరించుకొనవలసి యున్నది కావున నట్లు చేసినదని చెప్పనచో నది యౌచిత్యవంతముగ నుండును.

---

1. కవిరాజమనోరంజనము : 4–107.

## 34 జాతీయపు ఘాటలు :

ఉద్యానవన పాలకులు పామరులు, వారు పురూరవుని దర్శించి, తా ముద్యానవనమున జూచిన ఊర్వశీ చిత్ర ఫలకమును ప్రభువులకు సమర్పించుచు పలికిన పలుకులివి. శ్రుతిపేయముగ నున్నవి.

"సామి వారి తోటలో మిద్దె ముంగలి
యరంగు మీద నుండె నాద కెవడు
దెచ్చి పెట్టినాడొ దేవరా యెఱుగము
కానరాదు వింత మాని సడుగు" 5—23

కదాకర్ణనమున పురూరవునకు హాస్యరసస్ఫూర్తి కలిగినదట. తీయని జాతీయముల ఘాటు యీ పద్యము సుదీర్ఘ సమాస ఘటితమైన రసవద్రచనలోనిది "హాస" కారణము కాకుండునా యనుకొను వారికి కాదని యవి జాతీయపు మాటలని కవి సుస్పష్టమొనర్చినాడు.

## 35 నడుము :

నాయికా మధ్యమును వర్ణింపని కవి లేడు. దానిని వేదాంతముతో ముడి పెట్టిన వారును గలరు.

శ్రీనాథుడు దమయంతిని వర్ణించిన విధము గనుడు.

"కమ లేందీవర షండ మండిత లసత్కాసార సేవారతిన్
గమికిర్మీకృత నైక నీవృతునై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందు బింబాననన్
సమపీనస్తని నస్తి నాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్" శృం. నై. 2—21

దమయంతి మధ్యము, అస్తి నాస్తి విచికిత్సాహేతువై నదట. అస్తినాస్తి యని చర్చించుట వేదాంతుల వాదము. బ్రహ్మ పదార్థమును గూర్చి చర్చించువారు, కలదో లేదోయని చింతించునట్లే యామె మధ్యము సైతము సంశయాత్మకముగ

నున్నదని భావము. అనగా మిగుల సన్నని నడుము కలది. అబ్బయామాత్యుడు చెప్పిన పద్యము చూడుడు.

"కనఁబడునట సగుణస్థితిఁ
గనరాదట నిర్గుణాప్తిఁ గలదో లేదో
కనకాంగి నడుము పోలిక
యెనయఁ జిదంబరరహస్య మెప్పఁ దెలుఁగున్" 5-182

బ్రహ్మము సగుణస్థితిని కనిపించును. నిర్గుణాప్తి కనిపించదు. అది వాదము. ఇచ్చట దానినే చమత్కారముగ, సగుణస్థితి మొలనూలు (గుణము = త్రాడు) చూచి నడుమున్నదనుకొందుము. అది రతివేళ జారి, నిర్గుణమైనప్పుడు నడుము లేదనిపించును. నిర్ణయించుటకు వీలులేదు. అప్పట్ల తెలుగువాడు ప్రయోగించు సామెత, చిదంబర రహస్యము. చిదంబరమున తెరదీసి వెంటనే పైతురట, అలోపుననే దైవదర్శనము చేసి కొనవలయును. క్షణకాల దర్శనముచే దేవళమున దైవముండెనో లేదో సంశయాత్మకమగును. ఇదియు నట్టిదే. పూర్వ కవిని యనుసరించుచునే దానికొక సామెతను గూర్చి, నాయికా మధ్యమును వర్ణించిన కవి తనివి తీరక మరియొక చోట యా నాయికా మధ్యమునే వర్ణించిన తీరు గమడు.

"విభుఁడు తమకించి కటి చీర వీడఁ దివియ
నంబరము లేకయును విలాసాంగి మధ్య
మంబరం బున్నయట్లుండె నదరి చెదరు
నాయకముల సిగ్గు నిలుపలే దాయెఁ గాని" 5-203

ఊర్వశి విభుడు పురూరవుడు సంగమవేళ చీర వీడఁ దివియగా అంబరము లేకయు నామె మధ్యము, అంబరమున్న యట్లుండెనట. అది చమత్కారము. అంబరము = వస్త్రము/ఆకాశము. వస్త్రము లేక యుండుటెట్లనగా, వస్త్రమను నర్థమున లేదు. ఆకాశమను నర్థమున నున్నది. ఇదియే నిర్ణయము. ఆమె నడుము ఆకాశము వలె శూన్యమనుట. ఆమె నడుమునకు రూపము లేదు. వస్త్రము కట్టినచో ఉన్నట్లు తోచును. లేనిచో గూడ నున్నయట్లున్నదనుట శబ్ద చమత్కృతి. బ్రహ్మము, సగుణమైనను, నిర్గుణమైనను ఉండుట యథార్థము. అది యున్నదని తెలియుట

చిత్తు (జ్ఞానము) చిదంబరము (జ్ఞాన వస్త్రము) యొక్క ఉనికి రహస్యము. వేదాంతమంతయు నిందు గుదిగుచ్చి పోసినాడా యనిపించును.

## 36 సాంధ్యరాగము :

సాంధ్యరాగము సహృదయ రాగోదయ కారణము. దానిని వర్ణింపకుండు టెట్లు. అబ్బయ వర్ణన గమడు.

"వరుణ శుద్ధాంత యావత చారు సీమంత
    సింధూర రజముతోఁ జెలిమి చేసి
పనధి రాజోద్యాన వనవాటికా తరు
    కిసలయ శ్రేణితోఁ గ్రీడ సల్పి
పాశభృత్కేళికా పద్మాకరోత్ఫుల్ల
    హల్లక వ్రజముతో నసఁగి పెనఁగి
ప్రాచేతసోజ్జ్వల ప్రాసాదములఁ బొల్చు
    కురువింద మణులతో సరస మాడి

నిండుకొనియె సమస్త దిఙ్మండలమున
సాంధ్యరాగంబు తాండవ సంభ్రమభ్ర
మన్మహానట పటు జటా మకుట ఘటిత
ఫణి ఫణా మణి గణ ఘృణి ప్రచుర మనఁగ" 5–172

ఈ పద్య రచనారీతి శ్రీనాథుని క్రింది పద్యమును తలపించుచున్నది.

"గగన కల్లోలినీ కల్లోల మాలికా
    హల్లీసకములతో వవఘళించి
చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా
    స్తబక పంక్తుల తోడ సరస మాడి
శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా
    విమల చంద్రికలతో వియ్య మంది
బిసరుహాసనవధూ పృథు పయోధరభార
    హార వల్లరులతో నసగి పెనగి

పెలయు నెవ్వాని యభిరామ విమలకీర్తి
యతడు త్రిభువనారామ వేశ్యా భుజంగ
కదన గాండీవి జగనొబ్బగండబిరుద
శాశ్వతుం డొప్పు సింగన సచివవరుడు" శృం. నై. 1_37

శైలి విషయముననే పోలిక కానిపించును. తాను చెప్పదలచిన భావమును శ్రీనాథుని రీతిలో చెప్పవలయు నన్నదే అబ్బయామాత్యుని యుద్దేశమైయుండును. ఇక అబ్బయామాత్యుని వర్ణన పై శిష్ట్యమును పరిశీలింతము. సాంధ్యరాగము వరుణ శుద్ధాంత యావత చారుసీమంత సిందూరముతో చెలిమిచేసి, ఉద్యానవన వాటికల లోని కిసలయములతో గ్రీడసల్పి, పద్మాకరము నందలి హల్లకములతో ననగి పెనగి, ప్రాసాదములందలి కురువిందమణులతో సరసమాడి సమస్త దిఙ్మండలము వ్యాపించినదట. నాలుగు దిక్కుల వ్యాపింప పలయునని కాబోలు, వరుణుని పట్టణ మందే నాలుగు విధముల సాధన సంపత్తిని కూర్చుకొన్న దనిపించును. ఇక నాపై యబ్బయామాత్యుడు చేసిన యూహ మహాద్భుతము. మహానటుని మకుటస్థ ఫణి ఫణామణిగణఘృణి యని చూపటకుఁ దోపజేయుట దాని వై శిష్ట్యమునకు హేతువు. శివ సంబంధముచే నా సాంధ్యరాగము పవిత్రమైనది. సంధ్యా సమయములందు నటరాజు తాండవము సేయుట లోక విదితము గదా! దాని నాధారముగఁ జేసుకొని కవి చేసిన యూహ సరసహృదయ రంజకమగుట నిశ్చయము.

## 37 ఉషస్సు:

ఉషస్సును గూర్చిన ఈ క్రింది వర్ణనము సుదీర్ఘ సమాసఘటితమయ్యును, నాదయుక్తమై, సుందరమై అబ్బయామాత్యుని సంగీత సాహిత్యాభిజ్ఞతను చాటు చున్నది.

వనవాటికలయందు వరవిహంగివిహం
గసమాజ కూజిత కలరవంబు
ప్రాసాదములయందుఁ బాఠకోద్గీత భూ
పాలాది గీతికా బహుళరవము

గోస్థానములయందు గోపకాహ్వా నోత్సు
కారంభ సురభి కాంభారవంబు
నళినాకరములందు నవనవోత్ఫుల్లార
విందబృంద చలన్మిళింద రవము

స్నానఘట్టంబులందు మజ్జన విధాన
నిరత విశ్వంభరామర నికర పఠిత
సుప్రసిద్ధాఘమర్షణ సూక్త రవము
శ్రావ్యమై యొప్పె నయ్యుష స్సమయమునను" 5_223

పద్యము నడకయే సంగీత భణితిలో నడచినది. ఇక పఠించిన విను వారికి శ్రావ్యమగుట యతిశయోక్తి కాదు. అబ్బయలో నొక విశేషమున్నది. అతడెంత రసికుడో అంత నైష్ఠికుడు. ఎంత భోగియో, అంత యాధ్యాత్మిక చింతన గలవాడు. ఒక మాటలోఁ జెప్పవలయునన్న స్థిత ప్రజ్ఞుడని చెప్పదగినది అదియు మంగళాచల నృసింహుని కృపావిశేషమే. సీస పద్యము నందలి నాలుగు పాదములందు నాలుగు లోకసంబంధి సహజ విషయముల వర్ణించినాడు. చివరికి అఘమర్షణ సూక్త రవమును గూడ నందుఁ జేర్చిన గాని యతనికి తృప్తిగా లేదు. అది యతని జీవగత సులక్షణము. సాంధ్యరాగవర్ణనము నందు సైతము చివరికి శివ సంబంధమును వర్ణించి పవిత్రత నాపాదించుటకు పూనుకొన్నాడు. సౌందర్య పావిత్ర్యములు జంటగా సాగవలయు నన్నది అతని హృదయమని తోచును. పావిత్ర్యము వాచ్యముగగాని, వ్యంగ్యముగగాని చిత్రింపబడును.

## 38 నాయకుని చూపు :

"తరుణి నడుమున ఖేచరత్వము వహించు
వనిత కటియందు భూచరత్వంబు దాల్చు
రమణి నాభిఁ బాతాళ చరత్వ మభ్య
సించు నవ్విభు చూపు లచ్చెలువఁ గదిసి" 5_208,

అబ్బయామాత్యుని వర్ణనములలో నొక చమత్కృతి, మఱియొక విశేషము ఇతఁ

గూడి యుండుట సాధారణముగ కానిపించును. పురూరవు డూర్వశివి చూపిన చూపును వర్ణించుచున్నాడు. అతని చూపు, ఆమె నడుమున చరించినపుడు, ఖేచరత్వమును బొందునట. అనగా నామె నడుము ఆకాశ మని తాత్పర్యము. నడుము శూన్యమనుట సౌందర్య హేతువు, కవి సమయమును. చెప్పెడి తీరే క్రొత్తది. ఇక నతని చూపు ఆమె కటి భాగమున చరించినప్పుడు భూ చరత్వమును బొందునట. అనగా నామె కటి భాగము భూమండలమంత ఘనమని. ఇదియు సౌందర్య హేతువే. అతని చూపు, రమణి నాభి యందు చరించినప్పుడు, పాతాళమును బొందునట. అనగా నామె నాభి పాతాళ సదృశము. నత నాభీత్వ మంగనల యందు సౌందర్య హేతువే గదా ! పైకి చూడగా నాయికాంగ సౌందర్య మాత్ర వర్ణనముగా భాసించును. కాని లోనరసి చూచినచో విశేషమున్నది. మునుముం దూర్వశీ పురూరవులు, ఇంద్ర దత్త వరముచే త్రిలోకములలో నెందైన విహరింప సమర్థులు. దానిని అనగా నాయకాభ్యుదయ సూచనమే యిట వ్యంగ్య విలసితమై యొప్పారుచున్నది. అతని చూపు గగన భూ పాతాళములలో చరించుటను అభ్యసించుచున్నదన్న మాటలో నీ సూచన గలదు. ముమ్ముందనుసరించు సామర్థ్యమును సాధించుట కభ్యాస మవసరము గదా! అదీ చమత్కారమన్న యట్లుండవలయును. త్రిలోకములలో చరించునది (అచ్చెలువఁగదిసి) పురూరవుఁడా ? అతని చూపా ? యన్న నభేదము చెప్పవలయును. అచ్చెలువఁగదిసి యనుటచేత పురూరవుడే త్రిలోకమునందు విహరణ సమర్థుడగునని స్పష్టార్థము. దాని కుపస్కారకముగ, మూడు చోట్ల ప్రయోగించిన క్రియలు వహించు తాల్చు అభ్యసించు అనునవి కూడ సార్థకములే.

## 39. వేగుచుక్క :

అబ్బయామాత్యు డీ కావ్యమునందు వర్ణన చేయుచునే ఒక్కొక్క చోట నొక్కొక్క చమత్కృతిని సాధించినాడు. తెల్లవారుఝామున వేగు చుక్కఁ బొడుచుట సహజము దాని కాపేరేల వచ్చినదో కవి చమత్కరించిన తీరు గనుడు.

"అపుడు తమంబు చొప్పుఁ దెలియన్ సమయోచిత వేషధారియై
తపనుని యాజ్ఞఁ గైకొని ప్రమదంబున వేగున కేగుదెంచు దూ

త పగిడిఁ జూడ నొప్పె నుదితంబయి తూర్పున వేగుచుక్క యా
నెపమునసో దదాఖ్య ధరణిం ప్రతిపాదితమౌట దానికిన్" 5_217

తమంబు చొప్పు తెలిసికొని రమ్మని పంపగా సూర్యునికి వేగుగా పని చేయుటకై వచ్చిన దూత వంటి దగుటచేత వేగుచుక్క కా పేరు వచ్చి యుండ వచ్చునని కవి చమత్కరించినాడు. వేగు శబ్దముపై శ్లేషించిన తీరు సరళ సుందరము.

## 40. ఇంపు:

కవిరాజ మనోరంజనము నందలి పద్యము లన్నియు రసికుల కింపు గూర్చెడివి అందులో నీ పద్య మొక ఇంపుల గుంపు గమనింపుడు.

"పలుకుల యింపు ముద్దుగొను పెంపుఁ జనుంగవ యుబ్బరింపుఁ జె
క్కుల చెమరింపు మై పులక గుంపు వదల్పని కౌగిలింపుఁ గ
న్నుల యదలింపుఁ గీలుజెడ నొంపుఁ దలంపున వేడ్క నింపు నీ
కలయిక సొంపు నేమనవఁగాఁగలనా కలనైనఁ గోమలీ" 5_274

ఈ పద్య మొక రసధుని. పలుకుల మోహరింపు ఇంపుఁ గూర్చెది సొంపు రసికుల తలంపునకు వేడ్క నింపక యేమి జేయును? రసజ్ఞు లెవ్వ రీ ఇంపు గుంపు సొంపును మఱవగలరు?

## 41 నారదవర్ణనము:

అబ్బయామాత్యుడు నారదమహర్షిని వర్ణించిన తీరు మిగుల చిత్రమైనది. అతడు సంయమీంద్ర చంద్రుడు.

"లాంఛనంబు సముజ్జ్వల భుజాంతరస్థితి
మహతి రూపంబున రహివహింప
నస్పృతంబు విష్ణునామాక్షర మధుర గాం
ధర్వ రూపంబునఁ దరఁగ లెత్తఁ

"చంద్రిక ల్ధళధళాచ్ఛశ్వేత శారీర
కాంతి రూపంబునఁ గ్రమ్మికొనఁగఁ
జల్లదనంబు శశ్వత్కృపారసపూర్ణ
దృష్టిరూపంబునఁ దేటపడఁగ

మనుమఁడైన పురూరవక్ష్మాతలేంద్రుఁ
జూడ నేతెంచు చంద్రుని జాడ దోఁప
నరుగు దెంచె నభోమార్గ యానమునను
నారదుఁడు మూర్తికితశరన్నారదుండు" 1-108

మనుమడైన పురూరవునిఁ జూడ వచ్చిన చంద్రునివలె మన్నాడట సంయమీంద్ర చంద్రుడు నారదుడు. చంద్రుని యందుగల లాంఛన అమృత, చంద్రిక, చల్లదనములు, నారదునియందు మహతి, విష్ణునామాక్షర మధుర గాంధర్వ, అచ్ఛశ్వేత శారీరకాంతి, కృపారసపూర్ణ దృష్టులను రూపమున వెలపి యున్నవని కవి చమత్కారము. ఇప్పటివ కవి నారదుని చంద్రునితోఁ బోల్చినాడు. తరువాత పురూరవుని నోట నారదుని వర్ణించిన తీరు గనుడు.

"విను తమోగుణహర్తవై వెలయు నీవు
మిత్రరూపంబుతో వచ్చి మేలొనంగ
నిపుడుగద యబ్జకులమున కెలమియుగుట
చక్రవర్తిత్వ మిఁకఁ గదా స్పష్టమగుట" 1-113

అజ్ఞానమును తొలగించుటకై మిత్రునివలె నారదుడు వచ్చుట వలన చంద్రవంశమునకు చక్రవర్తిత్వము స్పష్టమైనదట. ఇది వినయోక్తి. ఇక నారదుని యందు అర్థాంతరముగా సూర్యలక్షణములు ప్రతిపాదింపబడినవి. సూర్యుడు తమోహర్త అతని రాకవలన అబ్జకులము (తామరలు) వికసించును. సూర్యుని రాకచే చక్రవాకములు సంతసమున వర్తించును. ఇట్లు సూర్యలక్షణములను, చంద్ర లక్షణములను ఒకే పాత్రయందు ప్రతిపాదించు సామర్థ్యము అనన్య సాధారణమైనది. అతని చంద్రత్వమునకు, మిత్రత్వమునకు సమన్వయ రూపమున వికసించు అబ్జములు (తామరలు/కలువలు) ధన్యములు. చక్రవర్తిత్వము చక్రవాకముల యందు

పురూరవుని యందు స్థిరముగ నుండుటకు హేతువేర్పడినది. సూర్య చంద్రులవలె నీ పురూరవుని చక్రవర్తిత్వము సుస్థిరమై యుండు ననుట విశేషము.

## 42 తార మోహిని యపరావతార:

తారను వర్ణించుచు, కవి యామెను మోహిని యపరావతార మనును.

"ఆ గురుదార రూపరేఖాత్యుదార
చారు కుచభార శృంగార తారహార
సుగుణ విస్తార వదనాబ్జ సురుచి విజిత
తార మోహిని యపరావతార తార" 2_7

యమకము, అంత్యప్రాసము సమ్మిళితమై పై పద్యమొక సంగీత రసధునివలె సాగినది. చంద్రుని మోహింపజేయగల లక్షణము లన్నియు వర్ణింపబడినవి. ఆమె వదనాబ్జ సురుచివిజిత తార యనుటలో నొక విశేషమున్నది. తన కాలిగోటి కాంతి చేత తారల నోడించినది. కాలిగోటికి పోలదగుట తెమగునోట నానిన నుడి కారము. తారలను మించిన సౌందర్యము గలది. కావుననే తారానాథుడామెను మోహించెనని సమర్థనము. మరియు నొక విశేషమున్నది. ఆమె మోహిని యప రావతార. ఒకప్పుడు శ్రీమహావిష్ణువు మోహినీరూపము నొందగా, చంద్రశేఖరుడు మోహితుడైనా డన్నది ప్రసిద్ధ గాథ. కాగా నీమె మోహినీ యపరావతార మను టతో చంద్రుడు మోహితుడగుట సహజమే యని కవి చమత్కృతిచే సమర్థించు చున్నాడు.

## 43 విచిత్రవనము:

ఊర్వశీ పురూరవులు మొట్టమొదటి సారిగా చిత్రవనమున గలిసికొనిరి, ఆవనమును కవి వర్ణించిన తీరు గనుడు.

"అమరతరువునకు పంటాన మనిన పేరు
నగవిభంజను తోటకు నందకాఖ్య

మదనసంహారు పనికిఁ గుమార సంజ్ఞ
యగుట తద్వనసంతతి యగుట నేమొ" 5_58.

సంతాన (అమర తరువు) నందక (ఇంద్రుని తోట), కుమార (శివుని తోట) అను శబ్దములు సంతానమను నర్థమున పర్యాయ పదములు. విచిత్ర వనమున కాముడు వనములు సంతాము వలె నున్నవట. అనగా ఆ మూడింటికన్నను, విచిత్ర వనమే శ్రేష్ఠమని స్పష్టము చేయుటకై కవి మూడింటికి ఈ విచిత్రవన సంతానమని చాటుటకే సంతాన పర్యాయ పదములఁ బ్రయోగించుట జరిగినది. ఇట్లు మూడు గొప్ప వనములకన్న శ్రేష్ఠత్వము నీవనమునం దారోపించుటకు కవి శబ్ద సంతానమంత మహిమాస్పదమై యున్నది ఇక కొదవయేమి? విశేషమును గలదు. ఈ వనమునందే ఊర్వశీ పురూరవులు పరస్పరము చూచుకొనుట జరిగినది. తరువాత పురూరవు డామె నేలుకొనుట, చంద్రవంశవృద్ధికరులైన ఆయువాది షట్కుమారులుద్భవించుటయు జరిగినది. కావున పురూరవునకు సంతానోదయ హేతువైన యావనము సామాన్యమైనది కాదని చెప్పుటేగాక; తద్వన సంతతి ప్రసిద్ధమైనదని సూచించుట జరిగినది.

## 44 నగ - నాగ

నేయార్థము కావ్యదోషము లందొకటి. ఐనను కవులు, పెండ్లి పిల్ల చెంపపై దిష్టి కొఱకు పెట్టెడు కాటుక చుక్కవలె సోయగమునే చేకూర్చునవి కాబోలు తమ కావ్యములం దచ్చటచ్చట కూర్చియున్నారు. వసుచరిత్ర కారుడు "స్వైర విహారధీరలగు సారసలోచనలున్న చోటికి బోరన లాతివారు చొరబూనినచో రసభంగమంచు"[1] వర్ణించునప్పుడు నేయార్థమును చెప్పినట్లే భావించవలయును "సా ర స లో చ న లు," 'రస,' భంగమైన "సాలోచనలు" గా మారుదురు, ఇది కవి తానై నియమించుకొనినది. చమత్కారావహమగుటచే, విమర్శకులు మెచ్చుటయు గలదు. పెద్దనగారు తమ మనుచరిత్రలో ప్రథమ సురతమును వర్ణించి యుండిరి. [illegible].

1. వసుచరిత్ర : 2_55

"సహసా నఖంపచ స్తనదత్త పరిరంభ
మా మూల పరిచుంబి తాధరోష్ఠ
మ తివయ ప్రేమ కల్పిత దంతసంబాధ
మ గణిత గ్లాని శయ్యానిపాత
మ తివేల మణిత యాచ్ఞార్థ గల్లచపేట
మ తిదీన వాక్ప్రాచి తాత్మవిరహ
మంకుర త్పులకజాలావిద్ధ సర్వాంగ
మానందకృతహరవానవాజ్ఞ

మా క్రమక్షణనుతివర్ణ మానిమీలి
తాక్ష మాస్విన్నగండ మాయత్త చేష్ట
మా స్తిమితభూషణారవ మా వధూటి
ప్రథమసురతంబు గంధర్వపతిఁ గరంచె" మనుచరిత్ర 3_116.

పై సీస పద్యమందలి ప్రథమ పాద ద్వితీయ ఖండాదిగ ప్రతిఖండ ప్రథమాక్షరము "మ" కారమే. అట్లే గీతమునందలి ప్రథమ తృతీయ పాదాద్యక్షరములు కూడ "మ" కారమే. కానియది సంధిగతమై యచటికి చేరినది. దీనిని పఠించియే గాబోలు అబ్బయామాత్యుడు తన "అనిరుద్ధ చరిత్రము"నందు క్రింది పద్యమును గూర్చి మెఱుగులుదిద్ది చమత్కరించినాడు.

"అధిక ప్రయత్న సంశిథిల నీవీబంధ
మధిముఖ కుంచి తాస్యాంబుజాత
మాలస్య కరగృహీతాంచిత కుచకుంభ
మనురాగ రస నిగూఢాంతరంగ
మాయాసలబ్ధ బాహాలతా పరిరంభ
మాకుంచిత భ్రూయుగాభిరామ
మామోద బాష్పధారా పూరితాంబక
మలఘు సీత్కార మోహన నినాద

పచిర సంభూత మదన తోయప్రవాహ
మవగ తోష్ఠాంగజాత ఘర్మాంబుకళిక
మాత్మపరవశ జనిత నిద్రాభిలాష
మగుచు నయ్యింతి ప్రథమ సమాగమంబు" 1–115.

ప్రతి ఖండాది యందేగాక, గీతమునందలి ప్రతి పాదాది యందును, సంధిగతమైన "మ" కారమును గూర్చి, ఇందొక చమత్కార మున్నదని సూచించుటకు గాబోలు "ప్రథమ సమాగమంబు" అని వ్రాసి యున్నాడు. పెద్దన "ప్రథమ సురత" మనగ, అప్పయ దానిని "ప్రథమ సమాగమ" మనుట నేయార్థము. ప్రథమ = మొదట (ప్రథమా విభక్తి) సమాగమము = మాయొక్క రాకతో కూడుకొనినది. పునః వచ్చుటచే నది, "మమ" కారము వారికి పరవశము పెరిగినదని చమత్కారము. అంతే కాదు తెలుగున బాలవ్యాకర్త సంధి ప్రకరణము నందు "ఉత్తున కచ్చు పరమగునప్డు సంధియగు" నన్నాడు. ప్రథమా విభక్తి "ము" వర్ణము, తరువాతి పద మందలి "అ" కారముతోఁ గలిసి "మా" గా మారుచున్నది. ఈ సంధి నిత్యమగుటచే వారి సమాగమము (శుక్లలోచ నానిరుద్ధుల సమాగమము) కూడ నట్లే నిత్యమని సూచించుటయు గలదేమో! ఇక వసుచరిత్రకారు డనుకరించు కోరికతోఁ గాబోలు క్రింది పద్యమును కవిరాజమనోరంజనమున గూర్చి యున్నాడు

"జగతీధ్రంబులు దేవపాపగతసంచారంబులై నిశ్చలం
బగు వృత్తిం దప మాచరించి శతఘంటారావనిర్భీకయా
నగుణోదగ్రగతి విగ్రహాంతరము లెన్నం దాల్చుటం గల్గెనో
నగసంబంధగతాదివృద్ధి యనఁగా నాగంబు లొప్పం బురిన్" 1–83

పురూరవుని రాజధానియైన ప్రతిష్ఠాన పురము నందలి యేనుగులను కవి వర్ణించిన సందర్భమిది. నగములు నిశ్చలంబగు వృత్తిం దపం బాచరించినవట. విగ్రహాంతరము లెన్నందాల్చుట (మరియొక శరీరము గావలయునను కోరికతో) కారణముగా నవి పర్వతముల వలె నున్నవి. ఇంత పెద్ద యాకారము వీనికెట్లు కలిగినదనుటకు కవి పూర్వజన్మలో పర్వతము లనుట యొక చమత్కారము. కనుక నగసంబంధగతాది వృద్ధి యనుట. శబ్దగతముగ జూచినచో "నగ" శబ్దము నందలి

ఆ ది వర్ణమునకు "వృద్ధి" వచ్చినచో "నాగ" యని యగును గదా యని మరి యొక చమత్కారము. నామరూపములకు రెంటికి హేతువు సరిపడినది.

## 45 నీతులు - లోకోక్తులు :

అబ్బయ తనకావ్యమునందచ్చటచ్చట సందర్భము వచ్చినప్పు డెల్ల చక్కని నీతివాక్యములను, లోకోక్తులను ప్రయోగించి యున్నాడు.

"మనసు చల్లఁబడక మాట లెన్నాఁడిన
ముక్తి గాదు వాద శక్తి గాని
మనసె కారణంబు మఱి బంధమునకు మో
క్షమున కనుచుఁ దెలుపు చదువు వినమె" 1_157.

"మన యేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అను సూక్తిని కూర్చిన తీరట్టిది. ఇది "చదువు". "సూక్తి" "చదువు" అని నిర్ణయము.

"కోరకు మే పదార్థమును గోరిన వచ్చునె రాని వస్తువుల్
గోరకయున్న రావె తనకున్ లభియింపఁగనున్న యర్థముల్
గోరిన రానిచోఁ గలిగి కోల్పడుచో వెత గాన సజ్జనుల్
గోర రనాస్థఁ బ్రాప్తములు గొందురు కుందరు వస్తుహానికిన్" 1_1.2

ఇది యొక సుభాషితమే యగును. రచనారీతి భర్తృహరి నీతి పద్యమును స్మరింపఁ జేయును. రాఘవశతకము నందలి క్రింది పద్యమునకుఁ దీనికి గొంత పోలిక గలదు చూడుడు.

"రాక న్మానవు హానివృద్ధులు మహారణ్యంబులో డాగినన్
పోక న్మానదు దేహ మే విధమునన్ పోషించి రక్షించినన్
కాక న్మానవు పూర్వజన్మకృతముల్ కాగల్గు నర్థంబులున్
లేక న్మాన వ వెంత జాలిపడినన్ లేముల్ సిరుల్ రాఘవా"

మఱియొక సందర్భమున లోకరీతిని చెప్పిన విధము గనుడు.

"అనుదినము నిట్లు హావభావాది చేష్టి
తముల మోహింపఁగాఁ జేసెఁ దార విధుని
బురుషు మన సెంత దృఢమైనఁ బువ్వుఁబోఁడి
వికృతి పైకొన్న సెగపొంత వెన్న గాదె" 2_17.

సెగపొంతవెన్న, పువ్వుఁబోడి వికృతి పైకొన్న పురుషు మనసు. తారాశశాంకుల దుష్ట సంబంధము నచ్చక గాఁబోలు "కలుగదు గదా వివేకంబు కాముకులకు"[1] అంటాడు కవి. "కామార్తా హి ప్రకృతి కృపణా శ్చేతనా చేతనేషు" అన్న కాళిదాసు కవిత గుర్తుకు రాకమానదు. మరొక చోట "దైవయత్నమున్ గడవవశంబె మానుషిక కార్యము నిష్ఫల మెన్ని చూచినన్"[2] అని విధి బలీయమను సూక్తిని గుర్తుకు తెచ్చి చూపించుట జరిగినది.

"దైవాధీనము లోకము
దైవ మధీనము మంత్రతంత్రములకు భూ
దేవాధీనము మంత్రము"[3]

అను పద్యభాగము క్రింది ప్రసిద్ధ శ్లోకమున కనువాదమే.

"దైవాధీనం జగ త్సర్వం
మంత్రాధీనం తు దైవతం
త న్మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణో మమ దేవతా"

పయోముఖ విషకుంభమను రీతిని పాలసుని గూర్చి చెప్పిన విధము గనుడు.

కైరవాప్త కళంకంబు పేర విషము
లోనఁ బూర్ణించియుండఁ బైపైని చంద్రి
కలు వెలింగించెదవు కుత్తుకను విషంబు
నాలుకను బెల్లమును గాదె పాలసునకు" 3_129

1. కవిరాజమనోరంజనము : 2_21
2. " " 2_52
3. " " 2_56

ఇట్లు సందర్భము వచ్చినప్పుడెల్ల నీ కావ్యమున లోకోక్తులు, నీతులు చమత్కృతికి తావులై యలరారినవి.

## 46 స్పర్ధ :

సంగీత సాహిత్యములందీ కవికి వసుచరిత్రకారునితో స్పర్ధయేగాక, పాండిత్యమునందు సాదృశ్యమును గలదు. "తమ్ములు" అను శబ్దప్రయోగ రీతి గమిడు.

"తమ్ములు కుముదప్రియ నీ
తమ్ములు సీ యమజ నివసితమ్ములు శరజా
తమ్ములు నీ యల్లుని కహి
తమ్ములుగాఁ జూడు మనుచితమ్ములు నడకల్" 3_130

"తమ్ములఁ బంపుదు న్మణిశతమ్ములఁ బంపుదు రాజహంసపో
తమ్ములఁ బంపుదున్ బరిచితమ్ములఁ గానదేవతాలి జా
తమ్ములఁ బంపుదున్ ద్రుతగతమ్ముల నేసును సారణిప్రపా
తమ్ముల వత్తు విశ్వవిదితా ! ముదితా ! మది తాప మేటికిన్" వసు. 6_60

మరొక్కటి, రెండును మన్మథ వర్ణనలే.

"నారఁట తేఁటి జోక నలినారఁట తేరఁట చిల్క సోకభో
గ్గారఁట విల్లు పూఁ దయగారఁట చుట్టము శైత్యపున్ సదా
చారఁట కమ్మ గట్టు పరిచారఁట కోయిల కేతనీభవ
ద్వారఁట యిట్టి నీ కొడుగువారఁట లోకు లదేమి చిత్రమో" 3_118

"కొండట విల్లు వేదలల కుండలిరాజట నారి యమ్మనం
తుండట పైటి పల్లియలు దున్నినవాహట యొందు రెందు భ
ర్గుం డిది నిండుపౌరుషమొకో యని గెల్వవె ముజ్జగంబు లు
ద్దండత నొక్క తుంటవిలుఁ దాలిచి యంటినఁ గందు తూపులన్"

వసుచరిత్ర. 3_174

వసుచరిత్రకారుని యనుసరించి అబ్బయ వ్రాసిన పద్యములంత రసవత్తులు

గావు. చమత్కార జనకములును గావు. కాని యాతని ప్రయత్న మతనిది. అతడు స్వతంత్రముగ చేసిన యూహలే కడు రసవత్తులనుట నూటికి నూఱుపాళ్లు సత్యము

"శ్రీమంగళగిరి నరసిం
హస్వామికృపావిజృంభితాద్భుతకవితా
శ్రీమంతుడ గానకళా
ధీమంతుడ దేవతాస్తుతివ్రతపరుడన్" 1–38

మంగళగిరి నారసింహుని కృపచే నబ్బయామాత్యుడు అద్భుత కవితా శ్రీమంతుడైనాడు. గాన కళాధీమంతుడైనాడు. అందుచేతనే కృతజ్ఞుడై దేవతాస్తుతి వ్రత పరుడైనాడు. ఈ మూడు మాటలు నిత్యసత్యములు. సంగీత సాహిత్యములను దైవభక్తిని ముప్పురిగా జేసి రచించిన అబ్బయామాత్యుని కవిత త్రివేణీసంగమ సదృశమైనది. సాహిత్యమున, సంగీతము జాలువారిన కొన్ని సందర్భముల నుటంకింతును.

"వింజామరంబుల విసరు పూఁబోడుల
కంకణ ఝణఝణత్కార రవము
మురువుగా సుతిఁ గూడి మొరయించు వైణిక
వల్లకీ నిక్వణ క్వణ రవంబు
కడు సొంపుగా నాడు కర్ణాట నాటికా
కనక మంజీర ఘల్ఘల రవంబు
ప్రణీత పార్థివ శిరః స్రగ్గంధ లోలతఁ
దిరుగు తుమ్మెదల ఝుంకరణ రవము

మిళిత మగుచు సుధారస గళిత మగుచు
లలిత మగుచు మనోరథ ఫలిత మగుచు
నా నినాదం బపూర్వ మోహన విలాస
మహిమఁ జెన్నొందెఁ దత్సభామండపమున" 1–103

పురూరవ సభామండపము నందు ఝణత్కార రవము, క్వణరవము, ఘల్ఘలరవము ఝుంకరణ రవము సమూహముగ సమ్మోహనముగ నుండెనని వర్ణించుచు, నా నినా

వము అపూర్వమోహన విలాస మహిమఁ జెన్నొందెనని చెప్పుట మిగుల రమ్యము అది మోహనరాగమువలె నింపు గూర్చు చున్నదని చమత్కారము.

## 47 రామకృష్ణునితో స్పర్ధ :

తెనాలిరామకృష్ణు డొకానొక పండితుడు భువనవిజయ ప్రశస్తిని తిరస్కరించుచు మాటాడగ, ఈ క్రింది పద్యమున కర్థము చెప్పుడని యా పండితుని ప్రశ్నించి, నిరుత్తరు నొనర్చెనట. ఇది యొక చాటువు. ఎంత క్లిష్టమో అంత చమత్కారయుతము.

"తేజము సాధువృత్తమును తేకువగల్గిన ధీరు డెప్పుడున్
ఆజికి నిల్లనన్ పరుని యాలికి నిల్లను నర్థికిల్లనున్
తేజము సాధువృత్తమును తేకువ లేని బికారి యెప్పుడున్
ఆజికి నిల్లనన్ పరుని యాలికి నిల్లను నర్థి కిల్లనున్"

అభినయముతో వివరించినగాని దీని యర్థము పొసగదు. బహుశః దీనిని గమనించియే వ్రాసెనో, లేక తానై చమత్కరింప నెంచి వ్రాసెనోగాని ఇట్టిదే అబ్బయామాత్యుని పద్యము గనుడు.

"వనమున నున్న నేమి గృహవాసము చేసిన నేమి యాత్మభా
వనయు నసంగవృత్తి యరివర్గజయంబును గల్గియుండినన్
వనమున నున్న నేమి గృహవాసము చేసిన నేమి యాత్మభా
వనయు నసంగవృత్తి యరివర్గజయంబును లేకయుండినన్" 1–151

శ్లేషచేత చమత్కరించిన తీరు రమ్యము.

## 48 బాలెంతరాలు :

బాలెంతరాలి సొయగమును వర్ణించిన తీరు కడు రమ్యము. మఱియు సహజ సుందరమును.

"పాలుబ్బి బిగివు గుబ్బల నెమ్మొనల తీవి
పసపంటు పయ్యెదపై నటింపఁ
గాయంపు ముద్దల కారంపుఁ దావు లా
స్యనిసర్గవాసన నలమికొనఁగ
నడుమున దిటముగా వడిఁ జుట్టి కట్టిన
బంగారు మైజారు కొంగు దనర
నల్లపూసల పేరు హరుమంజి ముత్యాల
కుతికంటు దాపునఁ గొమరు మిగులఁ

ప్రసవసమయపరిశ్రాంతి బడలియున్న
యంగకమ్ముల నొక వింత యంద మెసగఁ
జూడఁ దగియుండె నప్పుడా సుదతి యందు
లాలితంబైన బాలెంతరాలితనము" 2–190

లాలితంబైన తెలుగింటి బాలెంతరాలి సహజసుందర చిత్రము కనులకు గట్టినట్లు వర్ణింపబడినది. నాటి తెలుగువారి యాచారములు తెలియవచ్చుచున్నవి.

## 49. విరహము :

పురూరవుని గుణగణములను సౌందర్య విశేషమును వర్ణింపగా విని, ఊర్వశి పురూరవుని యెడ మరులుగొని విరహార్తయైన స్థితి, శ్రీకృష్ణగుణాకర్ణనమున నతనిని ప్రేమించిన రుక్మిణి. యతని రాకకై వేచి విరహార్తయైన ఘట్టమును తలపింపఁ జేయుచున్నది.

"చెప్పదు తల్లికిన్ దలఁపఁ జిక్కు దిశల్ దరహాసచంద్రికన్
గప్పదు వక్త్రితామరస గంధ సమాగత భృంగసంఘమున్
రొప్పదు నిద్రగైకొన దురోజ పరస్పరసక్త హారముల్
విప్పదు కృష్ణమార్గగత వీక్షణ పంక్తులఁ ద్రిప్ప దెప్పుడున్"

"తుడువదు కన్నులన్ వెడలు తోయకణంబులు కొప్పుఁ జక్కగా
ముడువదు నెచ్చెలిం గదిసి ముచ్చటకుం జన దన్న మేమియున్

గుడువదు నీరమున్ గొనదు కూరిమి కీరము జేరి పద్యమున్
నొడువదు పల్లకీగుణవినోదము సేయదు డాయ దన్యులన్”

శ్రీమదాంధ్ర మహాభాగవతము. 10_1727, 1728

“పాడదు పల్లఁగా జిలుఁగు పాట విపంచి వహించి యెప్పుడుం
జూడదు కూర్మి నెచ్చెలుల సోఁగకనుంగవ దెప్ప లెత్తి మా
టాడదు పంజరాంతరశుకావళి సారెకుఁ బేరుకొంగ లో
వీడదు చింత వంత యలివేణి మనోభవబాణభిన్నయై”

“పువ్వులు మానెఁ దాని మెయిపూఁతలు మానె సఖీజనంబుతో
నవ్వులు మానె గీరవచన ప్రతిభాషలు మానె మానెఁ దా
నెవ్వియు నింపుగాక సుఖహేతువు లెల్ల మనోజబాధ నా
జవ్వని దుఃఖితే మనసి సర్వ మసహ్య మనంగ లేదొకో” 3_75, 76

పోతన్నను అబ్బయామాత్యుడనుసరించిన తీరు స్పష్టముగ కానిపించును. అభిమానముగల చోట ననుసరణ మవశ్యముండును గదా! సుఖహేతువులింపుగాక పోవుటకు మనోజబాధ కారణమని చెప్పుచునే మఱియొక అభిజనోక్తిని “దుఃఖితే మనసి సర్వమసహ్యమ్” అనుదాని నుటంకించుచు సమర్థించిన తీరు విశిష్టమైనది. పెద్దనగారు మాయాప్రవరుని నోట యీమాటే యనిపించి యున్నారు. “అనాశ్వాసిత దుఃఖితే మనసి సర్వ మసహ్యమన న్నెఱుంగవే”[1] అబ్బయామాత్యున కెంత స్పర్ధయో?

## 50 చందమామ:

చందమామను దూషింపని విరహిణి యీ జగతిని గానిపించదు. చంద్రోపాలంభన వేళ అబ్బయామాత్యుని కవితా విగుంఫనముల గనుడు. రామాభ్యుదయమునందు అయ్యలరాజు రామభద్రుని క్రింది పద్యము గుర్తుకు వచ్చును.

1. మనుచరిత్రము. 3_99

"కానక కన్న సంతానంబు గావున
గానక కన్న సంతాన మయ్యె
వరయ గోత్రనిధానమై తోచు గావున
వరయ గోత్రనిధాన మయ్యె నేడు
ద్విజకులాదరణవర్ధిష్ణుండు గావున
ద్విజకులాదరణవర్ధిష్ణు డయ్యె
వివిధాగమాంతసంవేద్యుండు గావున
వివిధాగమాంతసంవేద్యు డయ్యె

కటకటా దాశరథి సముత్కట కరీంద్ర
కటి కలిత దానధారార్ద్రి కటక మార్గ
గామి యెట్లు చరించు నుత్కట కరీంద్ర
కటకలిత దానధారార్ద్రి కటక తతుల" రామాభ్యుదయము. 5_12

"శ్రీసహజోన్నతిఁ జెలువొందుటయె కాక
శ్రీసహజోన్నతిఁ జెలువుఁ గంటి
సత్కళానిధిపై ప్రశస్తిఁ గాంచుటె గాక
సత్కళానిధిపై ప్రశస్తిఁ గంటి
కువలయహితవృత్తిఁ గొమరు మీఱుటె గాక
కువలయహితవృత్తిఁ గొమరు గంటి
హరిణలక్ష్మఖ్యాతి నందియుండుటె గాక
హరిణలక్ష్మఖ్యాత నంద గంటి

కదిసి విషమాంబకుని కాప్తగరిమఁ గనుటె
గాక విషమాంబకుని కాప్తగరిమఁ గంటి
తనరె నీవింత నీ వింత ఘనుఁడ వయ్యుఁ
జందమా మా చెలి నలంచఁ జందమామ" 3_124

శ్లేషపోయిన పోకలు చెలువు మీరినవి. యమకానుప్రాసలు వ్యాఖ్యా నిరపేక్షములు

## 51 జవరాంద్ర చిత్తములు :

జవరాంద్ర చిత్తములను గూర్చి అబ్బయామాత్యుని వర్ణనము, పెద్దన వర్ణనఁబోలి యున్నది.

"ఒక్కొకవేళఁ బద్మముఖి లొల్లమి సేయుదు రొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాంద్ర చిత్తముల్
పక్కన వేసట ల్జన దుపాయములన్ దగు నిచ్చకంబులన్
జిక్కఁగఁ జేసి దాని సతి చిత్తముఁ బట్టి సుఖింపగాఁ దగున్"
మనుచరిత్ర 3_69.

"వెలఁది నృపాలుఁ జూతు నను వేడ్కయ కాని పహోగ్రు లమ్మునీం
ద్రులు తన యత్న మెట్టులగునో యని చూడదు పోవఁబూనెఁ దా
వలచిన చోటి కేగు శుకవాణి సముద్రముపైన నీఁదుఁ బో
తలఁప నిరంకుశంబులు గదా జవరాంద్ర తలంపు లెయ్యెడన్" 4_50.

జవరాంద్ర చిత్తములు క్షణక్షణములలని పెద్దనగారు రచింపగా నామార్గముననే, తలప నిరంకుశంబులు గదా జవరాంద్ర చిత్తములని అబ్బయ చమత్కరించి నాడు. జవరాంద్రను గూర్చి వెలిబచ్చిన యభిప్రాయములలో రెండింటికి కొంత సామ్యము గలదు. క్షణక్షణములు _ మారుచుండునవి _ హేతువు ఆత్మ సుఖ లబ్ధికే. నిరంకుశంబులగుట _ ఆత్మసుఖ లబ్ధికే. కాని అబ్బయామాత్యుని నాయిక పౌత్ర, జాణ. కావున నిరంకుశమనుట సమంజసము. ఇంద్రుని కాదని, గంధర్వులను కాదని, పురూరవుని యెడ లగ్న చిత్తయైనది యూర్వశి. కావున యామె తలంపులు నిరంకుశములనుట మిగుల సందర్భ శుద్ధిగా నున్నది.

## 52 పుష్ప పూజా ఫలము :

పూవులతో దైవముమ పూజించుట లోకము నందు సహజమే. భగవంతు నేదియో గోరుకొని పూజించుటయు సహజమే. అట్లు పూజించినవారి కా ఫలము దక్కుటయు సమంజసమే గదా! పురూరవుఁడు చేసిన పుష్పపూజాఫలము ఊర్వశి రూపమున సిద్ధించిన తీరు గనుడు.

"ఉవిద నీ కొప్పు నీలోత్పలంబుల గుంపు
భామ నీ కన్నులు పంకజములు
లలన నీ నాస తిలప్రసూనము మధూ
కములు నీ చెక్కిళ్ళు కమలగంధి
తెఱవ నీ ముద్దు వాతెఱ పాటలము మల్లె
మొగ్గలు నీ దంతములు మృగాక్షి
పెలఁది నీ పాలిండ్లు విరిచెండ్లు బంధూక
ములు నీ కరంబులు ముద్దుగుమ్మ

నెలఁత నీ మేను సంపెంగ నీ పదములు
హల్లకము లింత సుమనోలతాంగి నిన్నుఁ
బువ్వుగమిచేత నిర్మించెఁబో విధాత
చాన నీ పొందు పుష్పపూజాఫలంబు" 5–135

## 53 తపము :

ఒక్కొక్కపద్య మెత్తుగడలోనే యొక సొంపు పెలార్చును. సోయగము కనిపించినచో సొక్కిపోవు రసహృదయము గలవాడు అప్పయామాత్యుడు. పోతన్నగారు కుచేలోపాఖ్యానమున కుచేలుని గూర్చి అంతఃపుర కాంతా జనంబుల మనంబుల నద్భుతమందింప జేసిన ఘట్టమునందలి, వర్ణనను చూచి కాఁబోలు తానును అదే యెత్తుగడతో నారంభించినాడు. చూడుడు.

"ఏమి తపంబు చేసెనొకొ యీ ధరణీదివిజోత్తముండు దొల్
బాముల యోగివిస్ఫురదుపాస్యకుడై తనరారు నీ జగత్
స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్న వాఁ
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్"
శ్రీమదాంధ్ర మహాభాగవతము. 10–981.

"ఏమి తపంబుఁ జేసెనొ సుమీ యళు లిచ్చెలి కేశబంధమై
తా నుచయించినందుకు నిదర్శనమౌఁ గద సుప్రసూన పుం

శామల గంధబంధుర రసాతిశయానుభవంబు గల్గునే
కా మఱి పూర్వజన్మమునఁ గల్గిన వృత్తి భవాంతరంబునన్" 5-120.

ఎత్తుగడతోపాటు సుదీర్ఘ సమాస ఘటనము, పూర్వజన్మ ఫలమని సమర్థింపుటయు, మిగుల చమత్కృతిఁ గూర్చుచు. తపః ఫలముగదా సాధారణముగ నుండదు.

## 54 సత్కవి వచనము:

సందర్భము వచ్చినప్పుడెల్ల సత్కవితా లక్షణమును వ్యంగ్యముగ చెప్పుట అబ్బయకు మిగుల నిష్టము. సరస్సును వర్ణించుచు కవి చెప్పిన పద్యము గనుడు.

"కువలయ పుష్కరములతో
భువనములు నిజోదరమునఁ బొలుపొందఁగ స
త్కవివచనవర్ణితంబయి
శివులీల న్మెఱసి సరసి చెన్ను వహించెన్" 5-81

శ్లేషసామర్థ్యముచే సరస్సునకు, శివునికి సాదృశ్యమును చెప్పి అట్లు చెప్పఁ గల్గుట సత్కవివచన వర్ణిత మగుటచే సాధ్యమైనదను సూచన మిగుల ప్రౌఢ సుందరము. తన కవిత్వమును గూర్చి వ్యంగ్యముగ చెప్పిన మరియొక ఘట్టము గనుడు.

"ఏమి మిఁక దాఁప నేల నయవిశ్రుతుఁడైన పురూరవక్షితీ
శుని గుణముల్ జగజ్జన వచో రచన శ్రుతిరంజనంబుగా
విని విని దర్శనంబునకు వేడుక నొందుచు నున్న మా ఘన
స్తని కతఁ డిందు వచ్చుట నిదానము గాదె యభీష్ట సిద్ధికిన్" 5-112

ఎత్తుగడయే యొక ప్రబంధ కవిని తలపించును.

'నిక్కము దాపనేల ధరణీసురనందనః యింక నీ పయిన్ జిక్కె మనంబు నాకు" 1

1. మనుచరిత్ర. 2-51.

అన్నది వరూధిని ప్రవరాఖ్యునితో. అట్టి ఎత్తుగడయే యిది. ఊర్వశి చెలికత్తె మంత్రి కుమారునితో నన్నట్టుగ చెప్పిన సందర్భము. మఱియొక విశేషమున్నది. వరూధిని ప్రత్యక్షముగ ప్రవరాఖ్యుని చూచి, తానై పలికిన మాటలివి. ఇచ్చటి పరిస్థితి వేరు. పురూరవుని గుణములను జగజ్జనవచోరచన శ్రుతిరంజకంబుగ విని విని యాతనికై వలచి వచ్చిన యూర్వశి హృదయ మిది. ఇట మరియొక చమత్కృతియు నున్నది. పురూరవుని గుణగణముల వర్ణనమును ప్రస్తుతము వర్ణించునది అప్పయామాత్యుడు. అతని కావ్యము జగజ్జన వచోరచన శ్రుతిరంజకము కవిరాజమనోరంజనము. ఇట్లు సందర్భమును పురస్కరించుకొని కావ్య ప్రశస్తిని చాటుట యపూర్వము.

## 55 ఊర్వశీ సంభాషణము :

పెద్దనగారి ననుసరించుటయం దీ కవికి ప్రత్యేకాసక్తి యున్నట్లు తోచును ఊర్వశి పురూరవునితో తన దైన్యమును చెప్పిన సందర్భము.

"హృదయేశా ననుఁ జూడు నీకొఱకు నే నిట్లైతి నంచున్ సగ
ద్గద దీనోక్తులచేఁ గపోలఫలకాంతాశ్రూరుబిందుచ్ఛటన్
వదనగ్లాని యెసంగ నుస్సురనుచున్ వామాక్షి జూపెన్ మనో
జ దశాయాసకృశాంగవల్లి పతికిన్ సమ్మోహముం జేయుచున్" 5_148

వరూధిని ప్రవరాఖ్యునితో తనదైన్యము చెప్పిన విధము గనుడు

"పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ ని
చ్చోటఁ దవ న్నఖాంకురము సోకెఁ గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను మిట్టల నశ్రులు చిందువందగన్"
మనుచరిత్ర. 2_70

అట్లే పెద్దన గారు ప్రవరాఖ్యుని సౌందర్య విశేషమును వర్ణించుచు, "ప్రవరాఖ్యదలేఖ్య తనూవిలాసుడై" అని వ్రాసియున్నాడు. అందలి "అలేఖ్య" శబ్దము

అబ్బయామాత్యుని కింపైనవి. పురూరవుని సౌందర్యాతిశయమును ఊర్వశి నోట పలికించిన సందర్భమున చెప్పిన పద్యమునైత మెంత సుందరముగా నున్నదో చూడుడు.

"రాజనిభాస్య పల్కె నలరాజకుమారకుమారుతోడ నో
రాజకుమార ముందు సురరాజకుమారకుఁ జూతు వాహినీ
రాజకుమారుఁ జూతు ధనరాజకుమారునిఁ జూతుఁ గాని నీ
రాజదలేఖ్యమూర్తి సరిరా జగమందు వసింప రెవ్వరున్" 5_143.

## 56 అభ్యంజన స్నానము:

తెలుగునాట యభ్యంజన స్నానమున కొక ప్రత్యేకతఁ గలదు. అబ్బయామాత్యుని వర్ణనము పారిజాతాపహరణము నందలి వర్ణనమునుఁబోలియున్నది.

"కంపన లీలమై నసదు గౌ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమరింపగ హారలతా గుళుచ్ఛముల్
తుంపెనలాడఁ గంకణ మృదుధ్వని తాళగతిం జెలంగగా
సంపెగనూనె యంటె నొక చంద్రనిభానవ కంసవైరికిన్" [1]

కవిరాజ మనోరంజనమునందు పురూరవుడు తలయంటుకొను విధము గనుడు.

"కంకణనిక్వణంబు ఘలుఘల్లున మ్రోయగపోలపాళి తా
టంకరుచుల్ వెలుంగ నుదుటం జిఱుచెమ్మట గ్రమ్మ హారముల్
కుంకుమగంధపు వ్వలపు గుబ్బలపై నటియింప నొక్కయే
ణాంకనిభాస్య భూపతికి నంటె సుగంధపు నూనె యత్తఱిన్" 5-157.

## 57 క్షత్రియులు:

పెద్దనగారు క్షత్రియులను గూర్చి, నాల్గు వర్ణముల వారితోపాటుగా నొక సీసపద్య పాదమున వర్ణించి యుండగా అబ్బయామాత్యుడు ప్రత్యేకముగ నొక సీసపద్యమునే వ్రాసియున్నాడు.

1. పారిజాతాపహరణము : 2_9.

"అపటి రాజులు బంబు నంపి భార్గవునైన
బింకానఁ బిలిపింతు రంకమునకు........"[1]

సమస్త భూమండలమును నిరాతంకముగా, క్షత్రియ సంతతిని తునుమాడి, తన యధీనమున నుంచుకొనిన పరశురాముని సైతము, తమ కడకే బంటునంపి పిలుపించుకొనునంతటి పరాక్రమవంతులని అరుణాస్పదపుర మందలి క్షత్రియులను గూర్చి వర్ణింపగా, అబ్బయామాత్యుడు ప్రతిష్ఠానపురమునందలి క్షత్రియుల వర్ణించిన విధము మఱియు రమ్యముగ నున్నది.

"పౌరుషంబు కొలంత పౌరవిరోధంబుఁ
గలుగ దీ రాజశేఖరుల యందుఁ
బక్షపాతంబు స్వభావకాఠిన్యంబు
పొరయ దీ గోత్రాధిపరుల యందు
నొరు వంద నిలిచి యేయుట వైరిఘాటికి
విముఖమౌ టెఱుఁగ మీ విజయు లందు
సత్కులామిత్రత శాత్రువుఁ దలమాప
నిచ్చుటఁ జూడ మీ యినుల యందు

సనుచు జను లెంచ మఱియుఁ గళ్యాణగృహ ని
వాసులై నిత్యధర్మవిలాసులై య
నంతరాయభోగిష్ఠులై యమితవాహ
వంతులై బాహుజులు ప్రవర్తింతు రచట" 1_71

రాజశేఖరులు (శ్రేష్ఠులైన రాజులు / శివులు) శివునితోఁ బోల్తమన్న పౌరుషంబు కొలత లేదు. (శివుడర్ధనారీశ్వరుడనుట) పౌర విరోధము (త్రిపురాసురవైరము) లేదు. గోత్రాధిపరులు (రాజులు/పర్వతములు) పర్వతములతోఁ బోల్తమన్న తీవి యందు పక్షపాతము (రెక్కలు నరుకబడుట/ఒక పక్షము నొందుట) లేదు. స్వభావ కాఠిన్యము (పర్వతములు కఠినశిలా సముచ్చయములు) లేదు. విజయుల (యుద్ధము

1. మనుచరిత్ర. 1_50

పందు విజయము నందినవాడు / అర్జునులు) అర్జునునితో బోల్తపన్న ఇతరుల తోడ్పాటు అవసరము లేనివారు. (శిఖండి నడ్డుపెట్టుకొనుట) కర్ణుని (వైరి) ధాటి కాగలేక యొకనాడు విముఖుండగుట, అను దోషములు వీరి యందు లేదు. సూర్యునితోఁ బోల్తపన్న సత్కులా మిత్రత (సజ్జనుల యందు వైరము/నక్షత్ర సమూహమునందు వైరము) శాత్రవు దలమాప నిచ్చుట (చంద్రుడు కూడ సూర్యుడున్న పేర నుండుట) అను దోషములు వీరి యందు లేవు. ఇంతియే గాక పైనఁజెప్పిన సద్గుణి యందు మరి నాలుగు దోషము లున్నవని చెప్పక చెప్పిన రీతి కడు శ్లాఘ్యము లిప్పుడు స్మరించవలెను. ఇచ్చటి క్షత్రియులు కళ్యాణ గృహ నివాసులు. పర్వతముల యందు పాపగత సంచారమున్నది. వీరు నిత్యధర్మవిలాసులు విజయుడు వనవాసాజ్ఞాతవాస కాలమున భోగము లెరుగడు. వీరు అనంతరాయ భోగిష్ఠులు. సూర్యుని కు గుణము లేమి పరిమితము. వీరు అమితవాహావంతులు. ఇట్లు క్షత్రియుల వైశిష్ట్యమును వర్ణించిన తీరు సహృదయ రంజకమైయున్నది. వసుచరిత్రకారుని మెప్పగల స్పర్ధచేతనే పైపద్యము రచించెననుట కవకాశమున్నది. వసుచరిత్ర కారునిక్షత్రియ వర్ణనమునకు దీనికిఁ బోలిక గలదు.

"పగఱైనఁ జెల్వఁ గోల్పడని రాజులు శరం
బులు చన్న వెలవెలఁబోని ఘనులు
ధనదాశఁ గేలుమోడ్పని సార్వభౌమాంకు
లని వెన్కముందుఁ జూడని కుమారు
లరి మెచ్చఁగరములు నెరపని యను లాల
మున వాలు మఱువని పురుషసింహు
లవయంబు నడక తప్పని గోత్రపతు లెప్పు
డును సీవరము లేని యనఘ భోగు

లౌర వీరవ వీర నవైకపరులు
వటలుదురు పేల పుష్పవధ్వంశ్యు లగుట
కువలయాధార కమలానుగుణవిహార
సారసౌజన్యధరులు రాజన్యవరులు" వసుచరిత్ర–1–98

# 58 విష్ణు స్తుతి :

వైవస్వత మనువు పుత్రార్థ మధ్వరము సేయగా మనువు భార్య కోరిక ననుసరించి హోతయు నధ్వర్యుడును సంకల్పము చేసి పుత్రిక కలుగువట్లొనర్చిరి. దానికి మనువు మిక్కిలి చింతించి, వశిష్ఠుని జేరి తన విచారము వెలిబుచ్చెను. వశిష్ఠుడు యోగదృష్టిచే సర్వము గ్రహించి, విష్ణువనుగ్రహము వడయుటకై హోమ కావించి, శ్రీమహావిష్ణువును స్తుతించిన తీరు గనుడు.

పంచచామరము :

1. “తర ద్యుదగ్రదీప్తిమ త్సుదర్శనం సుదర్శనం
సరాగ చారు మాధురీ రసాధరం రసాధరం
వరాప్తతా చరన్మనో భవచ్ఛిదం భవచ్ఛిదం
హరిం వ్యతీతపద్మగర్భజామితం భజామి తమ్

2. కర స్ఫుర ద్దర స్వర ప్రకంపమాన దిక్తటం
ధరాధరా ధరా స్థిత ప్రధాన కూర్మరూపకం
చరాచరా కరా తత ప్రశస్త కుక్షి శోభితం
నిరంతరం దురంతశక్తి నిస్తులం ప్రభుం భజే

3. చలత్ప్రదీప
కలావిలా
మిళిందసుందరాలకం యు[illegible]
బలారిపై విమర్దనం ప్రభావయే జనార్దనమ్

4. ఉమాసమాన వాక్యనమ్రతోరు దివ్యనామకం
సమానమాధురీధురీణ సంస్కృతాంధ్రవర్ణితం
క్షమాసమాదృతాపరాధజాలక న్నిజాశ్రితం
రమాసమాగమప్రియాంతరంగ మచ్యుతం భజే

5. రణత్తరంగమాలికా స్ఫురత్తరంగిణీద్య స
త్ఫణామణిచ్ఛటాఘృణి ప్రభాసమానభామిభృ
ద్ఫణీంద్రభోగతల్పభాగి జా క్ప్రయానవిస్మయా
షణ ప్రకాశవిగ్రహం భజామి సాష్వనుగ్రహమ్ 2_60_64

పై యైదు పంచచామరములను స్తోత్రముగా రచించిన తీరులో పై విధ్య మున్నది. మొదటిది యమకము, అంత్యానుప్రాసములతో నడచినది. రెండవదాని యందాది యందేఅనుప్రాసము కూర్పబడినది. మూడవ దాని యందు పాదార్థముల యంత మున ప్రాస కూర్పబడినది. నాల్గవ దాని యందు ప్రతిపాద మొక సమాసముగా కూర్పబడి, ఆదిలోనే అనుప్రాస కూర్చబడినది. ఇక నైదవది పంచచామరమంతయు నొకే సుదీర్ఘ సమాసముగా కూర్పబడినది. వశిష్ఠుని హృదయాంతస్థ తపస్సు సాగిన రీతి ఆర్తిలో అతని భావ తీవ్రత భక్తిపారమ్యము, ప్రస్ఫుటీకరించబడినది. చామ రములు వేయుటలో నెన్నిరకము లుండునో అన్ని రకముల వీచినాడా యనిపించు చున్నది. ఈ స్తోత్రమును గూర్చి కవి చెప్పినమాట తరువాత నిట్లున్నది.

> "ఈ రీతి నవ్వసిష్ఠుఁడు
> సారమతిం బంచపంచచామరవృత్తో
> దారస్తుతి గావించిన
> నారాయణమూర్తి శ్రితజనప్రియుఁ డగుటన్" 2_66

వసిష్ఠునికి ప్రత్యక్షమై విష్ణువు కోరిన వరము లిచ్చినాడు. పైన నైదు పంచ చామ రములు వ్రాయబడినవని మనకు తెలియదా? వేరుగఁ జెప్ప వలయునా? అదియును సారమతిస్తుతి గావించినాడని మళ్ళీ చెప్పనేల? కారణము లేక పోలేదు. ఇందొక విశేషమున్నదని చెప్పుటకే యీ సూచన. పంచ పంచ అనుటచే నిరువదియైదైనది. సాంఖ్యము నందు తత్త్వము లిరువదియైదు. తత్త్వమెఱిఁగిన వాడు వశిష్ఠుడు. అతడు పంచ పంచ చామరములు వీవగా (షడ్వింశుడు/శ్రీమహావిష్ణువు) తరువాత దర్శన మిచ్చినాడని చమత్కారము. బ్రహ్మ తత్త్వమెఱింగిన వానికి తద్దర్శనము సులభ తరమని సూచించుటయే దీనిలోని పరమార్థము.

ప్రతి వర్ణనమున నొక చమత్కృతి సాధించిన కీర్తి అబ్బయామాత్యునిదే యనవచ్చును. శబ్దార్థాలంకారములు ప్రయోగించిన తీరు విశిష్టమైనది. పూర్వ ప్రబంధ కవుల యెడ స్పర్థగల్గి యనుసరించిన చోట్లు నిజమున కంత కన్న రమ్య ములుగా లేకున్నను స్వతంత్రించి తాను వర్ణించిన చోట్లు రస రమ్యములై, చమ త్కృతి కొటపట్లయి సహృదయుల నలరించు చున్నవి.

ఎనిమిదవ అధ్యాయము

# అబ్బయామాత్యుని కృతులలో ప్రతిబింబించిన సామాజిక పరిస్థితులు

కావ్యములు పురాగాథలను
తన కాలము నాటి సామాజిక పరిస్థితులు ప్రతిబింబించు[illegible]
సమయమును, సందర్భమును గలిపి వచ్చువచో, సమర్థుడైన కవి తప్పక ఏదో
గించుకొనును. అబ్బయామాత్యుడు అనిరుద్ధ చరిత్రము, కవిరాజమనోరంజనము
రెండు గ్రంథము లందును బహు విధములైన సామాజిక పరిస్థితులను సందర్భో
చితముగ వర్ణించి యున్నాడు.

## వివాహము :

తెలుగువారి పెళ్ళి తంతు ముచ్చటైనది. ఎన్నెన్నో వేడుకలు ఆటపాట
రుక్మలోచనానిరుద్ధుల వివాహ సందర్భము కలిసి వచ్చినది. కావ్యమున పెళ్లి

తంతు కన్నుల పండువుగా, మనస్సునకు వెన్నెల సోనగా వర్ణింపబడినది. మా పిల్లను మీ పిల్లవాని కిత్తుమని యర్థించ వలసిన బాధ్యత, పిల్ల తల్లిదండ్రులదే. అది అబ్బయామాత్యుని కాలము. నాడు కూడ నేటి వలెనే పిల్ల తల్లిదండ్రులే యర్థించినను, శుభలేఖ వ్రాసి పంపినంతనే, పిల్లవాడి తల్లిదండ్రులు 'హర్షము తోడ నవశ్య' మంచు గ్రక్కున ప్రతిలేఖం బంపిరట.[1] నాటి బంధుత్వముల కేర్పడి, లగ్నము నిశ్చయించుట జరిగినది. నగ పెళ్ళివారు తరలి వెళ్ళుట జరిగినది. కల్యాణ మంటపమునకు, పెళ్ళికూతురును తెరపట్టి చాటునకు తెచ్చిరట.[2] తలంబ్రాలు పోసికొనుట, పంచ మహా వాద్యములు మ్రోగుట చెలి పాదము పట్టి చెలువుడు సప్తపది చేయించుట, వైదిక లౌకిక ప్రయోజనము లెన్నియో నిర్వహింపబడినవి.[3] భోజన పదార్థములు పెక్కులు. పరమాన్నములు, పిండి వంటలు సూపములు, పండ్లరసములు, మధురామ్ల శాకములు, బెల్లము, ఆజ్యము, తేనె, కప్పురపు పండొరియము, ఉప్పుంగాయలు, పెరుగు, మీగడలు వడ్డింపబడినవి.[4] తరువాత శోభనము జరిగినది శోభనపు గదిలోనికి పెళ్ళికూతురును పద్మముఖులు త్రోసి పోయిరట.[5] ఇప్పటికిని తెలుగునాట నిదియే సంప్రదాయము.

నాడు పాలెగాళ్ళ పరిపాలన ప్రజారంజకముగ లేదేమో! కవి చమత్కారముగ సందర్భము కల్పించుకొని పాలెగాడి పరిపాలనలో చోరులు దారులు గట్టి కొల్లగొనుట, అదియు పాలెగాని ప్రేరణ చేతనే, విటావళిని పరాంగనల రమింపగా బనిచెనట.[6] వసుధాస్థలి నరాజకము దాపురించినదని కవి, పాలెగానికి చీకటికి అభేదము చెప్పిన తీరు సత్యప్రకటనార్థమే యనిపించును.

నాడు వైశ్యాధికారమును పొందిన వివిధ పదవులను గూర్చి కవి వర్ణించి

1. అనిరుద్ధ చరిత్రము. 1–95 నుండి 97
2. " " 1–98
3. " " 1–101 " 104
4. " " 1–105
5. " " 1–111
6. " " 3–9

యున్నాడు. దుముదారు చపాను పేషువా, నిశానీదారు, మొదలైన వారు సేవింపగా మన్మథుడనే పాదుశహా దండు గదలినాడట [1]

మంత్రసిద్ధి కొఱకు చేసెడు సాధనలను గూర్చి కవి మరియొకచోట వర్ణించిన తీరు రమ్యముగ నున్నది. [2] సంచరణ, ప్రదక్షిణము, స్నానము (అవగాహన క్రీడ) పునశ్చరణ, చేయగా మంత్రము సిద్ధించినది. సుధామధవత, అనిమిషత్వము ఫలముగా లభించినవి. అది మన్మథ మంత్రము, షడతి మందస్మితా సుభవత, అనిమిషత్వము లభించినది.

అధునిక యుగమున రతి క్రీడారహస్యములఁ దెలుపు చిత్ర పటములు (ఫోటోలు) వెలసి యుండుట బహిరంగ రహస్యము. కాని యిది అబ్బయామాత్యుని కాలము (18 వ శతాబ్ది) నాటికే సిద్ధించిన విధము గనుడు. ఉషానిరుద్ధులు భోగించిన విధము చిత్రాతి చిత్రము. గ్రామ్య వేణుదారిత ఖల్లరీ ముఖేంద్రాణీ జృంభితాది కరణంబుల స్త్రీ పురుష రూపంబులఁ జిత్రించిన కేళి చిత్రపటంబు లవలోకించుట వలనఁ గూటములకుఁ గ్రొత్తటికము సాధించినారట ఉషానిరుద్ధులు[3]

తెలుగువారి యభ్యంగన స్నానము ముచ్చటైనది. తలయంటి, నలుగుఁ బెట్టి స్నానము చేయించుట శుభకార్యము లందు తప్పనిసరి. "మరు కుమారుని నును సోగకురుల యందు, లలిత చాంపేయ సురభి తైలంబు నించి, యెలమిఁ దలయంటె నొక్క పూర్ణేందువదన. నలుగిడియె నొక్క కోమలి" యని వర్ణనము [4] అనిరుద్ధునికి (ఉషాసుందరుని) అత్తవారింట చేసిన యలంకారములు బహువిధములు. తాళిబిళ్ళ (వజ్రపుం జెక్కుల తాళిబిళ్ళ), అందియలు, ముక్కర, చేర్చుక్క, తాటంకములు, కటకకేయూరములు, రశన, హారములు మొదలగు వాని నెన్నింటినో యలంకరించిరి. నిలువుటద్దము ముందర బెట్టిరట. నిలువు టద్దముల వాడుకయు నాటికి ప్రబలముగా నున్నట్లు తెలియుచున్నది [5]

---

1. అనిరుద్ధ చరిత్రము. 3_19
2. " " 3_75
3. " " 3_94
4. " " 5_29, 30
5. " " 5_33 నుండి 38

పెళ్ళిఁ హాతు సత్తవాసంటి కనుపుటకై, వల్లకీ, వేణు, శంఖ, మృదంగాది వాద్యములు ప్రయోగింపబడినవి.[1] ఉషానిరుద్ధులు రాజమార్గమున నూరేగింపుగ రాగా, మహా సౌధముల మీది నుండి పురంధ్రులు లాజలు చల్లిరట[2] ఊరేగింపుగా వచ్చు వారిపై శోభన ద్రవ్యములను చల్లుట నేడును కలదు.

ఉషానిరుద్ధుల ద్వారకా నగర ప్రవేశ మొనర్చునప్పటికి నగరమంతయు శోభాయమానముగ నలంకరింపబడినది. ఘనసార కస్తూరికా జలాసారముల వీధుల జిలకరించిరట. ముక్తాఫలంబులతో రంగవల్లులు దీర్చిరట. సుగంధ ద్రవ్యములు ధూపదాంబరములు నంగళ్ళ పొందు పరచిరట. కదళికాస్తంభములను చిత్ర పటముల నుభయ పార్శ్వముల నుంచిరట. తోరణావళులు గట్టి, యగరు ధూపములు వేసిరట. నృత్త గీత వాద్యముల నెలపం జేసి, నగరము నమిత శృంగార మొనరించిరట.[3] ఇది అబ్బయామాత్యుని వర్ణనము. తెలుగునాట యుత్సవములందు, పండుగలం దలంకరించెడు రీతి యిది. కొంత యతిశయోక్తి తోచినను విషయము యథార్థమును చాటుచున్నది. పురకాంతలు బంగరు పళ్ళెరములందు ఘనసార దీపికల నుంచి మంగళకైశికీ రాగమున 'జయం మంగళ' మంచు పాడిరట.[4] ఇదియు తెలుగునాటి సంప్రదాయమే. పుత్రోత్సవమును వర్ణించుచు కవి, లౌకిక వైదిక రీతుల నిర్వహించిరని చెప్పుట గమనింపదగి యున్నది. అంతియే కాదు పదునొకొండవ దినమున నామకరణము చేసిరట.[5] ఇవి యన్నియు కవికి, స్వదేశాభిమానము చేత. కావ్యమున కెక్కిన తెలుగువారి సంప్రదాయ రీతులు. ఇప్పటికి శిష్ట సంప్రదాయ పద్ధతులై గోచరించుట తెలుగునాట పరిపాటియే.

కవిరాజ మనోరంజనము నందును కవి యెడ నెడ తన దేశీయాభిమానమును చాటుచు, నాటి సామాజిక స్థితిగతులను తెలిపెడు వర్ణనము లనేకము చేసియున్నాడు.

1. అనిరుద్ధ చరిత్రము. 5_39.
2. ,, ,, 5_40.
3. ,, ,, 5_56.
4. ,, ,, 5_62.
5. ,, ,, 5_84.

భరత ఫణితిని నృత్యము సేయుట,[1] శిరస్థిత పూర్ణకుంభ నృత్యము సేయుట[2] వర్ణించబడినవి. సిద్ధేంద్రస్వామి వారిచే ప్రతిపాదితమైన కూచిపూడి భరతనాట్యము నాటికి తెలుగునాట విస్తృతవ్యాప్తినంది యుండుట నిది సూచించు చున్నది.

మృగయా వినోద వర్ణన విషయమున నీ కవి మనుచరిత్ర కారునితో స్పర్ధ వహించినట్లు తోచును. వేట కుక్కల వర్ణనము, వాని వేట చేసెడి తీరు స్వభావోక్తితో రమ్యముగ వర్ణింపబడినవి.[3] ఎడమ చేతికి దిండుగా బట్టలు చుట్టుకొని సాహసికులు, పులి నోటగ్రుక్కి, కుడిచేత కటారిగైకొని బెబ్బులిని వధించిన వీరుని పరాక్రమమును కవి చోద్యముగ వర్ణించినాడు[4] తెలుగునాట పులి వేటకొక ప్రత్యేకత యున్నది. దానిని లోకమునకు చాటుటకే కవి యింతగా వర్ణించుట.

నాడు విద్యావంతుడగుట యన నేమో, ఏమేమి చదువుకొన వలయునో కవి పూనుకొని వర్ణించినాడు. ఋగ్యజుస్సామాథర్వణంబులు, నిరుక్తము, ఛందము, జ్యోతిషము, శిక్ష, కల్పము, శబ్దశాస్త్రము, మీమాంస, పురాణములు, సంహితలు, ధర్మన్యాయ శాస్త్రములు, పదునాలుగు నాదిమ విద్యలట.[5] ఇవి గాక చతుష్షష్టి కళలు, హరిహస్తి ప్రముఖావరోహణములు, దివ్యాస్త్ర ప్రయోగోపసంహరణములు గదాది సాధన ఘనాభ్యాసంబు, సారస్వతాకర వాగ్స్ఫూర్తి, ఉపాయ సప్తక చమత్కారము, షాడ్గుణ్యవిస్ఫురణంబునను విద్యల నెన్నిటినో పురూరవుడు నేర్చెనని వర్ణించి యున్నాడు.[6]

విరహ తప్తయైన యూర్వశి 'గిలుకు పావాలవ్వలికిఁ ద్రోచి యలంతిపాదుక

1. కవిరాజమనోరంజనము. 1–191
2. " " 1–189
3. " " 2–93 నుండి 96
4. " " 2–98
5. " " 2–238
6. " " 2–239 నుండి 240.

లంపుష్పలందుఁ దొడిగిన' దని వర్ణనము.[1] దీని వలన తేలికగా నుండు పాదుకలు వేరుగా నుండెడివని తెలియుచున్నది. పాదుకలలో బరువైనవి, తేలికైనవి రెండు రకాలవి తెలియుచున్నది. నేడుద్యానవనములలో తీగ పొదరిండ్లను మనము చూచుచున్నాము. నాడుగూడ నట్టివి గలవని ఆరామ లతాగృహ వర్ణనము[2] వలన తెలియుచున్నది. నేటివలెనే నాడు గూడ చలివేంద్రము లుండెడివి. అంతేకాదు చలివేంద్రములందు నీరు పోయువారు ప్రపాగేహినులు మిగుల సొగసైన వారు. పాంథులు వారితో సరసముగ మాటాడెడి వారు.[3]

వేసవి వచ్చినంతనే జనుల జీవన పద్ధతి మారెడిది. వారు సన్నవలపములనే గట్టెడి వారు. పన్నీటి స్నానాలు, తాళవృంతములు, దధ్యన్న భోజనములు, చిక్కని మధుర పానీయములు, కప్పురపు విడియములు కావలసి వచ్చెడివి. వెన్నెల బయళ్లు, ఇసుక తిప్పలు, చలువ చప్పరములు, విరుల పాన్పులు, శశి శిలావేదికలు భోగులకు విహారస్థానము లయ్యెడివి.[4] ఇది యంతయు తెలుగునాటి తీరే.

చలికాలము వచ్చినంతనే పరిస్థితి మారినది. అలవాట్లు మారినవి. మూరురంబుపై నేలయవియిండ్ల నీగుదురట. కటూష్ణ పదార్థము లారగింతురట. పచ్చడా లియగప్పియు కుంపటులన్నెలంగు వహ్నుల సెగనాగియు, జనులు తపింతురట.[5] పచ్చడములు, కుంపట్లు తెలుగు వారివే. ఎంత సహజ వర్ణనము. జాతీయపు మాటలుగా కవి వర్ణించిన వాక్యములు గమనింపదగినవి.

సామివారి తోఁటలో బిద్దె ముంగలి
యవఁమీఁద నుండె నాడ కెవఁడు

---

1. కవిరాజ మనోరంజనము : 3_98.
2. " " 3_99.
3. " " 4_14.
4. " " 4_16.
5. " " 4_138.

దెచ్చి పెట్టినాఁడొ దేవరా యెఱుఁగము
కానరాదు వింత మాని నడుగు కవిరాజ. 5_23.

ఇందు తోట, మిద్దె, ముంగలి అరుగు, సామి వంటి మాటలు జాతికి సహజమైన వని కాబోలు జాతీయపు మాటలని కవి చెప్పి యున్నాడు. ఇవి నాటి తెలుగు దేశమున మిద్దెలుండుటను, అరుగు లుండుటను తెలుపుచున్నది నేటికిని మిద్దెలు, అరుగులు తెలుగునాట కనిపించును. పురూరవుని కొఱకు సిద్ధము చేయబడిన భోజన పదార్థములన్నియు, తెలుగు వారివే. గారెలు, బూరెలు, కండమండెగలు, అప్పంబులు, సరసాన్నము, పాయసము, సూపము, శాకముల్కు, పడిదెంబులు, ఆనవాలు, పరిపక్వ ఫలములు, రసములు, పచ్చళ్లు, తేనియలు. సిగరులు, నారికేళోదకంబులు, పానకముల్, చల్ల, నీరు మొదలయిన పంచ భక్ష్య పరమా న్నములు మనకు దర్శన మిచ్చును [1] ఇవి యన్నియు నాడు నేడును కొంతవరకు తెలుగునాట నున్నవే.

కారపు కూరలు, చారులు, నెయ్యి, పప్పు పొంగారిన యానవాలు, పర మాన్నము, కమ్మని పిండివంట, కర్పూరము వంటి నెయ్యి, కడుఁబొత్తిగ వార్చిన యన్నము, ఉప్పునం గూరిన యల్లము, అవు పెరుగు నివి యన్నియు భోజన పదార్థములే. తెలుగువారివే [2]

ఇక తాంబూలము పండుటాకులు, కపురంపు బాగములు, ముత్తియపు సున్నము, లవంగములు, నేలకులు, జాపత్రియాదిగా గూర్చి తాంబూలము సేవించుట తెలుగు వాని సొమ్ము. [3] 'హాలారసపాన లీలలఁ జెలంగిరి వారలతాంగు లయ్యేడన్' [4] అని వర్ణించుటచే నాటి వార వనితలు మధుపాన మత్తలని తెలియ చున్నది. నేటికిని కొందరు వేశ్య లట్టివారే యగుట లోక విదితము. 'దధిమథన

1. కవిరాజ మనోరంజనము : 4_183.
2. ” ” 5_184
3. ” ” 5_187
4. ” ” 5_185

ఘుమ ఘుమధ్వని, యధికంబై వల్లవీ గృహంబులఁ జెలగెన్' [1] అని వర్ణించుటచే, నాడు గొల్లవాండ్రే పాడి పరిశ్రమ నిర్వహించిరని తెల్లమగుచున్నది. ఇక స్త్రీలు కినిసి దూఱాడిన సందర్భము సైతము కవి దృష్టిని దాటి పోలేదు. జోడు తగళ్ళను గంధర్వులు దొంగిలించుకొని పోగా యాదమఱచి నిద్రించిన పురూరవుని యూర్వశి నిందించిన తీరు గనుడు. "నిద్రమబ్బునన్ లేవకుండిన రోషంబు లేదు నీకు, దెగడి నే మొఱపెట్టంగ మగతనంబు దక్కి వినియును వినని చందమున నున్నవాడ వెందైన నిటువంటి వారు గలరె" [2] యని యూర్వశి దూఱాడినది. ఇవి యచ్చమైన తెలుగు తిట్లు.

అబ్బయామాత్యుఁడిట్లెడ నెడ సందర్భము కలసి వచ్చినచోటనెల్ల తెలుగు తనమును, తెలుగు సంప్రదాయమును, తెలుగువారి యలవాట్లను, తన కబ్బము లందు చొప్పించి, సందర్భోచితముగ రమ్యవర్ణనలు చేసి యున్నాడు. ఇది యాతని దేశీ యాభిమానమునకు తార్కాణ యని వేరుగ చెప్పనక్కరలేదు.

---

1. కవిరాజ మనోరంజనము. 5-222
2. " " 5-248

తొమ్మిదవ అధ్యాయము

# అనిరుద్ధచరిత్రము - రసపోషణ

అనిరుద్ధ చరిత్రము నందలి యంగిరసము శృంగారము. వీరము దాని కంగమై భాసిల్లి, రసపుష్టికి హేతువైనది. నిర్వేదాది సంచారి భావములు మరియు శోభ నిచ్చినవి. ఉషానిరుద్ధుల చరిత్రమే ప్రధానమైనప్పటికి కవి యనిరుద్ధుని దక్షిణ నాయకునిగా చిత్రింపఁ దలచి కాబోలు ప్రథమాశ్వాసమున రుక్మలోచ నానిరుద్ధుల కల్యాణమును, శోభనమును సరస ఫణితిని వర్ణించి యున్నాడు. పిత్ర దత్తయైన రుక్మలోచన విషయమున అయోగ శృంగారము గాని విరహ విప్రలంభ మును గాని వర్ణింపబడలేదు. కవి తలచుకొన్నచో నవకాశమున్నది. కాని ఉషా నిరుద్ధుల కల్యాణమునకు ప్రాధాన్యము నీయ నిశ్చయించి యుండుటచే కవి నేరుగా రుక్మలోచనానిరుద్ధుల సంభోగ శృంగారమునే రమ్యముగ వర్ణించినాడు. వారి ప్రథమ సమాగమమును వర్ణించిన తీరు మిగుల రమ్యముగ నున్నది. కన్య కారతి నారికేళ ఫల పాకమని చెప్పుచు కవి రుక్మలోచనానిరుద్ధుల సమాగమమును వర్ణించినాడు.

“శయ్యకుఁ జేరఁదీసి పతి సారెకు వేడఁగ నించుకైన మో
మియ్యక గుబ్బ లంటుకొన నియ్యక నిష్ఠరతిన్ రమింపఁగా
నియ్యక యెంత సేపె నలయించిన పిమ్మట సౌఖ్యదాయకం
బయ్యెను నారికేళఫలపాకము లౌ గద కన్యకారతుల్” 1_112

కవపంతరము ప్రథమ సమాగమ వర్ణన మిట్లు సాగినది.

అధికప్రయత్న సంశిథిల నీవీబంధ
మభిముఖ కుంచి తాస్యాంబుజాత
మాలస్య కరగృహీతాంచిత కుచకుంభ
మనురాగ రస నిగూఢాంతరంగ
మాయాసలబ్ధ బాహాలతాపరిరంభ
మాకుంచిత భ్రూయుగాభిరామ
మామోదబాష్పధారాపూరితాంబక
మలఘు సీత్కార మోహన నినాద

మచిర సంభూత మదనతోయ ప్రవాహ
మసగ కోష్ఠాంగజాత ఘర్మాంబుకళిక
మాత్మపరవశ జనిత నిద్రాభిలాష
మగుచు నయ్యెంతి ప్రథమ సమాగమంబు” 1_115

ఆమోదం బొనరింపఁగ
నామోదము విరియుఁ బోలె నైక్యస్థితితో
దామోదర పౌత్రుఁడు సం
ప్రేమోదయ హృదయుఁడగుచుఁ బెనఁగెన్ రతులన్” 1_116

క్రమముగ గాఢానురాగము కలిగినది. రతుల రీతి మారినది.

కేలి నంటఁగరాని గిలిగింతచే మాఱు
పెనఁగుట లేక కొన్ని దినములందు

నేమి చేసినఁ గాని హితము చేసుక నమ్మ
తించుట లౌక కొన్ని దినములందుఁ
జౌసీతి బంధ విశ్రాంతి మార్గము లన్ని
తెలిసి కూడుట కొన్ని దినములందుఁ
దాన పైకొని సురతప్రౌఢిఁ దమిఁ దీర
నెనయుట లౌక కొన్ని దినము లందు

నగుచు నా రుక్మనయనా సమాగమంబు
తన మనంబున కంతకంతకుఁ బ్రమోద
రసము కొలుపంగ గాఢానురక్తి నుండె
రసికశేఖరుఁ డా రతిరాజసుతుఁడు 1-119

రసికశేఖరుడైన రతిరాజసుతుడు రుక్మనయనా సంగమకేళి మన్న విధమును కవి రమ్యముగ చిత్రించి, సంభోగ శృంగారమును వర్ణించుటలో నితర ప్రబంధకవులకు తీసిపోడని ఋజువు చేసినాడు.

ద్వితీయాశ్వాసమునం దుషా చరిత్రమును వర్ణించుచు, స్వప్న సమాగమ మును చిత్రించిన తీరు కడు రమ్యము.

"తాంబూలరసరంజితంబైన కెమ్మోవి
యానుచో మొనపంట నూని యూని
కుంకుమాంచిత కుచకుంభముల్ గ్రహణంబు
సేయుచో నఖపంక్తిఁ జెనకి చెనకి
మకరికాకలిత కోమల గల్లముల ముఖం
బనుచుచోఁ జుంబనం బొసఁగి యొసఁగి
లలితభూషణచ యాలంకృతాంగము నెద
నలముచో మర్మంబు లంటి యంటి

కుసుమసాయక శాస్త్రానుగుణ విచిత్ర
బంధనైపుణి సురతప్రపంచసౌఖ్య

లీలఁ దనుఁ జొక్కఁజేసి లాలించె ననఘుఁ
గలికి కలఁగాంచె నాశ్చర్యకరముగాఁగ" 2-64

ద్వారకా నగరములో రుక్మలోచనా బాహుబంధములఁ జిక్కిన రసిక శేఖరుడై రతిరాజసుతుడు బహుదూరమున నెక్కడో యున్న శోణపురమునం దంతః పురమున నున్న ఉషాకన్య స్వప్నమున కానిపించు టేమి ? కుసుమ సాయక శాస్త్రానుగుణ విచిత్రబంధనై పుణి నామెను సురతకేళిఁ జొక్కఁ జేయుటేమి ? ఇది యంతయు నాశ్చర్యకరమే. కలగనుట సహజమే. కాని తానెన్నడు చూడని సుందర పురుషునిఁ గూడినట్లు కల వచ్చుట చిత్రము. ఇది దైవ ఘటన. స్వప్నమున దర్శించిన సుందరుని యందే యుషాదేవి హృదయము లగ్నమైనది. "అంతకంతకు నతిశయంబు మోహావేశంబునఁ దదీయ సౌందర్య సౌకుమార్య విలాస హావ భావంబునా వలుమాఱుఁ దలంచుచు, నా జగదేక సుందరుండు తన ముందర బొత గట్టినట్టైనం బట్టరాని తమకము"[1] హెచ్చినది. పూర్వరాగము అభిలాష విప్ర లంభమై తాపము మిక్కుటమైనది. ఆమెకు కలిగిన విభ్రాంతి యిట్టిదనరానిది.

"బింబోష్ఠి దర్పణ బింబంబుఁ జూచుచోఁ
చెలువుని ముద్దు చెక్కులు దలంచి
కలకంఠి మృగమద తిలకంబు దిద్దుచో
నరసుని మేని వాసన దలంచి
కలికి ముక్తామాలిక లలంకరించుచో
రమణుని మందహాసము దలంచి
పొలఁతి నీలోత్పలంబుల దండ లొనఁగుచో
రాముని చికురభారము దలంచి

గంధగజయాన హృదయంబు కరిగి కరిగి
యసురుసురు మంచుఁ బారవశ్యంబు నొందు
నిగిడి పుంఖానుపుంఖంబు లగుచుఁ దాఁకు
దర్పకుని పువ్వుటమ్ములఁ దాళలేక" 2-73

---

1 అనిరుద్ధచరిత్రము. 2-66.

క్రమముగా విరహతాపము మించినది.

"సెగలయ్యెఁ జలువ వెన్నెల
పొగ లయ్యెను గప్పురంపుఁ బొడి కన్నులకున్
బగలయ్యెఁ జిలుక మాటలు
వగలయ్యెను సుఖము లెల్ల వనితామణికిన్" 2-78.

చిత్రరేఖ ఉషకు నెచ్చెలి. ఊరడించినది. విషయము రాఁబట్టినది. కలలోఁ గన్న వానిని కూర్చుటెట్లో గదా యని చింతించినది. కొంతసేపు హృదయాబ్జమునం దలపోసి యొక మార్గము నూహించినది. ముల్లోకము లందలి యందగాండ్ర చిత్రములను లిఖించి చూపినది. ఉషాకన్య, యనిరుద్ధుని గుర్తించి యతడే తన హృదయచోరుడని స్పష్టపరచినది. మంత్రతంత్ర యోగాది విద్య లెరిగినదౌట, చిత్రరేఖ యనిరుద్ధుని తెచ్చుటకై బయల్వెడలినది. కాని యాలోనన ఉషాదేవి పొందిన విరహతాప మింతింతనరానిది. శైత్యోపచారములు జరిగినవి. కాని నిష్ఫలములైనవి. అంతటితో చెలులాగక మదన మలయపవనాద్యుపాలంభనము లకుఁ బూనుకొన్నారు. విరహతాపమునఁ గంటికి నిద్దురలేక వేఁచినది. తనకొఱకై విభుని తెత్తునని వెడలిన చిత్రరేఖ కార్యము నిర్వహించుదని దేవతలను వేడు కొన్నది. "కుసుమ కోదండ చండకాండ నిర్భిన్న హృదయయై కరగుచున్న"[1] సమయమున చిత్రరేఖ యనిరుద్ధునిఁ దెచ్చి పాన్పుపై నుంచినది. సమ్మోహన విద్యచే ద్వారకలోని వారి కనుగప్పి, యోగ విద్యచే ననిరుద్ధుని ఉషాంతఃపురము నకుఁ గొని తేఁగలిగినది. హరివంశము (మూలము) నందు పార్వతీపరమేశ్వరుల సన్నిధి కేళీ విలాసమున అప్సరాంగనలు తమ ప్రియులతో పార్వతీ పరమేశ్వర రూపమున క్రీడించుటఁ జూసి, తానుగూడ నట్లుండవలయునని యుషాకన్య కోరు కొనగా పార్వతీదేవి కరుణించి "వైశాఖశుద్ధ ద్వాదశి నాటి రాత్రి నీకు స్వప్నమున కనిపించెడివాడే నీ ప్రాణనాథు" డని యానతిచ్చినది. ఆ జగదంబ వరప్రభావము చేతనే ఉషాకన్య స్వప్నమున ననిరుద్ధుడు కనిపించి, వలపింపఁ జేసికొన్నాడు. ఈ విషయమును కనుపర్తి అబ్బయామాత్యుడు స్పృశింపలేదు. కాని బహు నిగూఢ ముగ నిట్టి సూచనను తన కావ్యమున నిక్షిప్తమొనర్చినాడు. ఉషానిరుద్ధులు పరస్పర

1. అనిరుద్ధచరిత్రము. 3-51.

మొకరి నొకరు నెరుగరు. వారికి పరస్పరానురాగము కలిగెడు నవకాశమే లేదు. వారు దూరదేశము లందున్నవారు. అత డుపేంద్రపౌత్రుడు. ఆమె రాక్షసరాజైన బాణుని కూతురు. వీరికి కల్యాణము ఘటిల్లుట యసంభవమే. కాని దైవమే పూను కొన్న నెట్టి యసంభవమైనను, సునంఘటితమగును. శివకేశవులు బాణునికి గర్వ భంగము కలిగించి, సద్బుద్ధిని ప్రసాదింప నిశ్చయించుకొన్నవారగుటచేఁ నతనికి అపూర్వమైన వియ్యము సిద్ధించినది. దీనికి పార్వతీదేవి కూడ తోడ్పడినది. ఆమెయే సకల శృంగార విద్యల నుషాకన్యకు నేర్పిన గురువు. అట్టి శృంగార విద్యల సార్థక్యమునకు రతిరాజసుతుడు గాక మరొక్క డా సుందరిని పరిణయమాడిన ఫలి తము లేదు. పార్వతీదేవి, అటు దైవకార్యమును సాధించుటకును, తన భక్తురాలు, శిష్యురాలునైన ఉషాకన్యకు తగిన వరుని గూర్చుటకును నిశ్చయించుకొని, ఉషా కన్య స్వప్నమున ననిరుద్ధుడు దర్శన మగునట్లును, అట్లు స్వప్నమున గాన్పించిన వాడే ఆమె భర్త యగు నని వరమిచ్చుటద్వారా నీ యుభయతారకమైన పథకమును పరిపుష్ట మొనర్చినది. ఇంత కథ దీని వెనుక నుండగా, స్వప్నమున ననిరుద్ధుని, ఉషాకన్య గాంచుట మొదటి మెట్టుకాగా, ఆ కనిపించిన వాడెవడో తెలయు మార్గము స్ఫురించినది ఆమె చెలికత్తెయైన చిత్రరేఖకు. ఆ చిత్రరేఖ తన చిత్రకళా నైపుణిచే ముల్లోకములందలి సుందరుల చిత్రపటములను లిఖించి ఉషాకన్యకు చూపకపోయినచో, వారికి సమాగమము ఘటిల్లదు. ఇట్టి విషయమున చిత్రరేఖ కళానైపుణికి అత్యంత ప్రాధాన్యమున్నది. చిత్రపటములను జీవముట్టిపడునట్లు తానెట్లు గీచినదో, చిత్రరేఖయే చెప్పినది.

"త్రిభువనవాసులై వెలయు దేవ మనుష్య భుజంగ కోటిలోఁ
బ్రభుతయు రూపసంపదయుఁ బ్రాజ్ఞతయుం గలవారి నెల్ల నే
ర్చి భగవతీ మహా మహిమచే లిఖియించితి నిప్పటంబునం
దభినవ మూర్తియై తగిన యా ఘనుఁ డెవ్వఁడు వీరిలోపలన్" 2-100

ఇందు 'భగవతీ మహా మహిమచే లిఖియించితి' నన్న చిత్రరేఖా వాక్యము లత్యంతము నిగూఢార్థవ్యంజకములు. ఆ భగవతి పార్వతియే. ఆ తల్లి మహా మహిమ చేతనే చిత్రరేఖ యందగాండ్రందఱి చిత్రముల నా పటమున గీచినదట. అట్లనుటచే, నబ్బయామాత్యుడు మూల హరివంశము నందలి వృత్తాంతము

నంతను కేవలము 'భగవతీ మహిమచే' వ్యంజింపఁ జేసినాడు. ఇది యాతని కథా కథన చాతురి కొంత మచ్చుతునక యనవచ్చును. హరివంశము నందలి కథ యంతయుఁ జేర్చినచో, మూలకథకు రసపుష్టి తగ్గునని భావించి కవి యిద్దాని నిట్లు నిగూఢమున నిక్షిప్త మొనర్చినాడనుట స్పష్టము. యథార్థమునకు రతిరాజసుతుడు తన్నిట్లు ద్వారక నుండి యొక రాక్షస కన్య యోగవిద్యా మహిమచేఁ దెప్పించుటకు కోపగించు కొనవలయును. అంతే గాక ఆమె తాను ఇంద్రారియైన బాణసుత నని చెప్పుకొన్నది. యాదవులకు మహేంద్రుడు సన్నిహితుడు. ఆ కారణముననైన అనిరుద్ధున కుషాకన్యపై విముఖత కలుగవలయును. కాని కలుగలేదు పైపెచ్చు ఉషాదేవి వలపుల మర్మమెరిగి, ప్రథమ భార్యయైన రుక్మనయనాసతికి సవతిని గూర్చు నుద్యోగమున, నిశ్శంకగా, నా యుషాకన్య నంతఃపురమున ననుభవించుచు నుండి పోయినాడు ఇట్లన్ని యసంగతములుండ కథ పొసగుటెట్లు? ఉషాదేవిని 'నీవెవ' రని యనిరుద్ధుడు ప్రశ్నింపగా, నామె తన వివరము లన్నియుఁ జెప్పి యతనితో ననిన మాటలు పరిశీలింపదగినవి.

"కన్నియ గాని యన్యసతిఁ గాను శరీరము నీదు సొమ్ముగా
మన్నన చేసి యేలుకొనుమా! వినుమా యనుమానబుద్ధిపై
నన్నలయించెదేని రమణా! యిఁక నేమనుదాన నిన్ను నా
కన్నులఁ జూడఁ గల్గెఁ గద! కాఁగల యట్లగు దైవయోగముల్" 3_70

తానాతని వలచిన దానినని స్పష్టము చేసి, 'అనుమాన బుద్ధి' తోఁ దన్నలయించినచో నేమియు ననదట. ఆతని చూడ గల్గుటయే భాగ్యముగా భావించునట. తరువాత నతనికి దయ కలిగిన మేలు. అదెట్లు సిద్ధించునో యామెయే సూచించినది. "కాగల యట్లగు దైవ యోగముల్" ఈ మాట ఉషాకన్య వలపును తెలుపుటయే గాదు, ఆమె 'దైవయోగము' నందు విశ్వాసమును ప్రకటించినది అది యొక్కటి చాలును. ఉషాకన్య తన్ను వివాహమాడు నర్హతను సాధించుకొన్నది. ఇది యంతయు 'దైవయోగము' చేతనే సిద్ధించినదని కవి, ఉషాదేవి నోట వ్యంగ్యముగా బలికించినాడు. ఇట్టి ఘట్టము పరమ రమ్యమై, అపూర్వ శృంగార రసావిష్కృతికి నాస్పదమైనది. మఱియొక్క చోట నిట్టి విచిత్ర సన్నివేశము గానము. అనిరుద్ధుడుషాకన్యను వలచి యామె పొందు విందులఁ గుడిచినాడు. సంభోగ శృంగారమును కవి మరల రసవత్తరముగ నొనర్చి యున్నాడు.

"కాంచనగాత్రి ముద్దుపగఁ గాంచి కవుంగిట గుబ్బలంటఁ గీ
లించి సుధాధరంబుఁ గబళించి హసించి కపోలపాళిఁ జుం
బించి చమత్కరించి పలపించి కళ ల్గరఁగించి మించి సొ
క్కించి కడున్ సుఖించి కిలికించిత కేళి రమించె వేడుకన్" 3_79

ద్రాక్షాపాకమున, సరళమధురముగాఁ జెప్పిన కవిత యేరిని మెప్పింపదు? ఆ కూటమి వారి కెంత యింపొదఁ గూర్చినదో ఆ 'ఇంచు' లోని 'ఇంచు' తనమే చెప్పుచున్నది.

"సురుచిరాంబర బంధ వరణంబు భేదించి
క్రీడాబలంబుల విఱుగఁదోలి
ఘన కుచ శైల దుర్గములు లగ్గలుపట్టి
జఘన వసుంధరా చక్ర మాఁగి
యూరూరు సంయుక్త తోరణంబులు గట్టి
చతురుఁడై మధ్యదేశంబుఁ బొదివి
యంగాంగములు భుజహుంకృతి లోఁగొని
యౌవన భండార మాక్రమించి

సురత సంగతి జయలక్ష్మి సొరిదిఁ గాంచి
తరుణి కౌఁగిలి నిజ రాజధాని గాఁగ
నెలమి మన్మథసామ్రాజ్య మేలుచుండె
సిద్ధసంకల్పుఁ డయ్యనిరుద్ధ విభుఁడు" 3_80

అనిరుద్ధు డుషామానస చోరుడేగాదు విభుడు కూడ. సమరము రాజధర్మము. వీరుడు విజయకాంక్షియై యుద్ధము లొనర్చుట సహజము రతిరాజసుతుడైన యనిరుద్ధ విభుడు ప్రణయ సమరమున జయలక్ష్మి చేకొని మన్మథ సామ్రాజ్యము నేలుచుండె నని కవి చమత్కృతి. మన్మథావతారమైన ప్రద్యుమ్నుని తరువాత నాతని కుమారుడైన యనిరుద్ధుడే, తండ్రి సామ్రాజ్యమును పరిపాలింప నర్హుడు గదా! కావున అతడు సిద్ధ సంకల్పుడు. వలపు పండినవి. ఉషారమణి గర్భవతియైనది. రహస్యము బాణుని చెవికెక్కినవి. అంతఃపురద్రోహిని బంధింప భటుల కాజ్ఞాపించినాడు.

భటులు అనిరుద్ధ ప్రతాపమునకు తట్టుకొనలేక నిహతులు కాగా, హతశేషులావార్త బాణునికి తెలిపిరి. బాణుడు తానే యుద్ధమునకు వచ్చి, ఘోర రణమొనర్చి తుద కెట్లో బంధించినాడు. ఉషారమణికి విరహము ప్రాప్తించినది. విరహ విప్రలంభ మును (మఱియొక విధముగా దీనిని ప్రవాస విప్రలంభ మనవచ్చును.)[1] కవి కడు రమ్యముగ వర్ణించి యున్నాడు. పూర్వరాగరూపమైన అయోగ విప్రలంభమునకన్న సంభోగానంతర వియోగజనితమైన విరహ విప్రలంభము మిగుల తాపకారి.

"వేకువఁ గాంతిఁ దప్పిన చంద్రబింబంబు
విధమున నెమ్మోము వెల్లఁబోయెఁ
బగలింటి సెగలచే సొగటొందు పూఁదీగె
వడువున నెమ్మేను వాడుదేరె
మునిమాపు జిగి దొలఁగిన తమ్మి రేకుల
రీతిఁ గన్నుల దైన్యరేఖ తోచెఁ
దగు రేయి హిమ మంటు తాంబూల దళముల
చెలువునఁ జెక్కిళ్లు చెమటఁ దోగె

చిన్నవోవుచుఁ జెక్కిటఁ జేయి చేర్చి
యాటపాటలపై వేడ్క లన్ని మఱచి
విరహ సంతాప వేదనన్ వేగుచుండె
నేమి చెప్పుదు న య్యుషాకోమలాంగి"          3–142

ఇట విరహానల సంతప్తమానయైన యుషాదేవి స్థితి చక్కగా వర్ణించబడినది. ప్రతి పాదమునందొక యుపమానమును కవి కూర్చి యున్నాడు. అవి యెంత లోక సహజములో అంత చమత్కారావహములు. వేకువ చంద్రబింబము వెల్లనగుట సహజము. ఆమె మొగము చంద్రబింబ తుల్యమని చమత్కృతి. కాని ఇప్పుడది వెల్లనై కాంతి హీనమైన దనుట ప్రస్తుతస్థితి "పూఁదీగెలు పగటి సెగలకు వాడుట సహజము. ఆమె తనువు పూదీగెవంటిదని చమత్కృతి, అది వాడి యుండుట ప్రస్తుత స్థితి. ఆమె పద్మపత్రనేత్ర. కావున సాయంవేళ జిగి దొలగిన వనుట

1. కావ్యాలంకార సంగ్రహము. పుట. 407.

చమత్కృతి. అట్లే యామె చెక్కిళ్ళు తాంబూల దళములు హిమమంటుటను, చెమటదోగుటతో బోల్చి చెప్పుట చమత్కృతి. ఇట్లు కవి ఉపమానములఁ జెప్పు చునే యొక విశేషమును సూచించుచున్నాడు. చిన్నవోయి చెక్కిట చేయి జేర్చి, ఆటపాటలు మాని, విరహవేదనతోఁ గుములుచున్న ఉషావర్ణనమున, కవి యందించిన కాలక్రమ గతిని గమనింపగా, వేకువ, పగలు, మునిమాపు, రాత్రి, అను భేదము లేక దినమంతయు ననగా నహోరాత్రములు ఉషారమణి విరహానల సంతప్తయైనదను నొక విశేష చమత్కృతి ద్యోతము కాగలదు. అబ్బయామాత్యుని వర్ణన నైపుణి కిది యొక మచ్చుతునక.

అనిరుద్ధుని జాడ తెలిసి, శ్రీకృష్ణ బలరాములు శోణపురముపై దండెత్తి వచ్చి, వాకిటనున్న శివుని పరాజితు నొనర్చి, బాణుని బాహుచ్ఛేదమొనర్చి, గర్వ నిర్వాపణము గావించినారు. బాణుడు సమృద్ధితో నుషానిరుద్ధుల నప్పగించినాడు. వారు ద్వారకలో సుఖమున్నారు. మరల సంభోగ శృంగారమును కవి వర్ణించి యున్నాడు. ఈ సారి రుక్మలోచ నానిరుద్ధుల, ఉషానిరుద్ధుల ప్రణయ కేళిని వర్ణించి అనిరుద్ధుని దక్షిణ నాయకత్వమును ప్రశంసించి యున్నాడు.

"ప్రాంచ త్కాంచన నూత్న రత్న ఖచిత ప్రాసాద దేశంబులం
బంచాస్త్రప్రియనందనుండు సురత ప్రాపంచిక వ్యాప్తిఁ గ్రీ
డించున్ దక్షిణ నాయకత్వమునఁ బ్రౌఢిన్ రుక్మనేత్రా మన
స్సంచారుండును బాణదైత్యతనయా సక్తాంతరంగుండునై" 5_76

"నిజవియోగ వేదనా భారంబునఁ గృశీభూతమై యున్న రుక్మలోచన ననేక విధంబుల గారవించి, సంప్రీతమజ్జన భోజనాదులఁ దృప్తుండై, బాణనందనా సురత సంభోగానంద నిరతుండై"[1] యనిరుద్ధుడున్నాడని కవి చాల నేర్పుగ వర్ణించినాడు.

"కుచకుంభ యుగముఁ బైకొని కేల నంటుట
నైరావతము నెక్కి యాడినట్లు

1. అనిరుద్ధచరిత్రము. 5_74

కదియించి నేమ్మేనుఁ గౌఁగిట నలముట
హరిచందనము మేన నలఁదినట్లు
సునయోక్తి వీనుల సోకుట నప్సరో
వీణానినాదంబు వినినయట్లు
బింబికాధర చూషణంబు సేయుటయు సు
ధాసారపానంబు చేసినట్లు

సౌఖ్య మొదవంగ నిచ్చ నిచ్చలును బాణ
తనయ సంభోగ మింద్రభోగంబు గాఁగ
సతత విభవానుభవ తృణీకృత పురంద
రుండగుచు నుండె న య్యనిరుద్ధ విభుఁడు" 5–77

బాణనందనా సురతభోగ మిట్లు సాగినది. ఆమె తన తండ్రి ఇంద్రారియనినది. ఆమె భర్త ఇంద్ర భోగము ననుభవించుట యెంత చమత్కృతి. ఆమె తండ్రికి శత్రువైన ఇంద్రుని భోగమను, ఆమె భర్త తన్ను పొందుట ద్వారా పొందుట, ఆమె కెంత మోదకారణమో చెప్పవలయునా? అంతే కాదు ఉషా-మణి కూటమిచే ననిరుద్ధుడు, సతత విభవానుభవ తృణీకృత పురందరు డైనాడని చెప్పుట మరియు చమత్కృతి. ఇట్లు ప్రణయకేళిలో ననిరుద్ధ విభుడు త్రిలోకాధిపతిని మించినాడని వర్ణించుట మిగుల రమ్యము. ఇట్లే కావ్యమున శృంగారము బహు ముఖముల విజృంభించి, సురతప్రాపంచిక వ్యాప్తిచే, రసరమ్యమైనది. కాకుండు టెట్లు? కావ్యనాయకుడు "శృంగార రసంబు విగ్రహముగా నొనరించిన మాడ్కినొప్పు" వాడు [1] కావ్యనాయిక "కరఁగు నను బోసి మోహనాకారరేఖ, యొసగదీర్చిన శృంగార రసమనంగ" [2] త్రిభువన మోహన రూపవతి. ఇక కావ్యము శృంగార రసగుళిక గాక మఱియొండు కానేర్చునే?

అనిరుద్ధచరిత్రము సహజముగనే శృంగారరస ప్రధానమైనది. ఏలన స్వప్నమం దొకానొక సుందరాంగుని దర్శించుట, అతడెవడో తెలియకున్నను, అతనియందే

1. అనిరుద్ధచరిత్రము. 1–77
2. " " 3–62

ఉషాకన్య లగ్నమానస యగుట, చిత్రరేఖ వంటి చెలి యొకతె ముల్లోకము లందలి సుందరు లందరి చిత్రములను వేసి, కలలోగన్న ప్రియుని నాయిక గుర్తించునట్లు చేయుట, అత డెవరో తెలిసినంతనే తన నెచ్చెలికై, సమ్మోహన విద్యను యోగ విద్యను వినియోగించి, ఆ సుందరుని ద్వారక నుండి శోణపురమునకు చేర్చుట, మొదలగు ఘట్టములు చిత్రాతి చిత్రములై శృంగార రసపుష్టికి హేతువులైనవి. తదుపరి బాణుడు, ఉషాకన్య గర్భవతి యైనదని తెలిసి, అనిరుద్ధుని బంధించిన కారణమున, విరహము (వియోగ విప్రలంభము) సిద్ధించినది. అదియు రసపుష్టికి నుపస్కారకమైనవి. అనిరుద్ధ బాణ కలహము,[1] శివకేశవుల యుద్ధవర్ణన,[2] కృష్ణబాణ సమరము[3] వీరరసస్ఫోరకములై, శృంగారమునకు బలము చేకూర్చినవి. శివకేశవుల సమర సంరంభమున భీభత్సము, సమయోచితముగ వర్ణింపబడినది.[4] కోటరీ రాక్షసి వికృతచేష్టయు నట్టిదే. శ్రీకృష్ణుని ధాటి కాగలేక భీతిల్లిన బాణుని సైన్యమును వర్ణించిన సంరంభము భయానక రసప్రతీతికి హేతువైనది.[5] భీభత్స భయానకములు వీరరసముతో పాటు, అంగరసములుగా శృంగార రసపోషణలో తగిన పాత్ర నిర్వహించినవి. ఉషానిరుద్ధుల సంయోగముననే, వీరము సహాయకమై, అంగరసముగా భాసించినది. దీనికి తోడు కవి, అనిరుద్ధుని దక్షిణ నాయకునిగాం జేయదలచి, ప్రథమాశ్వాసమున రుక్మవతీనానిరుద్ధుల కల్యాణమును, ప్రథమ సమాగమమును విపులముగా వర్ణించి, సంభోగ శృంగార వర్ణన విషయమున మఱి కొంత యవకాశమును పెంచుకొనుటయే గాక, తదుపరి ఉషారుక్మ నయనల నిద్దర నేలుకొని, అనిరుద్ధుడు దక్షిణ నాయకుడైనట్లు వర్ణించుటచే, శృంగార రసపుష్టి కీ యనిరుద్ధ చరిత్రము, సహజముగనే సమర్థమని తోచును. దానిని సమర్థుడైన అబ్బయామాత్యుడు తన వర్ణన నైపుణిచే మరియు రసరమణీయ మొనర్చి సహృదయ హృదయాహ్లాద కారియైనాడు.

---

1. అనిరుద్ధచరిత్రము. 3–111 నుండి 119 వరకు
2. " " 4–55 నుండి 76 వరకు
3. " " 4–79 నుండి 88 వరకు
4. " " 4–65
5. " " 4–77

# కవిరాజమనోరంజనము - రసపోషణ

పురూరవశ్చరిత్రమను నామాంతరముగల కవిరాజమనోరంజనమునం దంగి రసము శృంగారము. అంగరసములు వీర, రౌద్ర, శాంతములు. పురూరవుని గుణగణములను సౌందర్యాతిశయమును, నారద మహర్షి చెప్పగా విని, పురూరవుని యందే బద్ధానురాగయైనది ఊర్వశీ లలామ. అతనికై పరితపించినది. వలచి, వలపించుకొన్నది. వలపు పండించు కొన్నది, కవికి ఊర్వశీ పురూరవుల వృత్తాంతముతోఁ బాటు, అతని వంశమునకు సంబంధించినవి, ఇతరములైనవి యగు పెక్కు వృత్తాంతముల నొక్కచోటఁ బ్రబంధింప వలయునను తపన మెండుగా నున్నది. దాని ఫలితమే యీ కావ్యమునందు, తారాశశాంక ప్రణయము, ఇలాబుధప్రణయము, పార్వతీ పరమేశ్వర ప్రణయము, ఊర్వశీ పురూరవ ప్రణయము నను భిన్నప్రణయగాథలకు తావిచ్చినది. కావ్యనాయకుడైన పురూరవుని చరితము మూడవ యాశ్వాసమునగాని ప్రారంభము కాదు. ప్రథమాశ్వాసమున నాతని సౌందర్యాదిక వర్ణనము, నారద మహర్షిచేత నాత్మవిద్యోపదేశము నను సంఘటనలున్నవి. ద్వితీయాశ్వాసమున తారాశశాంకుల, ఇలాబుధుల చరితము వర్ణింపబడినది. పురూరవ జనన కథ యున్నదన వచ్చును. నాల్గవ యాశ్వాసమున మిత్రావరుణుల తపస్సు తత్తపో భంగమునకై యింద్రునిచే నియోగింపబడి యూర్వశి భూలోకమునకు వచ్చుట యను వృత్తాంతము నిబంధింపబడినది మునుల శాపమే, ఊర్వశీ భూతల వాసమునకు హేతువై, ఊర్వశీ పురూరవ ప్రణయమునకు భూమికయైనది. ఇట్లు నిశితముగాఁ బరిశీలించినచో, ప్రతియాశ్వాసమేదో విధముగ నాయక సంబంధియై రసోద్దీపకముగానే యున్నది. కవికి శృంగార రసపై విధ్యమును వర్ణించు నుత్సుకత కలదు. ఆ కారణముననే, జారా సంపర్కమనియైన భావింపక, తారా శశాంకప్రణయమును రసోచితముగ వర్ణించినాడు.

"బొమ సుడిపెట్టు మాత్రమె కాని ప్రియుడు పా
లిం డ్లొత్తిపట్టుట కిచ్చగించుఁ
గసరు మాత్రమె కాని కాంతు డాయము జెత్తి
పెనఁ బల్కుట కపేక్ష వీనులొగ్గు
కొంగు పైనిడుకోఁ బెనంగు మాత్రమె కాని
విటుడు గోప్యములు జూచుటకుఁగోరు
సీత్కృతు ల్వెడవెడఁ జేయు మాత్రమె కాని
పతి మోవి నొక్కు సంగతికి నలరు

సొలయు మాత్రమె కాని నెచ్చెలిమికాఁడు
కఠినరతి సలుపుటకు సముత్కంఠ దాల్చుఁ
బులక హర్షాశ్రు సుఖ జ లోద్భూత గరిమఁ,
దన వలపు జారునకుఁ దెల్పు దరుణి యపుడు" 2_29.

తారాశశాంక ప్రణయము, జారిణీ జార సంగమ దోషముచే శృంగార రస భూయిష్ఠ మనుటకు వీలులేదు. రసాభాసమనియే చెప్పవలయును. రసాభాస లక్షణ మును వివరించుచు శ్రీసన్నిధానము వారు కావ్యాలంకార సంగ్రహ వ్యాఖ్యా నమున సాహిత్యదర్పణ లక్షణము నిచ్చియున్నారు.

"ఉపనాయక సంస్థాయాం, ముని గురు పత్నీ గతాయాం చ,
బహునాయక విషయాయాం, రతౌ తథానుభయ నిష్ఠాయాం"

"ప్రతినాయక నిష్ఠాయాం, తద్వ దధమపాత్ర తిర్యగాది గతే
శృంగారేఽ నౌచిత్యం" మొదలగు లక్షణముల నుటంకించి, రసా భాస లక్షణము, సాహిత్య దర్పణము నందే సమగ్రముగ నున్నదని తీర్మా నించినారు. [1]

1. కావ్యాలంకార సంగ్రహము. పుట. 414

ఈ ఘట్టమున శశాంకునకు, తార గురుపత్ని యగుటచే నీ శృంగారము రసాభాసమైనది. కావున దీనిని సంభోగ శృంగారమని చెప్పుటకన్న, రసాభాసమని చెప్పుననే సలక్షణమని చెప్పదగును.

ఇలా బుధ ప్రణయము నందొక పై విధ్య మున్నది. ఇలాకాంత మొదట యజ్ఞఫలముగా తల్లి కోరిక ననుసరించి కూతురుగా జన్మించినది. తండ్రి పుత్రునికై యజ్ఞము చేసినాడు. కావున ఇలాకాంత కూతురుగా జన్మించినను తండ్రికి తృప్తి గలుగలేదు. అతడు వశిష్ఠుని తానొకటి గోర మరియొకటి యెట్లు సిద్ధించినదని ప్రశ్నించినాడు. వశిష్ఠుడు యోగదృష్టిచే, నది తల్లి కారణమున జరిగినదని తెలిపి, విష్ణునారాధనముఁ జేసి ప్రత్యక్షమైన శ్రీమహావిష్ణువు వలన నిలాకాంత పురుషుడగునట్లు వరమిప్పించినాడు. ఇలాకాంత, సుద్యుమ్నుడిగా మారినది. సుద్యుమ్నుడు యుక్తవయస్కుడై, మృగయా వినోదార్థ మడవి కేగి, యచ్చట ప్రమాదమున కుమారవనముఁ జొచ్చి మరల స్త్రీ యైనాడు. శివపార్వతులు విహరించు నా వనమున పురుషులు సంచరించినచో స్త్రీ లగుదురని, మహేశ్వరు డానతిచ్చిన కారణమున, శివాజ్ఞమేరకు సుద్యుమ్నుడు స్త్రీయై, రాజనగరుకుఁ బోవ సిగ్గిలి వనము నందే తిరుగఁ జొచ్చినాడు. సౌందర్య ఖనియైన బుధ దర్శనమున నతనికి మోహాతిరేకము కలిగినది. బుధుడును, ఇలా సౌందర్యమునకు ముగ్ధుడైనాడు. వారు గాంధర్వ విధిని వివాహమైనారు. సంభోగ శృంగార మీ ఘట్టమున పలు విధముల రమ్యముగ వర్ణింపబడినది.

"వనితం గౌఁగిటఁ జేర్చి బింబఫల నవ్యం బైన కెమ్మోవి ప
ల్మొనల న్నొక్కుచుఁ జెక్కుటద్దము లొగి న్ముద్దాడుచు న్మోహన
స్తనకుంభంబుల నెమ్మొనల్ ప్రణుకుచున్ సంభోగ చాతుర్య ఖే
లనుడై సర్వ రతిప్రసంగము మహోల్లాసంబు సంధిల్లఁగన్" 2–172

ఆరంభమున బుధుడు పైకొనినట్లు వర్ణింపబడినను, వారిది సమరతి యని కవి చమత్కరించుచున్నాడు.

"సొగసుఁ బల్మొనగంటి చుఱుఁ కెఱుంగగరాని
పెదవుల యమృతంపుఁ బీల్పు సొక్క

తారహారముల యొత్తడ యెఱుంగఁగ రాని
పరిరంభముల ప్రేమపరవశంబు
గినిగింత యక్కుబెక్కు లెఱుంగఁగారాని
మర్మసంస్పర్శ నానందసుఖము
సిగ్గు పోకడమాట యె గ్గెఱుంగగరాని
తమి హెచ్చరింపు వాక్యముల ముంపు

ముదురుఁ దమకంపుఁ గలయిక నొాదవు నలయి
కల, నెఱుంగఁగరాని యగ్గలపుఁ గళల
యుబ్బు నుబ్బు వినోదమై యొనరె నపుడు
సమరతిక్రీడ రమ ణి కి ర మ ణు న కు ను " 2_175.

ర మ ణి కి ర మ ణు న కు సమరతి క్రీడ యొనరినదని వర్ణించుటలోని యౌచి
త్యము ప్రశంస నీయము. సంభోగ శృంగార వై విధ్యమును వర్ణించు మరియొక
ఘట్టము గర్భవతీ సంపర్కము.

"కేలితమిం జెలంగి తమకించి నిజోద్ధతిఁ జూపఁ జూచు న
ప్వేళఁ బ్రశాంతుఁ జేయు నరవిందనిభానన కుంచి తాంచిత
భ్రూలతికా విలాసమునఁ బొల్పు కషంగవ మోడ్పుతోడ గ
ర్భాలస జాత శీత్కృతిరవాననపద్మము ప్రాణనాయకున్" 2_181.

ప్రసవానంతర ద్వితీయమాస సమాగమము వర్ణించిన తీరు మరియు సుందరము.

"అర్ధక్షణంబైన నంతరాయము లేని
కౌఁగిలి యత్నసంఘటిత మయ్యెఁ
గుచపీడనంబు చేకొలఁది సారెకుఁ జేయు
మమత హస్తస్పర్శమాత్ర మయ్యెఁ
గపుర విడ్యపుఁ దావి గ్రమ్ము చుంబనలబ్ధి
కటువస్తు పరిమళకలిత మయ్యె
ఘటచక్ర పుంభావ నటనలఁ జూపు నే
ర్పులకు జొకుడ్కు టలపరూప మయ్యె

నతని హృదయంబు పూర్వ హర్షానుభవతఁ
బొదలె బాలెంతరాలి సంభోగకేళి
నలవియే యెంచఁ బ్రసవితానంతర ద్వి
తీయమాస సమాగమాధిక్య సుఖము" 2_191

ఎంచనలవిగానిది, పూర్వహర్షా నుభవస్మృతి ప్రదమై మనోరంజనమైన దా రతిక్రీడ.

సంభోగ శృంగార వర్ణనమందెంత యాసక్తి యున్నను, కవి శివ పార్వతుల ప్రణయకేళి వర్ణించునెడ మాత్రము తగు నౌచిత్యమును పాటించి యున్నాడు.

"అంబుజాననఁ గౌఁగిట నలమి యలమి
యిష్టకేళీసుఖంబుల నెనసి తనిసి
యంకపీఠంబుపైనుంచి యలపు సొలపు
దీఱ లాలించి పలికె సుస్థిరుఁడు హరుఁడు" 2_130.

ఇష్టకేళీ సుఖంబుల నెనసి తనిసినాడు, హరుడని వర్ణించుటఁ జూడ నాది దంపతుల యెడ కవికి గల భక్తి తాత్పర్యము లట్లు సంయమనము పాటించు నట్లొనర్చినవని చెప్పవచ్చును. హరుడు సుస్థిరుడట. బహుశః కవికి కూడ నా సుస్థిరత్వమే యిట్లు సంయమనము గలిగించినదని తలంపవచ్చును. సందర్భము కలిగినచో నీ కవి శృంగార రసవైవిధ్యమును వర్ణించు నవకాశము వదులుకొనడు. సంభ్రమము వలన గల్గు విప్రలంభము, దివ్యము (దైవికమైనది) నాభసము (పిడుగుపాటు మొదలగునవి) మానుషము (ఇతరులు రాగసంభోగభంగము) నని త్రివిధము.[1] శివపార్వతులు విహరించు వేళ, శివదర్శనమునకై కౌండిన్యాది మును లనేకులు వచ్చిరి. ఆ సమయమున వచ్చిన వారినిఁ జూచి, పార్వతి యావేళ వివస్త్ర శరీరిణి గాన మిగుల లజ్జ నొందినదని కవి యా యాది దంపతులకు, మానుషభేదమున నొప్పెడి విప్రలంభము సిద్ధింపఁ జేసినాడు. ఈ విప్రలంభమే, శివుడా కుమార

1. కావ్యాలంకార సంగ్రహము. పుట. 409

వనమున ప్రవేశించిన పురుషులెల్ల స్త్రీ లగుదురని యాజ్ఞసేయుటకు హేతువైనది. ఆ యాజ్ఞయే సుద్యుమ్నుడు (కావ్యనాయక పిత) మరల స్త్రీ యగునట్లొనరించినది కావ్యకారణముల నౌచిత్యముతోఁ గూర్చుకొని ప్రబంధించిన కవి అబ్బయామాత్యుడు.

కావ్యనాయికా నాయకులు ఊర్వశీ పురూరవులు వారి ప్రణయ మనితర సామ్యము. పురూరవుని సౌందర్యాది గుణ విశేషములను నారదమహర్షి వర్ణింపగా విని, పురూరవుని కనురక్తమైనది ఊర్వశీలలామ. అతని పొందు ఘటించు టెట్లో తెలియక విరహాతప్తమైనది. అభిలాష విప్రలంభ రూపమైన పూర్వరాగము. (అయోగ శృంగారము) కవి చేత నెనిమిది పద్యములలో సుందరముగ వర్ణింప బడినది.[1]

"మది నంతంతకు నగ్గలించు వలప్రేమం దాళరా దేమి సే
యుదు నే యత్నముచేత వశ్యుఁడగు నా యుర్వీశుఁ డే నోము నో
ముదు నే దైవము వేఁడుకొందు నిఁక నీ మోహాబ్ధిన్ దేర యె
య్యది నా కెవ్వరు ప్రాణబంధులు మదీ యాసక్తి యాదేర్పఁగన్" 3—65

గుణ శ్రవణ మాత్రము చేత ననురక్తయైన యూర్వశి తాప మింతింతనరానిది. ఆమె యాసక్తి యెట్టిదో కవి వర్ణించిన తీరు చిత్రమైనది.

"దేవిడ బాహ్యవృత్తిఁ గడు రేచక పూరక కుంభక క్రియా
సూచన మూర్పుల న్నెడప వొప్పడ పల్లవరూప మాత్మలోఁ
జూచుచుఁ దత్కథా మధు వచో జపశీలత నుండెఁ బుష్పనా
రాచగురూపదేశమున రాజనిభాస్య తదేకనిష్ఠతోన్" 3—67

ఆమె విరహ తాప మొక యోగముగా సాగినది. గురువు పుష్పనారాచుడు. ఆరాధిత దైవము పురూరవ చక్రవర్తి. జపమో, తత్కథా మధువచస్సులు. నిట్టూర్పులే రేచకపూరక కుంభక క్రియా సూచనలు. యోగము సమగ్రమైనది. సిద్ధి తప్పదు గదా! నారదుడు పురూరవ సౌందర్య వర్ణన మొనర్చిన తీరంత రమ్యతమమైనది గావుననే, ఊర్వశి యంతగా ననురక్తయైనది. ఇచట కవి చమత్కారముగ, తాను

1. విక్రమార్కచరిత్రము. 3—60 నుండి 67 వరకు

వ్రాసిన యీ పురూరవ కథ, మధువచస్సంయుతమని సూచించుచున్నాడు. "దేవ మౌని రసోక్తులఁ గర్ణ రసాయనముగా"[1] వినిపించినాడని వర్ణించి, తన రచనయు నట్టిదని కవి గడుసుగా చెప్పుకొనుచున్నాడు. విరహతాపమును తొలగింప చెలులు చేసిన శీతలోపచారములు లెక్కకు మిక్కుటములు.

"రాజీవ రాజీవరాజి రాజితములై
కెలఁకుల కొలఁకులు దొలఁకు చోట
ఘనసార ఘనసారఘనులైన ఘనటచ్చ
దచ్ఛటా కదళికాతరుల క్రేవ
సంతాన సంతాన సంతతాతాంతత
శృంగారపాదపశ్రేణి నడుమ
మాధుర్య మాధుర్య మదురసన ఫలగుచ్ఛ
వల్లుల పంచటి చల్లనీడ

శీతకర శీతకరశిలాంచిత వితర్ది
సీమ సీమంతవతులు లేఁ గురుళయ్య
నమర నమరకళాపతి నధి వసింపఁ
జేసి జేసిరి సముచిత శిశిరవిధులు" 3–101.

చెలులు విరహతప్తయైన యూర్వశికి తాపము శమింపఁజేయ నెన్నియో శిశిర విధు లాచరించిరి. వారు పురల మరల నధికముగా శిశిరోపచారము లొనర్చిరి కాబోలు, ఇచటి యమకమూ విషయమును వ్యంగ్యముగ సూచించుచున్నది. శిశిరోపచారము లన్నియు వ్యర్థమైనవి. చెలులు తమ నెచ్చెలికి గల్గిన తాపమునకు మన్మథుడే కారకుడని, మన్మథో పాలంభన మొనర్చినారు. అతనికీవిషయమున తోడ్పడెడు చంద్ర, మలయానిలాదుల నుపాలంభించినారు. త్రైలోక్యవర్తి యను చిలుక వలన, ఊర్వశికి పురూరవ సమాగమము లభింపగలదని యాశపుట్టినది. ఈ యాశయే యామె ప్రాణములు నిలిపినది.

1. కవిరాజ మనోరంజనము : 3–52.

"ఊర్వశి పాకశాసను నియోగమునన్ భువి కేగు నప్పటన్
సర్వగుణాభిరాము నృపచంద్రు బురూరవుఁ గాంచు నాతఁ డీ
పర్వశశాంకబింబ ముఖి పైఁ గడుఁ గూర్మి వహించు మామకా
శీర్వచనంబు సిద్ధముగఁ జేకుఱు నిర్దళుకున్ సరాగముల్" 3_179.

త్రైలోక్యవర్తి పల్కినమాట లూర్వశికి తాపోపశమన కారులైనవి. పాకశాసను డెప్పుడు తన్ను భువికేగ నియోగించునాయని ప్రతీక్షించుచు ఊర్వశి యెట్లో కాలముఁ బుచ్చినది. మిత్రావరుణుల తపోభంగ మొనర్ప నూర్వశిని పాకశాసనుడు వియోగింపగా నామె భూలోకమునకుం జని, బహువిధశృంగారవిలాసములచే మిత్రావరుణుల సమ్మోహితులఁ జేసి. వారికి తపోభంగము గావించినది. ఆపైన పురూరవుని పొందు మార్గ మెట్లాయని చింతించుచు, పూర్వము పురూరవుని పొందగలవని యోదార్చిన త్రైలోక్యవర్తిని తలచుకొన్నది. వెను వెంటనే త్రైలోక్యవర్తి వచ్చి, ఆమె చిత్రపటమును పురూరవుడు చూచునట్లు చేయుమని యుపాయము చెప్పిపోయినది. ఊర్వశియు నట్లే చేసినది. చిత్రపటమును భటులు తేగా చూచిన పురూరవు డా యూర్వశి యందు మరులు గొన్నాడు, తుద కెట్లో చిత్రపటమున గలిసికొని, యామె పెట్టిన నియమముల పాటింతునని వాగ్దాన మొనర్చి, ఊర్వశిని తన రాజధానికిఁ గొనితెచ్చుకొని సుఖమున్నాడు. పరల శృంగారమును వర్ణించుటకు నవకాశము చిక్కినది.

"ఎదురుకోలు ఘటించె నితరేతర ప్రవు
ల్లాంబ కాంభోజ చ్ఛగంచలములు
వాద్య ఘోష మొనర్చె వరరత్న కింకిణీ
కంకణ కిణీరుణత్క్వణరవము
మంగళసూత్రసంపద దెల్పెఁ బతి చేయు
లలితాంగి కంఠావలంబనంబు
తలఁబ్రాల ముత్తియంబుల యంద మొందె ఘ
ర్ఘలరాలు కచపుష్పసముదయంబు

పలుకు లగ్నాష్టకము లయ్యె గళరవములు
పొత్తుల ఘటింప వేడుక పొలపు దాల్చెఁ

బిక్వ బింబాధరామృత పాన లీల
త న్మిథునకేళి పరిణయోత్సవమునందు" 5_209

ఊర్వశీ పురూరవులది గాంధర్వ వివాహము. కావున వివాహసంబంధమైన వేడుక లేవియు నుండవు. కాని కవి కిది లోటుగాఁ దోచెనేమో, వారి సమాగమమును, మిథున కేళి పరిణయముగా వర్ణించి వేడుకలన్నింటిని సాధించి పెట్టినాడు. వారిరువురు ప్రౌఢులే. ఇక సురతకేళీ విన్యాసము రసవత్తరము గదా!

"యుగప త్ప్రచుంబి తాన్యోన్య వీటి సుగం
ధాధరపుట చూత్కృతాభిరామ
మేకదా సంవీక్షి తేతరేతరముఖ
వ్యాకోచ నిర్నిమే షాంబకంబు
సాంగత్య కూజి తాంచ త్పరస్పర కంఠ
మణితస్వ నావ్య క్తమధురిమంబు
సమకాల గాఢ బద్ధమిథోభుజా బహ
వంకపాళీ మిళ దవయవంబు

సహనట ద్వంద్వ సమరతి సమయ చటుల
జప పునః పున రాఘాత శబ్ద రచిత
తాళమానంబు త త్సురతంబు మిగుల
సౌఖ్యా రమయ్యె న న్యో న్య జా బ ల కు ను" 5_212

నియమపాలన భంగముచే, నూర్వశి పురూరవుని వీడి, తప్పనిసరియై గంధర్వుల యాజ్ఞకు లోబడి, వారి వెంట స్వర్గమునకు బోయినది. పురూరవునికి ప్రవాస విప్రలంభము తటస్థించినది. సంభ్రమము వలన గల్గిన యీ ప్రవాస విప్రలంభము దివ్యమైనది. గంధర్వకృతమైనది కావున దైవికమైనదని చెప్పవచ్చును. పురూరవుడు పొందిన విరహతాపము చాల చక్కగ, సరళసుందరముగ వర్ణింపబడినది.

"కన్నుల నీరునించుఁ బులకంబులు దాల్చు వహించుఁ గంపమున్
విన్నఁదనంబు నొందుఁ గడు విస్వరతం బలవించు ఘర్మబిం

డాన్నతిఁ జెంద జిచ్చుపడి యుండును మూర్ఛిలు నంత నింతి పై
కొన్నటులైన లేచు పగఁ గుందును భావతి సాత్త్వికాప్తిచేన్" 5_265

ఇచట పురూరవుడు విరహార్తుడై పొందిన వివిధ సాత్త్వికావస్థలు చక్కగా వర్ణింపబడినవి.

"స్తంభ మచంచలత్వ మవశత్వ మగుం బ్రళయంబు దృగ్జలో
జ్జృంభణ మశ్రువౌ జెమట స్వేదము గద్గదవాక్యపై ఖరీ
గుంభము విస్వరత్వము తగుం బులకం బన రోమహర్షణా
రంభము కంపమౌ పడకు రామకుఁ బాండురుచుల్ వివర్ణతల్" 1

పురూరవుడు పొందిన సాత్త్వికావస్థలు, పై కావ్యాలంకార సంగ్రహ లక్షణము నకు లక్ష్యములా యన్నట్లున్నవి.

ప్రవాప విప్రలంభమున కావ్యము ననుసరించి, భూత విప్రలంభము వర్ణించిన తీరు కడు చిత్రము (పురూరవుడు ఊను పొందిన విరహతాపమును గూర్చి వర్ణించిన ఘట్టము.)

"వదలెడు క్రొమ్ముడి వదలియు
వదలని లజ్జాభరంబు వడి కూటములం
గదలెడు నడుమును గదలియుఁ
గదలని చనుదోయి దలఁచి కరఁగెద రమణీ" 5_273.

"పిలుపుల యింపు ముద్దుగొను పెంపుఁ బనుంగవ యుబ్బరింపుఁ జె
క్కుల చెమరింపు మైపులక గుంపు వదల్పని కౌఁగిలింపుఁ గ
న్నులయదలింపుఁ గీలుబడ నొంపుఁ దలంపున వేడ్క నింపు నీ
కలయిక సొంపు నే మఱవఁగాఁగలనా కలనైనఁ గోమలీ" 5_274.

విప్రలంభ వర్ణనమున నబ్బయామాత్యుడు కనబరచిన పై విధ్యము సహృదయ హృదయ రంజకమైనది.

1. కావ్యాలంకార సంగ్రహము. పుట. 336

శృంగార రసాభాసమును సైతము అబ్బయామాత్యుడు వర్ణింపక వీడలేదు. మిత్రావరుణు లిరువురు నూర్వశి యెడ ననురక్తులై మోహావేశమున వీర్యపతనము కాగా వారికి తపోభంగమైనది. ఇచ్చట మునుల కూర్వశిని చూడగ మోహావేశము కలిగినది.

"ఆ వగ యబ్బురపడి మో
హావేశతఁ జూడఁ జూడ యతివరుల మనో
భావము లానందావి
ర్భావంబులఁ జొక్కి వీర్యపతనం బయ్యెన్" 4_189

ఊర్వశికి వారిపై మక్కువ లేదు. వారికి తపోభంగ మొనర్చుటయే యామె పరః లక్ష్యము.

"వెలది నృపాలుఁ జూతునను వేడ్కయ కాని మహోగ్రు ల మ్మునీం
ద్రులు తన యత్న మెట్టులగునో యని చూడదు పోవఁబూనె" [1]

నని కవి వర్ణించి యున్నాడు. ఊర్వశి హృదయము పురూరవ వశమై యున్నది భూతలమున కేదో పని గలిగి పోవలయును. పురూరవుని చూడవలయును. అది యామె కోరిక. దానికై ఇంద్రుడు మహోగ్రులైన మునీంద్రుల తపోభంగము చేయుమని కోరినంతనే సంబరపడి భూలోకమునకు పోవఁబూనినది. తాత్పర్య మేమన, ఆమె పురూరవ వశమానస, ఇంద్రనియోగమున మిత్రావరుణుల కడకు వారి తపసు చెఱపవచ్చినది. అంతియే. అందువలన ఇచ్చట అనురాగ ముభయత్ర లేదు.

"ఏకత్రై వానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా
యోషితో బహుసక్తిశ్చే ద్రసాభాస స్త్రిధామతః" అని

ప్రతాపరుద్రీయ లక్షణమును శ్రీసన్నిధానము వా రుటంకించిరి. [2] అనురాగ మేకత్ర

1. కవిరాజమనోరంజనము. 4_50

2. కావ్యాలంకార సంగ్రహము. పుట. 413.

యుండుటచే నీ ఘట్టమున రసాభాసమే వర్ణింపబడినదని చెప్పవలయును. అగ్నిస్థాలీ పురూరవ సంబంధి శృంగారము నిట్టిదేయని చెప్పవలయును. ఇట్లీ కవి శృంగార రస పరిపుష్టికై, వర్ణన వైవిధ్యమును, వివిధ శృంగారములను, చిత్రించి తన రాసిక్యమును విశదపరచుకొన్నాడు.

పురూరవుని జైత్రయాత్రా సందర్భమున వీరరసము సముచిత రీతిని పోషింపబడినది. అతని యుద్ధ సన్నాహము ఘనముగ వర్ణింపబడినది.

"ఆ సన్నాహము చూడ నొప్పెఁ బ్రకటాహంకారఘోరద్విష
త్ప్రాణోత్పాదకపాంసుధారవిచలత్కాంభోజసంఘాతరిం
ఖాసంఘట్టితగహ్వరీజనితరంగద్ధూళిపాళిచ్ఛలో
ద్భాసాధీశమహామహోదహనకుంభద్ధూమరేఖాంకమై" 3–15.

అతని ధాటికి తట్టుకొన జాలక నరివీరులెల్ల యోడి పాఱిరి. అతనికి లభించిన విజయము నాన్యతోదర్శనీయము.

"చక్రాకార ధరాధరేంద్రము జయస్తంభాకృతిం బొల్చె ది
క్చక్రాంతస్థలిఁ దన్నృపాలక జగచ్చక్షుశ్శ్రుతాంగస్ఫుర
చ్చక్రానాహత సంభ్రమభ్రమణ చంచద్ధాటికావ్యాప్త భూ
చక్రాధిపత్యసూచకంబగుచు విశ్వఖ్యాతి సంధిల్లగన్" 3–35.

మిత్రావరుణుల కూర్వశీ సౌందర్య దర్శనము తపోభంగ హేతువైనది. వారాముద్దరాలిపై నలిగిన సందర్భమున రౌద్రము వర్ణింపబడినది. "తాపస జనోత్తము లీ లలన కతంబున విఘ్నం బొందెఁ దపంబునకు ననుచు నొచ్చపెడు నలుకన్, మానవ మానవతీ స్థితితో నుండుము భూమి"[1] ననుచు మునులు శపించిరి. ఇటరౌద్రము క్వాచిత్కముగ వర్ణింపబడినను, నాయకా నాయిక సమాగమ హేతువగుటచేఁ బ్రాముఖ్యమును పొంది యున్నది.

నారదమహర్షి పురూరవున కొనర్చిన ఆత్మవిద్యోపదేశ ఘట్టము, ద్వాదశి వేళ నభ్యంజనము చేసిన దోషనివృత్తికై పురూరవుడు మాఘ స్నానమునకై

1. కవిరాజ మనోరంజనము : 4–131, 132.

పెదలి విష్ణువు నారాధించిన ఘట్టము, శాంతరస ప్రధానములై తదనంతరము, పురూరవుని యభ్యుదయమునకు హేతువులైనవి. ఆత్మవిద్యోపదేశము, విష్ణు సాక్షాత్కారమునకు సాధనముకాగా, విష్ణుదత్త వరము పురూరవునకు దివ్యవనితా లాభాదికమునకు సాధన మైనది.

"పై వర్ణ్యంబు దొలంగి షోడశకళా స్వచ్ఛేందుబింబోపమ
శ్రీవర్తిల్లెడు నీదు మోము మరు నాక్షేపించు సౌందర్యలీ
లాస్ఫూర్తి యొసంగు దివ్యవనితాలాభంబు గల్గుం సుపు
త్రావిర్భూతి ఘటించు నేలుదు వనేకాబ్దంబు లీ రాజ్యమున్" 4-11

శ్రీమహావిష్ణు వా పురూరవునికి తన దివ్య దర్శనము నిచ్చుటయే గాక, దివ్య వనితా లాభము, పుత్రాదిలాభము, దీర్ఘకాల రాజ్యపాలనమును, సౌందర్యాతి శయమును ప్రసాదించుటచేత తరువాతి నాయికా నాయక సమాగమమునకు, నాయకాభ్యుదయమునకు శాంతరస స్ఫోరకమైన విష్ణుధ్యానమే, వరరూపమున సాధనమైనది. కావున నీ కావ్యమందు వీర, రౌద్ర, శాంతములు అంగరస ములుగా సముచితరీతిని పోషింపబడి, అంగిరసమైన శృంగార రసోద్దీపనమునకు హేతుభూతములైనవి.

శృంగారరస మెన్ని పోకలఁబోగలదో యన్ని రీతుల నడిపించిన కీర్తి అబ్బయామాత్యునికి కవిరాజమనోరంజన రచనచే సిద్ధించినది. పలువురు ప్రబంధ కవులు పురాణగాథలకే కల్పనలను జోడించి, రసవత్తరమైన కావ్యముల సృష్టించి యుండగా, నీకవి కల్పనల జోలికి పోక స్వకపోల కల్పిత వర్ణన వైవిధ్య వైశిష్ట్యములచే, కవిరాజమనోరంజనమును రసపూర్ణ మొనర్చినాడు. ఆత డెత్తుకొనిన కథలన్నియు పురాణాంతర్గతములే. తానేవియుఁ గల్పించలేదు. వాని నొక పక్కవి తెన్నున నిబంధించి, ప్రబంధ మన నిట్లుండవలయునని చూపినాడు తారా శశాంక ప్రణయము, రసాభాసమయ్యు రసరమ్యమైనది. ఇలా బుధ సంయోగము చిత్రాతి చిత్రమై, నాయక జనన కారణమైనది. మిత్రావరుణు లూర్వశి యెడ ననురక్తు లగుట రసాభాసమయ్యును, మునుల శాపమే నాయికా నాయకుల సంయోగహేతు వై నట్లు చిత్రింపబడుటచే నదియు నౌచిత్యశోభితమే యైనది. పార్వతీపరమేశ్వరుల

శృంగారము, సద్యస్స్నాదు స్త్రీరూపము నొంది, నాయక జనక స్థానమగుట యను విచిత్రస్థితికి, మూలకారణమై నిలిచి, రసౌచిత్యమును పొందినది. నాయికా నాయకుల శృంగారము 'న భూతో నభవిష్యతి' యని చెప్పుకొనఁ దగినది. గుణ శ్రవణముచే నొక యప్సరస భూతలాధినాథు వరించుట, అతనికై పడరాని పాట్లు పడి, వలచి, వలపించుకొన్న ఘట్టము మరి యొందు కాన్పించదు. నడుమ నడుమ వెన్నియో యాటంకములు, మునిశాపము, సమాగమ హేతువౌట, గంధర్వ కృత ద్రోహముచే, వియోగము సిద్ధించుట, గంధర్వు లగ్నిస్థాలి నిచ్చి పురూరవుని మోసగించుట, పురూరవుడు యజ్ఞములు చేసి, విష్ణునారాధించుటచే, ఇంద్రాదులు తప్పవిపరియై అతని మనసెఱిగి (అభ్యర్థింపబడకయే) ఊర్వశిని పురూరవుని కిచ్చి వేయుటేగాక దివ్యత్వమును, నరసుర లోకంబుల యథేచ్ఛా విహారానుమతిని ఇచ్చు టచే, పురూరవుడు మానవుడయ్యును దివ్యత్వమునంది, దివ్యస్త్రీ సంభోగమున సాధించిన తీరు రసరమ్యమై, కవిరాజులకు సైతము మనోరంజకమైనది. తన్ను దావెఱిగిన కవి కావుననే అబ్బయామాత్యుడు తన యీ ప్రౌఢకావ్యమును పురూరవ శ్చరితమనక "కవిరాజమనోరంజన" మని సముచితముగ నామకరణ మొనర్చినా డనుట నిశ్చయము.

పదవ అధ్యాయము

# అనిరుద్ధచరిత్రము - పాత్రచిత్రణ

శ్రీ మంగళాద్రి లక్ష్మీనృసింహ కటా
క్షాంచలామృతవృష్టి నంకురించి
సంగీత సాహిత్య సరస సౌష్ఠవయుక్తి
శాఖోపశాఖలఁ జాలఁ బ్రబలి
రసికరాజన్య ముఖ్యసమాజ బహుమాన
సతత వసంతాభిరతిఁ జిగిర్చి
దైవనామాంకిత స్తవ మనోహరభావ
పద వాక్యసుమములఁ బరిమళించి

యభినవ స్థితిఁ బెంపొందు నస్మదీయ
భాగధేయ సారస్వతపారిజాత

తరువునకుఁ బగు నత్ఫలోదయము గాఁగ
సముచితంబుగ నొక ప్రబంధము రచింతు " [1]

కనుపర్తి అబ్బయామాత్యుడు తన తొలి కావ్యమును భావించిన తీరిట్టిది. అది "సారస్వత పారిజాతము" నకు సత్ఫలోదయము. దైవనామాంకితస్తవ మనోహరము.

"భగవంతుని సద్గుణములు
పొగడు వివేకంబె తమ కపూర్వైశ్వర్యం
బగుట నరస్తుతి సేయరు
జగతిన్ సత్కవులు తుచ్ఛ సంపదకొరకై " [2]

సత్కవులు తుచ్ఛ సంపద కొఱకు నరస్తుతి సేయరనియు భగవంతుని సద్గుణములు పొగడు వివేకమే, అపూర్వైశ్వర్యమనియు, నిశ్చయముగ నమ్మి, తన కృతిని మంగళాచల నృసింహుని కంకితమిచ్చుటయే గాక, కావ్యేతివృత్తము సైతము శ్రీకృష్ణదేవుని పౌత్ర చరిత్ర మగుట మిగుల కొనియాడ దగియున్నది.

శ్రీకృష్ణుడు పరిపాలించుచుంత ద్వారక పై కుంతమై యొప్పినది. అతడు

"రుక్మిణీ సత్యలాదిగా రూపవతులఁ
బాలఁ బెండ్లాడి సంసారసౌఖ్యనిరతి
నెలమిఁ ద్రిభువన సామ్రాజ్య మేలుచుండెఁ
గృష్ణుఁ డంచిత కీర్తి వర్ధిష్ణుఁ డగుచు" 1–75

హరికి రుక్మిణికి లోకైక సుందరలీలా సుకుమార మూర్తియై మీనాంకుడు తనూభవుడై యుద్భవించి ప్రద్యుమ్న నామాంకుడైనాడు.[3] రతీ వల్లభుడైన ప్రద్యుమ్ననకు, రుక్మి కూతురైన శుభాంగి యందు "శృంగార రసంబు విగ్రహ

1. అనిరుద్ధ చరిత్రము. అశ్వా. 1–14
2. " " " 1–17
3. " " " 1–76

ముగా నొనరించిన మాడ్కి నొప్పు నొయ్యారము వాని భాగ్యవిభవాటిక లక్షణ లక్షితాంగు"[1] డుద్భవించినాడు. అత డనిరుద్ధుడు. "అతని వరి పీరుల దాయ, నిరుద్ధతులన్ జేసెడి యనిరుద్ధస్ఫుట పరాక్రమాఢ్యుండగుటన్"[2] అతని వనిరుద్ధ డనిరట. బ్రహ్మజ్ఞాన సూచనా సమర్థుండుగాఁ గలవాడని బ్రహ్మనామకు డైనాడు. ఋశ్యమృగ చిహ్నిత కేతుండు గాఁగలుగుటం జేసి ఋశ్యకేతుండైనాడు ఇట్టి వాడు నాయకుడుగా రచింపఁబడినది "అనిరుద్ధ చరిత్రము"

అనిరుద్ధుని సౌందర్యాతిశయ మింతింతనరానిది. శృంగారరసంబు విగ్ర హంబుగా నైనట్లుండు వా డతడు.

"అందుకొనరాని మ్రాని పండైన యతని
ప్రభుతచే నూర్పు లూష్మదీర్ఘ తవహింపఁ
గొలువునకు వచ్చు వారకన్యల కయోగ
విరహ మొదవించెఁ దమ్రావ పై భవంబు" 1_81.

ఈ వర్ణనము పెద్దనగారి ప్రవరాఖ్య వర్ణనమును బోలి యున్నది.

"వాని చక్కదనము పైరాగ్యమునఁజేసి
కాంక్షసేయు జారకామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె."[3]

పెద్దనగారి వర్ణనమునకన్న అబ్బయామాత్యుని వర్ణనము సరసము. పూచిన సంపెంగపూల పొలుపు మధుకరాంగనలకు భోగబాహ్యములు. ఏలన నవి భరింప జాలవు. వానికి ప్రమాదము కలదు. కనుక సాహసింపక పోవుట సిద్ధించినది. ప్రవరాఖ్యుని యెడనది సహజమే. కాని యిట ననిరుద్ధుడు అందని మ్రానిపండు

1. అనిరుద్ధ చరిత్రము. ఆశ్వా. 1_77
2. " " " 1_78
3. మనుచరిత్రము. ఆశ్వా. 1_52

కనుక వారకన్యకలకు అయోగ విరహము సిద్ధించినది. భోగబాహ్యమగుట వేరు. అందని మ్రావిపండగుట వేరు. రెండవది సరసము. అట్టి యనిరుద్ధ కుమారునికి అవంగ శరోపమానయైన రుక్మలోచనకు వివాహము జరిగినది. శాస్త్రీయముగ తెలుగునాట జరుగు పెండ్లితంతు చక్కగా వర్ణింపబడినది. మొదటి యాశ్వాసమునందు శ్రీకృష్ణ ప్రాభవము, ప్రద్యుమ్నోదయము, అనిరుద్ధ జననము, రుక్మలోచనా నిరుద్ధుల వివాహమును వర్ణింపబడిన తీరు చూడగా కవి దీనిని తరువాతి కావ్య కథకు భిత్తికగా తీర్చి దిద్దినాడనిపించును. రుక్మిణీ సత్యలాదిగాగల రూపవతులతో శ్రీకృష్ణుడు త్రిభువన సామ్రాజ్య మేలినాడని తెలుపుట, రతీవల్లభుడైన ప్రద్యుమ్నునికి శుభాంగియందు అనిరుద్ధుడు జనించినాడని తెలుపుట చూడగా వారిద్దరి వలెనే అనిరుద్ధుడును దక్షిణ నాయకుడుగా రాణించగలడని సూచించినట్లు స్పష్టమగుచున్నది. నవదంపతుల శృంగార కేళిని వర్ణించిన విధము మిగుల రసవత్తరము. సంభోగ శృంగార వర్ణనమున అబ్బయామాత్యుడు కొంత పచ్చిగ వర్ణించినను అసభ్యముగ మాత్రములేదు, రుక్మలోచనా ప్రథమ సమాగమమును వర్ణించిన తీరు గనుడు.

"అధిక ప్రయత్న సంశిథిల నీవీబంధ
    మభిముఖకుంచితాస్యాంబుజాత
మాలస్య కరగృహీతాంచిత కుచకుంభ
    మనురాగరస విగూఢాంతరంగ
మాయసలబ్ధ బాహాలతా పరిరంభ
    మాకుంచిత భ్రూయుగాభిరామ
మామోద బాష్పధారా పూరితాంబక
    మలఘు సీత్కార మోహన నినాద

మచిర సంభూత మదవతోయ ప్రవాహ
మపగ తోష్ణాంగజాత ఘర్మాంబు కణిక
మాత్మపరవశజనిత నిద్రాభిలాష
మగుచు నయ్యెంతి ప్రథమ సమాగమంబు" 1-115

ఆమోదం బొనరింపఁగ
నామోదము విరియుఁబోలె నైక్యస్థితితో
దామోదర పౌత్రుండును
ప్రేమోదయహృదయుఁ డగుచుఁ బెనఁగెన్ రతులన్ 1–116

రుక్మలోచనానిరుద్ధుల ప్రణయ మిట్లు దినదిన ప్రవర్ధమాన మగుచుండ, దానికి, చిత్రరేఖా కృత సమ్మోహన విద్యా ప్రయోగము భంగము కలిగించినది. శోణపురమునకు చిత్రరేఖచే గొంపోబడిన యనిరుద్ధుడు, ఉషాకన్యాంతః పురమున నిద్రలేచి ఉషాదర్శనముచేసి కొన్నాడు.

"కరఁగునసుఁ బోసి మోహనాకారరేఖ
యొనఁగఁ దీర్చిన శృంగారరస మనంగఁ
దన సమీపంబునందునఁ దరుణిఁ జూచి
మన్మథకుమారుఁ డాశ్చర్యమగ్నుఁ డగుచు" 3–62.

అత డామె సౌందర్యమును దర్శించి యాశ్చర్యమగ్నుడైనాడనగా, ఆమె సౌందర్యమంత యతి లోకమని స్పష్టము. ఆతడు జాణ కావుననే ఉషాదేవిని నీవెవ్వతె వని ప్రశ్నించి యామె సమాధానము విని,

పలుకులలోని ప్రార్థనయు భావములోఁగల తెంపు మోములో
వెలవెల చూపులోఁ బొడము విన్నన యూర్పులలో వణంకు ని
మ్ములఁ బొడగాంచి యొ మ్మదనమోహనుఁ డెంతయు సంతసించెఁ దా
వలపుల మర్మముల్ దెలియవచ్చుఁ గదా ఘనులైన వారికిన్. 3–73.

అతడు వలపుల మర్మ మెరిగిన ఘనుడు, కావుననే ఉషాకన్య తన్నెంతగా వలచినదో గ్రహించి, సంతసించి, యామె పొందు నంగీకరించినాడు. ఇది యతని యుదాత్త లక్షణమును, మర్మజ్ఞతను చాటుచున్నది. వారిరువురి ప్రణయము రస రమ్యమైనది, శృంగార రసంబు విగ్రహముగా నొనరించిన మాడ్కి నొప్పువాడనిరుద్ధుడు.[1] ఆమె కరగుసనుబోసి మోహనరేఖ యొనగ దీర్చిన శృంగార

1. అనిరుద్ధ చరిత్రము : ఆశ్వా : 1–77.

రసవనంగ నొప్పునవి.[1] గ్రామ్య వేణుదారిత ఖల్లరీముఖేంద్రాణీ జృంభితాది కరణంబుల స్త్రీ పురుష రూపంబులఁ జిత్రించిన కేళీ చిత్రపటంబు లవలోకించుట వలన గూఢములకుఁ గ్రొత్త టీకంబు సంపాదించుచు, ముచ్చటలం గలియుచు, సురత జనిత శ్రమంబుల సొలయుచు, నిది రాత్రి యిది దివంబని తెలియనీయని మోహాతిశయంబుల దేహంబులు జీవంబులు నొక్కటిఁగా సుఖించిరి.[2] ఇంతలో ఉషాదేవి గర్భము ధరించినది. రహస్యము బాణుని చెవి సోకినది. అంతఃపుర ద్రోహియైన యనిరుద్ధుని బట్టి తెండని బాణుడు తన భటుల కాజ్ఞాపించినాడు. అనిరుద్ధు డా రాక్షస భటుల మక్కడగింపగా, హతశేషులు బాణునకు జరిగినది విన్నవించిరి. అప్పుడు బాణుడే యుద్ధసన్నద్ధుడై వచ్చినాడు. అనిరుద్ధ బాణులకు ఘోరమైన యుద్ధము జరిగినది.

"యదువంశతిలక వీనికి
నివి జయకాలంబు పెనఁగ నేటికి హరిచే
బొదవు నపజయము వీనికిఁ
గదియు శుభము నీకు నచిరకాలమునందున్" 3_115

అని యశరీరవాణీ వలుకగా తెలిసి, అనిరుద్ధుడు వాని బెగడందగఁ జేసియుఁ గార్యమెంచి దేవాహితు చేతఁ బట్టువడె.[3] హనుమంతుడు శక్రజిత్తుచే నాహవభూమిఁ బట్టు వడినట్లు పట్టువడినాడట. కవి ప్రయోగించిన యీ యుపమ మిగుల సముచిత మగుచున్నది. నాయకుడైన యనిరుద్ధుడు శత్రువుచేఁ జిక్కుట దైవ నియోగమని స్పష్టము చేసి, నాయక పాత్ర కొక యుదాత్తతను కల్పించినాడు కవి. అశరీరవాణి పలుకుట యనునది అబ్బయామాత్యుడు కల్పించిన విషయము. ఔచిత్య విలసితమై యొప్పారుచున్నది.

అనిరుద్ధు డట్లు బాణునిచే బంధింపబడుటను సమర్థించుచు కవి తన ప్రతిభను వెలార్చిన పద్యము గమడు.

---

1. అనిరుద్ధ చరిత్రము : ఆశ్వా : 3_82.
2. " " " 3_94.
3. అనిరుద్ధ చరిత్రము. ఆశ్వా, 3_118.

"వనితా సంపర్కంబున
ననిరుద్ధుని రుద్ధుఁ జేసె నరివర్గంబున్
వనితా సంపర్కంబున
ననిరుద్ధుని రుద్ధుఁజేయు నరివర్గంబున్" 3_119

వనితా సంపర్కము అనిరుద్ధుడంతటి వానిని యరి వర్గము (శత్రువర్గము) నిరుద్ధుఁ జేసినది. వనితా సంపర్కము కారణంగా ఎంతటి అనిరుద్ధుడైనా (శత్రువులకు లొంగనివాడైనా) అరివర్గమునకు (కామక్రోధాది యరిషడ్వర్గమునకు) లొంగి పోవుట సహజమే కదా అని కవి చమత్కరించినాడు. తరువాత శ్రీకృష్ణుడు బాణుని పై దండు వెడలుట, ఆ యుద్ధమున బాణబాహుదర్పమణంగుట, అపై బాణుడు ఉషానిరుద్ధులను శ్రీకృష్ణున కప్పగించుట జరిగినది. దానితో బాణుని కదన కుతూహల రూప భుజగర్వ నిరాసమైనది. ఉషానిరుద్ధులు ద్వారకానగర ప్రవేశ మొన ర్చిన పిదప అనిరుద్ధుడు ఉషా రుక్మలోచనల నిరువురయెడ సమభావము వహించి దక్షిణ నాయకత్వము నెఱపినాడు.

"ప్రాంచ త్కాంచన నూత్నరత్న ఖచిత ప్రాసాద దేశంబులం
బంచాస్త్రప్రియనంచనుండు, సురత ప్రాపంచిక వ్యాప్తిఁ గ్రీ
డించున్ దక్షిణనాయకత్వమునఁ బ్రౌఢిన్ రుక్మనేత్రా మన
స్సంచారుండును బాణదైత్యతన యాసక్తాంతరంగుండునై" 5_78

ఉషా గర్భమున వజ్రోదయమైనది. అమ్మహానుభావుండైన యనిరుద్ధుడు మహైశ్వర్య సమృద్ధుండును సకలభోగానుభవ సిద్ధుండును, వేదోక్త కర్మానుష్ఠాన పరిశుద్ధుండునునై సంసార బద్ధుండునుంబోలి యుండె.[1] సర్వంబును బ్రహ్మా మయంబు, ప్రపంచంబస్థిరంబని తలంచి "బ్రహ్మైవాహమ్మ"ను వేదాంతసార వచ నార్థంబు చేవల వృథంబుఁ గావించి, యెఱుకఁ గలిగిన పురుషుండు తానై సాయుజ్య సిద్ధుండగుననియు నిశ్చయించి, యాత్మానుసంధానంబు సేయుచు, జనకుని కైవడి నాత్మజ్ఞాని యైనా"[2] డని కవి వర్ణించి యున్నాడు. అనిరుద్ధమూర్తి సాలగ్రామ రూపము నందిన విధము నిట్లు వర్ణించినాడు.

---

1. అనిరుద్ధచరిత్రము. ఆశ్వా. 5_106
2. " " " 5_106

"నీలాభంబును, వర్తులాకృతియుఁ జిహ్నీభూత రాజీవ పృ
ష్ఠాలంకారము పార్శ్వచక్రము త్రిరేఖాంచ న్ముఖోపాంతమై
సాలగ్రామసమాకృతిం బొదమి, పూజల్ గాంచి యిచ్చుం గృపా
శీలుండై యనిరుద్ధమూర్తి సకలశ్రీలుం బుధశ్రేణికిన్" 5_107

ఆ యనిరుద్ధమూర్తి లోక కల్యాణార్థమై సాలగ్రామ రూపమున అర్చావిధికి సాధన మైన తీరు కవి చేతఁగూర్పఁబడి నాయకపాత్రయైన యనిరుద్ధుడు, శృంగారము, విగ్రహముగా పరాక్రమము ప్రాణముగా, భారతీయ తత్త్వము ఆత్మగా అనిరుద్ధ, ప్రద్యుమ్న, ఋశ్యకేతు నామములు సార్థకముగా వెలుగొందిన దివ్యతేజఃపుంజము పూర్ణతమావతారమైన శ్రీకృష్ణుని వంశసంజాతుడైన అనిరుద్ధుడు, రాక్షస రాజ కుమారియైన ఉషా కన్యను వివాహమాడుట ద్వారా సర్వజనాహ్లాదకారణమైన త్రిజగత్కల్యాణమును సాధించినాడు.

## ఉ ష :

ఈశ్వరవరగర్వితుడైన బాణాసురునకొక కూతురు కలదు. ఆమె ఉష. భువన మోహనాంగి. ఆమె ముద్దుగఁబెరిగి జవ్వని యైనది. "జలజాతానన విగ్రహంబు రతిరాజప్యందన ప్రక్రియన్[1] శోభిల్లి నది. జవ్వనమున ముదిత రూపంబు త్రిభువన మోహన మైనది.[2]

"పేరుధమమ్మ దేవి, స్వరమేళకళానిధి, వర్తిలంబు, భాం
డీరము, కోహళీయ్యకము, తీవిగఁ గావ్యము, నాటకం, బలం
కారము, శాస్త్రముల్, మొదలుగా మఱి యభ్యసనం బొనర్చె శృం
గారపు విద్య లిద్దనుజకన్యకికున్ పరమానురక్తయై." 2_33.

ఆడఁ బాడ నేర్చి యభినయింపఁగ నేర్చి
సరస కవిత చెప్పఁ జదువ నేర్చి

---

1. అనిరుద్ధ చరిత్రము. ఆశ్వా. 2_23
2. " " " 2_30.

బాణదనుజపుత్రి బాలిక యయ్యుమ
సకలకళలయందు జాణ యయ్యె" 2_34.

అట్టి జాణ వసంతవేళ యుద్యాన వనమున బహు విధకేళికాసక్తయై చరించి నాటి రేయి స్వప్నమున నొక త్రిలోక సుందరకుమారుని దర్శించినది. అత డామెను బహువిధ శృంగార క్రియలచేఁ జొక్కజేసి లాలించినట్లు కలగాంచినది. మేల్కాంచి యతనిం గానక విరహతప్తయైనది. ఆమె కొక నేస్తమున్నది. బాహ్య ప్రాణమో యనదగినంతటి చెలిమి గలది. ఆమె చిత్రరేఖ. ఆమె తండ్రి కుంభాండుడు చతుష్షష్టితంత్ర మహామంత్రకలాప లక్ష్యపరుడై రాజిల్లు[1] నా తండ్రి నుండి, చిత్రరేఖ మంత్ర తంత్ర ప్రయోగ క్రియలు సాంగముగ నభ్యసించినది.[2] ఆమె ఇంగితజ్ఞానియగుటచేఁ దన చెలి తాపమునకు కారణము వలపని తెలిసికొనినది. స్వప్నవృత్తాంతము విని, ముజ్జగమ్ములనున్న ప్రభుతయు, రూపసంపదయు, ప్రాజ్ఞతయునుగల వారి నెల్ల నేర్చి, భగవతీ మహిమచేఁ జిత్రములు గీచి చూపించినది. తుదకా చిత్ర పటములఁ బరిశీలించి యుషాకన్య అనిరుద్ధుని స్వప్న ప్రియునిగా తెలిసికొనినది. ఉష యెంత సౌందర్యఖనియో యంత ఉదాత్తచరిత, కలలోనే కావచ్చునుగాక యొకని పొందినది. అతడే తనకు భర్త గావలయునని స్థిర చిత్తమున భావించినది. ఆమె తన నేస్తముతోనన్న మాటలు, ఆమె యుదాత్త సౌశీల్యమును ప్రకటించును.

"కలికీ! మాటలు వేయు నేమిటికి నీ కాయంబుతో వానితోఁ
గలియఁగా భాగ్యము గల్గకున్న విధునింగాఁ జేయుమీ వీని రా
గల జన్మంబున నంచు బ్రహ్మకు నమస్కారంబుఁ గావించి య
వ్వల దేహాంతర తీవ్ర లబ్ధి కుచిత వ్యాపారముం జేసెదన్." 2_141

ఆమె యంతకు ముందనిరుద్ధుని చూసి యుండలేదు. కాని కలలోఁ గన్నంతనె యతనికి తన మనసిచ్చినది. ఇక మరియొకని తలపునకు దెచ్చునది గాదు.

1. అనిరుద్ధ చరిత్రము : ఆశ్వా : 2_81.
2. " " " 2_82.

అత డామెకు భర్త గావలయును ఈ జన్మలో నది సాధ్యముగాకున్న, మరు జన్మ పరకై నా దీక్ష మానునది గాదు. అతని పొందుటకై మరల జన్మయెత్తుటకై నను సిద్ధమే. కాని మరి యొకని భర్తగా నంగీకరింపదు. ఇది యామె హృదయ సౌశీల్యమును, స్థిరబుద్ధిని చాటుచున్నది. చిత్రరేఖ సమ్మోహన విద్యా ప్రభావ ముచేఁ బనిరుద్ధుని ద్వారక నుండి శోణపురమునకుం గొని తెచ్చినది. అంతవఱకు ఉషాకన్య విరహానలతప్తయై పొరలుచున్నది. అనిరుద్ధుని గాంచినంతనే "ఇదియుం కల కాదు గదా" యని తలచినది. అనగా అనిరుద్ధ సమాగమము దుర్లభమని తలంచినది. కాని చిత్రరేఖానుగ్రహమున నది సిద్ధింపగా మొదట భ్రాంతియని దలంచి, కాదని, అతడు సత్యముగ ననిరుద్ధుడే యని గ్రహించి చిత్రరేఖను పొగడిన తీరు మిగుల రమ్యముగ నున్నది.

ఉ॥ సుకుమారమూర్తి నిప్డ డీడకుఁ దెచ్చితి, ప్రాణదానముం
జేసితి, నీకు మేల్మరలఁ జేయఁగ నేర, నమస్కరించెదన్;
నీ సుగుణంబు, నీ నెనరు, నీ యుపకారము, నుజ్జగంబులన్
వాసికి నెక్కి నీ కథలు వర్ణిత మయ్యెడుఁ గాక కోమలీ ! 3-56.

పూర్వము శ్రీకృష్ణుని గూర్చి విని యతనినే వరించిన రుక్మిణీదేవి, అగ్ని ద్యోతనుడు వారికి రుక్మిణి సందేశము నందించి వచ్చి, హరి వచ్చెనని తెలుపగా ఏమి భావించి పలికినదో బమ్మెర పోతనగారు వ్రాసిరి. ఉషయునట్లే భావించి పలి కినదని, అబ్బయామాత్యుడు వ్రాయుట ఔచిత్యతా శోభితమే గాక, పోతన్నగారి యెడ వారికున్న యభిమానమును సైతము చాటుచున్నది.

"జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి నా సందేశముం జెప్పి, నన్
నిలువం బెట్టితి, నీ కృపం బ్రతికితిన్ నీయట్టి పుణ్యాత్మకుల్
గలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిన్ గావింపగానేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ ! సద్బంధు చింతామణీ" 1

---

1. ఆంధ్రమహా భాగవతము : 10-1735

ఇతడు తన్ను వలచునో లేదో యని చింతించిన యుషాకన్య అతనితో నేమి పలుక వలయునో గదా యని బహువిధముల వితర్కించు కొన్నది. ఎదుర మేల్కాంచి యనిరుద్ధుడు తన్నుగూర్చి యడిగిన ప్రశ్నల కిచ్చిన సమాధానము బహుచిత్ర మైనది. సమస్తలోకములం దెన్నడు నే ప్రేయసియు, తన ప్రియునితో నిట్టి స్థితిలో నిట్టి సమాధానము చెప్పియుండదు. అత డామె నెఱుగడు. ఆమె యతనిని కలలోఁ గాంచి, చిత్రరేఖా సహాయమున తన వీటికి రప్పించు కొన్నది. (యథార్థము నకుఁ దెప్పించుకొన్నది.) ఇట్టి విచిత్ర పరిస్థితిలో నొక ముగ్ధ యేమి పలుక గలదు. ఏమైన గానిమ్మని యిట్లన్నది.

"ఇది బాణాసురు వీడు, శోణపుర, మా యింద్రారి మా తండ్రి, పెం
పొదవె న్నాకు నుషాభిధాన, మొగి నీ యొయ్యారపుఁ రూపు స్వ
ప్నదశం గాంచిన దాననై విరహ సంతాపంబునుం జెంద, స
మ్మదలీలన్ నినుఁ దెచ్చెఁ బ్రాణసఖి శుంభద్యోగ విద్యోన్నతిన్" 3-69.

"కన్నియఁగాని యన్యసతిఁగాను, శరీరము నీదు సొమ్ముగా
మన్ననచేసి యేలుకొనుమా!, వినుమా! యనుమాన బుద్ధిపై
న న్నలయించెదేని రమణా! యిఁక నేమనుదాన నిన్ను, నా
కన్నులఁ జూడఁ గల్గెఁ గదా! కాఁగల యట్లగు దైవయోగముల్" 3-70.

మొదట జరిగిన యథార్థమంతయు వివరించినది. తాను కన్నియనని వివాహ యోగ్యనని విన్నవించుకొనినది. తన్ను మన్నించిన మే లన్నది. కాదేని యతనిని కన్నులతోఁజూడ గల్గుటదే భాగ్యమని స్పష్టము చేసినది. అంతకన్న తానేమియు నన జాలనన్నది. ఇక దైవయోగ మెట్లున్న నట్లగునన్నది. ఎంత బేలతనమో, అంత జాణతనము "ఏలుకొనుమా! రమణా!" యనుట, "నా కన్నులఁజూడఁ గల్గె గదా" యనుట, "కాఁగల యట్లగు దైవయోగముల్" అనుట ఆమె హృదయ స్థితి కద్దము పట్టినవి. అతడామె నాదరించినాడు. వారి యానందమునకు హద్దులు చెఱిగి పోయినవి. వారిరువురు ప్రణయకేళిలో దేలిపోయిరి. ఆమె గర్భవతి యైనది. రహస్యము బట్టబయ లైనది. తండ్రి కీ విషయము తెలిసినది. వాడు రాక్షసుడు. దయాహీనుడు. "జక్కొందగాని దుర్మదోన్మాదుఁ జేసినట్టి ఖలు,

నా కడకుం గొనిరండు తీర్చికె" అని భటుల కాజ్ఞాపించినాడు. వా రా యని రుద్ధుని బంధింపఁజాలక యతనిచేత మర్దితులైరి. హతశేషు లా వృత్తాంతము తెల్పగా బాణుడే స్వయముగ ఉషాంతఃపురమునకు వచ్చినాడు. యుద్ధమున ననిరుద్ధుని జయించి, యతనిని కారాగారమున బంధించినాడు. ఉషాదేవి కిది దురంత సంతాప కారణమైనది. ఆమె పడిన మనోవ్యథ యిట్టిదని చెప్పరానిది. "ఆ మనోవ్యథఁ గనుగొన్న రామ! రామ! జగతిఁ బగవానికైన నను జాలిగాదె"[1] యని కవి వాపోయినాడు. పగవానికైన జాలిగలుగునేమో కాని, ఆమె తండ్రి యైన బాణాసురున కే మాత్రము చింతకలుగలేదు. శ్రీకృష్ణుకు దండువెడలి ఘోర యుద్ధమున బాణుని బాహుచ్ఛేదన మొనర్చి, దర్పమణచిన పిదపగాని, ఉషా నిరుద్ధులకు మరల సమాగమము సిద్ధింపలేదు. అంతకాల మువ విరహానల తప్త యగుటయేగాక నది తన తండ్రి కారణమున నగుటచే మిగులవంత నందినది. ద్వారకా నగరమునకు వచ్చిన తరువాత ఉషాదేవి కుమారుని గన్నది విద్యల నేర్పుట యందలి సార్థక్యము వానిని లోకకల్యాణార్థము పరులకు నేర్పుటలోనే యున్నది. ఉషాదేవి మేరుధనుష్క దేవియైన పార్వతి వద్ద నెన్నియో శృంగార విద్యలను బాల్యమున నభ్యసించినది. వానిని తన యానందమునకై మాత్ర ముప యోగింపక, లోకమున వ్యాప్తి నందునట్లు చేసి విద్యల సార్థక్యమును సాధించినది.

"సరస సంగీతంబు, సంయుతా సంయుత
హస్తాభినయము, భావాభిరామ
వీక్షణ భ్రూలతావిభ్రమంబు సపాద
తత్కాల కల్పిత తాళమాన
మైన లాస్యంబు, కాత్యాయని యొద్ద బా
ణాసుర తనయ తా నభ్యసించె
నది గాన, ద్వారక యందుఁ దద్విద్యాభి
లాషఁ బ్రార్థించు విలాసినులకు

పృథముఁగ వించె, సౌరాష్ట్ర దేశ చంద్ర
వదన లా నీలవేణుల వలన నేర్చి

1. అనిరుద్ధ చరిత్రము : అశ్వా : 3-123.

రా లతాంగులుఁ దెలుప నంతంత నఖిల
దేశముల సర్వజన వశ స్థితిని పెరసె" 5-104

పూర్వ ముషాకన్య బాల్యదశయందు నేర్చిన విద్యలను గూర్చి కవి వర్ణించినప్పుడు, స్వరమేళ కళానిధి, దత్తిలంబు, భాండీరము, కోహళీయకము, కావ్యము, నాటకము, అలంకారము, శాస్త్రములు మొదలగు శృంగారపు విద్యల నభ్యసించినట్లుగా తెలిసినది. ఇప్పుడు హస్తాభినయము, భావాభిరామ వీక్షణ భ్రూలతా విభ్రమము, సపాద తత్కాల కల్పిత తాళమానమైన లాస్యము, పార్వతీదేవి కడ ఉషాదేవి యభ్యసించినదని తెలుపుట చూడ కొంత భిన్నముగా దోచి పైరుధ్యము భాసించుచున్నది. కాని వీనిని "మొదలగు శృంగారపు విద్యల" లోనివిగా చెప్పుకొన్నచో నా పైరుధ్యము నిరస్తమగును. పరమశివుడు తాండవమునకు, పార్వతి లాస్యమునకు నాద్యులు కనుక లాస్యము ప్రథానముగ పార్వతీదేవి నుండి ఉషకు, ఉషనుండి, ద్వారకా యందలి విలాసినులకు, వారి నుండి సౌరాష్ట్ర దేశ చంద్ర వదనలకు, వారి నుండి సర్వజనవశస్థితిని ఈ విద్యలు పొందినవని కవి వాని పరంపరావ్యాప్తిని విశదీకరించియున్నాడు. మరియొక విశేషము కలదు. ఉషాదేవి శోణపురమునుండి వచ్చినది. ఆమె పుట్టినింటనున్నప్పుడపురూపముగ నేర్చుకొన్న విద్యలవి. అవి భారత దేశమునమున్న వారికి తెలియని విద్యలని కవి సూచించినట్లయినది. కావుననే వాని నామె ద్వారకయందు వసించి విలాసినులకు నేర్పినది. అదియు తద్విద్యాభిలాషఁ బ్రార్థించిన వారికే నేర్పినది. ఆసక్తిగల్గిన వారికే విద్య నేర్పవలయునని స్పష్టపరచినట్లయినది. ఇట్లా విద్యలు, ఉషాదేవి ద్వారా సర్వజన వశస్థితిని పొందినవని కవి చెప్పుట మఱియొక విశేషము. ఇంతవరకా విద్యలు శాస్త్రరూపమున పాఠ ప్రవచనములందు లేవని తెలుచున్నది. కాగా ఉషాదేవి పూనుకొనగా, నా విద్యా రహస్యములు పరంపరా క్రమమున ఒకరి నుండి మరియొకరికి, తెలిసి వచ్చినవన్నమాట. అందరా విద్యలు ప్రయోగింపఁజాలరు కదా! ఐనను అవి సర్వజన వశస్థితి నొందినవని వ్రాయుటేమియని వింతగఁ దోచవచ్చును. ఇంతవరకా విద్యలున్నవని యిచ్చటి వారెరుగరు. కాగా నిప్పుడవి ప్రవర్తింపఁబడి, సర్వజనులు ప్రశంసింపగా, వాని ప్రశంస సర్వజన వశస్థితి నొందినదని కవి చమత్కరించుట గమనార్హము.

ఇట్లు ఉషాకన్య శోణపురమున, రాక్షసరాజైన బాణునకు కూతురై, పరమ శివుని యిల్లాలైన పార్వతీదేవికడ శృంగార విద్యల నభ్యసించుట, శిష్యరికమొనర్చి జాణయై, దైవయోగమున, అనిరుద్ధ పత్నియై, సూక్ష్మవిద్యా ప్రవర్తకురాలై, సమస్తమానవాళికి క్షేమంకరమైన, దేవ మానవ రాక్షస జాతుల సమైక్యతకు సూత్రధారియై, విసూక్ష్మ శాంతిమయ విశ్వ నిర్మాణ కృషిలో ప్రధాన పాత్ర వహించినదని చెప్పవచ్చును బ్రహ్మసూ, ఋశ్యకేతు, అనిరుద్ధాది సార్థకనాముడైన అనిరుద్ధసతియగుటచే, ఆమె ధన్యయై త్రిజగత్కల్యాణ సంధాత్రియైనది.

## చిత్రరేఖ:

రాక్షసరాజైన బాణునకు కుంభాండుడను వాడమాత్య శ్రేష్ఠుడు. బాహు విక్రమకేళీ విరాజితాహిత ప్రకరుడాతడు చతుష్షష్టి తంత్ర మహాతంత్ర కలాప లక్ష్యపరుడు. వాని కొక కూతురున్నది. పేరు చిత్రరేఖ. వరసుందరాకారరేఖ నొప్పునది. తండ్రివలన మంత్రతంత్రయోగ క్రియలను సాంగముగ నభ్యసించినది. అట్టి చిత్రరేఖ బాణుని కూతురైన యుషకు బాహ్యప్రాణమోయన్నట్లు నేస్తము చేసినది. దీనాననాంభోజయై గ్లానిం బొందుచునున్న ఉషారమణీ యాకారమును వీక్షించినంతనే, ఇంగితజ్ఞానియగుటచేత నది వలపుమర్మంబుగా మది తెలిసికొన్నది. ఆమె యంతటి ప్రజ్ఞాశాలి. ఆమె తన ప్రాణసఖియైన యుషాదేవి దైన్యమును గూర్చి నెమ్మదిగా ప్రశ్నించినది. ఆమె యూహించిన తీరు కడు రమ్యము.

> "పరిరంభణ మృదు చుంబన
> నఖసాలాపాది సురత సౌఖ్యంబులచేఁ
> గరఁగించు విభుఁడు బాసిన
> విరహిణి చందంబు దోఁచె వెలఁదీ నీకున్" 2-87.

ఇంగితజ్ఞాని యగుటచే నామె దైన్యము వలపు మర్మమని గ్రహించి విరహిణివలెనున్నావని పలుకుట చూడ యామె యెంత జాణయో, ఎంతమాట నేర్పరియో తెలియుచున్నది. "నేఁ గలుగంగ నెంత పనిఁ సంతాపముం బొందగా

నేలా"[1] యని ధైర్యము చెప్పినది. నిజమునకు లోకవ్యవహారం దే ప్రాణసఖియైనను ఇట్లే సమాధాన పరచును. ఇక నీ చిత్రరేఖ యన్నదో యథార్థమే పలికినది. ఆమె అంతటి సమర్థురాలే. ఆమె మనసెఱిగి, మనసైన వానిని సముద్రమున నున్న ద్వారక యందలి యనిరుద్ధుని శోణపురము నందలి యుషాంతఃపురమునకేఁ గొని తెచ్చిన సాహసికి పైమాటలనుట సముచితమే గాని, లోకరీతికి సాధారణముగ పలికిన సాంత్వనోక్తి కాదు. ఉషాదేవి మనసు విప్పి, గుట్టు చెప్పినది. తానొక యందగాని వలచితి నన్నది. వాని రూపు నా హృదయ పటంబునందు లిఖియించిన కైవడిఁ గాన నయ్యెడిన్"[2] అని తాను కలలోఁ గన్న సుందరాంగుని వన్నె చిన్నెలను స్మరించి వాపోయినది. "వానిఁ గన్నులఁ జూపి, జీవంబు నిలుపు,"[3] మని దైన్యము నొందినది. ఇది చాల క్లిష్టమైన సమస్య. ఉషాదేవి స్వప్నమున గాంచిన యందగానిని చిత్రరేఖ యామె కెట్లు చూపగలదు? ఇది యసంభవముగ తోచును. కాని ప్రాణసఖికై సాధింపక తప్పదు. "తానయ్యెడఁ గొంతసేపు హృదయాబ్జమునం దలపోసె నేర్పునన్"[4] బాగుగా యోచించినది. ఉషాదేవి స్వప్నము గన్న యందగాని తెలిసికొను మార్గ మామెకు గోచరించినది. చిత్రరేఖకు మంత్ర తంత్ర యోగ ప్రక్రియలతో పాటు, చిత్ర లేఖన విద్య కూడ సమగ్రముగ వచ్చును. విరహిణి కనుక ఉష యోచింప జాలక పోయినది. కాని ఉషను మించిన ప్రజ్ఞాశాలి చిత్రరేఖ. కావుననే ప్రాణసఖి యైనది. ఆమె ప్రాణములు నిలుపనున్నది గదా! అవ్యక్తముగనే యైనను ఉషాదేవి, చిత్రరేఖ కొక సూచన జేసినది. "వాని రూపు నా హృదయ పటంబునందు లిఖియించిన కైవడిగాన నయ్యెడిన్" అను పలుకులతో "చిత్రము గీయవలెను" అను ప్రబోధనము చిత్రరేఖలో వ్యాపదేశముగ కలిగించినది. చిత్రరేఖయు నేర్పుగ తలపోసినది కావున, ప్రపంచమునందలి యందగాండ్రందరి చిత్రములు గీచి చూపుదమను యూహ స్ఫురించి తత్ప్రయత్నమునకు పూనుకొన్నది. "సజీవ

---

1. అనిరుద్ధచరిత్రము. ఆశ్వా. 2_88.
2. " " " 2_93.
3. " " " 2_94
4. " " " 2_95.

చిత్రముల్ నిలిపిన యట్లు వ్రాసె రమణీమణి నేర్పు వచింప శక్యమే"[1] యని కవి యాశ్చర్యపడునంత చక్కగా చిత్రములకు జీవము పోసి తన ప్రాణసఖి జీవములు సైతము నిలుపుకొనినది. చిత్రరేఖా చిత్రలేఖన సామర్థ్యమును గూర్చి కవి చెప్పిన పద్యము కడు రమణీయమైనది.

"వ్రాత కజుఁడు గర్త సేఁతకుఁ దాఁ గర్త
యనుట కిది విరోధమైన నేమి
సేఁత కజుఁడుఁ గర్త వ్రాఁతకుఁ దాఁ గర్త
యంచుఁ జిత్రరేఖ ననఁగ వచ్చు" 2_98

చిత్రరేఖ చిత్రలేఖన కళాపారీణయేగాదు, లోకజ్ఞురాలు, విజ్ఞానపేటి. కావుననే త్రిభువనముల యందలి దేవ మనుష్య భుజంగ కోటిలో, ప్రభుతయు, రూపసంపదయుఁ, బ్రాజ్ఞతయుఁ గలవారినెల్ల నేర్చి పటమున లిఖియించినది. ఇది భగవతీ మహా మహిమచే సాధించినది. అనగా నామె మహోపాసకురాలు. కావుననే ఉషా సంకల్పసిద్ధి సులభసాధ్యమైనది. చిత్రముల నెన్నిటినో చూచిన యుష తుదకు, తాను కలలో గన్న యందగా డనిరుద్ధుడే నని గుఱుతింప గలిగినది. అతని పొంద జాలకున్న తాను మరణింతునని యుష నిశ్చయించుకొనినది. అది చూచి చిత్రరేఖ యామెను సముచితరీతి ననునయించి "విభు వేగమె తోడ్కొని పత్తునంచు, నా సరసిజ గంధి యోగబల సంపదచే గగన ప్రచారయై"[2] యరిగినది. చిత్రలేఖన కళాపారీణయైన చిత్రరేఖ, అపూర్వ సౌందర్యఖనియైన యనిరుద్ధుని గాంచి, అంతటి సౌందర్య దర్శనమున కుబ్బి తబ్బిబ్బయినది

"మీసము తీరుఁ జూచి, జిగి మేని పటుత్వముఁ జూచి, మోములో
హాసముఁ జూచి చేతుల యొయారముఁ జూచి మనోజ్ఞరూపరే
ఖాసమలీలఁ జూచి యహహా యనుచుం దలయూచి ముందుఁ దా
వ్రాసిన భావ మెంచి తల వాంచుకొనెన్ జలజాక్షి సిగ్గునన్" 3_44

1. అనిరుద్ధచరిత్రము. అశ్వా. 2_97
2. " " " 3_39

చిత్రరేఖ సౌందర్య ద్రష్ట. కనుకనే త్రిభువనముల నున్న సౌందర్యఖనుల చిత్రములను కన్నులకుఁ గట్టినట్లు వ్రాసి చూపగలిగినది. ఆమెయే అనిరుద్ధుని సౌందర్య వైశిష్ట్యమును నెంచి తలమునకలైనది. అంతే కాదు. తాను ముమ్ము వ్రాసిన చిత్రపటము, అనిరుద్ధుని సహజసౌందర్యమును చాటఁజాలక పోయెను గదా' యని సిగ్గుపడి తలవంచుకొనినది. చిత్రరేఖ యెంత కళాకారిణియో, అంత మనస్విని కూడ. కావుననే తానా సుందరుని ప్రతిరూపమును సరిగా వ్రాయఁజాలక పోతినే యని సిగ్గిలినది. యథార్థము నొప్పుకొను స్వభావ మెంత సరళసుందరము. కావుననే చిత్రరేఖ, యథార్థముగ చిత్రరేఖయే. ఆ తరువాత సమ్మోహన విద్యచే ద్వారకా నగర జనుల నిద్రామగ్నుల చేసి, యోగబలముచే ననిరుద్ధుని గైకొని ఖేచరత్వమున నుచ్యద్వేగియై ఉషాంతఃపురమునకు చేర్చినది. ఈ ఉషానిరుద్ధుల సంధానము త్రిజగత్కల్యాణప్రదము. కావుననే ఉష "మేల్మరలఁ జేయగనేర నమస్కరించెదన్" 1 అని పలికి, "నీ సుగుణంబు, నీ నెనరు నీ యుపకారము ముజ్జగంబులన్ వాసికినెక్క నీ కథలు వర్ణితమయ్యెడు గాక కోమలీ" 2 యని యాకాంక్షించినది. సుజనులకు పరోపకారమే పరమ ధర్మము. వారి యశశ్చంద్రికలు లోకాహ్లాదకరములు. చిత్రరేఖ సార్థక నామధేయ శుద్ధ సౌజన్యమూర్తి. కళా తపస్విని.

## బాణుడు - శివకేశవులు :

"బాణుం డుద్ధత సత్త్వ నిర్జిత జగత్ప్రాణుండు పాతక్య శ
ర్వాణీ పల్లభ పాదపద్మ భజనారంభ ప్రవీణుండు, గీ
ర్వాణ వ్రాత మహో భయంకర ధమర్వాణుండు సంగ్రామ పా
రీణుం డప్పుర మేలుచుండు విజయశ్రీ పై భవాక్షీణుఁడై" 2-4

బాణుని గూర్చి కవి వర్ణించిన తీరట్టిది. వాడు శివానుగ్రహముచే సర్వజన దుర్నిరీక్షుడై నాడు. తన సహస్ర భుజా బలొద్ధత్య మహిమ నుగ్ర శాసనుడుగా

1. అనిరుద్ధచరిత్రము. ఆశ్వా. 3-56.
2. " " " 3-56.

ముల్లోకముల నెదురులేక శోణపురము రాజధానిగా విరాజిల్లువాడు.[1] వాడు భరత కళా ధురీణుండు.[2] భవానీ మనోహరుండగు హరుం డఖండతాండవకేళీరతుండై నాట్యము సలుపువేళ నావజంబను (రుంజ) వాద్యమును బుచ్చుకొని, శ్రుతి ప్రమాణంబు నిలిపి, నాద బ్రహ్మంబు జనియింప, పరమేశ్వరుని నాట్యంబు జగన్మోహనంబై ప్రవర్తిల్లు నట్లు నెఱయ మొఱయించినాడు.[3] బాణుని వాద్య విద్యకు పరమేశ్వరుడు మెచ్చి, వరమిచ్చెద వేడు మన్నాడు. "నా నగరి వాకిటం బారిషదాళి తోడ శర్వాణియు, నీవు, భక్తజనవత్సల! కావలియుండవే కృపన్"[4] అని వరమభ్యర్థించినాడు. సాంబశివుడట్టే యని యా దానవేంద్రుని పట్టణ ద్వారము నందు కాపుర మున్నాడు. బాణుని వైభవమంతయు వాని శివభక్తి పారమ్యమునం దున్నది. వాని భాగ్యాతిశయమట్టిది. వానికి శివుడుదక్క, తనతో సాటివాడిలలో మరొక వీరుడు లేడను గర్వము హెచ్చినది. తనతో యుద్ధముచేసి, తన చేతుల తీట కొంతయుం గూర్చుమని యొకనాడు వాడు పరమ శివునే ప్రార్థించినాడు. శివునికి వాని గర్వము దుస్సహమైనది. అతడు శాంతముగ నిట్లు పలికినాడు.

నాయంతవానితో నని
సేయంగలిగెదవు, నీదు చేతుల బరువున్
బాయు, భవదీయ కేతన
మే యెడఁ బడఁ గూలు నప్పుడ హీనవివేకా! 2_18

వాని గర్వమునకు రోషించి పలికిన మాటలివి. కనుకనే సాభిప్రాయములై ధ్వనించినవి. శివుడుదక్క మఱి యొక్కడు విక్రమాఢ్యుడు తనకు సాటివాడు లేడన్న బాణుని వాక్యములకు సమాధానముగా, సూటిగా గాకున్నను సాభిప్రాయముగా, తనయంతటి వాడింకొక్కడున్నాడని (అతడు శ్రీకృష్ణుడు [హరి]) పరమేశ్వరుడు బాణుని వాక్యములను ఖండించుచునే, వాని కోరిక మేరకు కేతన పతనమైనప్పుడు యుద్ధము సంభవింపగలదని సూచించినాడు. భవిష్యత్తులో ననిరుద్ధుని నిమిత్తము

1. అనిరుద్ధచరిత్రము. ఆశ్వా. 2_5
2. " " " 2_6
3. " " " "
4. " " " 2_7

జరుపగనున్న శ్రీకృష్ణ బాణాసుర సంగ్రామమును, పరమ శివుడు నేర్పుగ సూచించి నాడు. "భవదీయ కేతన మే యెడఁధరఁ గూలునపుడు హీనవివేకా!" యను చోట నొక చమత్కృతి కలదు. "ధరగూలునపుడు అహీనవివేకా!" యన్నట్లు బాణునికి తోచును. "ధరగూలునపుడు + అ + హీనవివేకా!" యని పరమశివుని భావము. బాహుబల గర్వితుడైన బాణునికి యుద్ధమే కావలయును. శివుడేమి చెప్పినను వాడు యోచించు స్థితిలో లేడు. కావుననే తనకు శివునంతటి వానితో యుద్ధము సంభవింప గలదని సంతసించుచు పోయినాడు. వాని యౌద్ధత్యమున కిదియొక తార్కాణము. ఉష గర్భవతియైనదని తెలియగనే వానికి ఖేదము, క్రోధము న్మదినిఁ గీల్కొనినది[1] అంతఃపుర ద్రోహిని పట్టి తెండని యోధుల కాజ్ఞాపించినాడు. వారనిరుద్ధునిచే పరా ఙ్ముఖులై, హతశేషులా విషయము తెలుపగా "బాణుండత్యుగ్ర రౌద్ర ముద్రా సము న్నిద్ర నేత్రకోణుండును, నాహవాటోపధురీణుండునునై" అనిరుద్ధుని కదిసినాడు.[2] "బాహుబలోద్ధతిం, బ్రళయభైరవు భంగి పరాక్రమించినాడు.[3] తన కుమార్తె కిది సంతాప కారణమని తలపక, అనిరుద్ధుని బంధించినాడు. వాని క్రూర స్వభావ మట్టిది ఔద్ధత్య మట్టిది. వానికి యుద్ధమన్న నెంత యానందమో!

"రణభేరీ ప్రకటాంక ఖాంకరణ సంరావంబు త్రైలోక్య భీ
షణమై మ్రోయ, భుజాసహస్ర సముదంచ ద్భాత హేతి చ్ఛటా
ఘృణి శోభిల్ల ననర్ఘ రత్నఖచిత ప్రేంక చ్ఛతాంగాధిరో
హణుఁడై సంగరకేళికిన్ వెడలె నుద్య ద్వాహినీయుక్తుఁడై" 4-42.

ఘోర యుద్ధము జరిగినది. వాని మొగసాల గాపున్నవాడు కనుక తప్పని సరియై శివుడు తనకు చెలికాడైన నారాయణునితో (శ్రీకృష్ణు) యుద్ధమునకు పూను కొన్నాడు. తన యావచ్ఛక్తిని వినియోగించి బాణాసురుని పక్షమునఁ పోరాడినాడు. భక్త సులభుడగు శివునికిది సహజమే గదా! యుద్ధరంగమున బాణుడొక మారు శ్రీకృష్ణుని ధాటికోర్వఁ జాలక నిశ్చేష్టుడైనాడు. ఇంతలో నతని జనని కోటరీరాక్షసి

---

1. అనిరుద్ధచరిత్రము. ఆశ్వా. 3-108
2. " " " 3-114
3. " " " 3-118

వికృత చేష్ట చూడలేసి శ్రీకృష్ణుడు విముఖుడై యున్నవేళ, బాణుడు పారి పోయినాడు. తన్నింతగా నొప్పించిన వాడు ఆదినారాయణుడే యగునని నిశ్చయించుకొని "అతని తోడి సంగ్రామంబు వలన నెట్లయిన లెస్సయని ధైర్యముఁ దెచ్చుకొని,[1] బాణుడు మరల యుద్ధరంగమునకు వచ్చినాడు. గర్వము తొలగి యాలోచనకుఁ బూనుకొనుటచే వానికి శ్రీకృష్ణు డాదినారాయణుడన్న జ్ఞానము కలిగినది. కాని సహజమైన బాహా గర్వమింకను తొలగకుండుటచే మరల యుద్ధ మొనర్ప బుద్ధి పుట్టినది. శ్రీకృష్ణ బాణాసురులకు మరల ఘోరాహవము ఘటిల్లినది. అందు శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రముఁ బ్రయోగించినాడు. ఆ చక్రము బాహా సహస్రంబు నందుఁ జతుష్టయావశిష్టంబుగా ఖండించి వైచినది.[2] శివుడు కేశవుని స్తుతింపగా, హరియు బాణునియెడ కృపగలవాడై వధింపక విడిచినాడు. శివుని కృపను పొందిన వాడగుట చేతను, తనకు పరమ భక్తుడైన ప్రహ్లదునకుం బ్రపౌత్రుడగుట వలనను, వానిని చంపక, బాహా విక్రమోన్మాద మడంచుటకై బాహా విచ్ఛేదన మొనర్చినాడట హరి.[3] అంతియేగాదు మరియు ననుగ్రహించినాడు.

"ప్రమథగణంబులలో ను
త్తముఁడై భవదీయ సన్నిధానంబున మో
దముతోడ నుండగలఁ డీ
యమరాహితుఁ డింక నో పురాసురమథనా!" 5–25.

శివకేశవుల చేతలు బహు విచిత్రములు. వారి కనుగ్రహము కలిగిన యెడ సిద్ధింపని దేముండును.? కావుననే బాణాసురునకు ప్రమథ గణములలో నుత్తమ స్థానము లభించినది. అంతేకాదు బాహాబల గర్వము నశించినంతనే, బాణునకు జ్ఞానోదయమైనది. ఇచట నొక విశేషమున్నది. శ్రీకృష్ణుడు బాణాసురుని బాహావుల నన్నింటిని ఖండించ లేదు. నాలుగు చేతుల వదిలి వేసినాడు. ఆ కారణ

1. అనిరుద్ధచరిత్రము. ఆశ్వా. 5–8
2. " " " 5–18
3. " " " 5–24

మువ వాడు శ్రీకృష్ణుని వలనే చతుర్భుజుడైనాడు. అనగా వానికి విష్ణువుతో సారూప్యము సిద్ధించిన దన్నమాట. సారూప్యము సిద్ధించినచో వైకుంఠమున నుండుమనక బాణుని పరమ శివుని ప్రమథ గణములలో జేర్పనేల నని ప్రశ్న పుట్ట వచ్చును. కాని మొదటి నుండియు బాణుడు శివపూజా ధురంధరుడు. వాడు శివ సాన్నిధ్యమును పొందుటయే సముచితము. ఇకను స్పష్టముగ చెప్పవలయు నన్న, శివకేశవుల కభేదము సూచించుటకే, సారూప్యము సిద్ధించినను, శివ సాన్నిధ్యమున నుండుమని నియమించుట యది నిర్ధారించుటకే.

శివకేశవులు భిన్నులుగా కనిపించి నప్పటికిని లోకరక్షకులైన వారిరువురికి భేదము లేదు. లేదన్న విషయము నీ కావ్యము ద్వారా కవి మరియొకమారు స్పష్ట పరచినాడు. బాణుడు శివపూజా ధురంధరుడు. భరత కళా ధురీణుడు. ఆ కళా పారీణతయే, నటరాజైన పరమ శివుని మెప్పించినది. వరమిప్పించినది. శివుడే బాణుని వీటి కావలి గాయవలసి వచ్చినది. అది కూడ సుగుణమే నంటాడు కవి. "దాన వేంద్రుని పట్టణ ద్వారమునను, గాపురంబుండె నిది లఘుకార్యమనక, యెంత సులభుండు పార్వతీ కాంతు డహహ."[1]

> "నాయంతవానితో నని
> సేయం గలిగెడును, నీదు చేతుల బరువున్ బాయున్"[2]

నని పరమ శివుడు బాణాసురునకు యుద్ధము కలిగెడు ఱటి నిర్దేశించినాడు. అప్పుడతని కేతనము ధరఁగూలునని సూచించినాడు. ఇట సర్వజ్ఞుడైన శివుడు భవిష్యత్కాలమున సంభవింపనున్న శ్రీకృష్ణ బాణాసుర యుద్ధమును దృష్టియందుంచుకొని పై మాటలు చెప్పినట్లు తోచును. తన్నెదిరించువాడు శివుడు దక్క మఱొక్కడు లేడన్న బాణుని వాక్యము ఖండించుటకు తన యంతవాడున్నాడని చెప్పినాడు. అతడు శ్రీహరి యని శివుని కెఱుకయే. అంతియే కాదు బాణుడు "చేతుల తీట కౌషధము సేయఁగదే"[3] యని శివునితోనే యుద్ధమును గోరినాడు.

---

1. అనిరుద్ధచరిత్రము. ఆశ్వా. 2_8
2. " " " 2_18
3. " " " 2_16

తాను నాటిన మొక్కను తానే ఖండించుట భావ్యము కాదను కొన్నాడేమో పరమ శివుడు తన యంతటి వానిని చూపించినాడు. అంతే కాదా యర్థములో "నీదు చేతుల బరువుఁ బాయు" నన్నాడు. అనగా నా యుద్ధము నందు బాణుని బాహు విచ్ఛేదము జరుగగలదని సూచించినాడు. శివుడు సూచించినట్లే, శ్రీకృష్ణుడు తన చక్రముతో బాణుని బాహు విచ్ఛేద మొనర్చుటఁ జూడ శివకేశవుల కభేదము స్పష్టము కాగలదు. శివకేశవు లిరువురు బాహ్యమునకు భిన్నులుగ తోచవచ్చును. శైవ జ్వరము, వైష్ణవ జ్వరమునకు లొంగినట్లు కనిపించుట మొదలగునవి లోకమున కా భ్రమ కలిగించును. కాని వారిరువుర కభేదము చెప్పుటయే కవి యభిప్రాయము. విష్ణువుతో సారూప్యము (చతుర్భుజత్వము) సిద్ధించిన బాణుడు ప్రమథ గణమునఁ జేరుట యీ విషయము దృఢపరచుటకే. మేరు ధనుష్కు దేవి ఉషా కన్యకు శృంగార విద్యల నేర్పినది. ఆమె శ్రీకృష్ణ పౌత్రుని కొఱకే అట్లు తీర్చి దిద్దుట జరిగినది. ఈ విషయము వాచ్యముగ చెప్పియుండ లేదుగాని, అన్యాపదేశముగ సూచించి యున్నాడు. చిత్రరేఖ అనిరుద్ధాది సుందరుల చిత్రములను సజీవముగ చిత్రింప గల్గుట భగవతీ మహిమయని సూచించినాడు. ఆ భగవతి యెవరో కాదు. రాక్షసులచే నిత్యము (వీటి కావలియున్న) పూజింపబడు పరమేశ్వరాణి పార్వతియే. ఇది యంతయు నొక వ్యూహము. "సాతత్య శర్వాణీ వల్లభ పాద పద్మ భజనారంభ ప్రవీణుండైన,"[1] బాణుడు "నా యజ్ఞానము వాసె నీ కరుణఁ గృష్ణ! గోపికావల్లభా!",[2] యని శ్రీకృష్ణుని ప్రార్థించుట శివకేశవాభేదమును సూచించుటకే. జగన్నాటక సూత్రధారులైన శివకేశవులు పన్నిన వ్యూహమునఁ జిక్కి, బాణుడు బాహుబల గర్వమును బాపుకొన్నాడు. ప్రమథ శ్రేష్ఠ పదవి నందినాడు, ధన్యుడైనాడు.

1. అనిరుద్ధ చరిత్రము: ఆశ్వా: 2-4.
2. " " " 5-27.

# కవిరాజమనోరంజనము - పాత్రచిత్రణము

## తార :

తార బృహస్పతి భార్య. ఆమె అపూర్వ సౌందర్య రాశి.

"ఆ గురుని దార రూపరేఖాత్యుదార
చారు కుచభార శృంగార తారహార
సుగుణవిస్తార పదనఖసురుచి విజిత
తార మోహిని యపరావతార తార"      2-7.

మోహిని యపరావతార మనదగిన సౌందర్య మామెది. అట్టి సౌందర్యము సుమన స్సాయక శారీర విభవజయ సౌందర్య శ్రీయుక్తమూర్తి, రజనీ నాయకు వీక్షించె, వికచ నయనోత్పలయై." [1] రజనీ నాయకుడైన చంద్రుని చూచినంతనే యామె వికచ నయనోత్పల యైనది. అనగా అతని సౌందర్యాతిశయమున కాశ్చర్య పడినదని సూచన. అంతే కాదు తాను గురుసతినని తలపక మోహవిలోల యైనది. మోహవిలోలయైన తార చూపులను కవి వర్ణించిన తీరు కడురమ్యము.

"పలుచని చూపునఁ బరిపాటిగాఁ జూచు
నల్లార్పుఁ జూపునఁ నదటి చూచు
నరకంటి చూపున నలసరీతిని జూచు
మఱుపెట్టు చూపున మరలి చూచు

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 2-12.

నొదకెల్లఁ జూపఁగా గడు నమ్రపడి చూచు
సొగయ నొయ్యారంపుఁ జూడ్కిఁ జూచు
భయ మింతలేక తప్పని చూపుచేఁ జూచుఁ
జూచి చూడని యట్టి చూడ్కిఁ జూచు

సొలపు వలపుసుఁ దిలకించు చూడ్కిఁ జూచు
వాటుఁ జూపున మరులుకొనంగఁ జూచు
దార తారామనోహరు దశవిధావ
లోకనంబుల మోహవిలోల యగుచు" 2_13

చూపులలో వచ్చిన మార్పు క్రమముగా వలపు ముదురుటను సూచించుచున్నది. తుదకు వాటుచూపున మరులుకొనంగఁ జూచినది. అతడు తనకు వశుడైనట్లే భావించినది. కావుననే కవి చమత్కారముగ తార, తారామనోహరుని దశవిధావ లోకనముల జూచి మోహ విలోలయైనదని వర్ణించినాడు. తారా శబ్దమునకు నక్షత్రములను యర్థమున, అతడు తారామనోహరుడు. తార, తారామనోహరునిఁ జూచి మోహ విలోలయగుటలో దోషము లేదని, కవి శ్లేషచేత చమత్కృతిని సాధించినాడు. తార చంద్రుని వలచి, తన సౌందర్యాతిశయము చేత, విలాసదృక్కుల చేత, నర్మగర్భ వాక్యముల చేత, హావభావాది చేష్టల చేత, తన్ను చంద్రుడు మోహించునట్లుగాఁ జేసికొనినది. "పురుషు మనసెంత దృఢమైనఁ బువ్వుబోడి వికృతి పైకొన్న సెగసొంత వెన్నగాదె"[1] యని కవి, శశాంకుడు తారకు వశుడైనాడని, అది సహజమేనని, సమర్థించినాడు. శశాంకుడు ప్రాపిత మోహాంధకార బంధురుడైనాడు. తారా శశాంకు లిరువురు, అన్యోన్య మోహవిభ్రమ సన్యస్త వివేకులగుచు, కోర్కులు ధన్యత నొందగఁ గలిసిరి."[2] కొంతకాలమీ కూటములు రహస్యముగ సాగినవి. తదుపరి చంద్రుడా తొయ్యలిని నిజమందిరమునకుఁ దెచ్చుక నిర్భయకేళీ లోలుడైనాడు."[3] అపై యామె గర్భవతియైనది. పుత్రోదయము గలిగినది. అప్పుడు దేవతలెల్ల చంద్రునికి బుద్ధి చెప్పి, వాచస్పతికి తార

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 2_18
2. " " " 2_31
3. " " " 2_32

నిష్పించిరి.[1] బహుళ దేవ సమాజమునకు వెలిచి, తార బృహస్పతితో సంసారము చేసినదని భావింప వలయును. బృహస్పతియు తార సౌందర్య విశేషమునకు భ్రమించి యేలుకొన్నట్లు కవి చమత్కరించినాడు. ఆమె సౌందర్యాతిశయము, వ్యభిచార దోషమును నివారించినది. "భార్యా రూపవతీ శత్రు"[2] వని తలచియు బృహస్పతి యామె నేలుకొనుటకు హేతువు సౌందర్య లోలుపతయే. చంద్రుని యందు తారకును సౌందర్యలోలుపతయే. బాహ్య సౌందర్య కారణమున వెల్లులెవ ప్రణయ మూర్తులను కవి యీ ఘట్టమున సందర్భోచితముగ వర్ణించినాడని చెప్ప వచ్చును.

## శశాంకుడు:

శశాంకుడు సౌందర్యఖని కావుననే తారవంటి అతిలోక సౌందర్యవతి మోహవిలోలయైనది.

"మదనసంహరు జటామకుటాగ్రసీమ ము
ద్దీపితంబైన వజ్రోపలంబు
బృందారకులకుఁ దృప్తిగ విందు లిడు సుధా
రసపూరితాక్షయ రజితపాత్ర
యలఘు పుష్కర పుష్కరాక రాంతర్విహా
రప్రౌఢిఁ జెలువొందు రాజహంస
మబ్జగర్భాండగేహమున నుత్కృష్టకాం
తి వెలుంగు కర్పూరదీపకళిక

దక్షకన్యామనోజ సంతాపభరము
నెయ్యమునఁ జల్లఁజేయు పన్నీటి కొలకు
శౌరి దాకంటి వెలిదమ్మి తోరమైన
చలువ చాయల గుంపు నిశాకరుండు." 2–8.

1. కవిరాజమనోరంజనము. 2–42
2. " " 2–36

శివుని శిరసున పత్రమై భూషణముగ భాసిల్లిన చంద్రుడు దేవతలకు సుధారసపూరితాక్షయరజితపాత్ర యైనాడు. పుష్కరా జలముల విహరించు రాజహంస బ్రహ్మోంరమునకు కర్పూర దీపకళిక. దాక్షాయణికి కన్నీటి కొలకు. శ్రీమహావిష్ణువునకు దాకమ్ము. చలువ చాయల గుంపు. ఇది కవికి తోచిన చంద్రుని వర్ణనము. ఇక తారకు చంద్రునిలో కనిపించిన సొబగులు వేరుగ మున్నవి.

"చక్కని మోము చూచి నరసంపుఁ గమంగవఁ జూచి నిగ్గుపుం
జెక్కులు చూచి కెంపుపగఁ జెల్వగు వాతెఱ చూచి కాంతిఁ బెం
పెక్కిన మేనుఁ జూచి గురు నింతి మనోహరగాత్రి తార యా
చుక్కలతేనికి౯ వలచి సొక్కె మనోభవబాణభిన్నయై" 2-14.

చుక్కల తేనిమోము, కమంగవ, చెక్కులు వాతెఱ, మేనిసొబగు చూచి తార వలచి సొక్కినదట. బృహస్పతి సదనమున కనారతంబు చదువగ వచ్చువాడు గాన, అతని సౌందర్య గుణాస్పద నిజరూప విలాసమామె హృదయమును వకింపఁ గొలిపినది. మోహ విలోలయై యతని వశపరచుకొన నుద్యమించినదట.

"లేని ప్రయోజనంబైనఁ గల్పించుక
  పలుమాఱుఁ దత్సమీపమునఁ దిరుగు
వలరాజు చిల్కుముల్కులవంటి చూపుల
  ననువుగా మర్మముల్నాటఁ జూచు
మచిత్రక్రమంబునఁ గుచకచాద్యవయవ
  సౌభాగ్యములు ప్రకాశంబు చేయు
వమయమైనప్పుడు సారస్యముగ నర్మ
  గర్భంబులైన వాక్యములు పలుకు

వతఁడు తన మోము చూచిన యపుడు దీన
వదనయై సోష్ణ దీర్ఘ నిశ్వాసవశతఁ
దన మనోవ్యథ యతని చిత్తమున కెఱుక
పఱుచు నా కాంత విరహవిభ్రాంత యగుచు" 2-15.

ఇందు చంద్రుని దోషమంతగా కనిపించదు. తారయే పూనుకొని తన సౌందర్య విలాసముల ప్రదర్శించి యతనిని వశము చేసికొనినది. తాను మోహ విభ్రాంత యగుటయే గాక, శశాంకుని గురుపత్నీ సమాగమ దురితమునకు పాల్పడఁ జేసినది. శశాంకుని దోషము తార చేసిన దోషముతోఁ బోల్చినప్పుడు, దోషముగా కనుపించక పోవచ్చును కాని, దోషము కాకపోదు. అంతేకాదు, తారపై మోహ మగ్నలమై తన మందిరమునకే తెచ్చుకొని సుఖించినాడు. ఆ కారణము చేతనే ఇంద్రాదులు చంద్రునికి బుద్ధిచెప్పి, తారను బృహస్పతి కిప్పించినారు. బృహస్పతి విషయమిట కొంత తడవ పలసి యున్నవి. తార చక్కదనమే గుణముగ సంస్మ రించి, కడలు ద్రొక్కిన కాంతను మరలఁ దెచ్చుకొన నుత్సహించినాడు.

"అమృతమయుఁడౌట శశి పవిత్రాంగు డనియొ
తన మహిమ దార దోషంబు దలఁగు ననియొ
యమరగురుఁ డింతి విడువలేఁడయ్యె గాక
పెనిమిటికి నేల కడలు ద్రొక్కిన లతాంగి" 2_34.

శశి పవిత్రాంగుడనియా? తార దోషము బృహస్పతి మహిమచేఁ దొలగుననియా? ఏమో కావచ్చును. ఇది కవి చమత్కారము. కాని నిజమునకు, బృహస్పతి వ్యథి దార దోషమును సైతము నిర్లక్ష్యపరచి తార నేలుకొనుటకు, నామె యంచలి యతి లోక సౌందర్యమే కారణము. బృహస్పతి యంతటివా డీట్లయిన, శశాంకుడు తారకు వశుడగుటలో నాశ్చర్యముండదు. కావుననే తార దోషము కనిపించినంతగా, చంద్రుని దోషము కనిపించదు. కవి తన శబ్ద శక్తిచే దానిని సమర్థించిన తీరు గనుడు.

"దోషాకరుండుఁ దారా
శ్లేష సుఖాన్వితుఁడుఁ గాన శీతాంశుఁడు దా
దోషాకరుండుఁ దారా
శ్లేష సుఖాన్వితుఁడు నయ్యె.........." 2_28.

దోష, తారా శబ్దములపై చక్కని శ్లేషఁ జేసి కవి, శశాంకుడు తారా వశుడగుట సహజమే యని సూచించినాడు. బహుశః కావ్యనాయకుడైన పురూరవునికి పితా

ఇందు చంద్రుని దోషమంతగా కనిపించదు. తారయే పూనుకొని తన సౌందర్య విలాసముల ప్రదర్శించి యతనిని వశము చేసికొనినది. తాను మోహ విభ్రాంత యగుటయే గాక, శశాంకుని గురుపవితా సమాగమ దురితమునకు పాల్పడఁ జేసినది. శశాంకుని దోషము తార చేసిన దోషముతోఁ బోల్చినప్పుడు, దోషముగా కనుపించక పోవచ్చును కాని, దోషము కాకపోదు. అంతేకాదు, తారపై మోహ మగ్గలమై తన మందిరమునకే తెచ్చుకొని సుఖించినాడు. ఆ కారణము చేతనే ఇంద్రాదులు చంద్రునికి బుద్ధిచెప్పి, తారను బృహస్పతి కిప్పించినారు. బృహస్పతి విషయమిట కొంత తడవ పలసి యున్నవి. తార చక్కదనమే గుణముగ సంస్క రించి, కడలు ద్రొక్కిన కాంతను మరలఁ దెచ్చుకొన నుత్సహించినాడు.

"అమృతమయుఁడౌట శశి పవిత్రాంగు డనియొ
తన మహిమ దార దోషంబు దలఁగు ననియొ
యమరగురుఁ డింతి విడువలేఁడయ్యె గాక
పెనిమిటికి నేల కడలు ద్రొక్కిన లతాంగి" 2_34.

శశి పవిత్రాంగుడనియా? తార దోషము బృహస్పతి మహిమచేఁ దొలగుననియా? ఏమో కావచ్చును. ఇది కవి చమత్కారము. కాని నిజమునకు, బృహస్పతి వ్యథి దార దోషమును సైతము నిర్లక్ష్యపరచి తార నేలుకొనుటకు, నామె యంచలి యతి లోక సౌందర్యమే కారణము. బృహస్పతి యంతటివా డిట్లయిన, శశాంకుడు తారకు వశుడగుటలో నాశ్చర్యముండదు. కావుననే తార దోషము కనిపించినంతగా, చంద్రుని దోషము కనిపించదు. కవి తన శబ్ద శక్తిచే దానిని సమర్థించిన తీరు గనుడు.

"దోషాకరుండుఁ దారా
శ్లేష సుఖాన్వితుఁడుఁ గాన శీతాంశుఁడు దా
దోషాకరుండుఁ దారా
శ్లేష సుఖాన్వితుఁడు నయ్యె............" 2_28.

దోష, తారా శబ్దములపై చక్కని శ్లేషఁ జేసి కవి, శశాంకుడు తారా వశుడగుట సహజమే యని సూచించినాడు. బహుశః కావ్యనాయకుడైన పురూరవునికి పితా

మహుఁడగుటచేతఁ గాఁబోలు, చంద్రుని యందొక పిసరంత పక్షపాతమును చూపె నేమో యనిపించును.

## ఇలా బుధులు :

"జలజబాంధవవంశ విస్తారకుండు
మహితకీర్తి వైవస్వతమనువు సకల
ధారుణీమండలాధిపత్యమునఁ దనరు
చుండి సంతానకాంక్షచే నొక్క నాడు" 2-45.

జలజబాంధవ వంశవిస్తారకుడైన వైవస్వత మనువు సంతాన కాంక్షచే యజ్ఞము చేయుట సహజము. "పురుషునకుఁ బుత్ర లాభంబె పరమహితము"[1] అని భావిఁచుటయు సహజము. అనుపమగుణనిధియైన వశిష్ఠుడు వారికి కులఁ గురువు. వాఁ యనుమతితో నధ్వరము సాగినది. కాని వైవస్వతుని భార్య శ్రద్ధాదేవికి కూతురు కలగవలయునని కోరికగా నున్నది. ఆమె హోతను, అధ్వర్యునిఁ బ్రార్థించి, తనకు కూతురు గల్గునట్లు చేయుమనగా సంకల్పవైపరీత్యముచే హోత వెడచేత నిలా కన్య పుట్టినది. వైవస్వతుడు పుత్ర సంతానము కలుగదాయెనని చింతించినాడు. వశిష్ఠునిఁ జేరబోయి, తన కీ గతి, పుత్ర సంతానాపేక్షచే నధ్వరము సేయగానేల పుత్రిక జన్మించినదని ప్రశ్నించినాడు. వసిష్ఠు డవ్విధమంతయు యోగదృష్టిచేఁ దెలిసికొని, వైవస్వతు ననునయించి, విష్ణువునుగూర్చి స్తుతించినాడు. విష్ణు వాతని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై. అకూతురు కొడుకౌనని యానతిచ్చినాడు. ఇలా కన్య పురుషునిగా మారగా, తండ్రియైన వైవస్వతుడు సుద్యుమ్నుడని యాతనికి నామకరణ మొనర్చినాడు. సకల విద్యాపారంగతు నొనర్చినాడు. సుద్యుమ్నుడొకనాడు మృగయా వినోదియై వని చని కుమార వనముఁ జొచ్చినాడు. శివ శాపముచే మరల కలికి రూపము దాపురింపగా, సుద్యుమ్నుడు వనమునఁ దిరుగుచు, విధివశమున తారా కుమారుడైన బుధునిగని మోహ వివశత నందుట జరిగినది. ఇలా బుధులు పరస్పర లగ్న చిత్తులై సుఖింపఁ గొన్ని నాళ్లకు, ఇలాకన్య గర్భవతియై సుముహూర్తమున పురూరవ కుమారుని ప్రసవించినది. కతిపయ

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 2-48

వాసరంబులకు స్త్రీయైన, సుద్యుమ్నుడు "కుత్సితమగు నాత్మ వర్తనము చిత్తమునం దలపోసి రోసి దుఃఖితు"[1] డై మతి వశిష్ఠుని తలచుకొనగా నమ్మునీంద్రుడు భక్త ప్రసన్నుడగుట వెంటనే వచ్చి, అతనికై శివుని యారాధించినాడు. శివుడు ప్రసన్నుడై, కుమార వనమునఁ జొచ్చిన వారు స్త్రీలగుటకు తానిచ్చిన శాపమే కారణము కావున తన వచన మమోఘమని తెలుపుచునే, ఉభయార్థ సార్థకముగా నొక యుపాయము చేసినాడు. "పురుషుండై యొక మాసము, ధరణీ సామ్రాజ్య భారదక్షతనుండుం దరుణీమణియై మాసాంతరమున వర్తించునట్లు తప్పక నడుచున్"[2] అని వరమిచ్చినాడు. పరమేశ్వరు నాజ్ఞచే నిలాకన్య మరల పురుషాకృతి నందినది. సుద్యుమ్నుడుగా మాసము రాజ్యము పరిపాలించి తదుపరి మాసము స్త్రీగా రహస్యముగ గడుపుచు, జీవితమంతయుఁ గడపి, తుదకు పురూరవునకు రాజ్య పట్టాభిషేక మొనర్చి, సుద్యుమ్నుడు తపస్సు చేసికొన నరణ్యముల కేగినాడు. ఈ విధముగ నీ యిలా వృత్తాంతము బహు విధములైన విచిత్ర సన్నివేశముల కాలవాల మైనది. తల్లిదండ్రుల కోరికలు భిన్నములైనచో సంతానము దైన్యమునందుననుట కీ వృత్తాంతమును తార్కాణగ గైకొన వచ్చును. ఇలాకన్య జీవితము మొదటినుండి చివరి వరకు వేదనా మయమైనదే. స్త్రీగా పుట్టి పురుషుడౌట, సకల విద్యా పారంగతుడై రాజకుమారుడుగా జీవితము సుఖముగా సాగుచుండ మరల స్త్రీయగుట, తనవారిని చూచుట కేవగించుకొని యరణ్యములందే వర్తించుట, విధివశమున తాను పురుషుడయ్యు, శరీరముచే జవ్వనియైన కారణమున మోహవివశత, బుధుని సంపర్కముఁ జెందుట, గర్భవతియై పుత్రుని ప్రసవించుట, మరల శివ కృపా మహిమచే, పౌరుషము సిద్ధించినను, సమగ్రము కాక మాసమున కొక తీరుగ జీవించుట మొదలగు అనుభవ విశేషములను పొందిన ఇలాకన్య జీవితమంతయు నొడుదుడుకులుగనే సాగినది. ఇట్టి పాత్రలరుదు. కళాపూర్ణోదయమున పింగళి సూరన కల్పన చేసి యుండెనేగాని మరి యెచ్చోట నిట్టి వైపరీత్యము కనిపించదు. అబ్బయామాత్యునికి కల్పనముకన్న యథార్థమును వర్ణించుట యందే ఔత్సుక్యము మెండు. కావుననే

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 2–196
2. " " " 2–210

"పురూరవశ్చరితమును" కావ్యముగా వ్రాయుచు పురూరవ జన్మ వృత్తాంతము నింత విపులముగ వర్ణించుట జరిగినది. బుధుని పాత్రలో పైశిష్ట్యము గోచరింపక పోయినను కవి ఇలా బుధ సమాగమమును వర్ణించిన తీరు ఔచితీ రమ్యము.

"అతని కన్యాసమాగమస్థితి తదీయ
మిథునవర్తనమునుఁ బెంపు మిగిలియుండె
బుధుని కన్యాసమాగమ మిథునవర్త
నములు పెంపు వహించుట నైజమ కద" 2_177

కన్యా మిథున రాసులకు బుధుడధిపతి కావున జ్యోతిష సంబంధియైన విషయమును కవి చమత్కృతిచే నిచ్చుటఁ గూర్చి, ఇలా బుధ సమాగమ మిథున వర్తనములు నైజమని తెలుపుట కడు రమ్యము.

## ఊర్వశి :

ఊర్వశి నారాయణోరూద్భవ. అతిలోక సౌందర్యవతి.

"పుట్టిన యిల్లే ప్రపూర్ణేందుముఖికిని
నారాయణస్వామి యూరు సీమ
నాట్యవేదార్థంబునకు నే కళావతి
లాస్యనిరూఢి కూలంకషంబు
ప్రథమబహూకార పాత్రలలోనఁ దా
నే యింతి హరిహరాజేంద్రసభలఁ
గారణం బే హంసగమన రూప మరుంధ
తీమనోహరు పునర్దేహలబ్ధి

కట్టి యూర్వశి భువనమోహనవిలాస
నిజకటాక్షపరంపరావిజితకుసుమ
ధన్వ చార్వసిసౌమ్యనందనకథాసు
ధార్ణవాంతర్నిమగ్నాంతరంగ యగుచు" 3_51.

దేవమౌని నారదు డా పురూరవుని సౌందర్యమును, భోగ భాగ్య సంపన్నతను, ప్రాజ్ఞతను, ధైర్య విక్రమా ద్యున్నతిని వర్ణింపగా విని, పురూరవునికి మనసిచ్చినది. ఆమె దేవకాంతయయ్యును పురూరవుని యందే లగ్నమానస యైనది. అతని విలాస గుణాదులు మదిఁ దలచుచు మోహ జలధి మగ్నతచేఁ దద్గత మానసయై, వేలుపులతకూన వియోగ విప్రలంభము నొందినది.[1] అతనిపై వలపుచేత నామె వేలుపు లతకూన యైనది. పాండురంగ మాహాత్మ్యము నందలి నిగమ శర్మను గూర్చిన వర్ణనము కవికి స్ఫురించినది గాబోలు. "కూన" శబ్దమును ప్రశంసా పూర్వకముగ ప్రయోగించినాడు.

"వనితామానస సూనసాయకుడు, జీవత్తాతపాదుండు, భూ
జన సమ్మాన్య విశుద్ధవర్తను, డుదంచ త్త్యాగశీలుండు, చం
ద్రుని పెన్నుద్ది సమగ్రకాంతిమహిమన్, నూనూగు మీసాల లేఁ
గొనబుం బ్రాయపుఁ దేజుకూన, యత డుత్కంఠుండు వాచాలతన్"[2]

లేఁగొనబుం బ్రాయపుఁ దేజుకూన నిగమశర్మ. అట్లే యూర్వశి వేలుపులతకూన. ఇది కవికి రామకృష్ణుని యెడగల యభిమానమునకు తార్కాణము. పురూరవ లగ్న మానసయై, అతనికై విరహ వేదన ననుభవించినది. పూర్వరాగ రూపమున, అభిలాష విప్రలంభ మిచ్చట ముచ్చటగ వర్ణింపబడినది. ముని పురూరవుని గూర్చి చెప్పనేలనని చింతించినది. తన కాతనిపై యంతెకురాని ప్రేమ యేల గలుగ వలయునని వాపోయినది. అతని బొందుటకై యామె జపరూప తప స్సారంభించినది. ఇది యొక చిత్రమైన శృంగార తపస్సు.

"రేచిత బాహ్యవృత్తిఁ గడు రేచక పూరక కుంభక క్రియా
సూచన నూర్పుల న్నిడివి చొప్పడ వల్లభు రూప మాత్మలోఁ
జూచుచుఁ దత్కథామధువచోజపశీలత నుండెఁ బుష్పనా
రాచ గురూపదేశమున రాజనిభాస్య తదేకనిష్ఠతోన్" 3_67

---

1. కవిరాజమనోరంజనము. అశ్వా. 3_53
2. పాండురంగమాహాత్మ్యము, అశ్వా. 3_6

ఆమెకు విరహ మింతింతనరానిదై దుస్సహమైనది. చెలులామె విరహవేదనకు తల్లడిల్లి, చేయగల శిశిరోపచారము లన్నియు చేసిరి. మన్మథోపాలంభన, చంద్రోపాలంభన, మలయానిలోపాలంభన, కోకిలాద్యుపాలంభనములఁ జేసి, వఖులామె నూరడింప యత్నించిరి. కాని విరహతాపము తగ్గదాయెను. త్రైలోక్యవర్తి యను చిలుక యామెకు తాపోపశమనము కలిగించినది.

"ఊర్వశి పాకశాసను నియోగమునన్ భువి కేగు నచ్చటన్
సర్వగుణాభిరాము నృపచంద్రు బురూరవుఁ గాంచు నాతఁ డీ
పర్వశశాంకబింబముఖిపైఁ గడుఁ గూర్మి వహించు మామకా
శీర్వచనంబు సిద్ధముగఁ జేకుఱు నిద్దఱకున్ సరాగముల్" 3-179

చంద్రనిభాస్య కా నృపతిచంద్రునితో నతమైన కూటమిం
జంద్రునియందు లీయమగు చంద్రికయుం బలె నుండఁ గల్గెడుం
జంద్రవిలాసమూర్తులగు చక్కని పుత్రులఁ గాంచు భూమిలోఁ
జంద్రకులంబు వర్ధిలు నిజంబుగ నూర్వశి కారణంబునన్" 3-180

ఇవి త్రైలోక్య చక్రవర్తి, శుభవార్తగా యూర్వశి సన్నిధానమున నామె చెలులతోఁ బలికిన దివ్య వాక్యములు. భవిష్యద్వాణి సత్యవాక్కులు సామాన్యమైన చిలుకలిట్లు పలుకి నేర్చునాయన్న నది యసంభవము. ఆ చిలుక మఱొక్కమాట కూడ చెప్పినది. "మా నారాయణమూర్తి యూరువున జన్మంబందుటం జేసి నీపై నెయ్యంబున నింతయుం దెలిపితిన్"[1] అని తాము నారాయణమూర్తికి సన్నిహితులమని సూచించుట చేత, లక్ష్మీనారాయణుల పెంపుడు చిలుక లగునేమో యని యూహ పొడముసు. కళాపూర్ణోదయమున పింగళి సూరనగారు సృష్టించిన పరస్వతీదేవి పెంపుడు చిలుక, ప్రభావతీప్రద్యుమ్నమున శుచిముఖియను చిలుక మరియొకటి, శృంగార నైషధమున నల దమయంతులఁ గలిపెడి హంస యొకటియు మండగా అప్పయామాత్యుడు కవిరాజమనోరంజనమం దీ త్రైలోక్యవర్తిని సృష్టించి కథా గమనమునకు సౌలభ్యమును, చమత్కృతిని సాధించినాడు. ఈ త్రైలోక్యవర్తి, శుభావహమైన భవిష్యద్వృత్తాంతమును ముందుగా తెలుపక పోయినచో విరహతాపముచే

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 3-182

నూర్వశి యేమయ్యెడిదో చెప్పజాలము. కావున కథాగతికి భంగము రాకుండ ఔచిత్యము పాటించబడినది. కొంతకాలమునకు మిత్రావరుణులు ఘోర తపము చేయుటకు పూనుకొనిరి. వారికి తపోభంగము కలిగించుటకై యూర్వశియే తగినదని ఇంద్రుడు భావించి యామెను నియోగించినాడు. పూర్వము త్రైలోక్యవర్తి సూచించి యుండుటచే ధర కేగుట పురూరవ సమాగమమునకు హేతువు కాఁగలదని యాశించిన యూర్వశి, ఇంద్రుని యాజ్ఞ విని "మహాప్రసాద" మనినది.

> "ధరకు నరిగెడు పయనంబు తనకుఁ గల్గు
> టది నిధానంబు దొరకినయట్ల యగుచు
> నతిశయంబైన సమ్మోద మావహింపఁ,
> జారులోచన నిజనివాసమున కరిగి" 4-51.

ఆమె ఇంద్రునాజ్ఞ నెరవేర్పఁ బూనుకొనుటలో వెనుక ముందాలోచింప లేదు. అమ్మునీంద్రులు మహోగ్రులని తలంపలేదు. కేవలము ధర కరుగుట పురూరవ సమాగమ ప్రాప్తి హేతువను నిశ్చయ మొక్కటే యామె నివి యేవియును నాలోచింపనీయ లేదు. అతనియెడ నామెకున్న ప్రణయ గాఢత యట్టిది. మిత్రావరుణుల తపోభంగ మొనర్చుటకు తన యాకర్షణశక్తిని వినియోగించినది. ఆమె పూనిక వ్యర్థము కాలేదు. మిత్రావరుణు లూర్వశీ సౌందర్య దర్శనముచే మోహావేశమునందిరి. వారికి వీర్య పతనమై తపమునకు విఘ్నము కలిగినది. వారా యూర్వశిని "మానవ మానవతీ స్థితితో నుండుము భూమి"[1] ననుచు శపించిరి. ఆమె శాప విముక్తిని వేడుకొనగా "కతిపయదినములు భూవిలో, నతిసంతోషమున నుండి యంతట నమరావతి మండగలవు పూర్వ స్థితి నంచు ననుగ్రహంబు చేసిరి మౌనుల్"[2] చింతారహిత స్వాంతయైన యూర్వశి మనంబు పురూరవునిపైఁ దగుల్గొన్నదని గ్రహించి గంధర్వు లామె పురూరవునితో నుండుటకుఁ గొన్ని నియమములు చేసిరి. ఆమె పెంపుడు తగళ్లనా పురూరవుడు చోర మృగాద్యుపద్రవముల నుండి రక్షింప వలయును. వివస్త్రుడై యామెకు

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 4_132
2. " " " 4_133

కనిపించరాదు. ఈ రెండు నియమములకు భంగము కలిగినచో నూర్వశి పురూరవుని వీడి స్వర్గమునకు రావలయునని యొప్పించుకొని గంధర్వులు వీడ్కొనిరి. ఊర్వశి పురూరవుని వరించి ఇంత వంతఁ గుందుటయేగాని పురూరవు డామెను గూర్చి యేమియు నెఱుగడు. పురూరవ సమాగమ మెట్లు సిద్ధించునో యూర్వశి కగమ్యగోచరముగ నుండెను. ఆమె త్రైలోక్యవర్తిని సంస్మరించినది. కరుణించి యా చిలుక రానే వచ్చినది. "సకలావయవ సంపూర్ణ సరస సౌందర్య సౌభాగ్య సముదారంబగు నీ యాకారంబు పటంబున స్ఫుటంబుగా వ్రాయించి యా రూపం బప్పురూరవునికి దృగ్గోచరంబగునట్లు"[1] సేసిన కార్యము నెరవేరునని యానతిచ్చినది. ఊర్వశి యట్లే చేయగా నామె చిత్ర పటమును భటులు తేగా చూచి యామె యపూర్వ రూపసంపద కచ్చెరువంది పురూరవుం డయ్యంతి యూర్వశి యనియుఁ దెలిసికొనినాడు. అదియు చిత్రముగ జరిగినది. పటము పయి "సుపర్వాంగనోత్తమా" యని వ్రాసి యున్నది. ప్రాసంగికముగ మున్ను నారదుడు వర్ణించిన యప్సరోజనము రూపురేఖలు స్ఫురణకు రాగా నామె యూర్వశి యని నిశ్చయించినాడు.

"భావి సంబంధమున కభిప్రాయమైన
తలఁపు గొలుపు ఋణానుబంధంబు వలన
నతని మది దోఁచెఁ దచ్చిత్రితాంగలీల
యూర్వశీకాంత రూపు గానోపు ననుచు" 5_33

ఆమె నెట్లయిన వొందవలయునని పురూరవుడు నిశ్చయించుకొనినాడు. నాటినుండి యతని మదిలో నూర్వశీరూపము మెలగుచున్నది. ఇంతలో విచిత్ర వృత్తాంత మెఱిగి యతడటకు వెడలుటయు నట యూర్వశీ సమాగమ మొనగూడుటయు సంభవించినది. ఆమె పెట్టిన నియమముల నంగీకరించి, తన రాజధానికిఁ గొని తెచ్చినాడు. ఇష్టసుఖముల ననుభవించినాడు. ఇంతలో నింద్రుని పంపున గంధర్వు లూర్వశికై భూలోకమునకు వచ్చి, ఊర్వశీ పురూరవులకు వియోగము గావింప నెంచి, ఊర్వశి పెంపుడు తగళ్ళను బట్టుకొని పోగా నవి భీతిలిఁ గూసినవి.

1. కవిరాజమనోరంజనము. అశ్వా. 5_19

ఊర్వశి ఖిన్నయై తగళ్ళ నెవరో దొంగ లెత్తుకు పోయిరని తలంచి వాని రక్షణమున నేమఱి నిద్రించిన పురూరవుని పరుషోక్తు లాడినది.

"నిద్రాభంగవికారము
రౌద్రావేశమును విస్మరత యొదవింపం
దద్రాజమౌళి జఘనజ
హ్రద్రాజితవస్త్రుడగుచు నరిగె నెఱుంగమిన్" 5_251

నిద్రాభంగ వికారము, రౌద్రావేశము, పురూరవునికి దైవవశమున తాను వివస్త్రుడై నాడని తెలియనీయలేదు. అతడు గంధర్వులం దోలి తగళ్ళను సురక్షితముగ నూర్వశికి నప్పగించినాడు. కాని యూర్వశికి పురూరవుడు వివస్త్రుడై కనిపించుట చేత పూర్వనియమము ననుసరించి యామె యతనిని వీడి చనక తప్పలేదు. ఊర్వశికి పురూరవునిపై యెనలేని ప్రేమ యున్నది. కాని నియమభంగ మొనర్చుట యామె శక్తికి మించినది. ఆమె గంధర్వుల యాజ్ఞచే మెలగునది. కనుక నియమబద్ధయై పురూరవుని వీడిపోయినది. "వీడని పొందు వీడుకోవలసెం గదా యికం గలల వంటివి గాదె ఋణానుబంధముల్"[1] అని వాపోయినది.

"నా వలనం గొఱత గలుగదు
నీ వచనము దప్పె నింక నిన్ననవేలా
దైవకృతం బటువంటిది
భూవర నాకొఱకు వగలం బొందకు మింకన్" 5_258

అని యోదార్చి వెడలి పోయినది. అంతటితో నామెకు మును మిత్రావరుణులిచ్చిన శాపకాలము తీరినది. శాపముం దీఱి యూర్వశి దేవకాంతగా మారినప్పటికిని యామెకు పురూరవునిపై మమతం దీఱలేదు.

విరహ వ్యాకులిత చిత్తుండై పురంబు చొర నొల్లక పురూరవుడూర్వశి నన్వేషించుచుండ, నమ్మహీభర్త వర్తనం బరయుటకయి వచ్చి, యచ్చేడియ యతని దైన్యం బవలోకించి యూఱడించుటకయి, సరస్వతీ తటినీ తటంబున సఖీ సమేత

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 5_257

యయి పొడచూపినది.[1] ఆమె కతనిపైగల మక్కువ నిక్కువ మైనదనుట కిది తార్కాణము. అతని నోదార్చి, యతని శృంగారకేళిఁ దేలించినది.” నా కడ కీ విభావరి సనన్ మఱి మీదఁటి రేయి రమ్ము సౌఖ్యాకరప్రవృత్తిఁ గూడగ నుపాయ మగు”[2] నని సూచించినది. ఆమె గర్భధారిణి యని పురూరవుడెఱిగి తన రాజధాని కఱిగినాడు. మనుష్యమానంబున సంవత్సరము గడచిన పిదప నూర్వశినిఁ గలియ నేఁగిన పురూరవునకు నూర్వశి కనకాద్రి పొంత గాన్పించినది. గంధర్వుల వేడి కొనినచో, తన్ను పురూరవున కర్పించగలరని ఊర్వశి పురూరవునకు నుపాయము చెప్పినది. ఇదియు పురూరవునిపై నామెకుఁ గల గాఢానురాగమును సూచించు చున్నది. పురూరవుడు గంధర్వుల వేడుకొనగా వారామె నీయ నిచ్చగింపక “వయో రూప లక్షణాముల నుర్వశిం బోలియున్న యగ్నిస్థాలి యను నీలవేణి”[3] నిచ్చి చనిరి. కొన్నిదినంబు లా యగ్నిస్థాలితో సురత సుఖంబుల ననుభవించిన పురూరవుడు, అప్వేలంది చేష్టితంబులు వేఱొక భంగి నుండుటచే నామె యూర్వశిగాదని సంశయించినాడు. గంధర్వులు వంచించిరని తెలిసినాడు. “ఆత్మపురికి నేతెంచి ధర యేలుచుండె గుణాంచిత నుర్వశిఁ దలంచి యసురుసురనుచున్.”[4] ఇది యాతనికి నూర్వశి యెడగల ప్రగాఢ ప్రేమను సూచించుచున్నది. కృతయుగము గడచి త్రేతాయుగము ప్రవేశించినది. “అతని బుద్ధి కామ్నాయములు కర్మబోధకంబు లగుచుఁ ద్రివిధంబులై తోఁచ యాగవిధులు తదనుగుణముగ నొనరించు తలఁపు తోడ”[5] శాస్త్రోక్తముగ యాగము నిర్వహించినాడు. శ్రీమన్నారాయణస్వామి గుఱించి యనేక యాగము లొనర్చినాడు. “పురందర ప్రముఖ దేవత లతనికిం బ్రసన్నులై యభీష్ట వరంబు లొసంగి యుర్వశీ కాముకుండగుట నతని యభిప్రాయంబు దెలిసి యవ్విలాసిని నతనికిచ్చి నరసురలోకంబుల యథేచ్ఛా విహారంబులఁ జరియించునట్లు దివ్యత్వం బొసంగిరి.”[6] ఇట్లుర్వశీ పురూరవులు తమ

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 5_266
2. ” ” ” 5_278
3. ” ” ” 5_288
4. ” ” ” 5_290
5. ” ” ” 5_291
6. ” ” ” 5_293

వలపులు పండించుకొనగా వారి కాయుగురు పుత్రులుదయించిరి. దేవకాంతయైన యూర్వశి, భూనాథాగ్రణియైన పురూరవుని వలచి, వలపించుకొని, అతనిని తన వానినిగఁ జేసికొన్నది. వారిరువురి ప్రణయము నిత్యనూతనమైనది. అనితర సామ్యమైనది. దివ్యమైనది.

# పు రూ ర వు డు :

పురూరవుడు శుంభత్ప్రతాప ఘోరతర భైరవుడు. ఉదారుడు. అతని యసమ సాయకతఁ జూచి, వాని సుమహిత కార్ముకత్వంబుఁ జూచి, కుమారునిఁ బోల్తురు. దుర్వారకళంక దోషము తొలగిన యెడల శరత్పూర్ణిమా శశాంకు డొకించుక సాటి వచ్చును. అతని మోమున శారద నిల్చియున్నది. చంద్రవదన వసంత నాసత్య లేక రూపమై జనించినట్లు సౌందర్యగరిమ నత దతిశయిల్లును. "అయ మర్థిజన" యంచు బ్రహ్మ యాచక లలాటాంతస్థలి వ్రాయగా నా వ్రాతను, విశేషాన్వయ క్రియగా నర్థమవారిగా నొనగి యర్థింజేయు వితరణ బుద్ధి గలవాడు. అన్నింటికి మించి వినయశీలి. నారదమహర్షి రాగా "అచ్చుగ భక్తి మ్రొక్కి కనకాసన సుస్థితుఁ జేసి, పూజలన్ మెచ్చొదవింపగా వినయమేదుర మంజుల వాక్యపై భవం బెచ్చ"[1] గా మసులుకొన నేర్చిన రాజకులతిలకుడు. సేమ మడిగిన మౌనీంద్రునికి, వినయ సంభ్రమ మాధురీధురీణ వచనంబుల పలికిన తీరు కడు రమ్యములు.

"మీ కారుణ్యము వలనను
మా కందఱకు న్శుభంబు మౌనీశ్వర మీ
రాకవలన మద్భాగ్యము
లోకస్తుతమయ్యె జగతిలోపల నింకన్" 1_112.

"విను తమోగుణహర్తవై వెలయు నీవు
మిత్రరూపంబుతో వచ్చి మేలొనంగ
నిపుడు గద యబ్జకులమున కెలమి యగుట
చక్రవర్తిత్వ మిఁకఁ గదా స్పష్ట మగుట." 1_113.

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 1_109

ఇట్లు నేర్పుగ పలుకఁ జాలుట యాతని వినయ విధేయతలతోఁ బాటు ధీ విశేషమును సైతము చాటుచున్నది. "రాజా ప్రత్యక్ష దైవత" మ్మని పలికి నారద మహర్షి పురూరవునకు రాజనీతిని బోధించినాడు. "నిశ్చల ధర్మ మార్గమున సప్తద్వీప సామ్రాజ్యము న్నిర్వైర స్థితి నేలు నీకుఁ దలప న్నీతి ప్రకారంబులో యుర్వీనాథ! నిసర్గ సిద్ధములుగా నొప్ప న్విచారించినన్" 1 నీతులు నీకు తెలియనివి కావని ప్రశంసించినాడు. అప్పుడు పురూరవుడు తమ్ము పొగడ వలదని కోరుచునే, అర్థకామ పురుషార్థముల నిరసించి, ధర్మమును ప్రశంసించి, మోక్షాపేక్షతో నాత్మవిద్య నుపదేశింప వేడుకొనినాడు. నారద మహర్షి యాతనిపై దయగలవాడై యాత్మ విద్య నుపదేశించినాడు. పురూరవు డా విద్యా గ్రహణమున తగు నేరుపు చూపియుండును. అతని యవగాహన సామర్థ్యము నెఱిగి కాబోలు, నారదుడు "అతని మనీషా విశేషంబునకు సంతోషించుచు బహుభంగుల నాశీర్వదించి" 2 నాడు. చక్రవర్తిత్వము స్పష్టము చేయుటకై పురూరవుడు జైత్ర యాత్రకు బయలుదేరినాడు. ధర్మ సంస్థాపనము రాజులకు కర్తవ్యము గదా! అతని పరాక్రమము నిర్వక్రమైనది. కావుననే నిశ్చల ధర్మ మార్గమున సప్త ద్వీప సామ్రాజ్యము న్నిర్వైరస్థితి నేలఁ జాలినాడు. ఇట్లు జైత్ర యాత్ర వలన ధర్మముతోఁ బాటు ధర్మ మార్గమున అర్థ పురుషార్థము సైతము పురూరవునిచే సాధింపబడినది. అతని చక్రవర్తిత్వము సామాన్యమైనది కాదు. అతిలోకమైనది.

"ఆ యెడ నప్పురూరవుఁ డుదగ్రపరాక్రముఁ డష్టదిఙ్మహీ
నాయకలోకమౌళి నటనవ్యకిరీటకిరీటభావ భా
గ్గేయ నిజైకశాసనవిఖేలనుఁడై యపశత్రుపక్షని
ర్దాయితఖడ్గజిహ్వగవతంసకుఁడై జగమేలుచున్నెడన్" 4-148.

నిరంతరము ధర్మ మార్గమున నడచు నా పురూరవు డొకనాడు ద్వాదశియని తలపక ప్రమాదమున నభ్యంజన స్నాన మొనర్చినాడు. అది ధర్మ యుగము.

---

1. కవిరాజమనోరంజనము. అశ్వా. 1-129
2. " " " 1-177

(కృతము) కావున "ఆ దురితంబుచే నృపతి యాననసీమ వికారభావ ముత్పాదక మైనది."[1] అతడు వెంటనే బ్రాహ్మణముఖ్యులతోడ నా దోషమును గూర్చి తెలుపగ, వా రా దోషము నివారించుటకు మాఘ స్నానమును ప్రాయశ్చిత్తముగ తెలిపిరి. పురూరవు డా భూసుర వాక్యముల నామోదించి సకలాఘ విభంగమైన గంగా తీరమున మాఘ స్నాన మొనర్ప నేగినాడు. ధర్మార్థముల సాధించిన పురూరవుని మానసమున నెల్లప్పుడును నిరంతరాయముగ నొక మోక్ష కామన నెలకొని యున్నది. కావున నది యీ పవిత్ర గంగా తీరమున వికాసము నందినది. ఏకాంతమున పద్మాసనాసీనుడై, యోగవిధిని, నాదబిందు కళాస్ఫూర్తి పొడకొనునట్లు "సర్వపరిపూర్ణమగు విష్ణుశబ్దవాచ్య సిద్ధవస్తువు ధ్యానంబు సేయుచుండె"[2] అతని భక్తికి మెచ్చి విష్ణువు ప్రత్యక్షము కాగా, నా భూవల్లభుడు బహువిధ స్తోత్రము లొనర్చినాడు. ఆ రమా భర్త యతనికి పరిపూర్ణ సుఖంబున నుండుమని దీవించినాడు. దివ్య వనితా లాభము కలుగుననియు, సుపుత్రావిర్భూతి ఘటించు ననియు, అనేకాబ్దములు రాజ్యము నేలుదువనియు, తుదకు "అనపాయ మహా సుఖ సదనంబగు మత్పదమున సంతసమున నుండెదవ"[3] నియు నానతిచ్చినాడు. శ్రీమహావిష్ణువు వచస్థ్సితి ననుసరించి యతనికి దివ్య వనితా లాభంబు మొదట కలుగవలసి యున్నది. ఆమె యెవరో కాదు. శ్రీమన్నారాయణుని యూరుసీమ నుద్భవించిన యూర్వశియే. ఆ యూర్వశీ లలామను, చిత్రపటమున గనినంతనే దైవనిర్ణయముచే పురూరవు డామె యందే సంలగ్న మానసుడై యామెను పొందువరకు కొంత చిత్త వైకల్యము నొందినప్పటికిని ధర్మ మార్గమును మాత్రము వీడలేదు. దైవ యోగమున నూర్వశీ వియోగము లటస్థించినను, రాజధర్మము వీడలేదు. గంధర్వుల వేడి యూర్వశికి బదులుగా నగ్నిస్థాలిని పొంది తుదకు తాను గంధర్వులచే వంచింపబడితినని యెఱిగియు పురూరవుడు స్థిర చిత్తమున, తృతీయ పురుషార్థమైన కామమును సాధించుటకై త్రేత ప్రవేశింపగా, శ్రీమహావిష్ణువును గూర్చి యనేక యాగము లాచరించినాడు. పురందరాదుల కిక తప్పని సరియై అతడడుగక పోయినను,

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 4_149
2. " " " 4_157
3. " " " 4_183

ఊర్వశీ కాముకుండగుట యతని యభిప్రాయంబుఁ దెలిసి, యవ్విలాపిని నత నికిచ్చి నరసురలోకంబుల యథేచ్ఛా విహారంబులఁ జరియించునట్లు దివ్యత్వం బొసంగిరి.[1] ఆ తరువాత నతనికి సుతషట్కమూర్వశీ లలామయందుద్భ వించినది. ఇట్లు పురూరవుడు ధర్మార్థ కామ మోక్షములను సాధించి ధన్యు డైనాడు.

## వశిష్ఠనారదులు :

వైవస్వత మనువు, సంతాన కాంక్షచే నొక్కనాడు "పురుషునకు పుత్ర లాభంబె పరమహితము"[2] అని భావించి, కుల గురుండును, అనుపమగుణ నిధియు నగు వసిష్ఠుని ప్రార్థించి యతం డనుమతి సేయగ పుత్ర సంతానము కొఱకు నధ్వరము చేసెను. మనువు భార్య కూతురు గావలయునని కోరికచే హోత నధ్వ ర్యునిఁ బ్రార్థించి పుత్రికను వేడినది. ఆమెకు సంకల్ప వైపరీత్యముచేఁ బుత్రమైఁ యిలా కన్య జన్మించినది. కాని తండ్రి యగు మనువు పుత్ర లాభము నపేక్షించి వాడగుటచే, పుత్రికా లాభమునకు సంతసింపక యిట్లేల జరిగినదని వశిష్ఠునిఁ బ్రశ్నించెను. వశిష్ఠుడు యోగదృష్టిచే సర్వము నెఱింగి, విచారింపకు మని యూర డించి "నియమ వ్రతముతో నఖిల భువనకర్తఁ బరమాత్మ నాశ్రిత కల్పతరువు, విష్ణు నారాధనను చేసి విమల భక్తిని నుతించినాడు"[3] శ్రితజన ప్రియుఁ డగుట నారాయణమూర్తి యతనికిఁ బ్రత్యక్షమైనాడు. వసిష్ఠుడు శ్రీమహావిష్ణువును వాచా నైపుణ్య మెలర్పగా నుపనిషత్సార స్తుతుల నింపూనగా, మనువునకుఁ బుత్రదానం బనుగ్రహింపవలయునని ప్రార్థించినాడు. శ్రీమహావిష్ణువ కూతురు కొడుకౌనని యానతి యొసగి యంతర్హితుడైనాడు. కులగురుడైన వసిష్ఠుడు తన శిష్యుడైన వైవస్వతుని కొఱకు లోకమునందే గురువును సాధింపఁ జాలని పుత్రప్రాప్తి యోగమును సాధించి పెట్టినాడు అది యాతని యుదాత్త గుణశీలములకు తార్కాణ ఆ తరువాత యిలాకన్య సుద్యుమ్నుడుగా మారి మృగయా వినోద మనవికే...

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 5_293
2. " " " 2_48
3. " " " 2_58

యచ్చట ప్రమాదవశమున కుమార వనమ్ము జొచ్చి పూర్వ శివ శాప నియమముచే స్త్రీ యైనాడు. అతిలోక సుందరుడైన బుధుని గాంచి మోహమునకు లోనై యాతని బొంది గర్భము ధరించి పురూరవునిఁ గని తుద కీ యాడు రూపెట్లు తొలగునా యని చింతించి వసిష్ఠుని ప్రార్థించినాడు. ఊర్జిత కరుణాగరిష్ఠుడగు వశిష్ఠుడు తలచినప్పుడ వచ్చినాడు. భక్త ప్రసన్న కరుణారసార్ద్ర స్వభావుఁ డగుటచే, స్త్రీ యైన సుద్యుమ్నుడు తన వృత్తాంతము విన్నవించి పురుషత్వ ప్రాప్తికై వేడుకొనగా, వశిష్ఠుడు యోగనిష్ఠను పరమశివు నారాధించినాడు ప్రత్యక్షమైన పరమేశ్వరుని యనేక భంగులఁ బెనగొన్న భక్తిచే వినుతులు సేసి పరమశివుని ప్రసన్నునిఁ జేసి కొన్నాడు. శివుడు తన వచన మమోఘమని మాన్పరానిదని పలుకుచునే వశిష్ఠుని యెడ ప్రసన్నుడగుటచేత కాదనలేక, సుద్యుమ్ను డొక మాసము పురుషుడగను, ఒక మాసము స్త్రీ గను చరింపగలదని యను గ్రహించినాడు. ఇట్లు వశిష్ఠుడు రెండవ సారి సుద్యుమ్నుని మరల పురుషునిగా మార్చుటలోఁ దోడ్పడి, మనువు కులము నిలుపఁ జాలినాడు. కుల గురువగుటచే నాత డా వంశమువారికై పడినపాట్లు చూడ వశిష్ఠుని సద్గుణ సంపత్తి, కరుణార్ద్ర స్వభావము వ్యక్తము కాగలదు. అంతటితో నాగక, సుద్యుమ్నుని యతని కుమారుడగు పురూరవుని వెంటనిడుకొని వారి రాజ ధానియైన ప్రతిష్ఠాన పురమునకు చేర్చి, మనువున కీ వృత్తాంత మంతయుఁ దెలిపి, పురూరవుడు సార్వభౌముడై ధరాస్థలము నేలెడునని వివరించినాడు. అతని శిష్య వాత్సల్య మట్టిది. కావుననే మనువు

"శిష్యవాత్సల్యమున మీరు చేసినట్టి
యత్నమునఁ జేసి యీడేఱె నన్ని పనులు
నిట్టి శ్రేయస్కరములకు హేతుకంబు
మీ యనుగ్రహమహిమ గాదే యమీంద్ర" 2_234.

అని బహు విధముల మృదు వచనముల కృతజ్ఞతను వెల్లడించి, తన మనుమనికి విద్యల నేర్పుమని యర్థించినాడు. అతని గురుభక్తి యట్టిది.

"మీ యుపదేశంబున నితఁ,
డాయతమతి సకలవిద్యలందు ధురీణుం

డై యొప్పునట్లు సదయో
పాయత నొనరింపవలయు నభ్యసనంబున్" 2_238.

ఇట్లు వసిష్ఠుడు వైవస్వత మనువునకు కులగురువై యుండి, పురుష వంశావ ప్రాప్తికి, తదుపరి పౌత్రుని విద్యాబుద్ధులఁ గఱపుటకు, హూమకాని దీక్షతో కృషిచేసి వారి యభ్యుదయమునకు పాటుపడినాడు.

పురూరవుడు వశిష్ఠునిచే సకల విద్యల నేర్చినాడు. సామ్రాజ్యాభిషిక్తుడై జైత్ర యాత్రసలిపి, తన చక్రవర్తిత్వమును సుస్థిర మొనర్చినాడు. వసిష్ఠుడు నాటిన మొక్క నేటికి మహావృక్ష మైనది. దానిని తీర్చి దిద్దవలయువని నారద మహర్షి హూను కొన్నాడు, పురూరవుని కొఱకు ప్రతిష్ఠాన పురమునకుఁ బవిగట్టు కొనివచ్చి, యతని యతిథి మర్యాదల స్వీకరించి, యతనికి రాజనీతి నుపదే శించినాడు. పురూరవుని గుణగణములఁ బొగడిన తీరు రమ్యతరము.

"ఉత్తమాన్వయమున నుదయంబు నొందుట
సరిలేని సౌందర్యశాలి యగుట
యఱువదినాల్గు విద్యలఁ బ్రవీణుండౌట
పటుబాహుశౌర్యసంపన్నుఁ డగుట
ధరణిచక్రాచలాంతంబుగా నేలుట
నిగ్రహానుగ్రహ నిపుణుఁ డగుట
వేదశాస్త్రోక్తసద్విధు లాచరించుట
యౌదార్యగుణముచే నధికుఁ డగుట

హరిహరబ్రాహ్మణార్చనానిరతుఁడగుట
యాత్మవిదుఁడౌట యొక్కనియందుఁ గలవె
పుణ్యనిధివైన నీయందె పొసఁగె నిన్ని
సద్గుణములు పురూరవసార్వభౌమ" 1_115.

రాజనీతిని యుపదేశించి, సప్తద్వీప సామ్రాజ్యమును నిర్వైర స్థితి నేలు పురూ రవునకు, నీతి ప్రకారంబు నిసర్గ సిద్ధములని, నారదుడు పలుకగా విని, పురూ

పదునొకొండవ అధ్యాయము

# కనుపర్తి అబ్బయామాత్యుని - వ్యక్తిత్వము

కనుపర్తి అబ్బయామాత్యుడు చతుర కవిత్వ తత్త్వపటు సంపద నార్జించిన యశశ్శాలి. ప్రబంధ రచనా పరిణతబుద్ధి. నరహరికి భక్తితో తన కవిత నంకిత మొనర్చిన భక్త శ్రేష్ఠుడు. పండితుడు. బహు శాస్త్రపరిచయముగల ధీమణి. సంగీత కళానిధి. ఉపాసకుడు. వినయశీలి. లోకజ్ఞుడు. తాను పుట్టిన తెనుగు నేలపై నెనలేని ప్రేమగలవాడు. ఆత్మప్రత్యయముగలవాడు. నరస్తుతి సేయక, నరహరినే నమ్ముకొన్న మహాత్ముడు. ఈతని వ్యక్తిత్వమును గూర్చి విపులముగ తెలుపుట కీతని కావ్యములైన 'అనిరుద్ధ చరిత్రము,' 'కవిరాజ మనోరంజనములు' తప్పమరి యెుండాధారము లేదు. కవి వ్యక్తిత్వము కావ్యములపై ముద్ర వేయుట లోక సహజము గదా! బహుముఖ ప్రజ్ఞాశాలియైన యీ కవిచంద్రుని గూర్చి విపులముగ పరిశీలించ వలసి యున్నది.

రవుడు తనకు నాత్మవిద్యోపదేశ మొనర్పుమని నారద మహర్షిని వేడుకొన్నాడు. సద్గురువు తనంత తానై రాగా ఆత్మవిద్యనడిగిన పురూరవుని భాగ్యమే భాగ్యము గదా! పురూరవుని కోరిక విని, నారదుడు "హర్షోత్కర్షమానసుండై నీ ప్రశ్నం బింత యొప్పునే"[1] యని ప్రశంసించి, ఆత్మ విద్యోపదేశ మొనర్చినాడు. పురూరవుని కాత్మ విద్యోపదేశ మొనర్చి, యాతనికి శ్రీమహావిష్ణువునర్చించి ప్రత్యక్షీకరించుకొనెడి యోగనిష్ఠనుచేకూర్చినాడు. దాని వలన పురూరవుని పారలౌకిక పురోగతికి మూల కారణమైనాడు. అంతటితో నాగక, స్వర్గమున పురూరవుని గూర్చి వర్ణించుట ద్వారా, యతని సౌందర్యాది సద్గుణములు లోకవ్యాప్తి నందినవి. అతని వాక్కులు సంసోక్తులు కర్ణ రసాయనములై వినువారిని పరవశింపఁ జేసినవి.

"నారద నారదజోక్తిక
ధారాగ్రహణప్రయత్నతత్పరలీలా
సారంగీభూత శ్రుతు
లై రప్పుడు లేఖు లెల్ల నా సభలోనన్" 1_213.

శ్రవణ తత్పరులై దేవతలు మోదమునందగా, పురూరవుని యందనురాగము జనించి యూర్వశి గుణ శ్రవణముచేతనే తన్నాతని దానిగా నర్పించుకొని, అతనికై విరహవేదన ననుభవించినది. తుదకాతని పొందుటే గాక, మనువంశ వర్ధనియై యాఱుగురు పుత్రుల గన్నది, తనతోపాటు, పురూరవునకు దివ్యత్వంబు నందుటకు హేతు భూతయైనది. ఇట్లు నారదుడు పురూరవ గుణ ప్రశస్తిని వర్ణించుటచే, ఊర్వశీ పురూరవుల సమాగమమునకు ప్రేరణ యైనాడు. ఆత్మ విద్యోపదేశముచే పారలౌకిక సుఖమును, గుణగానముచే ఊర్వశి పురూరవుని యందనురక్తయై, ఇహలోక సౌఖ్యముల చేకూర్చుటలో పరోక్షముగ నైననేమి, హేతు భూతుడైనాడు. ఈ విధముగ నారదపాత్ర పురూరవశ్చరిత్ర మందత్యంత ప్రాముఖ్యమును సంతరించుకొన్నదని చెప్పవచ్చును.

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 1_138

# 1. కవితా విశేషములు:

అబ్బయామాత్యుడు తన కవిత్వమును గూర్చి చెప్పుకొనిన తీరు గమడు.

"చతురకవిత్వతత్త్వ పటుసంపద యొక్కరి సొమ్ముగాదు, భా
రతి దయ సౌధవార్ధి కవిరాజుల మానసముల్ ఘటంబు లా
యతము కొలంది లబ్ధమగు నయ్యమృతం బటుగాఁదలంచి య
ద్యతన కవీంద్రులార! కృపదప్పక, మత్కృతి నాదరింపుఁడీ" [1]

'కవితాశక్తి యొక్కరి సొమ్ముగాద' ని పలికి తన యాత్మ ప్రత్యయమును తెలుపు కొనుచునే, కృపతో, తన కావ్యము నాదరింపుడని యర్థించి తన వినయ గుణమును ప్రదర్శించినాడు. కృపఁ దప్పక/కృపన్, తప్పక అనుచోట్ల విరుపుచేత, తనకుగల శబ్దప్రయోగ నైపుణిని చూపించినాడు. శ్రీ చింతామణి మంత్ర దేవతయైన శారద తన 'స్వచ్ఛ జిహ్వాస్థలిఁ వాచానృత్యము సల్పుగావుత' [2] మని భక్తితోఁ ప్రార్థించినాడు.

"ఎవ్వరి కెంత బుద్ధి పరమేశుఁడు దాఁ గృపచేసె నట్టిదై
నివ్వటిలుం గవిత్వరుచి నేరుప చాలినఁ జాలకుండినన్
నవ్వక వర్తమాన కవినాథులు చేకొనరయ్య మత్కృతిఁ
బువ్వులు గందకుండ రసముం గొను తేఁటులవంటి నేర్పునన్" [3]

వినయ శీలియై వర్తమాన కవుల నభ్యర్థించినాడు. తన నేర్పును గ్రహించు నేర్పు వారిదేనట.

"నా, యుల్లపు సౌధవీధిఁ గొలువున్న సరస్వతి సత్యవాణి నా
తల్లి యొసంగు పల్కు లివి తప్పులు సేయక చిత్తగింపుఁడీ" [4]

---

1. అనిరుద్ధ చరిత్రము ; 1-9.
2. కవిరాజ మనోరంజనము : 1-6.
3. " " " 1-10.
4. " " " 1-11.

తాను పలుకుట, సరస్వతి పలుకుటే. అందువలన తప్పు పట్టరాదట. అతనిది సత్యవాణి. ఇకనతని గూర్చి వేరుగఁ జెప్పఁ బనిలేదు.

"కాళిదాసాదులకునైనఁ గలవు తప్పు
లనిరి పెద్దలు మాదృశు లనఁగ నెంత
తప్పు గలిగినఁ దీర్పుఁడీ యొప్పుగాను
బాలునకు బుద్ధి నేర్పినభంగిఁ గవులు" అనిరుద్ధ. 1_10

కాళిదాసాదులకైన తప్పు లున్నవని పెద్ద లనిరట. తానెంత? తాను బాలుడు. కనుక తప్పుల నొప్పులుగా భావింపుడని వినయముతో వర్ణించినాడు. భగవదర్పిత కావ్యంబు పట్ల నెరసు లెన్ని దూషింపవలదని యానఁ బెట్టినాడు. చమత్కృతి యన్న నిట్లుండ వలయును,

"బాలత్వమందె నీకు ద
యాళుఁడనై యొసఁగితిన్ మదర్పిత కవితా
ఖేలనమును మద్భజనా
శీలంబును దృఢముగాఁగఁ జేసితి వత్సా" అని. 1_23

అని మంగళాద్రి నారసింహుడు వచించుటను బట్టి యతడు బాల్యమునుండి కవిత శక్తిని, నారసింహ భక్తిని దృఢముగాఁ బొందినవాడని వ్యక్తమగుచున్నది. 'కవి రాజమనోరంజన' రచనా వేళ కాతనికి ప్రౌఢి సిద్ధించినది. "అవ్యక్తప్రసాదోద్యా తాద్భుత శేముషీ చతురవాగ్యుక్తిన్"[1] కవిరాజమనోరంజనమును ప్రబంధముగ రచింపుమని మంగళాచలపతి యాజ్ఞాపించినాడు. అనిరుద్ధచరిత్రము నందలి రచన కన్న, కవిరాజమనోరంజన మందలి రచన ప్రౌఢము, సుందరమునై యుండుట పై దానినే సమర్థించు చున్నది. అంతేకాదు కవిత్వతత్త్వ పటు వంపదతో పాటు, సంగీత కళాధీమంతత కూడ సిద్ధించినది. దానికిని మంగళాచలపతి కృపయే హేతువు.

---

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 1_26

"శ్రీమంగళగిరినరసిం
హామేయకృపావిజృంభితాద్భుతకవితా
శ్రీమంతుఁడ గానకళా
ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్" కవిరా. 1_38

వివయశీలి యయ్యుమ, కవి తన కవిత్వమును గూర్చి విపులముగ చెప్పి కొనుచునే చమత్కారముగ తమ్ము తా మెచ్చుకొనుట తగదని సూచించినాడు. అట్లనుటచే తాము చెప్పికొనిన దానికన్న నధికుడేనని సూచించుట జరిగినది.

"తనుఁ దా మెచ్చుకొనంగ నేటికిఁ గవిత్వప్రౌఢి యాంధ్రీఘన
స్తనకుంభస్ఫురణన్ నవీనమృదుచిత్రశ్రీపదాచ్ఛాదనా
భినవాలంకరణార్థసూచనల సంప్రీతిన్ మనోవీథులం
జొమపం గల్గిన నింపుతో విని రసజ్ఞుల్ మెచ్చినం జాలదే" కవిరా. 1_18

తన కవితా రీతితోపాటు, లోకమున కవిత్వమెట్లుండిన బాగుండునో సూచించిన తీరు తడు రమ్యము. ఆంధ్రీఘనస్తన కుంభస్ఫురణ రసజ్ఞు లెటిగినదే.. నవీన మృదు, చిత్ర, శ్రీపదాచ్ఛాదనాభినవాలంకరణార్థ సూచనలచేత రసజ్ఞులు, మనో వీథుల సంప్రీతిని పొందుదురని స్పష్టపరచి యున్నాడు. పడతుల గుబ్బ చన్గవలను వర్ణించుచు, కవి చెప్పిన సామ్యము, కవిత్వమును నిర్వచించినట్లు కనబడుచున్నది.

"తడిసిన పయ్యెదయ్యెదలు దాకొని పైపయి నంటి యుండఁగా
నుడువ నగోచరం బగు వినూత్న విలాసత నొప్పె నప్పు డ
ప్పడఁతుల గుబ్బచన్గవలు ప్రౌఢకవీంద్రులచే రచింపఁగాఁ
బడు మృదుగూఢపాకరస బంధురకావ్యవచస్సమంబులై" కవిరా। 4_102.

మృదుగూఢ పాకరస బందుర కావ్య వచస్సులు రచించి యీ కవి కూడ ప్రౌఢ కవి యనిపించుకొని యున్నాడు.

## వర్ణనలు :

శృంగార రసము నంగిరసముగా తన రెండు కావ్యములను రచించిన వాడగుట చేతను, ప్రబంధ కవులయెడ స్పర్ధగలవాడగుట చేతను, ఇతని కవితలో శృంగారము పాలెక్కువనియే చెప్పవలయును.

అస్తమయ వేళ, నీడలు నిడుదలగుట సహజము. దానిని కవి దర్శించిన తీరు రమ్యతరము.

"ఇనునకుఁ బద్మినీకువలయేక్షణపై మది నెంత మోహమో
తను నెడఁబాసి యెంత పరితాపము నొందునో, నాల్గు యామముల్
చనిన పునస్సమాగమము సంఘటనం బని తెల్పు మంచుఁ దా
బనిచె సరస్యుపాంత తరు పంక్తుల నీడల పేరిదూతలన్" అని 3-8.

శృంగార నాయికలను, సందర్భము గలపి వచ్చినది గదా యని లక్షణము తెలుపుచున్నాడో యన్నట్లు వర్ణించిన తీరు మిగుల ప్రశంసింపఁదగి, కవి గడుసుతనమును సూచించుచున్నది.

"అధిపలాలితలైన స్వాధీనపతికలు
నలుక దీఱిన కలహాంతరితలు
పరుని రాకను గోరు వాసకసజ్జికల్
పతివంచితలు విప్రలబ్ధసతులు
పొరుగూర విభులున్న ప్రోషితభర్తృకల్
కలహించి విడనాడు ఖండితలును
ధవులు వేగంబ రాని విరహోత్కంఠితల్
సంకేతగతు లభిసారికలును

రమణసంభోగ విప్రలంభముల నొంది
రష్టవిధ నాయికలు నిట్టు లతిశయముగఁ
గువలయానందభావానుగుణ్యకళల
విలసితంబైన యన్నిశావేళయందు" అని 3-13.

వృక్షములు సుందరముగ నుండుట లోకవిదితమేగాని, వానియందు సైతము సుందరీ దర్శనము చేసినా డీ కవి.

“తను సుఖంబిచ్చు శీతల తరుచ్ఛాయా వి
శేషముల్ బాలికాశ్లేషములును
వీక్షణప్రీతి గావించు జాంబీర స
మాజముల్ యువతి వక్షోజములును
గర్ణపర్వ మొనర్చు కలరవాదిక కంఠ
రణితముల్ మదవతీ మణితములును
ఘ్రాణతృప్తి యొసంగు ఘనపుష్పసురభిసం
బంధముల్ వనితాస్యగంధములును

నాలుకకు నింపు పుట్టించు నవఫలరస
పూరములు యౌవతాధరసారములును
సరసులకు నిట్టు లవ్వనుల్ జవ్వనులును
జేయు వేడ్కలు వింతలై చెల్లె నపుడు” కవిరా. 5-44.

పంచేంద్రియ సుఖములనందించిన యా వనజవ్వనులు, సరసులకు ననుభవ యోగ్యలగుట చిత్రము.

వర్షము జగములకెల్ల హర్ష కారణము. కవి హృది కది ఎంతో యింపు గూర్చినది. ‘ఇంచు’ కాగమముతో శబ్దము ప్రవహించినది.

“నీరాళ్ల గొంది శంపారుచుల్ గనిపించె
నభ్ర మభ్రము నింద నాక్రమించె
వృష్టి కుంభద్రోణవిస్ఫూర్తి వర్షించె
జాతకంబులు మింట సంభ్రమించె
నదులు కూలంకషోన్నతములై ప్రవహించె
హాళికోద్యోగంబు లగ్గలించె
జాజితోఁటలు పుష్పసౌభాగ్యత వహించె
జలజప్రకాశత సన్నగించె

జనము మోదించె శాద్వలచ్ఛాయ మించె
నీప మిగిరించె మల్లె మే ల్నిర్గమించె
నెమలి నర్తించె భేకనాదము రహించె
భువిఁ దొలకరించె వానకందువ ఘటించె" కవిరా. 4_28

తొలకరి ఘటించిన తీరింత యించినది.

ప్రకృతి యందలి నిసర్గ సౌందర్యము. కవి గంటము నుండి జాలువారి ఆనందనాదమై జగతి పరవశించిన వైనము మిగుల చిత్రము.

"కలకంఠముల కంఠములఁ గుంత దుత్కంఠ
నొనరించు పంచమస్వనము నిగుడ
సమరంద సుమబృందగ మిళందము లమంద
గతి నెనంగించు ఝుంకరణ మొనర
గొరవంక లిరువంక మరువంకముల శంకఁ
బతియించు గతి ప్రోయు పలుకు లెసఁగ
శుకకులాధికవిలాసకకలారవకలా
పోక్తులు సరసస(ం)యుక్తి నెఱయఁ

గులుకు పలుకుల మెలఁకువ నలరు కలర
వముల రవములు చెలగంగ నెమిలిగములు
విమలగతిఁ గూయు నినదము లమర నివ్వ
నంబు చెలువొందు నానందనాద మయత" కవిరా. 2_116

వివిధ పక్షిజాతుల కలరవములు, వనమునందు నిసర్గ సంగీతఝురుల నింపి నానందమయత సాధించినది. ఇక రసజ్ఞుల కేమి కొదవ?

బాల్యము సౌందర్య నిలయము అందును సుతు బాల్యము మరియు సుందరమై భాసించుట లోకసహజము. అది యానంద మందిరము కూడ. ఇక రసజ్ఞుడైన కవి బాల్య సౌందర్యమును వర్ణింపకుండ నుండగలడా? అది యే కవికిని సాధ్యముగాదు అబ్బయామాత్యుని వర్ణనము రమ్యసుందరము.

"తొకతొక మాటలు న్నొసలఁ దుంపెసలాడెడు నుంగరంపు పెం
డ్రుకలును మద్దికాయల గడుం గదులాడగ ముద్దుగారు పొం
దిక జిగి పాలబుగ్గలను దేలికచూపులుఁ గోమలింపు టం
గకములు గల్గి యిం పొదవుఁగా సుత బాల్యము తండ్రి కెంతయున్"

కవిరా. 2_47

సుద్యుమ్ను డిలాకన్యగా మారిన సందర్భమున నే కవికిని లభించని చక్కని యవకాశము కనుపర్తి అబ్బయామాత్యునికి దక్కినది. ఆ సందర్భమును పురస్కరించుకొని, పురుషుని నుండి స్త్రీ యావిర్భవించిన విధమును కవి రమ్యముగ వర్ణించి యున్నాడు.

"శ్మశ్రుకళంకదోషంబు నిశ్శేషమై
ముఖచంద్రబింబము ముద్దుగులుక
వరపీవరపరజోభరణంబు హరణమై
నేత్రాబ్జధవళిమ నివ్వటిల్ల
ముష్టిషపేటికాయుక్తి విముక్తియై
కచనీలమణిగణకాంతి దనర
జ్యాకిణాంకమిళందవహితంబు రహితమై
కరహల్లికచ్ఛాయ గడలుకొనగఁ

బటుతనుత్రాణశుక్త్యపవారణము న
వారణంబై శరీరలావణ్యమౌక్తి
కద్యుతి వెలుంగఁ బురుషలక్షణము లెడలి
యక్కుమారుండు నవమోహనాంగి యయ్యె" కవిరా. 2_122.

రూపకాలంకారము, సుందరీ రూపమునందిన పై నముకడు రమ్యము. అక్కుమారునియందు నవమోహనాంగి రూప మారోపింపబడినది. అది కావ్య కథనమువ, శివశాపకృతము. ఇచ్చట నిది కవి శబ్దికృతము, పురుషుడు, స్త్రీగా మారుటయే చిత్రము. మారినప్పుడు రూపమునందు సారూప్యముండును గదా! కావున కవి, రూపసామ్యత చెడకుండ, మోహనాంగిని తీర్చి దిద్దిన తీరు నాన్యతో దర్శనీయము.

ఈ కవి కూర్చిన యుపమా సౌందర్య మింతింతనరానిది. ఉదాత్త సుందరములైన యీ యుపమాలంకార ఘటనానైపుణి సహృదయ హృదయాహ్లాదకరమే గాక కవిలోకస్తుత్యము.

> "బాహాబలోద్ధతిం బ్రళయభైరవు భంగిం బరాక్రమించి, య
> వ్యాహతలీల వాని బెగడందగంజేసియుం గార్య మెంచి దే
> వాహితుచేతం బట్టువడె నా హనుమంతుండు శక్రజిత్తుచే
> నాహవభూమిం బట్టువడినట్లు ప్రశాంతనిజోగ్రకోపుండై" అని. 3_118.

అనిరుద్ధుని వర్ణించుట యతని యౌచిత్యతా లక్షణమునకు తార్కాణ. ఈ విషయమునే నారదుడు శ్రీకృష్ణుని కెరుకపరుచునపుడు మరల నిదే యుపమానము వాడుట కవికి నచ్చలేదు. మరియొక యుదాత్తమైన పోలిక గైకొని వర్ణించి యున్నాడు.

> "........ నాగ్రహంబున నిశాచరుం డార్చి యెదిర్చి పేర్చినం
> దెంపును బెంపునుం గలిగి దీకొని యుద్ధముం జేసి చేపి ని
> ర్జింపంగలేక దైవగతిచే ననిరుద్ధుండు వానిచేత బం
> ధింపంబడెన్ దశాస్యజఫణిప్రదరావృతరాఘవాకృతిన్" అని. 4_22

కవి సుందరకాండ యందలి వృత్తాంతము నుపమానముగా గైకొని చెప్పి, నారదునిచే యుద్ధకాండ యందలి వృత్తాంతము నుపమానముగా చెప్పించుటలో నౌచిత్యమున్నది. ఒకటి పునరుక్తి కాకుండుట. రెండు నారదుడు, రామరావణ యుద్ధము దర్శించి యుండుటచే నా ఘట్టమునే పోలికగా చెప్పుట సముచితమని భావించి యుండుట లెస్స.

శ్రీకృష్ణ బాణాసురుల యుద్ధమును వర్ణించు నెడ రెండు వేర్వేరు పద్యములందు రెండుపమానముల గైకొని, తన ప్రౌఢిని దర్శింపం జేసినాడు.

> "హరిపై బాణుం డహంకృతిం గదిసి బాహాపంక్తి నొక్కుమ్మడిన్
> శరముల్ తోమరముల్ గదల్ ముసలముల్ చక్రంబులున్ శూలముల్
> పరిఘంబుల్ కరవాలముల్ పరశువుల్ ప్రాసాద నానాయుధో
> త్కరముల్ శైలముం గప్పు మంచు పగిదిం గప్పట్టగా నేసినన్"
>
> అని. 5_13

బాణుని యాయుధపరంపర మంచు, శ్రీకృష్ణుడు పర్వతము. అతని నా యాయుధము లే మాత్రము నొప్పింపజాలవని సూచన. ఇక శ్రీకృష్ణుని సమాధానము

"భుజబలశాలి మాధవుఁడు పూని ధనుర్గుణ టంకృతిన్ హరి
ద్గజముల కర్ణము ల్పగులఁగా నిశితార్ధశశాంకసాయక
వ్రజములు పింజపింజఁ గరువం బరఁగించి తమం బడంచు నీ
రజహితులీల సాధనపరంపరలం దునుమాడి త్రిప్పెన్" అని. 5-14.

బాణుడు బహువిధాయుధములఁ బ్రయోగించినను, శ్రీకృష్ణుడు కేవల మర్ధచంద్ర సాయకముల చేతనే వాని పీచ మడచినాడు. సూర్యుడు తమము నడచినట్లని చెప్పుటచే, సూర్యుని కిరణ ప్రసారము, మంచును కరగింప సమర్థమైనదగుట, శైలముఁ గప్పుమంచునకు ప్రతి చర్యగా నతికినట్లు పరిపడినది. ఇట్లు రెండు పద్యములలో నిరువుర పేరు పేరుగ నుపమించి, ఆ యుపమాన సామర్థ్యముచే, జరుగుచున్న యుద్ధమున శ్రీకృష్ణ విజయము నద్భుతముగ సూచించిన కవి ప్రౌఢిమ ప్రశంసనీయమైనది.

చిత్రలేఖ చేత చిత్రింపఁబడిన యనిరుద్ధుని సౌందర్య విశేషమును జూచి, ఉషారమణి రుచిరావలోకనంబులు పరమ శాంతుని హృదయంబునుంబోలె దత్సౌందర్య లహరీ మగ్నంబై యానంద లహరిం దేలుచున్న' వని వర్ణించిన తీరు న భూతో న భవిష్యతి. పరమశాంతుని హృదయము, శంకర భగవత్పాద కృత 'సౌందర్యలహరీ' 'శివానంద లహరీ' గ్రంథ పఠనవేళ నొందెడు నానందాతిశయమును ఉషారమణి, తనమానస చోరుడైన యనిరుద్ధుని దర్శించి పొందినదని చెప్పుటలో విశేషమున్నది. ఆమె ప్రేమ యంత నిసర్గ సుందరమనుట పవిత్రభావనా విలసితమనుట జన్మసార్థక్య సాధనా హేతువనుట. ఇంత చిన్న యుపమానమున నింత మహార్థమును సాధించిన అబ్బయామాత్యుడు ధన్యుడు. అతని గన్న తలిదండ్రులు ధన్యులు. అతని వంశము ధన్యము, వేయేల నాతని గన్న తెనుగునేల ధన్యమైనది. ఉపమాద్యలంకార శోభితమైన వచనములు మఱి రెం డుదాహరింపఁదగి యున్నవి. కావ్యమునం దంతట నలంకారములు కుప్పలు తిప్పలుగ నున్నవి అన్నియు నుదహరింప సాధ్యము కాదు. కాని సుదీర్ఘములైనను రెండు వచనములు, స్పృహణీయములై యున్నవి. అబ్బయా

మాత్యుని కవితా వైశిష్ట్యమును చాటి కవిలోకమున నతని నున్నత పదవి నలంకరింపఁ జేయుటకీ రెండు వచనములు చాలును.

" .... .... అన్నగరీ లలామంబు వైకుంఠ పురంబునుం బోలె, నాగ నగరంబు విధంబున ననంత కల్యాణ గుణాభిరామంబై, నభో మండలంబు తెఱంగున సుకవి కల్పిత ప్రబంధంబు చాడ్పునఁ గలిత కవిరాజ విరాజితంబై చంద్రబింబంబు పోలికఁ గుసుమిత ద్రుమంబు లీల, విరాజ మాన సాగరంబై, యలకా పురంబు భాతి జలజాకరంబు రీతిఁ బద్మాలంకృతంబై, యధ్యయన విద్యా విశేషంబు కైవడి సంగీత రత్నాకరంబు చెలువున వర్ణ క్రమ ప్రశస్తంబై, రామాయణ కావ్యంబు గతి భార్గవ వంశంబు కరణి రామాభిరామంబై, మిత్ర భావ ప్రకాశం బయ్యును కువలయానందంబై, రాజాభ్యుదయం బయ్యును గమలాంచితంబై హరి విహారం బయ్యును బుణ్యజనరంజనంబై విబుధవర విరాజితం బయ్యును, సమస్త గోత్ర ప్రచారంబై, గురు ప్రదీప్తం బయ్యునుఁ గవి హితంబై, సంపదలకుం గొటారును సౌభాగ్యంబులకుఁ బుట్టినిల్లును, సౌఖ్యంబులకు నాలవాలంబును, సారస్యంబులకుఁ గాణయాచియు, సంతోషంబునకు నాటపట్టునునై వసుంధరా సుందరీ నిటల తట సంఘటిత ముక్తాలలామంబు పోలికఁ జతుర్ముఖ నిర్మిత ప్రపంచాభరణంబై, యొప్పుచుండు." [1] బ్రహ్మలీలా పరిపూర్ణ మానుష విలాసుడు, శ్రీకృష్ణుని యావాసమైన ద్వారకాపురిని వర్ణించిన తీరు సాహిత్య ప్రియుల నెల్లర నలరింపఁ జేయ సమర్థమైనది. "తత్సమయంబున సాధుజనంబునుం బోలి పంకరహిత స్వచ్ఛ జీవనంబైన స్రవంతీ వితానంబును జంపకమహీరుహంబుల గతి ననాశ్రిత సారసంబులైన జీమూత ఖండంబులును వనూపమ భూముల చందంబున మందీకృత శిఖి ప్రకాశంబు అయిన ధరాధరంబులును వైద్యశాస్త్రంబు విధంబున గౌరాభ్రక గుణ ప్రకటంబయిన తారా పథంబును భాగ్యవంతుని మందిరంబు కైవడి శ్రీవిశేషాభిరామం బయిన చంద్రికాపుంజంబును విష్ణు విగ్రహంబుల రీతిం గమలాకరంబులయిన కొలంకులును గలిగి నితంబినీ కదంబక నితంబ బింబంబులకు నుపమానంబు సేయందగు నందంబులం దనరు సమున్నత సైకతంబుల వలనను దానశీలుని కీర్తివిస్ఫూర్తి నకలంక ధావళ్యవిలసనంబయిన కాశప్రచయంబుల వలనను

1. అనిరుద్ధ చరిత్రము ; I_73

చాపాంధకారంబులం బరిహరించుటకు దృష్టాంతంబుఁ జూపు కరణిఁ దమఃపటలంబు నణంచుచు సుజన మందిరాంగణంబులం బ్రకాశించు కార్తిక నియమ దీపికాజాలంబుల వలనను నక్తభోజనవ్రతనిష్ఠ లొనర్చు నవ్యహమహారుద్రాభిషేక పూజా విధాన విశేషంబులం దనరి విదోషంబులయిన ప్రదోషంబులం గళ్యాణ నిలయ శబ్దార్థంబు ధ్వనిపరంబయిన నిజాభిధేయ లీలం దెలుపు శివాలయచయంబుల వలనను సకల సౌకర్యాలవాలంబయిన శరత్కాలంబు ప్రవర్తిల్లె"[1] ఈతని కవితయు నిట్టిదని చెప్పుటకన్న (శరత్కాలము వంటిదని) యౌచిత్యము లేదు.

## సూక్తులు:

ఈతడు తన రెండు కావ్యములం దెడనెడ సందర్భ శుద్ధితోఁ బ్రయోగించిన సూక్తులు, లోకోక్తులు అతని లోకజ్ఞతను తెలుపుచున్నవి.

అనిరుద్ధ చరిత్రము నందలి సూక్తులు:

1. "వట్టి యార్వేరమున బలవంతుతోడి సాటికిఁ బెనంగు టెల్ల నిష్ఫలము గాదె" 1-89.
2. నిరంకుశుల్ గారె కవులు 1-90.
3. నారికేళఫలపాకము తా గద కవ్యకారతల్ 1-112.
4. అబలాశ్రయమున భంగము ఘటించు 1-113.
5. నీచాః కలహ మిచ్ఛన్తి 2-19.
6. తామసు డేమి యెఱుంగు 3-10.
7. కాపురుషులు రాజవందనముఁ బొందియు నైజము మానరే గదా! 3-28.
8. కాఁగలయట్లగు దైవయోగముల్ 3-70.
9. ఆఁకొని భుజియింపబోవుచును గూరల మేలడుగంగ నేటికిన్ 4-81.
10. దైవకృత మెవ్వరికైన హరింపవచ్చునే 5-7.
11. బ్రహ్మైవాஉహమ్ 5-106.
12, సర్వంబును బ్రహ్మమయంబు, ప్రపంచం బస్థిరంబు 5-106.

---

1. కవిరాజ మనోరంజనము: 4-61.

కవిరాజ మనోరంజనము నందలి సూక్తులు:

1. రాజా ప్రత్యక్ష దైవతమ్ 1_116.
2. జగ మెల్లను బ్రహ్మమయంబు 1_149.
3. మనసె కారణంబు మఱి బంధనమునకు, మోక్షమునకును. 1_157.
4. పురుష మన సెంత దృఢమైనఁ బువ్వుబోడి వికృతిఁ బైకొన్న నెగపొంత వెన్న గాదె 2_18.
5. కలుగదు గదా వివేకంబు కాముకులకు 2_21.
6. భార్యా రూపవతీ శత్రుః 2_36.
7. వ్రతముచెడిన సుఖము దక్కఁగవలె 2_37.
8. పురుషునకుఁ బుత్ర లాభంబె పరమహితము. 2_48.
9. బుద్ధిహీనలు సతులు 2_50.
10. దైవయత్నముఁగా గడవ వశంబె, మానుషిక కార్యము నిష్ఫల మెన్ని చూచినన్ 2_52.
11. దైవాధీనము లోకము, దైవ మధీనంబు మంత్రతంత్రములకు, భూదేవాధీనము మంత్రము 2_[6.
12. ఉష్ణ ముష్ణేన శీతలమ్ 2_163.
13. భద్రాణి భవంతు తే 2_220
14. మేలిమి పసిండికి నవ్య వికాస పారిజాత కుసుమగంధ మబ్బిన విధంబు 2_241.
15. దుఃఖితే మనసి సర్వ మసహ్యమ్ 3_76.
16. విషమసంధిఁ గిదొనర్పుట హీనుల జాడ గాదె 3_93.
17. కుత్తుకను విషంబు నాలుకను బెల్లము గాదె పాలసులకు 3_129.
18. సాధులగు బంధువుల దవ్వు సాగనంపి వచ్చు టుచితంబు గద గుణవంతులకు 3_185.
19. నిజాధికారముల్ దప్పినఁ జిన్నవోయి మరలం బనుచుందురు గాదె దుర్నృపుల్ 4_23.

20. సెగపొంత వెన్న పురుషుం డౌఁ బో వధూచేష్టకున్ 4_40.
21. నిరంకుశంబులు గదా జవరాండ్ర తలంపు లెయ్యెడన్ 4_50
22. శ్రీ శ్రీఁ జేయు 4_93
23. అమర్యాదాప్తి వచ్చు గాదె ప్రమాదం బొకవేళ బుద్ధిమంతుల కైనన్ 4_148
24. చిదంబరరహస్య మెవ్వ డెఱుంగున్ 5_132
25. ఎంత చేసిన వారికి నంత గాదె 5_210
26. అనఘులగువారు దమ యింటి కరుగుదేరఁ, గోరి యనురాగ
మందని వారు గలరె 5_224
27. కలలవంటివి గావె ఋణానుబంధముల్ 5_257
28. వారకాంతల వలపు లెవ్వరికి సతము 5_259
29. వారాంగనా స్నేహ మోహగుణంబుల్ చపలాయతము లెంతైనన్
సతం బేలగున్ 5_277

ఇందు కొన్ని తెలుగువారి నాలుకలపై సదా నాట్యమాడునవి. కొన్ని సంస్కృతభాషా పండితులు నిత్య ముదాహరించునవి. కొన్ని సందర్భములను బట్టి తన లోకానుభవమును కూర్చి కవి రూపొందించినవి.

## విశేషచ్ఛందములు :

తెలుగు కవులు ప్రయోగించిన సాధారణ ఛందములు (ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము, ఆటవెలది, తేటగీతి, కందము, సీసము) గాక వివిధములైన విశేషచ్ఛందముల నీ కవి సందర్భానుకూలముగ నుపయోగించి యున్నాడు.

### అనిరుద్ధచరిత్రము — విశేషచ్ఛందములు :

1. భుజంగప్రయాతము 1_109, 2_147, 4_33.
2. మాలిని 1_123
3. స్రగ్ధర 2_10, 4_49, 4_65

4. మత్తకోకిల 3_22, 5_48
5. పంచచామరము 3_131
6. లయగ్రాహి 4_48
7. తోటకము 4_50, 5_115
8. దండకము 4_97
9. కవిరాజ విరాజితము 4_104

కవిరాజమనోరంజనము నందలి విశేషచ్ఛందములు :

1. మాలిని 1_217
2. పంచచామరము 2_60 నుండి 64 వరకు
3. శిఖరిణి 2_123
4. లయగ్రాహి 2_205
5. లయవిభాతి 2_208
6. భుజంగ ప్రయాతము 2_247
7. కవిరాజ విరాజితము 3_197, 5_244
8. స్రగ్ధర 4_21, 4_173
9. పృథ్వీ 4_25, 5_302
10. రగడ 4_81. (30 పాదములు)
11. దండకము 4_161.
12. సర్వతోభద్రబంధ శ్లోకము 4_175.
13. మహాస్రగ్ధర (నిరోష్ఠ్యము) 4_188.
14. ఉత్సాహము 4_189.
15. కందద్వయ, రుగ్మవతీ, కమల విలసితగర్భ క్రౌంచపద వృత్తము 4_177.

విశేషచ్ఛందములను పూర్వకవులు ఆశ్వాసాంతములందు, కావ్య గర్భమునందు ప్రయోగించుట సాధారణ విషయమే. అబ్బయామాత్యుడు కూడ నా మార్గమువవే

తాను విశేషచ్ఛందములను సంవర్ప బుద్ధితోఁ గూర్చి యున్నాడు. నవ దంపతుల కేళి, బాణాసుర భాగ్యాతిశయము, ఉషకు చేసిన శైత్యోపచారములు, శ్రీకృష్ణ, బాణాసుర సైన్య వర్ణన, నారాయణాస్త్ర విజృంభణ, శాంభవీ జ్వరస్తవము యాదవుల సంతోషము, సుద్యుమ్నుడు స్త్రీ యగుట, విష్ణుస్తోత్రము, శివస్తోత్రము, ప్రావృట్కాలము, పుష్పాపచయము, ఉపరతి మొదలగు ఘట్టములను వర్ణించు సందర్భములందే, యీ విశేష చ్ఛందములను ప్రయోగించి, తన యౌచిత్యతా గుణమును చాటుకొని యున్నాడు. ముఖ్యముగ నితనికి దైవభక్తి మెండు. కావుననే విశేష చ్ఛందములం దధిక సంఖ్యాకము లైనవానిని, శివకేశవ స్తుతికే నియో గించి యున్నాడు. తన రెండు కావ్యములందును దండకము నొక్కొక్క దానిని గూర్చి ఒక దండకము శాంభవీ జ్వరము శ్రీకృష్ణుని స్తుతించునది. రెండవది పురూరవుడు శ్రీమహావిష్ణువును స్తుతించునది. పుష్పాపచయ వర్ణన సందర్భమున నితడు రచించిన ముప్పది పాదముల రగడ, సాహిత్య ప్రియులందరికి మోద కారణమైనది. నటరాజైన శంకరుని స్తుతించు సంవర్భమున లయగ్రాహి, లయ విభాతులను కూర్చుట యీతని యౌచిత్య ప్రియతకు నిదర్శనము. అట్లే వసిష్ఠుడు విష్ణుస్తుతి మొనర్చు సందర్భమున పంచ పంచచామరములను రచిం చుట యీతని పాండిత్యమునే కాక విశేషఫణితో ఛందస్సును వ్యంజించి, శ్రీమహావిష్ణువు పంచవింశతి తత్త్వములకతీతుడైన షడ్వింశుడని సూచించు చున్నది. కావుననే యతడు పంచ పంచచామరముల వెను వెంటనే రచించిన, కందమును పరిశీలించిన యీతని ప్రజ్ఞావిలసనము హృదయస్పర్శి కాగలదు.

"ఈ రీతి నవ్వసిష్ఠుఁడు
సారమతిం బంచ పంచచామరవృత్తో
దారస్తుతి గావించిన
నారాయణమూర్తి శ్రితజనప్రియుఁడగుటన్" కవిరా. 2-66.

ఇందలి 'సారమతి' శబ్దము నన్నయ సూచించినదే, సారమతులే తెలియ దగినది. 'పంచ పంచచామరములు వ్రాసి మరల పంచ పంచచామరవృత్తముల స్తుతించెనని చెప్పుటేలయనిన, విశేషమున్నది గ్రహింపుడని యొక సూచన, నారాయణమూర్తి శ్రితజన ప్రియుడు. కావున యతని పదములాశ్రయించిన యబ్బయామాత్యుడు ధన్యుడైనాడు.

# చిత్రకవిత్వము :

అప్పయామాత్యుడు తన గ్రంథములు రెండింటిని భగవదంకిత మొనర్చుటే గాక, తన పాండిత్య ప్రకర్షను చాటునట్టి చిత్ర గర్భ బంధ కవిత్వము చెప్పిన పద్యము లన్నింటిని శ్రీమహావిష్ణువును స్తుతించుటకే రచించుట యాతని దైవభక్తికి నిదర్శనము. చిత్రకవితకు క్రిందివి యుదాహరణములు.

(అ) పాదభ్రమకకందము :

దానవజలేజవనదా
భానుతతవిభాకరైకభావితతనుభా
మానాథవివిధనామా
యానసరసహారహీరహాసరసనయా    కవిరా. 4-166

(ఆ) ఓష్ఠ్యకందము :

ప్రాపై మాపైఁ బ్రేమన్
మా పాపముఁ బాపి బ్రోవుమా మము భవ్యా
ప్రౌపమ్యభావిభావా
భూపా భూవిభ్రమా ప్రభూపా మాపా    కవిరా. 4-167

(ఇ) నిరోష్ఠ్యమహాస్రగ్ధర :

కరఖేలచ్చక్రధారాఖరకరకరవిదీర్ణంద్విరోద్దండదండా
సురరాట్చక్రాంధకారశ్రుతితురగజటాజూటరంగత్తరంగో
త్కరగంగానీరహారాకరణఘణరణత్కాంచనాంచిత్సుతాకో
ట్యురుకాంతిచ్ఛన్నగోత్రాధ్యదకజజిశిరోయుక్తరాజత్కిరీటా
కవిరా. 4-168.

(ఈ) ద్వ్యక్షరకందము :

మామానినీనసేనా
సేమమున ననూననామ ని న్నెన్నను నా

నాముని మనోస్మని మన
నా మనమున నమ్మినాను ననో్మ్నిము మనా కవిరా. 4_169.

# బంధ కవిత్వము:

(అ) గోమూత్రికా బంధము: (కందము)

మురహర సుఖకరలీలా
పరమకృపాధామ విజయబాహాగర్వా
పురహరసఖ సురపాలా
వరసుకృతాధార వినయవాహాఖర్వా కవిరా. 4_170.

(ఆ) నాగబంధము: (చంపకము)

జలరుహనాభ శూలధర సారసగర్భసమేతపై భవా
సలలితరూపనీల జలజాలహరప్రభ భూరిభోగదా
విలసితపాదశై లధర వీరవరద్విపమోహవారణా
జ్వలదరివాసఖేలకిరసార శుభప్రదగీతవారణా కవిరా. 4_171.

(ఇ) ఛత్రబంధము: (కందము)

ధీర వరద సామరమత
సారసనయన యెనయైన సఖణి మకరహా
హారకమణిరదసురసా
సారసుదరసాతసురమస్వాదరవరదా కవిరా. 4_172.

(ఈ) అష్టదళపద్మబంధము: (స్రగ్ధర)

హారీ నిష్ఠా విబల్యా ద్యుఖిమత సమ రోగ్రాఘు సుశ్రీ వరాహా
హారావ శ్రీసుఖ గ్రాహా కరతిముఖ లౌల్యావన స్థానురీహా
హారీ సుస్థానవల్యాయత విపిన సమగ్రాటక ప్రాతరోహా
హారోక్ష ప్రాకటగ్రాహ్యా సితయశ సకల్యా బలిష్ఠా నిరీహా
కవిరా. 4_173.

(ఉ) చక్రబంధము : (శార్దూలము)

వక్షశ్రీమణి సుప్రదీప్త మనుసేవ్యా యచ్ఛనీలాంగదా
యక్షాగోచర కన్గొనంగ మతి భాగ్యం బబ్బె నా కిష్ట పీ
దక్షోపాధిఁ బవిత్రుఁ జేయు మను వొందం న్నన్న నాతంకదా
దాక్షిణ్యావహగేయ నాకు దరియుం దా పొక్క నీవే కదా
కవిరా. 4-174.

(ఊ) సర్వతో భద్రబంధ శ్లోకము :

నభోగోదదగోభోన, భోప్రమాక్షక్షమాప్రభో
గోమాశయా యాశమాగో, దక్షయానవయాక్షద కవిరా. 4-175.

బంధకవిత్వమున నింత సారళ్యమును, తెలుగు వాక్యములను గూర్చిన ప్రతిభ యీ కవికే దక్కినది.

# గర్భ కవిత్వము :

రెండు కందములను, రుగ్మవతీ వృత్తమును, కమల విలసిత వృత్తమును గర్భము నందిమిడ్చి క్రౌంచపదవృత్తమును ఘటించిన తీరు, అబ్బయామాత్యుని అనన్యదుర్లభమైన పాండితీ ప్రకర్షను చాటుచున్నది.

కందద్వయ రుగ్మవతీ కమలవిలసిత గర్భక్రౌంచ పదవృత్తము :

శ్రీమహిమా నిశ్రేయససీమా చిరశుభకరవిలసితగుణఖేలా
సామజసంరక్షా నుతసామా సరసిజభవసురసముదయపాలా
తామరసాప్తస్థానకధామా దరనినదచకితదనుసుతజాలా
తామసమారా ధామ సుధామా తరుణనళినజలధరవిభవేలా. కవిరా. 4-177

ఆ పద్యములో గర్భకందము :

శ్రీమహిమా నిశ్రేయస
సీమా చిరశుభకరవిలసితగుణఖేలా

సామజసంరక్షా నుత
సామా సరసిజభవసురసముదయపాలా కవిరా. 4-178

ఆ పద్యములో ద్వితీయ కందము :

తామరసాప్త స్థానక
ధామా దరవినద చకిత దమసుతజాలా
తామసదూరా ధామసు
ధామా తరుణ సజల జలధరనిభ నీలా కవిరా. 4-179

ఆ పద్యములో రుగ్మవతీవృత్తము :

శ్రీమహిమా నిశ్శ్రేయస ధీమా, సామజ సంరక్షా నుతసామా
తామరసాప్త స్థానకధామా, తామసదూరా ధామసుధామా కవిరా. 4-180

ఆ పద్యములో కమలవిలసిత వృత్తము :

చిర శుభకర విలసిత గుణ ఖేలా
సరసిజభవ సురసముదయ పాలా
దర వినద చకిత దమసుతజాలా
తరుణ సజల జలధర నిభనీలా కవిరా. 4-181

ఇంత ప్రౌఢముగ చిత్ర గర్భ బంధ కవిత్వములఁ జెప్పి, యీ కవి తరువాత "అజరుద్రాదులు మిమ్మెఱింగి మతిసేయన్ లేరు నేనెంతవాఁడ"[1] నని సవినయముగా పురూరవునితోఁ జెప్పించి, తన వినయ గుణాధిక్యమును, భక్తిసౌశీల్యములనుఁ బ్రకటించుకొనిన తీరు రమ్యాతిరమ్యము.

## స్తోత్ర రచన :

ఈ కవి తన కావ్యములందు సందర్భ శుద్ధితో రచించిన స్తోత్రములు భక్తులెల్లరు నిత్యము పఠించుటకు వీలుగా నున్నవి. దండకములే గాక మిగిలిన స్తోత్రములును రమ్యములై యతని భక్తి పారమ్యతను ధారాశుద్ధిని చాటుచున్నవి.

1. కవిరాజమనోరంజనము. ఆశ్వా. 4-182

(అ) బాణాసురుడు శంకరుని గూర్చి చేసిన స్తవము :

"గిరిజామానసహంస ! హంసవరయోగిధ్యేయచిద్రూప రూ
పరుచిశ్రీజితముక్త ! ముక్తభుజదర్పవ్యాఘ్రదైత్యేంద్ర ! యిం
ద్రరమాపల్లవమిత్ర ! మిత్రరజనీరాట్చక్ర ! చక్రాబ్జసుం
దరరేఖాంకితపద్మ ! పద్మ శరభా నాశంకరా ! శంకరా !" యని. 2-12

ఇది తెలుగు పద్యమే యైనను సంస్కృత వృత్తమై భాసించు చున్నది. కాకున్న సంస్కృతమునకు తెనుగు ఛందో లక్షణ మబ్బినట్లున్నది. ముక్తపదగ్రస్త మీ పద్యమునకు మరియు వన్నెఁ దెచ్చినది.

(ఆ) శాంభవీశ్వరము శ్రీకృష్ణుని గూర్చి చేసిన స్తవము :

శ్రీలక్ష్మీపతయే, కృతాఖిలజగత్త్రేమాయ దివ్యౌజసే
నీలాంభోధరకాంతికాంతవపుషే నిర్వాణసంధాయినే
లీలాకల్పితరాత్రివ్యకాయ మహతే లేశాతిపూర్ణాత్మనే
నాళీకాసనపూజితాయ భవతే నారాయణాయోన్నమః" అని. 4-96

ఇదియు పైదాని వంటిదే. దీని తరువాత వెంటనే చెప్పిన దండకము సయితము కవికిగల భగవద్భక్తిని, కవితానురక్తిని చాటుచున్నది.

(ఇ) శివకృత కేశవస్తుతి :

గంగాధరుడు బాణుని రక్షింపుమని శ్రీకృష్ణుని వేడుకొనిన సందర్భమునందు కవి, శివునిచే నీస్తవము పఠింపఁజేసి యున్నాడు.

"గంగాధరుండు పురుషసూక్తంబు చదువుచు హరినిఁ జేరి
వినయ వాక్య ప్రయుక్తి నిట్లని నుతించె" అని. 5-20

ఇతర స్తోత్రముల వలె గాక యీ స్తోత్రము సాక్షాత్పరమేశ్వరుని చేత చెప్పఁ బడుటచే నిట కవి, పురుషసూక్తము నందలి మంత్రార్థమునే తెలుగు పద్యముల రెండింటియం దిమిడ్చి, తన నైపుణ్యమును ధ్వనింపఁ జేసియున్నాడు. ఈ స్తోత్రము పురుషసూక్త భావమును తెలుపుచున్నదని సూచించుటకే పై పద్యము నందు 'పురుష సూక్తంబు చదువుచు హరినిఁ చేరి యని వ్రాయుట జరిగినది.

"అనఘుఁడప్రమేయుఁడనంతుఁడపాద్యుఁడక్షరుండ వ
త్యనుపమచిన్మయుండవుచరాచరజాలసమేతమై యి
వ్వనజభవాఁడపంక్తులభవజ్జఠరంబుననీదుమాయచే
జననము వర్ధనంబు నవసానము నొందుచునుండు నీశ్వరా అని. 5-21

"అఖిలాత్మ నీ నాభియందు నాకాశంబు
మునివంద్య నీ పాదములను ధరణి
సర్వేశ నీ మానసమునఁ జంద్రుండును
జలజాక్ష నీ నేత్రముల నినుండు
గాంభీర్యనిధి నీ ముఖంబున నింద్రుండు
మురహర నీ కర్ణములను దిశలు
నగేంద్రశయన నీ యూర్పుల ననిలంబు
ఘనమూర్తి నీ మస్తకమున దివము

ప్రబలమగుచుండు నుపనిషత్ప్రంచకమయ
దివ్యమంగళవిగ్రహస్థితి వెలుంగు
నిన్ను భావించి సేవించి సన్నుతించి
కాంతు రనఘులు మోక్షంబు గమలనాభ" అని 5-22.

"చంద్రమా మనసో జాతశ్చక్షో స్సూర్యో అజాయత? ముఖా
దింద్ర శ్చాగ్నిశ్చ। ప్రాణా ద్వాయు రజాయత। నాభ్యా ఆసీ దంత
రిక్షమ్। శీర్ష్ణో ద్యౌ సమవర్తత। పద్భ్యాం భూమి ర్దిశ శ్శ్రోత్రాత్। తథా
లోకాగం అకల్పయన్" ఇత్యాది పురుషసూక్త మంత్రములకు,
పై పద్యము తాత్పర్యమై యుండుట గమనింపఁ దగి యున్నది. కవి హృదయ
మిచ్చట నున్నది.

(ఈ) బాణకృతకేశవస్తుతి ;

మాయామానుష మూర్తిపై తనరు బ్రహ్మాంబుజా, శివాబ్జాసన
ధ్యేయున్ నిన్ను నెఱుంగలేక యవినీతిన్ మాఱుకొన్నందుకుం

ప్రాయశ్చిత్తముగాఁగఁ జేసితిని, నా పాపంబు లోపంబుగా
నా యజ్ఞానము వాసె నీ కరుణఁ గృష్ణా! గోపికావల్లభా! అని. 5-27.

అనిరుద్ధ చరిత్రమునందలి నాల్గుస్తోత్రములలో మొదటిది, బాణుడు శివునిస్తుతించినది. సంస్కృత సమాన ఘటితమై, ముక్తపద గ్రస్తాలంకార మండితమై యలరారుచున్నది. ఇక కేశవస్తుతులు మూడు. మొదటిది శాంభవీ జ్వరము మొదట సంస్కృత సమాసభరితమైన పద్యమున స్తుతించి యుండ, దండకము సంస్కృతాంధ్ర వచోరీతిని సాగినది. తరువాతి రెండును (శివబాణకృత కేశవస్తుతులు) తెలుగు పద్యములందు సంస్కృతాంధ్ర పదాళితో గుబాళించినవి. విష్ణుస్తుతి విషయములో నీకవి యీ వైలక్షణ్యమును సాధించి యొక ప్రత్యేకతను నిలుపుకొన్నాడు తాను తెలుగువాడు. విష్ణుభక్తుడు. తెలుగువారు విష్ణువునిట్లు సంస్కృతాంధ్ర శబ్ద యుక్తిని స్తుతింప వలయునని యీ కవి భావించెనేమో యనిపించును. కాని కవిరాజ మనోరంజ రచనా సందర్భమున నీ నియమము పాటించినట్లు లేదు. స్తోత్రము లన్నియు సాధారణముగ నొకటి రెండు చోట్ల దప్ప సంస్కృత సమాన భరితములుగనే యున్నవి.

(ఉ) వసిష్ఠకృత విష్ణుస్తుతి ;

పంచచామరములు :

1. తరణ్యుదగ్రదీప్తిమ త్సుదర్శనం సువర్ణనం
సరాగచారుమాధురీ రసాధరం రసాధరం
పరాప్తతాచరన్మనోభవచ్ఛిదం భవచ్ఛిదం
హరిం వ్యతీతపద్మగర్భజామితం భజామి తమ్

2. కర స్ఫురద్దరస్వర ప్రకంపమాన దిక్తటం
ధరాధరాధరాస్థిత ప్రధానకూర్మరూపకం
చరాచరా కరాతత ప్రశస్త కుక్షి శోభితం
నిరంతరం దురంతశక్తినిస్తులం ప్రభుం భజే

3. చలత్ప్రదీప్తకుండలం లసత్కపోలమండలం
కలావిలాసమోహనం ఖగప్రకాండవాహనం
మిళిందసుందరాలకం యమిప్రతానపాలకం
బలారివైరిమర్దనం ప్రభావయే జనార్దనమ్

4. ఉమాసమాన వాక్య సన్ను తోరు దివ్యనామకం
సమానమాధురీధురీణ సంస్కృతాంధ్రపర్షితం
క్షమాసమావృతాపరాధజాలక న్నిజాశ్రితం
రమాసమాగమప్రియాంతరంగ మచ్యుతం భజే

5. రణత్తరంగమాలికా స్ఫురత్తరంగిణీధ్వన
త్ఫణామణిచ్ఛటాఘృణి ప్రభాసమానభూమిభృ
త్ఫణీంద్రభోగతల్పభాగభాక్ప్రయానదివ్యభూ
షణప్రకాశవిగ్రహం భజామి సాధ్వనుగ్రహమ్"

కవిరా. 2-60 నుండి 64 వరకు

ఐదు పంచచామరములలో నైదువిధములైన నడకను ప్రదర్శించి కవి తన రచనా వైదగ్ధ్యమును, విష్ణుభక్తిని తేటపరచి యున్నాడు. 'పంచ పంచచామరములు' ఇందలి పంచ పంచ శబ్దము, ఇరువదియైదు తత్త్వములకుపసూచకముగా నుండి ఇరువదియైదు తత్త్వముల నెఱింగిన వసిష్ఠునకు, వరుడైన యనగా షడ్వింశుడైన పరమాత్మ, శ్రీమహావిష్ణువు వర్ణన మిచ్చటలో నెంత సొగసున్నదో, ఎంత యౌచిత్యమున్నదో గమనింపఁదగి యున్నది. పవిత్రము, ఉదాత్తము, భక్తిభావ సమ్మిళితమునైన కవి హృదయ మొక్కచో యిట్టి రచన సేయ సమర్థమై యున్నది. 'కవిరేవ ప్రజాపతిః' అను నార్యోక్తికి తార్కాణమైన కవివతంసు డీ కనుపర్తి వంశపారావారరాకా సుధాకరుండైన యబ్బయామాత్య సుధీమణియే.

(ఊ) వసిష్ఠకృత శివస్తుతి :

లయగ్రాహి.

"అంగజ భుజంగమ విహంగప కురంగ కర
భృంగినుత మంగళ తరంగ పటు శృంగా

రాంగ భట పుంగవ తురంగమ మతంగజ శ
తాంగ చతురంగ బలరంగ దరిభంగా
భంగుర పతంగ శశిసంగత రథాంగ సద
పాంగ శుభలింగ గిరిశృంగగృహ గంగా
తుంగతర భంగచయ సంగమ వ రాంగ హృద
యంగమ మతంగ మతిచంగ సుమభృంగా,

లయవిభాతి :

భుజగకటకవలయ వరరజతగిరి నిలయ వద
నృకీతభరతలయ రణవిజయ భుజదండా
ఋజు సరస హసన లస దజినకృత వసన ముఖ
విజితశశి లసన రచిత జలభవదజాండా
త్రిజగదమభరణ సురభకిత మృదుచరణ మద
గజదనుజ హరణ వరపిజనయన కాండా
ప్రజప వృషగమన ఘనవృజిన చయదమన కృత
సుజనభయ శమన ధృత రజనికరఖండా"

కవిరా. 2-205, 206.

వసిష్ఠుడు, వయం బెనయం బెనగొన్న భక్తిచేసి నుతించిన తీరు, శివుని మదికే యపూర్వం బనిపించినది. శివుడు నటరాజు. ఆయనకు లయ ప్రియమైనది. లయ కరుడు శివుడు. కనుకనే కవి 'లయగ్రాహి,' 'లయవిభాతి' యను నీ రెండు ఛందముల నెన్నుకొని, తన కవితా శక్తిచే వానికి లయగూర్చి భక్తినిచేర్చి నుతించి యున్నాడు ఔచిత్యతా స్నిగ్ధ సుందరమైన యీ స్తవ మేరికి హృద్యము కాదు ?

(ఋ) పురూరవకృత విష్ణుస్తుతి చిత్రబంధ గర్భ కవిత్వములతోఁ గూడి మహోదాత్తముగ చిత్రీకరింపఁ బడియున్నది. ముక్తపదగ్రస్తాలంకార యుక్తమైన యొక సీస పద్యమును, తదుపరి యంత్యప్రాసాలంకార యుక్తమైన మరియొక సీస పద్యమును చెప్పి కవి, పిదప చిత్రబంధ గర్భ కవిత్వముల గూర్చిన తీరు

'సభూతో నభవిష్యతి' యన్నట్లున్నది. అతని పాండిత్య ప్రకర్షకు, స్తోత్ర మధ్యమునఁ గూర్చిన యాంధ్ర గీర్వాణ భాషాశ్లేష కందము ఆంధ్ర సాహిత్య రత్నాకరమునకు పూర్ణచంద్ర సమ మైనట్టిది. ఇది యాతనికిగల గీర్వాణాంధ్ర భాషా ప్రాగల్భ్యమునే గాక నా రెండింటి యందలి సమతా భావమును, అతుల భక్తిని, సాహిత్య రక్తిని చాటుచున్నది. పండిత కవియైన అబ్బయామాత్యుడు ధన్యుడు.

"దేవర పే లాలసి కా
యే వర సన్మానక మది నే ననయము నీ
తా పసరు న్నాక దనం
దావాలాయ మను మాట చప్ప వినవయా" కవిరా 5-176

స్తోత్రమధ్యమున సారభూతమై, పాండితీ ప్రకర్షకమై, అనితర సామ్యమైన యీ కందపద్యము తెలుగు వారందరికిని అద్భుతానంద సంధాయి కాగలదని నిశ్చయముగ చెప్పవచ్చును సంస్కృతాంధ్రముల కిద్వైతసిద్ధి కలిగించిన విధము నావ్యతో దర్శనీయము.

## ఛందో వైవిధ్యము :

'అనిరుద్ధ చరిత్రము'ను 'కవిరాజ మనోరంజనము' అను నీ రెండు గ్రంథము లందు కవి ప్రయోగించిన ఛందస్సులను పరిశీలించినచో నితనికి దేశీ ఛంద స్సులపై మక్కువ యెక్కువైనదని స్పష్టమగును.

దేశీయ ఛందస్సులైన తేటగీతి, ఆటవెలది, సీసము. కందములతో నితడు ఆటవెలది నంతగా ప్రయోగించలేదు. అట్లే వృత్తములలో (ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము) శార్దూలములను మిగిలిన వానితోఁ బోల్చి నప్పుడు తక్కువగానే ప్రయోగించి యున్నాడు. అనిరుద్ధ చరిత్రమునం దీ కవి దేశీ ఛందస్సులకు, వృత్తములకు (దేశీ ఛందస్సుల సంఖ్య ఎక్కువైనను) సమ తౌల్యమును పాటింపగా, కవిరాజ మనోరంజనము నందు దేశీ ఛందస్సుల

సంఖ్య పెంచి వ్రాసి యున్నాడు. దీనిని బట్టి అతనికి క్రమముగా దేశీ ఛందస్సుల యెడ నభిరుచి పెరిగినదని స్పష్టమగుచున్నది. ఇది యాతని మాతృ భాషాభిమానమును చాటుచున్నది. రెండు గ్రంథములందలి పద్యసంఖ్యను దృష్టిలో నుంచుకొని పరిశీలించినచో, నతడు వృత్తములను తగ్గించి, దేశీ ఛందస్సులైన తేటగీతి సీసము, కందములను పెంచి వ్రాసి యున్నాడు. ఇంతేగాక విశేష ఛందస్సుల విషయమున గూడ తరువాతిదైన 'కవిరాజ మనోరంజనము' నందు పెంపుదల గాన్పించదు. బహుశ సంప్రదాయమును, ఔచిత్యమును గ్రహించి ప్రయోగించుటచే నీ తగ్గింపు సంఘటిల్లి యుండునని తోచెడిని. చిత్రబంధ గర్భ కవితలు, కవిరాజ మనోరంజనము నందే కాన్పించుటచే, నప్పటికి కవిలో ప్రౌఢి పెరిగి, పరిణత సిద్ధించినట్లు కనిపించుచున్నది. ప్రతి పద్యము నందును ధారా శుద్ధితోపాటు, సంగీతకళా నిధిత్వ లక్షణము ప్రత్యక్షమై యతనికిగల ఛందోఽధికారమునేగాక శబ్ద ప్రయోగనైపుణిని, పాండిత్య ప్రకర్షను చాటుచున్నది.

## భాషా వ్యాకరణములు:

ఇతని భాష మృదుపదగుంఫితమై మిగుల ధారాళముగ సాగును. శ్రీ చింతలపూడి శేషగిరిరావుగారు 'కవిరాజ మనోరంజనము' పై తమ వ్యాసములో నీ విధముగా ప్రశంసించి యున్నారు. "కవిరాజ మనోరంజన మీ ప్రబంధమునకు సార్థకనామము. వసుచరిత్ర పిమ్మటఁ గొన్ని పిల్లవసుచరిత్రలు బయలు దేరెనుగాని దీనికిఁ దుల్యమగు ప్రౌఢ ప్రబంధము లొకటి రెండుకంటె నెక్కుడు గాన్పింపవు. ఈ కవిరాజ మనోరంజనము భావముల ప్రోవు, అలంకారముల గని, వర్ణనల కాటపట్టు, జాతీయముల పేటిక, లోకోక్తుల కాలవాలము. ఇందుఁ బ్రతి పద్యము భావగర్భితమై మృదుపద గుంఫితమై, అలంకార సహితమై, ధారా శుద్ధిగలిగి విరాజిల్లుచున్నది.[1]

వ్యాకరణాంశముల విషయమునఁ గొన్ని చిన్న చిన్న పొరపాటు దొరలినట్లు కాన్పించును. "క్త్వార్థమైన – –

1 ఆంధ్రపత్రిక. ఉగాది సంచిక. క్రోధన 147.

శ్లేషౌనాచి" అను సూత్రమునకు భంగముగ సంధిగలుపుట మొదలగు వ్యాకరణ విషయమైన నెరుసు లొకటిరెండు గలవు. కాని కవి చెప్పినట్లు కాళిదాసాదు లకునైన గలవు తప్పులు, కాన నింత గొప్ప గ్రంథమున నిట్టి నెఱసులు పాటింపఁ దగినవి కావు.[1] అని శ్రీ చింతలపూడి శేషగిరిరావుగారే అభిప్రాయ పడిరి. "ధనముకున్"[2] "చేసుక"[3] అను శబ్ద ప్రయోగములు దుష్టములుగా కనిపించును. ఈ కవి తన కాలమున లక్షణ విషయమునఁ గొంత యవ్యవస్థ యున్నట్లు సూచించి, తన్నుఁ దా సమర్థించు కొని యున్నాడు.

"చెల్లనటంచు నొక్క కవి చేసిన లక్షణ మొక్కరివ్వలన్
జెల్లమిఁ జేసి తా నొకటి చెప్పఁగ ఛాందస విస్తరంబు సం
ధిల్లుటఁ గావ్య శంక లవనిం దఱుచయ్యె రసజ్ఞులార నా
యుల్లపు సౌధవీథిఁ గొలువున్న సరస్వతి సత్యవాణి నా
తల్లి యొసంగు పల్కులివి తప్పులు పేయక చిత్తగింపుఁడీ"

కవిరా. 1-11.

పై వివరణము, మన శంకలనెల్లఁ బారద్రోలి, రసజ్ఞులైన వారు క్వాచిత్కమైన శబ్దదోషముల లెక్కింపరాదని హెచ్చరింపఁ జాలి యున్నది. "నిరంకుశాః కవయః" అను నార్యోక్తినిఁ దలంచి విరమింతును.

కందుకూరి వీరేశలింగము పంతులు గారు కనుపర్తి అబ్బయామాత్యుని గూర్చి తమ 'ఆంధ్ర కవుల చరిత్ర' లో వెలిబుచ్చిన యభిప్రాయము సకలజన సమ్మతమైనది. "ఇత డా (కనుపర్తి అబ్బయామాత్యుడు) శతాబ్దము నందుండిన ప్రబంధ కవీశ్వరులందరిలో మిక్కిలి ప్రౌఢుడు. వసుచరిత్రమునకు తరువాత నీతని కవిరాజమనోరంజనముతో సరి తూఁగదగిన ప్రబంధము లొకటి రెండు కంటె నెక్కువ లేవు.[4]

---

1. ఆంధ్రపత్రిక. ఉగాది సంచిక. క్రోధన. 147
2 అనిరుద్ధచరిత్రము. 1_85
3. " " 1_119
4. శ్రీ కందుకూరి వీరేశలింగ కృత గ్రంథములు. సంపు. 10. పుట. 448, 448

శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారీ కవిని గూర్చి యభిప్రాయపడిన తీరు గమనార్హము. "ఈతడు ప్రశస్తమైన కవి. ప్రబంధకవు లందరి పోకడలను చక్కగా జీర్ణించుకొనిన వాడు. కేవల కల్పనా కథలవంక బోక పురాణమునందలి యితివృత్తమును దీసికొనినాడు. నరాంకితము చేయక నరసింహాంకితము చేసినాడు. పండితుడు. బహుశాస్త్ర కోవిదుడు ఉపాసకుడు, ధర్మమార్గ ప్రవర్తకుడు. కవిత్వ మును తిక్కనవలె నారాధనా విశేషముగ భావించినవాడు. పోతనవలె భక్తుడు. శ్రీనాథునివలె సీసములను నడుప యత్నించువాడు. పెద్దనవలె కావ్య నిర్మాణము చేయగలుగుదునను నాత్మ ప్రత్యయము గలవాడు. పూర్వాంధ్ర కవుల కవితా చమత్కారముల నాకళించు కొన్నవాడు.[1]

"చతురుల్ పూర్వకవీంద్రు లిన్నిటను నే స్వల్పజ్ఞుఁడ స్వామికిన్
హితమో కాదో మదీయ కావ్య మని నా కేలా విచారింప న
గ్రతనూజుల్ వ్యవహారకర్తలయినం గానీ కడుం బాలుఁడౌ
సుతు నవ్యక్తపు మాట తండ్రి కొదవించుం గాదె యానందమున్"

కవిరా. 1-17.

కవితా శక్తితోపాటు, వినయ సంపత్తిని తన సొమ్ముఁ జేసికొనిన ధీశాలి కమపర్తి అబ్బయామాత్యుడు. మంగళాద్రిపతి నిష్ఠావాప్తి కై కొల్చి, ధన్యుడైన పునీతుడు. చతురకవిత్వ తత్త్వపటు సంపద నార్జించి, ఆత్మభాగధేయ సారస్వత పారిజాత తరుపునకుఁ దగు సత్ఫలోదయము నొందిన ప్రజ్ఞాశాలి. "ప్రభువుల్ కవీశ్వరుల మన్నన సేయుట కీర్తిఁ గోరి, నిశ్చితమతి దేవతా స్తుతియె సేయు కవీంద్రుల నాదరించి సత్కృతి యొనరించి సత్ప్రభుని కీర్తికిఁ గీర్తి ఘటింపకుండునే"[2] యని విశ్వసించి ప్రభువులకే సన్మార్గము చూపి, సత్ప్రభుపైన మంగళాద్రిపతి గొల్చి చిరకీర్తినందిన సాహిత్యమూర్తి, అబ్బయామాత్యుడు. పండితకవి. భక్త కవి. ముక్త కవి.

---

1. "దువారము" అనిరుద్ధ చరిత్రమునకు పీఠిక: పుట: 58.
2. అనిరుద్ధ చరిత్రము : 1-19.

## II సంగీత కళానిధిత్వము:

అప్పయామాత్యుఁడు సంగీత సాహిత్యములందు సమానమైన ప్రతిభ గల వాఁడు. కావ్య పీఠికలలో నతఁడు తన్ను గూర్చి చెప్పుకొన్న తీరు ఈ విషయ ప్రత్యయమును చాటుచున్నది.

"శ్రీ మంగళాద్రి లక్ష్మీనృసింహుల కటా
క్షాంచలామృతవృష్టి నంకురించి
సంగీత సాహిత్య సరస సౌష్ఠవయుక్తి
శాఖోపశాఖలఁ జాలఁ బ్రబలి
రసికరాజన్యముఖ్య సమాజబహుమాన
పటల పసం బాభిరతిఁ జిగిర్చి
దైవనామాంకిత స్తవమనోహరభావ
పద వాక్య సుమములఁ బరిమళించి,

యభినవస్థితిఁ బెంపొందు నస్మదీయ
భాగధేయ సారస్వత పారిజాత
తరువునకుఁ బగు సత్ఫలోదయము గాఁగ,
సముచితంబుగ నొక ప్రబంధము రచింతు." అని. 1-14.

సంగీత సాహిత్య సరస సౌష్ఠవయుక్తి మంగళాచల నృసింహుని కటాక్షాంచలామృతవృష్టినంకురించి, క్రమముగా పెరిగి, అతని భాగధేయ సారస్వత పారిజాత తరువు ఫలించిన తీరు కడునద్భుతమైనది. అందొకటి యనిరుద్ధ చరిత్రము రెండవది కవిరాజ మనోరంజనము, దాని సత్ఫలములు.

"శ్రీ మంగళగిరినరసిం
హామేయకృపావిజృంభితాద్భుతకవితా
శ్రీమంతుఁడ గానకళా
ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్" కవిరా 1-88.

కవిరాజ మనోరంజన రచనవేళ, అతనికి సంగీత సాహిత్యములలోఁ బరిణతి సిద్ధించినది. కావుననే 'అద్భుత కవితా శ్రీమంతుడ,' 'గానకళాధీమంతుడ' అని చెప్పుకొని యున్నాడు. అది శ్రీమంగళాద్రి నారసింహుని అమేయ కృపచేత సిద్ధించినది కావున, దేవతాస్తుతి వ్రత పరుడగుటయు సిద్ధించినది. ఇట్టి మూడు విశిష్టగుణంబు లితని కవితాప్రపంచము నజరామర మొనర్చినవి.

ప్రతి పద్యమునందు, ప్రతి వాక్యమునందు, ప్రతి ఘట్టమునందీ సంగీత సాహిత్య దైవభక్తులు ముప్పిరిగా సాగి యతని కవిత్వము నమృతమయ మొనర్చినవి.

కవిరాజ మనోరంజన కావ్య నాయకుడు పురూరవుడు. అతని సభా వైభవ మును వర్ణించుచు కవి చెప్పినరీతి రమ్యోదాత్తము.

"వింజామరంబుల విసరు పూఁబోడుల
కంకణ ఝణఝణత్కారరవము
మురువుగా సుతిఁ గూడి మొరయించు వైణిక
వల్లకీ నిక్వణక్వణరవంబు
కడు సొంపుగా నాడు కర్ణాట నాటికా
కనకమంజీర ఘల్లు లరవంబు
ప్రణత పార్థివ శిరః ప్రసగ్గంధలోలతఁ
దిరుగు తుమ్మెదల ఝంకరణరవము

మిళితమగుచు సుధారసగళితమగుచు
లలితమగుచు మనోరథఫలితమగుచు
నా నినాదం బపూర్వమోహనవిలాస
మహిమఁ జెన్నొందెఁ దత్సభామండపమున" కవిరా 1-108.

'మోహన విలాస మహిమ' యనుటచే నతనికిగల సంగీత కళాపాండిత్యము స్పష్టమగుచున్నది. మోహనరాగము సకలజన సమ్మోహనమగుట లోకవిదితము. పురూరవుని సభయాన్నట్లు నినదించెనని యపూర్వభావన. పద్మాహితుండైన

చంద్రుని అహితమైన గురుపత్నీ సంపర్క దోషమునకు పురికొల్పిన, తార వర్ణన యెంత సంగీత స్ఫూర్తి నిచ్చునో గమనార్హము.

"హరినీలముల మించి యళిలీల వెలయించి
వేణియు శ్రోణియు వింత దనర
వివి నిరాకృతిఁ జేసి కరి కరాకృతి దాసి
యొదలును దొదలును నొప్పు మీఱ
నగజాతములఁ గేరి మృగపోతముల మీఱి
చన్నులఁ గన్నులఁ జెన్ను మిగుల
పరకుందములఁ బోలి యరవిందముల నేలి
రదములుఁ బదములు రహి వహింప

గురుని భవనంబునందు సుందరి మనోజ్ఞ
విమలఘంటారవాయతవిమలకనక
చరణమంజీరపుంజసింజానినాద
యగుచు నిట్లు మెలంగఁ బద్మాహితుండు." కవిరా. 2-19.

శబ్దసంయోజనమెంత లయబద్ధమో, అంతే ఘనముగ భావము అలంకారము రంగరించబడినవి. మన్మథుని ఘంటికాధ్వని యట్లుండఁగనుట, మృదంగధ్వని వినిపించెడు రీతి చేసిన రచన మరియు చిత్రమనిపించును.

"యతి యతి నియతికి గిరిజా
పతి పతి మతి నంకపించి సాగుజ్య నిజా
కృతి శ్రుతి తతి నుతి పాత్ర
స్థితి ధృతి యుతి దర్శితంబు చేసే న్మునికిన్" కవిరా. 2-201.

నటరాజు దర్శనమిచ్చెడు సందర్భమున యోగనిష్ఠుడైన వసిష్ఠునికి కలిగిన యను భూతిని కవి యతి సమర్థతతోఁ బ్రదర్శించి యున్నాడు. త్రిలోకబాంధవుడు శివుడు ప్రత్యక్షముకాగా, వశిష్ఠుడు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, పరమ శివునిస్తుతించిన తీరు నాన్యతో దర్శనీయము.

లయగ్రాహి.

"అంగజ భుజంగమ విహంగవ కురంగ కర
భృంగినుత మంగళతరంగ పటుశృంగా
రాంగ భటపుంగవ తురంగమ మతంగజ శ
తాంగ చతురంగ బల రంగ దరిభంగా
భంగుర పతంగ శశిసంగత రథాంగ సద
పాంగ కుధలింగ గిరిశృంగ గృహగంగా
తుంగతర భంగచయ సంగమ పరాంగ హృద
యంగమ మతంగ మతిచంగ సుమభృంగా
కవిరా. 2-205.

లయవిభాతి.

"భుజగకరవలయ వరరజతగిరినిలయ పద
సృజితభరతలయ రణవిజయ భుజదండా
ద్విజానవసహనన లస దజినకృత వసన ముఖ
విజిత శశి లసనరచిత జలభవద జాండా
త్రిజగ దనుభరణ సురభజిత మృదుచరణ మద
గజదమజహరణ నరసిజనయన కాండా
వ్రజపవృషగమన ఘనవృజినచయదమన కృత
సుజన భయశమన ధృతరజనికరఖండా" కవిరా. 2-20

కేవలపఠనము చేతనే యీ రెండు పద్యముల నుండి మృదంగాది చర్మ వాద్యముల ధ్వని సృజింపబడి, హృదయమునకు భక్త్యావేశము ప్రసాదింపదగిన దీ రచన.

సంగీత సంప్రదాయమునందలి ఆరోహణా వరోహణములను సూచించుచు చెప్పిన పద్యము, ఉషా సౌందర్య దర్శనముతోపాటు, సంగీతమాధురీ స్పర్శనము గావించును.

ఘనసారమును సారఘనము నాక్షేపించుఁ
గలికి పల్కుల యింపు కచము సొంపు
పద్మరాగము రాగపద్మము నదలించు
రమణింపు మోవి పాదముల తీవి
మృగమదంబును మదమృగమును హాసియించుఁ
గాయంపు వలపు కన్దోయి మెలపు
వరనాగమును నాగవరముఁ జుల్కగఁ జేయు
నవకంపు నూఁగారు నడల తీరు

చక్రసామ్యత వెలయు కుచమ్ము లందు
సామ్యచక్రతఁ దనరు వెక్కసపుఁ బిఱుదు
రూఢి నారోహిణియు నవరోహిణియుఁగ
నెలఁత చెలువంబు సారె వర్ణింపఁ దగుమ" అని. 2-26.

ఉషా సౌందర్యము మాటిమాటికి దర్శింపదగి యున్నది. చూచినవారు కనుఁ ద్రిప్పుకొనలేక యామె సౌందర్యము నాపాదమస్తకము సారెకు దర్శింతురు. కనుకనే కవియు సారెకు వర్ణింపదగినదని చెప్పియున్నాడు. 'సరిగమ పదనిస,' 'సనిదపమగరిస' యను రీతిని యారోహణావరోహణములెట్లో ఘనసార, సారఘన—ఇత్యాది సమాసములఁ బ్రయోగించి, తన సంగీత సాహిత్య ప్రతిభలఁ జాటుకొని యున్నాడు.

ఇట్టిదే యీ క్రింది పద్యముఁగూడ సంగీత సాహిత్యముల సరస సమ్మేళనము.

"ముసుకారునను కారుకొని మీరు ఘన చారు
తను మారుకొని కేరుఁ దరుణి కురులు
నల కుందముల యందముల చందముల మంద
ముల నొందఁగాఁ జేయుఁ జెలి రదాళి
తెగరాని నగమేని తొగరేని జిగిఁ బూని
తగు దాని సొగసైన నగు మొగంబు

వెల పెంపు వెలయింపు కళ గుంపు తులకింపు
బలుకెంపుఁ దలపించుఁ బణఁతి మోవి

సింగముల భంగముల నొందఁజేయు నడుము
కీరముల దూరములఁ దొలఁగించుఁ బలుకు
ఐక్కవలఁ దక్కువలఁ జేయుఁ జమ్మదోయి
ముదిత రూపంబు త్రిభువన మోహనంబు" అని. 2-30.

ఉషా సౌందర్య మెంత జగన్మోహనమో, అబ్బయామాత్యుని సరస కవితా రీతి సంగీత కళానమ్మిశ్రితమై యంత జగన్మోహనముగ సాగినది. ఉషా సుందరి కొఱకు, చిత్రరేఖ యనిరుద్ధుని గొంపోవవచ్చి. ద్వారకా నగరమును దర్శించిన సందర్భమున కవి రచించిన తీరు పరిశీలింపఁదగి యున్నది.

"కాంచెం గాంచనగాత్రి సౌధ శిఖరాగ్ర స్వర్ణపాంచాలికా
చంచ న్నీలమణి ప్రకల్పిత కచ ప్రక్రీళవ త్తారకా
దంచోదంచిత హృద్య వాద్యరవ తుంభ ద్యామపూజా లస
త్రొంకాంచామిత్ర గురుస్థ మండప సహస్రస్ఫారకాద్వారకన్" అని. 8-40.

'పంచోదంచిత హృద్య వాద్యరవము' వినినట్లురచించి యున్నాడు. ఇతనికి పంచ మమున గానము చేయుట మిగుల యిష్టమని తోచుచున్నది. ఇది యాతని సంగీత విద్యావై శద్యముచే చాటుచున్నది.

తెలుగుదేశమున పెళ్లిళ్ల సందర్భమున మంగళహారతులు పాడుట లోక సామాన్య విషయము.

"బంగరు పళ్లెరంబులను పద్మముఖుల్ ఘనసార దీపికల్
రం గమరంగ నించి మణిరాజిత కంకణహస్త పల్లవల్
నంగతినుంచి త్రిప్పుచును సారెకు మంగళకైశికా "జయం
మంగళ" మంచుఁ బాడిరి సమంచిత పంచమనాద వైఖరిన్" అని 5-82.

మంగళహారతులను పద్మముఖులు మంగళకైశికీ రాగమునఁ బాడిరట. 'సంగతి' 'పంచమనాద పైఖరీ' శబ్ద ప్రయోగమాతని సంగీత విద్యాపారమ్యతకు తార్కాణములు. కవిరాజ మనోరంజన రచనా సందర్భమున కాతని సంగీత విద్యా పాటవము మరింతగ పెరిగినది కాఁబోలు. తాను 'గానకళాధీమంతుఁడ' నని చెప్పుకొని యున్నాడు.

సంగీత కళావిధులైన వారికి మాత్రమే 'గ్రామ' విషయచర్చ సముచితము.

"హైమమనోజ్ఞమైన పురి హర్మ్యచయంబున మర్త్యదంపతుల్
ప్రేమలతోడఁ గూడి విహరించుచు నింపుగ షడ్జ మధ్యమ
గ్రామముల న్వినోదగతి గానము సేయఁగ నాలకించుచుꣳ
వేమఱు మెచ్చుచుందు రతి వింతగఁ గిన్నరదంపతు ల్దివిన్" కవిరా. 1-74

కిన్నెరదంపతు లాకాశమునందుండి ప్రతిష్ఠానపుర వాసుల షడ్జమధ్యమ గ్రామముల గానము సేయగ వింతగ మెచ్చుచుందురట. ఇట నొక విశేషమున్నది. 'కాళిదాస కుమార సంభవ' కావ్యమునందు మల్లినాథసూరి వ్యాఖ్యానించుచు నిట్లు వ్రాసియున్నాడు. "ఉద్గాస్యతాం దేవయోనిత్వా దుచ్చైర్గాన్ధార గ్రామేణ గానం కరిష్యతాం-ఉక్తం చ నారదేన"

షడ్జ మధ్యమ నామానౌ గ్రామౌ గాయన్తి మానవాః
న తు గాన్ధార నామానం, న లభ్యే దేవయోనిభిః" ఇతి

"కిన్నరాణాం దేవగాయకానాం"[1] — మానవులకన్న గానవిషయమున నధిక ప్రతిభా విశేషములుగల దేవగాయకులు సైతము, ప్రతిష్ఠానపుర వాసుల షడ్జమధ్యమగ్రామ గానమును విని వింతనొందిరి. అట్లనుటచే వీరు గాన విషయక ప్రజ్ఞాతిశయముగల వారని సూచన. సంగీతకళా పారీణుఁడు కాని కవి యిట్లు వ్రాయఁ జాలఁడు. ప్రతిష్ఠానపుర వాసులు గీత ప్రబంధ ఫణితిని గానము చేసినట్లు వర్ణించి యున్నాడు.

1. కుమారసంభవం ప్ర. స. 8

"బంగారు జలపోఁత రంగు మీఱిన కాయ
కుచమండలంబుపైఁ గొమరు మిగుల
సరసాంగుళులు సారెసారె సారెల మీఁద
నారోహణావరోహణతఁ దనర
నేర్పరింపఁగ రాక యేకమై ఆంత్ర గా
త్రంబుల నాదామృతంబు దొరుగ
భావానుభవరీతిఁ బైకొన్న మది సొక్కి
కనుచూపు వింతచేఁ గానఁబడఁగ

మంద్ర మధ్యమ తారకా సాంద్ర సరిగ
మపదని స్వరానుస్వరమాధురీధు
రీణ గీతప్రబంధప్రమాణఫణితి
వీణ వాయించె గానప్రవీణ యగుచు" కవిరా 4-107.

వీణా వర్ణనముతో పాటు, గాన మహిమను కూడ సముచితముగ వర్ణించి యున్నాడు. స్వరములు, స్థాయులు, భావానుభవరీతి వర్ణించుచు, వారు గీత ప్రబంధ ప్రమాణ ఫణితిని వీణ వాయించినట్లు తెలిపి యున్నాడు. ఇది పరిశీలింపదగినది.

శ్రీకృష్ణ దేవరాయలు తమ యాముక్తమాల్యదలో విలుబుత్తూరిని వర్ణించుచు నచటి ద్రవిడాంగనలు గానము చేసినట్లు వర్ణించిన విషయము స్మరింపఁదగి యున్నది.

"శయపూజాంబుజముల్ ఘటిం దదబద్ధ ఆన్దోయి లే గొనుపై
దయఁ దవ్వక బనపాడి పాగడపు బాదం బొప్పఁ తెంగల్వ డి
గ్గియ నీ రచ్యుతమజ్జనార్థము కటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవడాంగనల్ నడుతు రుద్యానంపు లోత్రోవలన్"[1]

1. ఆముక్తమాల్యద. 1-58.

ఇచ్చట ద్రవిడాంగనల్ దివ్య ప్రబంధ యుగాస్యల్ అని శ్రీకృష్ణదేవ రాయలు వర్ణించిన, దివ్య ప్రబంధములు, దేవతాస్తుతి పరమైనవి. అబ్బయా మాత్యుడు 'దేవతాస్తుతి వ్రతపరుడన్' అని పీఠికయందు సంగీత సాహిత్య ములతో పాటు తన కది మూడవగుణ మన్నట్లు చెప్పికొని యున్నాడు. కనుక దేవతా స్తుతిమయమైన 'గీత ప్రబంధ ప్రమాణ ఫణితి' యనుటలో నీ పవిత్రతా భావము సైతముండి యుండవచ్చునని తోచెడిని.

సంగీత మహిమను గూర్చి యింత కంఠోక్తిగఁ జెప్పిన వారరుదు.

"మలయజగంధి తాళపరిమాణమనోహరరాగగీతికా
కలనినదంబు జంత్రమున గాత్రమునం జెలగింపు నింపుచే
శిలలు ద్రవించెఁ జిత్రములు జీవకళల్ ధరియించె దారువుల్
మొలుపుగ నంకురించె మృగముల్ మదిఁ జొక్కు వహించె నెంతయున్"[1]

శిలలుద్రవించుట, చిత్రములు జీవకళ ధరించుట, దారువులంకురించుట, మృగములు మదిఁ జొక్కువహించుట, సంగీత కళా మహిమకు పరాకాష్ఠ. అది కవికిగల సంగీతకళా విషయకగాఢ ప్రజ్ఞా విశేషముచే వర్ణించిన విధము. అది గాంధర్వ గానము. దాని మహిమ యట్టిది.

సంగీతము కేవలము శ్రవణానందదాయి మాత్రమేకాదని యీ కవి నిశ్చితాభిప్రాయము. ఊర్వశి గానము చేసిన గాంధర్వ గానము, ముని చంద్రుడైన మిత్రావరుణులసైత మాకట్టు కొనినదన్నచో, దాని ప్రయోగాతిశయ మట్టిది.

"ఆ గాంధర్వనినాదవైభవము బ్రహ్మానందమై యంచమై
భోగేచ్ఛాంకురకందమై శ్రుతిసుభోద్భూతామృతస్యందమై
వాగర్థైకరసానుభూతి కుతుక స్వచ్ఛందమై యొప్పుచు
రాగాంభోనిధి ముంచియెత్తె మునిచంద్రస్వాంతకంజంబులన్"
కవిరా. 4-110.

1. కవిరాజ మనోరంజనము : 4-108.

గాంధర్వ గానమగుటచే నది బ్రహ్మానందానునంధాయి యైనది. కాని ప్రయోక్త దృష్టి రసానుభూతిఁ గోరునది. కనుక రాగాంబుధిని మునిచంద్ర స్వాంతకంజ ముల ముంచినదట. రాగము రాగముఁ బెంచుట యెంత చతురోక్తి! ఎంత సరసోక్తి! రసవివేక నిధాన కావ్యరచనా ధురీణమైన కవి హృదయ మెంత రసజ్ఞము!

"కలకంఠాంచిత కంఠ పంచమ కుహూకారంబులుం గీర కో
మలవాచానినదంబులుం గలరవామందధ్వనుల్ శారికా
కలనాదంబులు చంచరీకచయ ఝంకారంబులుంగా దట్టమై
చెలఁగుం దద్వనపీమ మన్మథజయశ్రీగీతికారావమై" కవిరా 5-80.

కలకంఠ కీర శారికా చంచరీకము లొనర్చిన కలరవములు, మన్మథ జయశ్రీ గీతికారావమై భాసించినదని చెప్పుట కవి భావుకతను చాటుచున్నది. శ్రీరాగము విన సొంపైనది. దానిని సూచించుచు కవి 'శ్రీగీతికారావము' అని ప్రయోగించి యున్నాడు. శ్రవణ ప్రవణమైన యా వనసంగీతమును సహృదయుల కనుభూత మొనర్పుటకై శ్రీరాగ లక్షణము నం దారోపించుట యెంత మనోహరమో, అంత ప్రతిభా ప్రకాశకము.

వింధ్య శిఖరిని వర్ణించిన ఘట్టము మరియొక హృదయస్పర్శియైన రచన.

"కరిణీకరోత్క్రుష్ట ఝరిణీకపిత్థాభ్ర
చరిణీ కుచోపరిచ్ఛన్నశాటి
జలజాతరాగాద్యుపలజాతమయదరీ
స్థలజాతతప్రభాసాంద్రమూర్తి
నటనాధిగతశిఖుస్ఫుటనాదహృదయ సం
ఘటనార్తతాబిలంగతభుజంగి
శిఖరాంతరప్రయాయిఖరాంశుసాన్నిధ్య
సుఖరంజితాబ్జినీస్ఫురితసరసి

కిసలయఫలలసదసమకుసుమవిసర
పరసతరతరువిహరణపరవరభృత

నికరమధుకరకలరవశుకకులముఖ
విహగముఖరవముఖరి యవ్వింధ్యశిఖరి" కవిరా 5-74.

“ముఖారి” రాగమును స్ఫురింపఁ జేయు, ‘విహగముఖరవముఖరి” ప్రయోగము గమనింపఁ యున్నది. సందర్భము గలిగినచోటనెల్ల తన గానకళాధీమంతతను ప్రకటించు కొన్నాఁ డీ కవి.

తనకుఁ బ్రత్యక్షమైన శ్రీమహా విష్ణువును స్తుతించుచు పురూరవు డొక దండకమును పఠించుట జరిగినది. “వైమానిక స్త్రీల సంగీతముల్ రంగు రక్తిల్ వహింపంగ నప్పంచమంబుం బ్రమాణించి యా మీఁదటన్ దైవతాంచన్నిషాద శ్రుతుల్నింపఁ గా లక్ష్యముల్ దెల్పు చందాన హేషా విశేషంబులం బృంహితంబుల్ చెలంగించు నుత్తుంగరంగత్తురంగంబులన్ భద్రమాతంగ యూధంబులం జక్కఁగా నెక్కి వెన్వెంట దిక్పాలక శ్రేణి యేతేర”[1] శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమైనట్లు వర్ణింపబడి యున్నది.

పంచమము, ధైవతము, నిషాదము — శ్రుతులతో వైమానిక స్త్రీలు గాన మొనర్ప, వారితో పోటీపడి, దిక్పాలకు లెక్కిన తురంగమాతంగములు, హేషా, బృంహితములచే లక్ష్యములఁ దెలుపు చున్నవని కవి వర్ణించినతీ రాతని గాన కళా ధీమంతతతోపాటు, లోకానుభవమును, సమ్యక్పరిజ్ఞానమును, రసజ్ఞతను చాటు చున్నది. శరత్కాలమున రాజన్యులు, అన్యరాజదమనమునకై యుద్ధప్రియులై దాడి వెడలుట లోకసహజము. కాగా శరత్కాలము, ప్రేయసీ ప్రియులకు ప్రణయ కేళీ సామ్రాజ్య విస్తరణ సమర్థము. అట్టి వేళ మన్మథుడు దాడివెడలుటయు సమంజసమే. కాగా కాముని ప్రయాణమందుభులెట్లు మ్రోయునో కవి, భావించి రసికశిఖామణుల కందించిన తీరు ప్రశంసా సహస్రముల కర్హమైనది.

“కాము ప్రయాణదుందుభుల కై వడిఁ దచ్ఛరదాగమంబునన్
వేమఱు మ్రోసె దిక్కుల నవీనఫలోదయనస్యమంజరీ
హామతి సంభ్రమద్విహరణార్థసముద్ధతి శాలిపాలికా
స్తోమ ఝణంఝణత్కటకశోభితహస్తచపేటనాదముల్” కవిరా. 4-80

1. కవిరాజ మనోరంజనము: 4-181.

శాలిపాలికాస్తోమ ఝణంఝణత్కృటక శోభిత హస్త చపేట నాదములు, కాము ప్రయాణ దుందుభుల కైవడి వేమఱు మ్రోసిన తీరు కవికిగల దేశీయాభిమాన ముద్ర, సహజసుందరమైన గ్రామీణ వాతావరణమును హృదయంగమ మొనర్చును.

ప్రతి పద్యమును సంగీత సాహిత్య సౌరభ్యములఁ బ్రసరింపఁ జేయు చుండుటచే యీ కవి ప్రతిభా విశేషమును చాటుట కెన్ని పద్యముల నుదహరించి నను తనివి తీరదు.

"సరసాతిశయసారసరసామభపధీర
తరసారఝంకారకరమదాళి
కలనాదకృత తాళకలనాయుతమరాళ
లలనాపురుషదాలలితకేళి
రటదాగమాభంగసటదాతతతరంగ
ఘటదాకృతిరథాంగపటలశాలి
పవనార్భకవినోదజవనాట్యకృన్మోద
భువనాద్భుతామోదకువలయాళి

ప్రకటనికటతటస్ఫుటపటుపటీర
విటపి పరిమళమిళితసపీనమృదుల
కదళికాతరువిగళితకలితశశిర
జఃపులినపాళి యొక్క కాసారమాళి" కవిరా. 4_85

కవిమౌళియైన యబ్బయామాత్యుని యీ కాసారమాళివర్ణనము సాహితీప్రియుల కెల్ల రకు హృదయాహ్లాదముతోపాటు, సరససంగీత శ్రవణానుభవమును సైతము కలిగించి అద్భుతామోదము నీయ సమర్థమై యున్నది. 'గానకళా ధీమంతుడ' నని యీ కవి చెప్పుకొనుట సత్యప్రకాశమునకే గాని స్వాతిశయముచే గాదు.

బహుముఖీనమైన శాస్త్ర పాండిత్యము :

కనుపర్తి అబ్బయామాత్యుడు బహుశాస్త్రకోవిదుడు. అతడు తనకు తెలిసిన శాస్త్ర జ్ఞానమును సంచర్భశుద్ధితోఁ దన కావ్యములందు చొప్పించి, అద్భుత ప్రజ్ఞా

విశేషమును ప్రదర్శించుటతోపాటు, ఆయా శాస్త్రములు భారతీయ జన జీవన వాహి లో నెట్లంతర్లీనమై విరాజిల్లుచున్నవో దృశ్యమాన మొనర్చి యున్నాడు జ్యోతిషము, సాముద్రికము, భరతశాస్త్రము, మంత్రశాస్త్రము, వేదాంతము, కామశాస్త్రము, రాజనీతిశాస్త్రము, ఆయుర్వేదము, యోగవిద్య మొదలగు ననేక శాస్త్ర విషయముల నెడనెడ తన కావ్యమ్వయమునందు సువర్ణ భూషణములందు మణిగణమును పొదిగి నట్లు రమ్యతరముగ గూర్చి యున్నాడు.

# 1. జ్యోతిషము:

భీష్మభూవరాగ్రామణి, వసుదేవ స్వామికి మ్రొక్కి, తన పౌత్రుని పుత్రికయైన రుక్మనయనను, అనిరుద్ధునకుఁ గూర్పవలయునని శుభలేఖఁ బంపగా, హర్షము మాకు నవశ్యమంచుఁ గ్రక్కునఁ బ్రతిలేఖఁ బంపి, యనుకూలపు లగ్నము నిశ్చయించినారట బలకృష్ణ ముఖ్యులు. వివాహమునకు శుభలేఖఁ బంపుట, లగ్నము నిశ్చయించుటనునవి తెలుగునాటి యాచార విశేషములు. కాగా లగ్నము నిశ్చయించుటకు జ్యోతిర్జ్ఞానము కావలయును. అబ్బయామాత్యునికిఁ గల జ్యోతిష పరిజ్ఞానము సాధారణమైనది కాదు.

శ్రీకృష్ణుడు బాణాసురునిపై దండెత్తిన ముహూర్తమును గూర్చి కవి చేసిన వర్ణన పరిశీలింపదగినది.

"పాపయుత త్రికస్థను శుభస్థితి కేంద్రము కార్యపూర్ణ దృ
గ్వ్యాపకముం గదా యని శరాననలగ్నము చంద్రహోర ను
ద్దీపిత పుష్కరాంశ గణుతించి విశేషముహూర్తమంచు మే
ధాపరిపూర్ణులైన వసుధావిబుధుల్ వినుతింప నయ్యెడన్" అని. 4-25.

ముహూర్తము విశేషమైనదని చెప్పుటకు, దగిన హేతువు లన్నిటిని జ్యోతిష శాస్త్ర పరిజ్ఞాన పరిపూర్ణుడగుటచేత యీ కవి చక్కగా చెప్పి యున్నాడు. మేధా పరిపూర్ణులైన వసుధావిబుధు లా ముహూర్తమును మెచ్చిరట. అది యట్టిది. పాపయుత త్రికస్థము, పాపగ్రహములైన రవికుజ శనులు లగ్నము (ముహూర్తము) నకు మూడింట లేక, ఆరింటనుండుట మంచిది. అట్లే శుభగ్ర

హములైన చంద్ర, బుధ, గురు, శుక్రులు కేంద్రములనగా 4, 7, 10 స్థానము లందుండుట శ్రేష్ఠము. కార్యమనగా దశమస్థానము. దానికి శుభగ్రహముల దృష్టి సంబంధముండ వలయును. (గ్రహము లన్నియు తామున్న లగ్నమునుండి, ఏడవ ఇంటిపై దృష్టిని ప్రసరించుచుండును. కాగా కుజగ్రహము 4, 8 స్థానములపై శనిగ్రహము 3, 10 స్థానములపై, గురుగ్రహము 5, 9 స్థానములపై విశేషదృష్టిని ప్రసరించుచుండును.) రాశినిబట్టి ప్రతి రాశియందు పూర్వార్ధ పరార్ధములకు సూర్యచంద్ర హోరయను విభాగముండును. అందు చంద్రహోర జయప్రదము. శరాసన లగ్నము శరాసనమనగా ధనుస్సు. యుద్ధమునకు బయలుదేరు ముహూర్తము (లగ్నము) ధనుర్లగ్నము. అది శ్రేష్ఠము. ఆధనువు బట్టి విజయము సాధింపదగిన యుద్ధమునకు, ధనుర్లగ్నములో బయలుదేరుట శ్రేష్ఠమని చెప్పుట యౌచిత్యతకు శిఖరాయమానము. లగ్నమునందు ముప్పది భాగలుండును. ఒక్కొక్క లగ్నమునకు ఒకభాగ శ్రేష్ఠమైనదిగా నుండును. దానిని పుష్కరాంశమందురు. ఆ వేళ నా పని చేసిన నా లగ్నమునందలి శుభ ఫలితము మరింత మిక్కుటముగ లభించును. కావుననే సమస్త విషయములను బరిశీలించి శ్రీకృష్ణుడు బాణాసురునిపై దండెత్తుటకు మేధా పరిపూర్ణులైన వసుధా విబుధులు సుముహూర్తము నిశ్చయించి యున్నారు. కావుననే తరువాతి ఘట్టమున శ్రీకృష్ణునికి, బాణాసురునికి పరమశివుని తోడ్పాటున్నప్పటికిని, విజయము లభించుటయే గాక, ఉషానిరుద్ధులు సగౌరవముగా, శోణపురమున వీడ్కొలు 'పడసి' ద్వారకా నగరమునకు విచ్చేసిరి. యుద్ధమునకు బయలుదేరు ముహూర్తము శ్రేష్ఠమైనదని యొక్క మాటతో వర్ణింపవచ్చునుగాని, కవికి జ్యోతిషమునందున్న విశేష పరిజ్ఞానముతో పాటు, అశేషాభిమానముకూడ నున్నది. కావుననే యిట్టి వర్ణనము. జ్యోతిష శాస్త్రమునందు మూడు భాగములున్నవి. ఒకటి సిద్ధాంత భాగము, (భుగోళ పరిజ్ఞానము, పంచాంగములు చేయుట, గ్రహణ నిర్ణయము, పంటలు, వర్షపాతము మొదలగు విషయములను గూర్చి చెప్పునది.) రెండవది ముహూర్త భాగము. (సమస్త కార్యములకు విశేషమైన కాలమును నిర్ణయించునది.) మూడవది జాతకభాగము, ఇది యొకా నొక సమయమున నుద్భవించిన వాని జీవిత గమనమును నిర్ణయించునది. గొప్పవారి జనన కాలము శుభోదర్కమై యుండును. శ్రీకృష్ణ

పౌత్రుడైన యనిరుద్ధునికి, ఉషాదేవికిఁ గలుగబోవు సంతానము వజ్రుఁడు. ఇతఁడు హరి పూర్ణాంశావతీర్ణాంగుడు. మరి యాతని జనన కాలవైశిష్ట్యమును కవి వర్ణించిన తీరు కడురమ్యము. ఇదియును అబ్బయామాత్యుని జ్యోతిష పరిజ్ఞాన ప్రాభవమును చాటుచున్నది.

"స్వక్షేత్రంబుల నుచ్చరాసుల హితస్థానంబులన్ దీప్తులై
యక్షీణుండగు చంద్రుఁ జూచుచు దినేశాదుల్ చరింపన్ సమ
గ్రక్షేమంకరలగ్నవేళ శుభయుక్తంబందు రాజాంశఁ బ
ద్మాక్షీరత్నము పుత్త్రిఁ గాంచె హరి పూర్ణాంశావతీర్ణాంగునిన్" అని 5-81.

వజ్రకుమారుని జననకాల ముహూర్తము (లగ్నము) మిగుల శుభ ప్రదమై యున్నది. శుభనక్షత్రమునందు రాజాంశలో జననము. సమగ్రక్షేమంకర లగ్న మట. అందలి విశేషమేమన, సూర్యుడు మొదలగు గ్రహము లన్నియు, స్వక్షేత్రమునందో, ఉచ్చరాశియందో, మిత్ర స్థానమందో మెలగుచు, అక్షీణుడు (పూర్ణ) చంద్రునిపై దృష్టికలిగి యుండుటచేత నా లగ్నము సమగ్ర క్షేమంకర మైనదని కవి చక్కగా వర్ణించి యున్నాడు. ఇట్టి ముహూర్తములు కోటి కొక్కటియున్న నెక్కువ. అందుచేతనే, వజ్రకుమారుని జాతకము సర్వశుభ లక్షణ లక్షితమని చెప్పక చెప్పుట. ఇట్లు చెప్పుట కీ కవికిగల జ్యోతిష విద్యా ప్రవీణత పనికి వచ్చినది. పురూరవ జననవేళా విశేష వర్ణనమును గూడ కవి యిట్లే జ్యోతిష పరిజ్ఞాన పరిపూర్ణ మొనర్చి యున్నాడు.

"సూచించెం బరమోచ్చ భాగ విహర త్సువ్యక్త వర్గోత్తమ
ప్రాచుర్యోచిత దృక్సమేత శుభదారంభగ్రహానుగ్రహం
బాచక్రాచల ధారుణీవలయ రాజ్యశ్రీయు దైశ్వర్య వి
ద్యాచాతుర్యగుణాది భావిఫలముల్ తజ్జన్మకాలంబునన్" కవిరా 2-188

"ఇతఁ డుదయించువేళ నమరేంద్రగురు ప్రముఖ గ్రహంబు లా
తతకళల న్వెలుంగు హిమధామునిఁ జూచుచునుంటఁజేసి ని
ర్జితరిపుఁడై ధరాస్థల మశేషము నేలెడు సార్వభౌముఁడై
యతులితకీర్తి నొప్పెడు మహావిభవంబునఁ బెక్కు వర్షముల్"
కవిరా 2-232.

గ్రహములు పరమోచ్చ భాగమునమందుట, వర్గోత్తమాంశలో నుండుట, శుభగ్రహ వీక్ష, గుర్వాదిగ్రహములు, పూర్ణచంద్రునిపై దృష్టి నెఱపుట, మొదలగు నంశము లన్నియు నొక లగ్నవేళా పై శిష్ట్యమును దెలుపునవి. ఇవి యన్నియు నొక్కచోఁ గూడి యుండుట సాధారణముగ సంభవింపదు. కాగా యిట్టి శుభలగ్నమునఁ బురూరవుడు జన్మించుటచేఁ గలిగెడు భావిఫలమును గూర్చి, పై పద్యములందు, కవి వర్ణించి యుండుట, యాతని జ్యోతిష విద్యా ప్రావీణ్యమునకును, దానియం దాతని కున్న యనంత గౌరవాభిమానములకు తార్కాణము. మేధా పరిపూర్ణ వసుధావిబుధాగ్రణి యాతడు.

## 2. సాముద్రికము :

ఈ కవికి సాముద్రిక శాస్త్రము నందును ప్రావీణ్యమున్నది.

"భుజ నేత్ర నాసికంబులు జాను హనువులు
నైదు దీర్ఘములు గోప్యాంగ కంఠ
జంఘలు మూఁడు హ్రస్వములు ఫాలము రొమ్ము
కటి మూఁడు వెరఁదలు కంఠనినద
మును నాభి కందంబు మూఁడుగంభీరముల్
ఫాల కటీ స్కంధ బాహు కుక్షి
ముఖము లా ఱున్నతంబులు బగుగుల్ఫ త్వ
గంగుళీ చరణంబు లైదు సూక్ష్మ

ములు దృగంత జిహ్వాధరములును నఖర
తాలు కర రేఖ లాఱు రక్తములు నైన
యట్టి మానవుఁ డధికభాగ్యాన్వితుండు
గాఁ నెఱుంగుము కుసుమమార్గణ కుమార" అని. 5_98

"వరలీల దక్షిణావర్త రేఖాయుత
భ్రూమధ్యుఁడు సమస్త భూమి నేలు

నైదు రేఖలు ఫాలమం దున్నవాఁడు దీ
ర్ఘాయుస్సమన్వితుం డైనవాఁడు
ఊర్ధ్వ రేఖలు పాదయుగళంబునందుఁ బెం
పొందు మానవుఁ డుత్తమోత్తముండు
తనర ముప్పదిరెండు దంతములఁ గల్గిన
యట్టి నరుండు భాగ్యాధికుండు

కంబుసన్నిభమైనట్టి గళమువాఁడు
విలసితంబగు కీర్తుల వెలయువాఁడు
కఠినమగు హస్తతలములుఁ గడు మృదుత్వ
చరణములు గల్గు మనుజుఁ డైశ్వర్యయుతుఁడు" అని 5_99.

పై రెండు పద్యములందు మానవుల భాగ్యాతిశయమునకు హేతువైన యవ యవ లక్షణములు చాల వరకుఁ జెప్పబడినవి. ఇన్ని శుభ లక్షణము లొక్కని యందుండుట లోక సాధారణము కాదు. కాని "శ్రీమన్నారాయణాంశోదయం డైన యిప్వ్రద్యుమ్నకుమారుని శరీరంబున నిటువంటి శుభలక్షణంబు లనేకంబులున్న యవి."[1] యని నారద మునీంద్రుడు శ్రీకృష్ణునితో వచించియున్నాడు. దీనిని బట్టి సాముద్రిక శాస్త్రవైశిష్ట్యము, దానియందు కవికిగల ప్రత్యయాభిమాన ములతో పాటు, యాతని యపార సాముద్రిక శాస్త్ర పరిజ్ఞానము వెల్లడియగు చున్నది.

'కవిరాజ మనోరంజన' మందు నైత మీ శాస్త్ర విషయ వర్ణనము గలదు. ఇచ్చటి వర్ణనమునందొక ప్రత్యేకత కలదు. పురూరవునిఁ గూర్చి ప్రశంసింపఁ దలంచిన వసిష్ఠు డాతనిని బిలిపించి, "తన సమీపంబున నాసీనుం జేసి, సాముద్రిక చిహ్నము లుపలక్షించి యిట్లనియె.

"రత్నగర్భకు వీని రాజీ కాజానుబాహస్తంభసీమ నిత్యాశ్రయంబు
వాగ్వధూటికి వీని వ్యాకోచహల్లక నవ్యజిహ్వాగ్రంబు నాట్యశాల

1. అనిరుద్ధ చరిత్రము : 5_101.

చింతామణికి వీని ప్రాంతరక్తవిశాల సుందరాక్షులు కేళిమందిరములు
స్పర్శవేదికి వీని భవ్యరేఖాశ్రయళయకుశేశయపాళి జన్మభూమి

సకల సౌభాగ్యలక్షణ స్వచ్ఛమైన
వీని నెమ్మేను లక్ష్మికి విడిది పట్టు
వీని సద్గుణసంపూర్ణ విమలహృదయ
నళినకర్ణిక సింహాసనంబు హరికి" కవిరా. 2-230

"నానాద్వీప నృపాలమౌళి నవరత్న స్నిగ్ధ కోటీర కో
భాపీరాజిత రాజితంబులగు నీ పాదంబు లందు న్నవ
శ్రీ నిత్యధ్వజవజ్రశంఖహలరాజీవాది తద్రక్తరే
ఖాసీకంబు కుమారశేఖర భవిష్యద్భాగ్యముం దెల్పెడున్" కవిరా. 2-231

మొదటి పద్యమందున్న యెత్తుగడయే వేరు. అజానుబాహువగుటచే వీని బాహువు రత్నగర్భకు (భూమండలమునకు) నిత్యాశ్రయము. లక్షణము, దాని ఫలము వరుస వెంటఁ జెప్పుటకు బదులుగా లక్షణమును గౌణమొనర్చి, లక్ష్యమైన ఫలమును పూర్ణవాక్యముగ వర్ణించిన విధము ప్రతిభాతుందిలము. రెండవ పద్యమునందు చెప్పబడిన, పాదములందలి, ధ్వజ, వజ్ర, శంఖ, హల రాజీవ చిహ్నము లాతని భవిష్యద్భాగ్యమును దెలుపునవని వర్ణించిన కవి యా భవిష్యద్భాగ్య మెట్టిదో, పూర్వార్ధమునందే వివరించుట విశేషము. ఈ కుమారుని యుత్తర జీవితమెంత మహోత్కృష్టమో, దాని నుపలక్షించు చిహ్నములు మునుముందే సూచించుచున్నవి. కావున కవి మరికొంత చమత్కరించి, మునుముందే (పూర్వార్ధమందే) యాతని భవిష్యద్భాగ్యమును వర్ణించి యున్నాడు. వసిష్ఠుడు సంయమీంద్రుండగుట చేత సాముద్రిక చిహ్నముల నుపలక్షించి భవిష్యద్భాగ్యమును చెప్పగలుగుటే గాక పురూరవుని సకల సద్గుణ సంపూర్ణ విమల హృదయనళిన కర్ణిక, హరికి సింహాసన మని భవితవ్యమును సూచించుట చిత్రము గదా! విమల హృదయము నెట్లు దర్శింపగలిగెను? అతడు సంయమీంద్రుడగుట చేత, నా పురూరవ కుమారుడు మహావిష్ణు భక్తుడు కాగలడని తన యపూర్వ దివ్యజ్ఞాన విలసితమైన యంతర్నేత్రమున దర్శించెనని సమాధానించుకొనవలయును. అహో యేమి మహత్త్వము.

మహాకవుల రచనలిట్లుండును. అబ్బయామాత్యుడు ధన్యుడు. అతని జననముచే కనుపర్తివారి వంశమే ధన్యమైనది.

## 3. భరత శాస్త్రము:

ఈ కవికి భరతశాస్త్రమునం దభినివేశాభిమానములే గాక ననితర దుర్లభమైన పరిజ్ఞాన విశేషమునుం గలదు. భరతుడను ముని దీనికాద్య ప్రవర్తకుడు. ఈ శాస్త్రము దేవలోకము నందును ప్రచలితముగ వ్యాప్తినంది యున్నట్లు కవి వర్ణించి దానికిఁ గురుతర స్థానమును చేకూర్చి యున్నాడు.

"వచ్చి పురుహూతునకు మ్రొక్కి వరమృదంగ
వాద్యరవహృద్యతాళానవద్యనాట్య
విద్య చోద్యంబుగాఁగ బ్రవిస్తరించి
పడఁతు లానరించి రప్పుడు భరతఫణితి" కవిరా 1-191,

ఇంద్ర సభలో నచ్చరలు, ప్రవిస్తరించినది భరతఫణితి. మృదంగము, తాళము, తోడు కాగా ననవద్యమైన నాట్యము చోద్యముగ నచ్చరలచేఁ బ్రవిస్తరించ బడినది. అవగా భిన్నరీతులఁ బ్రదర్శింప బడినది. కూచిపూడివారి భరతనృత్యము జగత్ప్రసిద్ధ మైనది. బహుశః అచ్చరలీనృత్యమునే దేవసభలోఁ బ్రదర్శింపగా, నద్దానిని జూచి వారు చోద్యము నందుట సహజముగ నున్నది. కవియేమి చేయలేడు! అతడు ద్రష్ట మరియు స్రష్ట. ఊర్వశి విరహార్తయై కృశించి యుండ, ఇతర యచ్చర లేమలు దేవలోకమున నృత్య మొనర్చిన పైనమును ఊర్వశి చెలులు మద్దళధ్వనివిని, గుర్తెఱింగిరి. వారెంతటి నృత్యకళా ధురీణలో గదా!

"నెఱపుచున్నది జక్కిణీ లయల్ హొయలుగా శశిరేఖ నాటకశాలలోనఁ
జూపుచున్నది జోగిణీ పంతు రంతుగా రంభ నాట్యగృహాంతరంబునందు
నాడుచున్నది కేళి హాళిఁ గోలాటంబు మంజుఘోషిణి లాస్యమందిరమునఁ
బలుపుచున్నది ప్రౌఢ జాడల గౌరవంజియుల తిలోత్తమ నృత్యనిలయసీమ

నాటపాటల సభలోన సాటి చెలులు
మించు మెప్పించుకొన నభ్యసించు పగలు
వింటివా తెల్పుచున్నది పెలంది వితతి
పర్ధళధ్వని ఓ త్తరక్రమంబు లెల్ల" కవిరా 8-88.

చిక్కిణీలయలు, తోగిణీపంతు, కోలాటము, కొరవంజియ, మొదలగు నాట్య విశేషము లెన్నిటినో కవి వర్ణించి యున్నాడు. కొన్ని యిప్పుడు వినికిడిలోనే లేవు. పర్ధళధ్వని వినుచునే నే యాట కే లయ యని గుర్తించు నేర్పు యూర్వశి చెలుల కున్నట్లు కవి వర్ణించి తన కా యా నృత్య విశేషముల లక్షణ పరి జ్ఞానము కలదని సూచించి యున్నాడు. నృత్యకళాభ్యాసము, సౌందర్య పోషకమని కవి వర్ణించిన తీరు సాహిత్యమునందొక చిత్రమే కాదు, రసికజనశ్లాఘాపాత్ర మనై యున్నది.

"చన్నులు పంకజకోశములు చక్కని చేతులు వల్లవాకృతుల్
నెన్నుదు రర్ధచంద్రరమణీయము ముష్టికరప్రమాణతన్
జెన్నగు మధ్య మంగములచే భరతాభినయం బెఱుంగనౌ
చున్నది నిన్నుఁ జూచినఁ దలోదరి యాటకు జాణవౌటనో" కవిరా 5,198

పురూరవు డూర్వశిని దర్శించి పల్కినమాట యిది. ఆమె నృత్యకళయందు జాణ. ఈ విషయము నాతడు గ్రహించిన తీరు చెప్పిన హేతువు గమనింపదగి యున్నది. ఆమె యంగములెల్ల సుందరములై విరాజిల్లుటకు, భరతాభినయమే కారణమట. ఇట్లనుటచే నామె సౌందర్యమెంత విశిష్టమో చెప్పుటయేగాక, ఆమెకు గల భరతాభినయకళా పాండిత్యమును ప్రశంసించుటయేగాక, ఆ కళకే యొక వైశిష్ట్యము నాపాదించుట జరిగినది. ఇది యతిశయోక్తియా కాదు. లోకమునందు త్యంతము సహజముగ దర్శితమగు చున్నదే. కవి దృష్టిపడిన వెంటనే దాని స్థాయి యాకసము నంటినది.

భరతముని ప్రతిపాద్యమైన 'భరత నృత్యము' లేదా కూచిపూడివారి 'భరతనాట్యము' స్వర్గమునకెక్కి, సెబాసనిపించుకొనుచుండ, రాక్షస రాజైన బాణుని కుమార్తె ఉషాదేవి పార్వతీదేవి గురుత్వములో నభ్యసించిన నాట్య

విశేషమును 'అఖిల దేశము వ్యాప్తి నొందించినదని కవి వర్ణించిన తీరు రమ్యాతి రమ్యము.

"వరన సంగీతంబు సంయుతావంయుత
హస్తాభినయము భావాభిరామ
వీక్షణ భ్రూలతా విభ్రమంబు, సపాద
తత్కాల కల్పిత తాళమాన
మైన లాస్యంబు కాత్యాయని యొద్ద బా
ణాసుర తనయ తా నభ్యసించె
నది గాన ద్వారకయందుఁ దద్విద్యాభి
లాషఁ బ్రార్థించు విలాసినులకు

దృఢముఁ గావించె సౌరాష్ట్రదేశ చంద్ర
వదన లా నీలవేణులంవలన నేర్చి
రా లతాంగులఁ దెలుప నంతంత కఖిల
దేశముల సర్వజనవచఃస్థితివి వెలసె" అని. 5-104.

ఆ యుషాదేవి యసాధారణ ప్రజ్ఞావిశేషము గలది.

"ఆడఁ బాడ నేర్చి యభినయింపఁగ నేర్చి
నరస కవిత చెప్పఁ జదువ నేర్చి
బాణదనుజపుత్రి బాలిక యయ్యును
సకల కళలయందు జాణయయ్యె" అని. 2-34.

సకలకళలయందు జాణ కావుననే తాను బాల్యమున నేర్చిన విద్యను మఱింపక అభ్యాసముచేఁ బెంచుకొని తన యత్తవారింటఁ దమ్ముఁ బ్రార్థించిన వారికి నేర్పఁ జాలినది. క్రమముగా నా నృత్యవిద్య, శిష్యపరంపరగా సౌరాష్ట్రదేశమునను, పిదప అఖిలదేశములందును వ్యాపించినది. అది యా విద్యావైశిష్ట్యము. తద్విద్యా ప్రవర్తకురాలైన పార్వతీదేవి గురుత్వ ప్రాశస్త్యము. కవి యిన్ని ధ్వనింపఁ జేసి యున్నాడు. ఉషాదేవి తండ్రి బాణాసురుడు. అతడు కూడ నృత్యకళయం

దత్యంతము కుశలుడు. భరతకళాధురీణుడు. సకలకళా కోవిదుడగునట్టి రాజును గూర్చి చెప్పనక్కఱయేలేదు. కళ భక్తికి తోడై దైవప్రసాదమునకు, తద్వారమున మోక్షమునకు హేతువెట్లగునో యీ కావ్యమే (అనిరుద్ధ చరిత్రము) ఉదాహరణము. "భవానీ మనోహరుండగు హరుం డఖండ తాండవ కేళిరతుండై ముఖరిత మృదంగంబును, రణితోపాంగంబును, సంగీత ప్రసంగంబును బరితోషితాశేషభూతాంత రంగంబును నగు నృత్యరంగంబున, దశప్రాణాత్మకంబును, మూర్తిత్రయ కళా రమ్యంబును లఘు గురు ప్లుత సమేతంబును దక తక ధిక తక ముఖ శబ్ద బంధురంబు నగు ధ్రువ మఠ్య రూపక ఝంపా త్రిపుటాటతాళైక తాళ సింహానంద చంచుపుటాది తాళంబుల, జతులు కడకట్టుకై మురి కళాసికల ద్రుత మధ్య విళంబి కాల పరిమాణంబుల దండ లాసక కుండలి ప్రేరణీ ప్రముఖ మార్గంబుల రంగ రక్తులు వహింప నాట్యంబు సలుపు నవసరంబున భరత కళాధురీణుండగు బాణుం డా పణవంబా రయంబునం బుచ్చుకొని శ్రుతి క్రమణంబు నిలిపి, తకధిమి కిట శబ్దాక్షర సముచ్చారిత ముఖుండగుచు గరప్రహారంబులం జిత్ర విచిత్రంబులై చెలంగు తాళవ్యాప్తులు ఘుమం ఘుమాయమానంబులై నాదబ్రహ్మంబు జనియింప, హృదయారవిందంబున కానంద సంపాదకంబై నెఱయ మొరయించిన నప్పరమేశ్వరు నాట్యంబు జగన్మోహనంబై ప్రవర్తిల్లెన్"[1] నాట్యము కమలముందు జరిగినట్లుగ శబ్ద విన్యాసముఁ గూర్చిన తీరు, అందున్న శాస్త్ర పరిభాష రసికుల హృదయమును చకచ్చకిత మొనర్పఁ జాలి యున్నవి.

ఇట్లు శాస్త్ర విషయమును వర్ణింపఁ జాలుటకుఁ గేవల శాస్త్ర పరిచయము చాలదు. విశేషమైన ప్రజ్ఞాపాటవము లవసరము. అతనికిఁ గల భరత శాస్త్ర పరిచయము సకలరసికజన మనోభిరామమైనది. కావ్యమునందు శివుడు బాణుని మెచ్చుకొన్న తీరు చిత్రమైనది. బాణుని వాద్య విద్యకు నపారముదంబును బొంది శాంకరీ ప్రాణవిభుండు 'మెచ్చితి దయన్ వరమిచ్చెద వేడు' మన్న, గీర్వాణవిరోధి 'నా నగరి వాకిటఁ బారిషదాళితోడ శర్వాణియు, నీవు భక్తజన వత్సల కావలి యుండవే కృపన్'"[2] వాద్య విద్యకు మోదించి శివుడు వరమిత్తుమ

1. అనిరుద్ధ చరిత్రము : 2-8.
2. " " 2-7.

వేడు మన్నాడు. బాణాసురుడు కోరిన కోరిక సామాన్యమైనది కాదు. శర్వాణితో సహా శివుని తన నగరి వాకిట కావలిగా నుండుమని కోరి యున్నాడు. శివసాన్నిధ్యమునకై చేయుట లోక ప్రసిద్ధము కాని వాద్య విద్యచేఁ బ్రసన్నమొనర్చుకొని, దైవసాన్నిధ్యమును తన కడకే రప్పించుకొన్న ఘనత బాణునిదే యనవచ్చును. అట్లనుటకన్న బాణుఁడన్నట్లు 'భక్తజనవశ్యులు' నగు శివుడేమి యీయఁ జాలడని ప్రశ్నించుకొని, శివకారుణ్య మనంతమని భావించుట లెస్స. కళాకౌశలము, శివ సాన్నిధ్యమును సాధించిన పైనమెంత రసరమ్యము ! అబ్బయామాత్యుడు కూడ తన సాహిత్య కళాకౌశలముచే, మంగళాద్రి నారసింహుని తన హృదయస్థునిగఁ జేసి కొని యుండుటచే నిది సంభవమే యని నమ్మఁదగి యున్నది. అన్ని కళల కన్న వాఙ్మకళ గొప్పది. దానిని సాధించిన కవివరేణ్యుడు కనుపర్తి అబ్బయామాత్యుడు.

## 4. మంత్రశాస్త్రము :

ఈ కవికి మంత్ర శాస్త్రమునఁ గల పరిజ్ఞానము సైతము సామాన్యమైనది కాదు. సమగ్రముగ తెలిసి, సమర్థముగ వర్ణించిన ధీశాలి యితడు.

"అమరారీశ్వరుఁడైన బాణున కమాత్యశ్రేష్ఠుడై బాహావి
క్రమకేళీ విధి రాహిత ప్రకరుఁడై ప్రౌఢిం జతుష్షష్టి తం
త్ర మహామంత్ర కలాపలక్ష్యపరుఁడై రాణిల్లెఁ గుంభాండ నా
మమునం దైత్యవరేణ్యుఁ డొక్కరుఁ డసామాన్యప్రభావంబునన్"

అని. 2_81

కుంభాండుడు బాణుని మంత్రి. ఇతనికి చతుష్షష్టి తంత్ర మహామంత్ర కలాపములు తెలియును. ఊరక తెలియుట కాదు. వాడు లక్ష్యపరుడు. అనగా వానిని సాధించిన వాడు. వాని కుమార్తెయైన చిత్రరేఖ కూడ తండ్రివలన నా మంత్ర తంత్రముల నెఱింగినది.

"వాని యనుగుఁ బట్టి వరసుందరాకార
రేఖ నొప్పుఁ జిత్రరేఖ యనఁగ

దండ్రివలన మంత్ర తంత్ర యోగ క్రియ
లభ్యసించి యుండు సాంగముగను" అని. 2-82

చిత్రరేఖ తండ్రివలన మంత్ర తంత్ర యోగ క్రియలను సాంగముగ నేర్చినది. సాంగమనగా ప్రయోగోపసంహార యుక్తముగనని తాత్పర్యము. ఆమె "తన సమ్మోహన విద్యచే జనుల నిద్రామగ్నులం జేసి" [1] ద్వారకా నగరి యందు తన యంతః పురమున నిద్రించిన యనిరుద్ధుని శోణనగరమునకుఁ గొంపోయినది. ఇది యంతయు సమ్మోహన మంత్ర విద్యా ప్రభావమే.

"ఘననభోంతరములఁ బూర్ణిభవించు త
మంబుల నుచ్చాటనంబు చేసె
వసతుల మెలఁగు జీవంజీవవిహాగక
దంబంబు నాకర్షణంబు చేసెఁ
గనగూడి చెలఁగు జక్కవల క్రీడావిలా
సంబులు సంస్తంభనంబు చేసెఁ
నలినమధ్యంబునఁ జెలువొందు కైరవా
రామంబుల వశీకరంబు చేసె

నలినపంక్తికి విద్వేషణంబు చేసె
దమ్మిరారాపెకల మారణమ్ము చేసెఁ
బొనఁగ వెన్నెల మంత్ర విభూతిఁ జల్లి
మహిమఁ జూపె సుధాకర మాంత్రికుండు" అని 8-18.

సుధాకరుడు మాంత్రికుడట. ఉచ్చాటనము, ఆకర్షణము, సంస్తంభనము, వశీకరము, విద్వేషము, మారణము, మంత్ర విభూతి చల్లుట మొదలగు శద్ధములఁ బ్రయోగించిన పైనమాతనికి గల మంత్రశాస్త్ర ప్రావీణ్యమును తెలుపు చున్నది.

"నాథు సుదర్శనంబువలనన్ మదనగ్రహమోక్షమయ్యె బిం
బాధరకున్ సుదర్శన మహామహిమం బిటువంటిదే కదా!

1. అనిరుద్ధచరిత్రము. 3-48

యీ ధరఁ దత్ప్రయోగమున నెట్లు గ్రహంబులు నిల్వవేర్పుఁ ద
త్సాధకులైన మాంత్రికులు సార మెఱుంగుదు రప్పు డిప్పుడున్"[1]

సుదర్శన మహా మంత్రము వలన గ్రహబాధ తొలగు నమట లోక ప్రసిద్ధి. సాధకులైన మాంత్రికు లీ విషయ మెఱుగుదురు. కాగా నా విషయము "అప్పు డిప్పుడు" అమట వలన నీతని మంత్రశాస్త్రజ్ఞత వెల్లడి యగుచున్నది.[2] అని శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రిగారు తమ యనిరుద్ధ చరిత్రము పీఠికలో వివరించి యున్నారు. మంత్రము సాధించు వా రాచరించు వివిధాంశములను గూర్చి గూడ యీ కవి చక్కగా వివరించి యున్నాడు.

"అకలంక చంద్రబింబానన యూరుదే
శంబుల వెంట సంచరణ చేసి
కోమలాంగి నితంబ భూమండలంబునకుఁ
గ్రమమూఱోఁ బ్రదక్షిణము లొనర్చి
మృగనేత్ర గంభీరమగు నాభిసరసిలో
నవగాహవక్రీడ లాచరించి
గంధసింధురయాన కఠినకుచోత్తుంగ
శైలాగ్రమునఁ బునశ్చరణ సలిపి

వదతి మందస్మిత సుధామదవత నిమి
షత్వమును గాంచెఁ గాని పాంచశరి చూపు
ల పునరావృత్తి మోక్షంబు నందవయ్యెఁ
గాముకులపుణ్యములుభోగకారణములు" అని 3-75.

ాంచశరి (ప్రద్యుమ్న కుమారుడైన యనిరుద్ధుడు) ఉషా సౌందర్యము ననుభ ంచుటతోఁ దృప్తినొందక, తన చూపులుఁ ద్రిప్పుకొన లేదు. కవి యతని చూపులు చరించిన తీరుమ, మంత్రసాధకుల చర్యల ననుకరించి యుండుటచే, కవి

1. అనిరుద్ధ చరిత్రము : 3-80.
2. " " పీఠిక: పుట. 57.

చమత్కరించిన తీరు తెలిపిన మంత్రశాస్త్రజ్ఞత వెల్లడించుచున్నది. సంచరణ, ప్రదక్షిణము, అవగాహన క్రీడ (స్నానము) పునశ్చరణ మొదలగు వాని ప్రయోగమే, కవికింగల మంత్రశాస్త్ర ప్రావీణ్యమును చెప్పక చెప్పుచున్నవి.

## 5. వేదాంతము :

ఈ కవి నిగమాంతరహస్యవేది. నియోగి బ్రాహ్మణుడు. అద్వైత తత్త్వ పరిజ్ఞాన పరిపూర్ణుడు. అనిరుద్ధ చరిత్రమునందు అనిరుద్ధుని మహిమా విశేషమును ప్రశంసించుచు, కవి వేదాంతోపన్యాసమును వచన రూపమున సుస్పష్ట మొనర్చి యున్నాడు. అద్వైత సిద్ధాంతమును చెప్పుచు 'సర్వంబును బ్రహ్మ మయంబు, ప్రపంచంబస్థిరం' బని తలంచి 'బ్రహ్మైవాహ' మ్మను వేదాంతసార వచనార్థంబు కేవల దృఢంబు గావించి, యెఱుక గలిగిన పురుషుండు తానె సాయుజ్య సిద్ధుండగు ననియు నిశ్చయించి, యాత్మానుసంధానంబు సేయుచు"[1] ననిరుద్ధుండె నని చెప్పి యున్నారు. అంతకు పూర్వము "అమ్మహానుభావుండైన అనిరుద్ధుండు మహైశ్వర్య సమృద్ధుండును, సకల భోగానుభవసిద్ధుండును, వేదోక్త కర్మానుష్ఠాన పరిశుద్ధుండునై, సంసార బద్ధుండునుంబోలి యుండె"[2] నని కవి వర్ణించుట చేత నొక విషయము స్పష్టమగుచున్నది. లోకుల కాతడు సంసారబద్ధుడునుం బోలె గాన్పించుచున్నాడేగాని, యాత్మజ్ఞాని యగుటచే జీవన్ముక్తుడని, తరువాతి వర్ణన వలన తెలియుచున్నది. బద్ధులు, ముముక్షులు, నిత్యులనని విశిష్టాద్వైత సిద్ధాంతమున జీవులు మూత్తెఱంగులు. ఇచ్చట కవి, యనిరుద్ధుడు 'బద్ధుండునుం బోలియుండె" నని వర్ణించుట చేత, యథార్థముగ నాతడు బద్ధుడు కాడని సూచన చేసి, తరువాత యతని మనోగత భావనను వర్ణించునప్పుడు, 'ఎఱుకఁ గలిగిన పురుషుండు తానె సాయుజ్య సిద్ధుండగునని చెప్పియుండుటచే (సాయుజ్య ప్రశంసచేత) నీ కవి యద్వైత సిద్ధాంతము నవలంబించి జ్ఞానియైన కవి తల్లజుడుగా మనకు దర్శన మిచ్చుచున్నాడు. తరువాతి గ్రంథమైన కవిరాజ మనోరంజనమునందు, సుదీర్ఘమైన వేదాంతోపన్యాసమును నారదుని చేత చేయించి, పురూరవునికి యాత్మవిద్యోపదేశ

1. అనిరుద్ధచరిత్రము. 5_108.
2. " " 5_108.

మొనర్చి యున్నాడు. ఈ వేదాంత బోధ ముప్పది యారు గద్యపద్యములలో సాగి యద్వైత సిద్ధాంతమును ప్రవచించుచున్నది.

"ప్రారబ్ధంబగు మేన నే యనుభవం బొచుండఁ ద త్సాక్షిపై
యారూఢస్థితి సర్వమున్ మఱచి సర్వావస్థలం జిత్సుధా
ధారాపానసుఖాప్తి సర్వగత శుద్ధబ్రహ్మ మే నంచు శం
కారాహిత్యము మానమీ యదియ మోక్షప్రాప్తి భూవల్లభా" [1]

పై బోధ పురూరవునియం దద్భుతముగ ఫలించినది. పురూరవుడు విష్ణు సాక్షాత్కారమునుఁ బడయుటయే గాక, సదాచారవర్తనుడై, న్యాయార్జిత విత్త సౌఖ్యానుభవము నొంది, దివ్యాంగనా భోగాప్తివడసి, ధర్మార్థ కామమోక్ష పురుషార్థ సిద్ధి నొంది "శ్రీవాసుదేవాంఘ్రి చింతనామృతధారఁ బొరయు బ్రహ్మానంద పూర్తివలన"[2] వంకల్ప సిద్ధినిఁ బడసి యుండుట మిగుల ప్రశంసింపఁ దగియున్నది. భూపాలకుల కెల్ల నేవం విధ జీవన మార్గదర్శమై సకలార్థ సిద్ధిదమై జగద్ధిత సాధకమై యుండుట లెస్స.

## 6. యోగశాస్త్రము :

కనుపర్తి అబ్బయామాత్యుడు శ్రీ విద్యోపాసకుడుగా కనిపించుచున్నాడు. యోగవిషయమున నితనికెంత యభిమానమో అతని కావ్యములే సాక్ష్యమిచ్చుచున్నవి.

బాణుని యమాత్యుడైన కుంభాండుని వలన యతని కుమార్తెయైన చిత్రరేఖ మంత్ర తంత్ర యోగ క్రియ లభ్యసించినదని కవి వర్ణించి యున్నాడు.[3] అనిరుద్ధుని మొదటి సాతిగా దర్శించిన యుషాబాలను వర్ణించుచు కవి చేసిన వర్ణన 'నభూతో నభవిష్యతి'. "అక్కోకకుచ తన రుచిరావలోక నంబులు పరమ

---

1. కవిరాజమనోరంజనము. 1_178
2. " " 5_287
3. అనిరుద్ధచరిత్రము. 5_82

శాంతుని హృదయంబునుం బోలె దత్సౌందర్య లహరీ మగ్నంబై యానంద లహరిం దేలుచున్నన్"[1] అనుటలో సౌందర్య లహరీ ప్రశంస, శంకర భగవత్పాదుల సౌందర్య లహరిని గూర్చి యుద్దేశించినదే. కాకున్న పరమ శాంతుని హృదయ మెట్లుపమానము కానేర్చును? ఆనందలహరి, శివానందలహరీ స్తోత్రము గాక మరియొక్కటి కాదు. ఇట్టి వ్యంగ్యరచన మరొండు చోట గావ్పించదు. సౌందర్య లహరి యందుఁ బ్రతిపాదింపబడినది శ్రీ విద్యా విషయమే. కావున శ్రీ విద్యోపాసకుడనుట సుస్పష్టము. శోణపురమున అనిరుద్ధుడు మేల్కాంచి తానున్నది "ద్వారకలోని వజ్రహర్మ్యము గాదా? [2] యని విస్మయొందుట జరిగినది. ద్వారకలో తానున్నది వజ్రహర్మ్యమట. శ్రీవిద్యాధిదైవతమైన లలితాదేవికి "వజ్రేశ్వరీ" నామ మొకటి యున్నది. "షష్ఠీతిథి నిత్యా జాలంధర పీఠాధిష్ఠాత్రీ వజ్రేశ్వరీ, అథవా శ్రీ పురస్య ద్వాదశః ప్రాకారో వజ్రమణిమయః తస్యైకాదశద్వయమధ్యే వజ్రాఖ్యా నదీ"[3] అని శ్రీలలితా సహస్రనామ భాష్యమునందు దేవికి వజ్రసంబంధము కలదు. అంతేకాదు యామె యాయుధములలో నొకటి వజ్రము. ఆ సూచన కూడ నిట నున్నదని చెప్పుటయే ప్రస్తుతాంశము. శ్రీ కృష్ణుడు బాణాసురునిపై దండెత్తిన సందర్భమున నాతడెక్కిన రథమును కవి "మహిత లోచన దుర్నిరీక్షణ కాంతుమాలి కోగ్ర సహస్రార మండితంబు"[4] అని వర్ణించుట కేవలము శ్రీవిద్యా సూచనయే. పురూరవునికి నారదమహర్షి యాత్మ విద్యోపదేశము చేయుచు, చిత్సుధాధారాపాన సుఖాప్తి సర్వగత శుద్ధ బ్రహ్మమేవంచు"[5] భావించినట్లు వర్ణించుట జరిగినది. ఇచటి చిత్సుధాధార సహస్రారముమండి జాలువారు సుధా ధారయే కాని మరొండు కాదు. "సుధాసారాభివర్షిణీ" యని శ్రీలలితా నామము. "సుధాయాః తత్కార్ణికా చంద్ర సంబంధిన్యాః ఆ సారోధారా సంపాతః తమభివర్షితుం శీలమస్యాః"

---

1. అనిరుద్ధచరిత్రము. 2_135
2. " " 4_63
3. శ్రీలలితా సహస్రనామభాష్యమ్. పుట. 268
4. అనిరుద్ధచరిత్రము. 4_28
5. కవిరాజమనోరంజనము. 1_173

అమృతస్య ధారా బహుధా దోహమానం చరణం నో లోకే సుధితాం దధాత్వితి శ్రుతేః"[1] అని శ్రీభాస్కరరాయల వ్యాఖ్యానము. "సుధాస్రుతిః" అని మరియొక శ్రీలలితా నామము "సుధాయాః సహస్రార కర్ణికా చంద్రగతాయాః స్రుతిః స్రవణం యయా కుండలి న్యాసా సుధాయాః స్రుతి రేవ వా, డాకిన్యాది మండలా న్యాప్యా యయంతీ సా క్రియైవ భగవతీత్యర్థః యద్వా, ప్రసిద్ధం చంద్రమండలా ద్వహ్ని రవ్యాది తృప్తి జనితా పీయూషవృష్టి రేషై వేతి "దశభిః పంచభి శ్చైవ సుధా మృత పరిస్రవైః కృష్ణపక్షే సదా పీత్వా జాయంతే పీవరా స్సురాః త త్పర్వం కాంభవీ మా" యేతి వాయు పురాణాత్ జ్ఞానార్ణవే శక్తిబీజ సాధనే, "స్రవత్ పీయూషధారాభి ర్వర్షంతీం విషహారిణీం" ఇతి యత్ ధ్యాన ముక్తం తాదృశరూప వతీ తివా"[2] ఇత్యాది వ్యాఖ్యానములచే శ్రీవిద్యాధిదైవత మైన లలితాదేవీ స్మరణము కావ్యమునందచ్చట సందర్భ శుద్ధితో, గవి సమర్థముగ వర్ణించి యున్నాడు. మిత్రావరుణుల తపస్సును వర్ణించుచు కవి వాచ్యముగ శ్రీవిద్యా నామాంతరమైన కుండలిని సాధించి "అధారాది షట్చక్రంబుల సగుణ విచా రంబును హృత్కమ లాంతర్జ్యోతి యందు చిత్తంబు లీనంబగుటయు, భ్రూ మధ్య చిత్కళా చింతనంబు వాదియగుధ్యానంబున నిరూఢులయి, యద్వితీయంబయి సర్వపరిపూర్ణంబైన బ్రహ్మంబు తానయై యుండు సమాధి యందుఁ బరమా నందులయి పరమ శివోపాసనఁ జేయుచుండిరి"[3] అని స్పష్టముగ శ్రీవిద్యో పాసనము వివరించి యున్నాడు. ఏవంవిధ వర్ణనచే ఏ కవి శ్రీవిద్యోపాస్తి నెఱిగినవాడని చెప్పుట యతిశ యోక్తి కాఁ జాలదు. పై పెచ్చు యథార్థము నుగ్గ డించినట్లగును.

## 7. కామశాస్త్రియము :

ఈ కవికి కామశాస్త్రంబు నందును తగినంత పాండిత్యమున్నదని తోచు చున్నది. ఉషానిరుద్ధుల ప్రణయకేళిని వర్ణించుచు కవి చేసిన వర్ణన మిందుకు

---

1. శ్రీలలితా సహస్రనామ భాష్యమ్ : పుట 88
2. " " " పుట 454
3. కవిరాజ మనోరంజనము 4_8

నిదర్శనముగా నున్నది. ఉషానిరుద్ధులు "గ్రామ్యవేణుదారితఖల్లరీ ముఖేంద్రాణి జృంభితాదికరణంబుల స్త్రీ పురుష రూపంబులఁ జిత్రించిన కేళీ చిత్రపటంబు లవలోకించుటవలనఁ గూటములకు గ్రొత్తరికంబు సంపాదించు"[1] చుండిరని కవి వర్ణించి తనకుఁగల కామశాస్త్ర పాండిత్యమును వెల్లడించి యున్నాడు. అట్లే యూర్వశీ పురూరవుల రతికేళిని వర్ణించిన సందర్భమున సమరతిని గూర్చిన వివరణ మాతని కామశాస్త్ర పాండితిని వెల్లడించుచున్నది.

"యుగపత్ప్రచుంబి తాన్యోన్య వీటీ సు
గంధాధరపుట చూత్కృతాభిరామ
మేకదా సంవీక్షి తేతరేతరముఖ
వ్యాకోచ నిర్నిమేషాంబకంబు
సాంగత్యకూజి తాంచ త్పరస్పర కంఠ
మణితస్వ నావ్యక్త మధురిమంబు
సమకాల గాఢబద్ధ మిథో భుజాబహ
దంకపాళీ మిళ దవయవంబు

సహనట ద్వంద్వ సమరతి సమయచటుల
అవ పునః పునరాహూత శబ్ద రచిత
శాశమానంబు తత్సురతంబు మిగుల
సౌఖ్యకరమయ్యె వన్నెలజాణలకును" కవిరా. 5_212

## 8. చిత్రలేఖనము:

చిత్రలేఖన కళయందీ కవికి యెనలేని యభిమానముతో పాటు చక్కని యనుభవజ్ఞానము పైతముఁ గలదు. అనిరుద్ధ చరిత్రమునందీ కళకు ప్రతీకగా చిత్రరేఖా పాత్ర సృష్టియే పరమ ప్రమాణము. చిత్రరేఖా సామర్థ్య మపూర్వమైనది.

1. అనిరుద్ధ చరిత్రము 2_94

"వ్రాత కజుఁడు కర్త వ్రేఁతకు దాఁ గర్త
యనుటకిది విరోధమైన నేమి?
పేఁత కజుఁడు కర్త వ్రాఁతకుఁ దాఁ గర్త
యంచుఁ జిత్రరేఖ నవఁగవచ్చు" అని. 2-98

త్రిభువనంబులం గల్గు పురుషశ్రేష్ఠుల లిఖియించి, యుషాదేవి ముందుంచినది చిత్రరేఖ. "నజీవ చిత్రములఁ బిలిపిన యట్లు వ్రాసె, రమణిమణి నేర్పు వచింప శక్యమే"[1] యని కవి యాశ్చర్యచకితుడై యామె వ్రాఁతకుఁగర్త, పేత కజుడు కర్త యని లోకవిరుద్ధమైనమ నరే నిశ్చయించు కొన్నాడు. "సామాన్యంగా బ్రహ్మ ప్రతి జీవికీ నొసట మంచో చెడ్డో వ్రాస్తాడు. అంతవరకే ఆయన పని. ఇక చేజేతులా ఏవేవో కర్మలు చేయడం ఆయా జీవుల పని. ఇక్కడ ఈ సంప్రదాయం మారింది. ఇక్కడ వ్రాతకు చిత్రరేఖ, చేతకు బ్రహ్మ బాధ్యులు. చిత్రములు వ్రాసి తేవడం చిత్రరేఖ పని, ఇక ఉషకూ ఆ చిత్రములలో, ఉషమ కలలో ఏవేవో ఆగడపు పనులు చేసిన అసామీ ఉండి, ఆయనగారు ఉషకు పతి కావడం అనేది బ్రహ్మ చెయ్యవలసిన పని"[2] అని శ్రీ యామిజాల పద్మనాభస్వామి గారు చక్కగా వివరించి యున్నారు. అట్టిది విశిష్ట కళానిలయ చిత్రరేఖా పాత్ర.

పురూరవునికి యూర్వశీ సౌందర్య దర్శనమైనగాని వారి సమాగమము సిద్ధింపదను నూహ చేసిన త్రైలోక్యవర్తి నామ శుకముఖ్యుని యుపదేశము మేరకు "శిల్పకళా విశేషంబున వలంతి యగు చిలంతి యొక్కతె యన్నెలంత రూపంబు శృంగార రసానురూపకంబుగా లిఖియించి"[3] నదట. శృంగార రసాను రూపకంబుగా చిత్రించుట సామాన్యమైన విషయము గాదు. ఈ కవికి చిత్రకళ యెడ గల యభిమాన మీ వర్ణనలు తెలుపుచున్నవి.

---

1. అనిరుద్ధచరిత్రము. 2-97
2. " " పీఠిక - పుట. 84
3. కవిరాజమనోరంజనము. 5-19

## 9. రాజనీతిశాస్త్రము:

రాజుల తిరస్కరించి, రాజగోపాలునకు తన ప్రౌఢ కావ్యము నంకిత మొనర్చిన కవిరాజు అబ్బయామాత్యుడు. ఇతనికి గల రాజనీతిశాస్త్ర పరిచయ మఖండమైనది. కవిరాజ మనోరంజనమునందు నారద మహర్షిని ప్రవేశపెట్టి యతని చేత, పురూరవునకు రాజనీతిని, ఆత్మ విద్యను బోధింపఁ జేసినాడు. దీనినిఁ బట్టి కవి, రాజైన వాడు రాజనీతితో పాటు, ఆత్మవిద్యా నిధియై యుండిననే, లోక కల్యాణము తథ్యమని విశ్వసించినట్లు గాన్పించును. కావుననే, ఈ కవి నారదుని నోట చివర వినిపించిన హితోక్తులు సర్వరాజన్య శిరోధార్యములు.

"సకలమును జిన్మయముగ దృశ్యములు మది క
దృశ్యములుగాఁ దలంచి నిష్పృహతఁ
వర్తిపై దైవగతి నేలవలయు రాష్ట్ర
మేల మనహంకృతిని శంక యేల నీకు" కవిరా. 1_175

పదునొకొండు పద్యములలో (రాజనీతి) నీ కవి వర్ణించిన రాజనీతి సజ్జన సమ్మత మైనదేగాక సకలలోక క్షేమంకరమైనది.[1] రచనయు, పొందికగా గూర్చిన నేర్పును బహుధా ప్రశంసింపఁదగి యున్నవి.

"కలిమి కొలంది కీవి, గమకంబు కొలందిఁ బ్రవర్తనంబు, దో
ర్బలము కొలందిఁ బూన్కి, యనురక్తి కొలంది సమాదరంబు, మే
లొలయు కొలంది యత్నము, నియోగి కొలందిని భార మీగియుం,
దెలివి కొలంది మాటయు నతింపఁగ యోగ్యతఁ దెచ్చు నేతకున్"[2]

నేతకు యోగ్యతఁ దెచ్చు గుణములను వాని కొలదులను దెలుపుచు, ఈగి విష యమునఁ గొలదులు నిశ్చయింపక నీడుట యాతని యౌచిత్యతా గుణమునకుఁ బ్రతీక. అంతియే కాదు. బోధ యొక్కటియే నిశ్చయముగ ఫలము నీయజాలదు.

---

1. కవిరాజమనోరంజనము. 1_118 నుండి 128
2. " " 1_128

పరి మహాత్ముల బోధలు వ్యర్థము లగునా? కాజాలవు. కాజాలవని చూపుటకే యీ కవి వారదునిచే పలికించి బోధలకు సమాచరణమును సైతము వర్ణించి కృతకృత్యుడైనాడు.

"తా నెంత యధికుఁడైనం
గావి మనుజేశ్వరుండు కార్యాకార్య
జ్ఞానము విబ్ర ప్రధానుల
తో నాలోచించి యుక్తితో నెఱుఁగఁదగున్" 1

మొదట ఇది, బోధ, దీనికి యాచరణము తుదిని.

"ఆ దురితంబుచే నృపతి యానసీమ వికారభావ ము
న్నాదరమైన నాప్తులగు బ్రాహ్మణముఖ్యులతోడఁ దెల్పినన్" 2

ద్వారక నారభ్యంగస్నాన మొనర్చుటచేఁ బాపము ఘటిల్లినది. దానినిఁ బాపుకొనుటకు కార్యాకార్య జ్ఞానము నెఱుగుటకై, యాప్తులగు బ్రాహ్మణులను విచారించి వారట.

"తన రాజ్య మొరుల రాజ్యం
బనవలవదు బుద్ధికుశలులగు చారులఁ బం
చి నిఖిల వార్తలు నిచ్చలు
విను టొప్పును భూవిభుండు విశ్రుతమతియై" కవిరా. 1-122

ఇది ప్రథమాశ్వాసమున బోధ. దీనికి సమాచరణము పంచమాశ్వాసమున గలదు.

"పేరోలగమున నుండఁగఁ
జారులు దేశాంతరములఁ జరియించి రయం

1. కవిరాజ మనోరంజనము 1-119
2. " " 4-149

బారఁ జమదెంచి మ్రొక్కిన
వారల మన్నించి మమతవల్లభుఁ దెలిమిన్" కవిరా - 5-50

"లోకవార్తా విశేష సంశ్రవణకుతూహల సూచనా లక్షణంబు లయిన
కటాక్షవీక్షణంబులం గమంగొనినాడు" కవిరా. 5-51

రాజనీతి శాస్త్రముతోపాటు నేర్చిన యాత్మ విద్యను సైతమీ రాజేంద్రుడు ఆచరించి చూపియున్నాడు. అతని జిజ్ఞాసా రూపమైన ప్రశ్న యెనిమిది పద్యములలో (1-131 నుండి 138) వర్ణించి, తత్సమాధానముగా యాత్మ విద్యా రహస్యములనెల్ల ముప్పది నాల్గు గద్య పద్యములలో సాకల్యముగ (1-140 నుండి 173) బోధించగా, పురూరవుడు తన జీవితమెల్ల వాని కనుగుణముగ నడచుకొని, శ్రీ మహావిష్ణువును ప్రత్యక్షీకరించుకొని, ముక్తినే కోరియున్నాడు, పాపనాశనము, దివ్యవనితా లాభము, సుపుత్రావిర్భూతి, రాజ్యపాలనము, తుదిని వైకుంఠ ప్రాప్తిని, శ్రీమహావిష్ణు వాతనికి వరముగానిచ్చి యున్నారు. ఇట్లీ కవి వర్ణించిన బోధలు వదాచరణముచే ఫలసిద్ధి నందియుండుట మిగుల నౌచిత్య భరితములై, కవిరాజ మనోరంజకములై యున్నవి.

## 10. శకున శాస్త్రము:

శకున శాస్త్రమును సైతమీ కవి వదిలి యుండలేదు. నిర్జర విరోధియైన బాణాసురుడు, శ్రీకృష్ణునిపై దండు వెడలి నప్పుడు కొన్ని యపశకునములు కనిపించి యతని యపజయమును సూచించినవట.

"ఇట్లు చతురంగసేనాసమేతుఁ డగుచు
నరిగె నెడనెడఁ బొడఁగాంచు నాపజయిక
శకునముల నాత్మలోపల నరకు గొనక
దురభిమానంబు పేర్మి నిర్జరవిరోధి" అనిరు. 4-52

దుశ్శకునములనేల వర్ణింపవలయునని భావించెఁ గాబోలు, కవి యచ్చట వానిని

వర్ణించి యుండలేదు. శుభ శకునము లెదురయ్యేనేని యూరకొనునా? పురూరవుడు చిత్రవనముఁ జూడనేగునప్పుడు చక్కని శుభ శకునము లెదురైనవట.

"కోమల గంధవాహ మనుకూలగతిం బ్రసరించెఁ బుణ్యకాం
తామణి పూర్ణకుంభ యుగ ధౌత దుకూల ఫలప్రసూన ము
ఖ్యామల వస్తుపుంజ మెదురయ్యె సువర్ణ పయో విహంగముల్
వామదిశాగతిన్ మెలఁగె వల్లభ మల్లము వల్లవింపఁగన్" కవిరా. 5,70

ఇంతటి శుభశకునము లెదురైనవి కావుననే పురూరవునకు దివ్యవనితయైన ఊర్వశీ సమాగమము సిద్ధించినది.

## 11 ఆయుర్వేదము :

ఆయుర్వేదము పైత మీ కవికి కరతలామలకమే. మలయానిలోపాలంభన వేళ కవి వర్ణన మత్యంతము రసరమ్యము.

"వాతవిధ్వంస నరసాఖ్య వటలు నౌష
ధంబు నాగేంద్ర మనుమంత్రితంబుఁ జేసి
వలయు నీ పైఁ బ్రయోగింప మలయపవన
మందు మంత్రంబులను గాని మట్టుపడవు" కవిరా. 3-189

'వాతవిధ్వంస' మొక యౌషధము. వాయువును నశింపఁ జేయునదను వర్ణమున మలయ పవమ నిరోధింప సమర్థమనుట కవి ప్రౌఢోక్తి. నాగము, వాయువు నాహారముగా గలది గనుక నాగేంద్ర మంత్రముఁ గూడఁ బ్రయోగించినాడు. ఇది మంత్ర శాస్త్ర విషయము.

ఈ కవి యొక కాల భిషగ్వరుని ప్రసాదించి యున్నాడు. ఇతడు సామాన్య వైద్యుడు కాడు. విశేష ప్రజ్ఞాశాలి.

"మార్తాండౌషధసేవచేతను జగ న్మర్త్యుండు ప్రాలేయ శీ
తార్తిం బాసి తదీయ వైకృతివిధాహం బొందఁ ద ద్బాధ వి

ర్వర్తింపం గ్రియచేసె యుక్తి చెలువారం బూర్ణచంద్రోదయ
స్ఫూర్తిం గాల భిషగ్వరుండు వయిపై జ్యోత్స్నారుచుల్ దేరఁగన్”

కవిరా. 5_184

జగత్తను మర్త్యుడు మార్తాండుడనే ఔషధమును సేవించి శీతార్తినిఁ బాపుకొన్నాడు. మార్తాం డౌషధమనగా సూర్యావర్తియను మందు. దానిని సేవింపగా వేడిఁ బుట్టుట లోకధర్మము. దానిని నివారించుటకు పూర్ణచంద్రోదయము కావలసి వచ్చినది. దానిని కూడ కాల భిషగ్వరుడు ప్రసాదించి తద్బాధను నివారింపఁ జేసినాడు. పూర్ణ చంద్రోదయము 'చలువజేయు' నౌషధము. ఆయుర్వేద రహస్యము లెఱింగిన వారే యిట్లు వ్రాయగలరు. కాలభిషగ్వరుడు 'యుక్తి' చెలువార నీ పని సాధించినాడు. ఇచ్చట కవి తనదైన 'ఉక్తి' చెలువార నీ వర్ణన మొనర్చి, కవిరాజ మనోరంజన మొనర్చి యున్నాడు.

అప్పయామాత్యునికిఁ గల బహుశాస్త్ర పరిజ్ఞానము. అనిరుద్ధ చరిత్రము కవిరాజమనోరంజనము నీ రెండు గ్రంథములం దెడనెడ సువర్ణ భూషణమునఁ బొదిగిన మణిగణము వలె హృద్యమై, కవిరాజ మనోరంజకము లగుట తెలుగుల యదృష్టము.

## తెలుఁగుదనము :

భాషాభిమానము :

ఈ కవికి తాను పుట్టిన నేలపై నెనలేని యభిమానమున్నది. తన జాతి యౌన్నత్యమును చాటవలయునను కృత నిశ్చయమున్నది. తన జాతి సల్లక్షణములనెడ నెడ కావ్యములందుఁ జొప్పించి, వర్ణించుటచే నీతనికిఁ దెలుగునేలపై గల యపారమైన ప్రేమ కొనియాడదగి యున్నది. సందర్భము గల్గిన చోటనెల్ల, తెలుగువారి జీవన విధానమును ప్రౌఢముగ చిత్రించి యున్నాడు.

“నెంఁత చిక్కకు మాట నేర్పుచో 'గీర్వాణ'
భాషలోనఁ 'దెనుంగుఁ' బల్కు గలియు” అని. 2_78

ఉషాకన్య చిల్కకు మాటలు నేర్పుచు దేవ భాషయైన 'గీర్వాణ' మునకు బదులుగా మనసు సరిగా లేకుండుటచే 'తెనుంగు' పల్కు నేర్పునట. ఇట్లనుటచే ఉషాకన్య సావధానయైనచో గీర్వాణభాష నేర్పెడిది. అట్లు గాక నగలపుఁ జింత చేత నవధానము లేక సహజమైన 'తెనుంగు' పల్కు నేర్పినదని విశేషము. ఇట్లను టచే నుషాకన్యకు తెనుంగు సహజమని గీర్వాణ మభ్యాస సాధ్యమని తెనుంగు సహజము. ఉషా కన్యకా ? ఏమో కాని, అబ్బయామాత్యునికి సహజము. ఇది యాతని మాతృభాషాభిమానమును వెల్లడించుచున్నది. ఈ కవికి తెలుగువారిపై గల యభిమాన మనన్య సదృశమైనది.

తెలుగువారిపై యభిమానము :

పురూరవుని సేవించుటకు వచ్చిన వారిలో నాంధ్రులు లేరు, "ప్రభుసేవా సమాగత సంకీర్ణ కర్ణాట లాటవరాట కాంభోజ కాశ్మీర కుకురు కురు గాంధార సౌవీర సౌరాష్ట్ర మగధమద్ర మాళవ నేపాళ బంగాళ కళింగ ద్రావిడ కేరళ గూర్జర ప్రముఖ నానాదేశ"[1] ముల వారున్నారు కాని యాంధ్రులు లేరు. వారు పురూరవుని సేవ కేగలేదు, ఏగలేదనుటకన్న, నేగినట్లు వర్ణించుటకు కవి హృదయము నందలి మాతృదేశాభిమాన మడ్డు వచ్చినది కాబోలు.

తెలుగువారి నివాసములు అలంకరణము :

తెలుగువారి కమ్మటిండ్లను గూర్చి చెప్పుచు, వర్షాకాల వేళ తెలుగువారు "పైఁ జలిసోఁక కని కమ్మటిండ్లలో ముచ్చ ముడిఁగి"[2] నారని వర్ణించి పైఁ జలిసోకని మగుణము గలవని మెచ్చుకొన్నాడుకవి. వీనినే కవి "మారుతంబు పై నొలయని యిండ్ల"[3] నియు వర్ణించి వాని ప్రాశస్త్యమును చాటి యున్నాడు. ఇక యలంకరణమును నట్టిదే.

---

1. కవిరాజ మనోరంజనము 1-88
2. " " 4-29
3. " " 4-138

"ఘనసార కస్తూరికా జలసారంబు
చెలువంపు వీథులఁ జిలుకరించి
గమకంబులైన ముక్తాఫలంబులతోడ
లీలతో రంగవల్లికలఁ దీర్చి
వరరత్న భూషణాంబర సుగంధద్రవ్య
పుంజంబు లంగళ్లఁ బొందుపఱిచి
కదళికా స్తంభముల్ ఘన చిత్ర పటములు
నుభయ పార్శ్వములఁ బెంపొంద నునిచి

ద్వారములయందుఁ దోరణావళులు గట్టి
పరిమళము మించు నగరు ధూపములు వైచి
నృత్త గీత వాద్యాదుల నెఱవఁ జేసి
యమిత శృంగార మొనరించి రప్పురంబు" అని. 5_58

నూతన వధూవరులైన యుషానిరుద్ధులు ద్వారకకు వచ్చు సందర్భమునఁ జేసిన యలంకరణము, తెలుగునేల మత్సవముల వేళఁ జేసెడిదేగాని మరొండు గాదు.

ఆహార పానీయములు — అలవాట్లు :

తెలుగువారి యాహార పానీయములే పురూరవుడు భుజించినట్లు కవి వర్ణించుట తనవారిపై గల యభిమాన సూచనమే.

"గారెలు బూరెలు కండ మండెంగ ల
ప్పంబులు మొదలైన భక్ష్యములును
సరసాన్నమును బాయసమ్ము సూపము శాక
ములు మొదలైనట్టి భోజ్యములును
పడిదెంబు లానవాల్ పరిపక్వ ఫలములు
మరసముల్ మొదలైన చోష్యములును
బహువిధంబుల నొప్పు పచ్చళ్లు తేనియ
ల్పిగరులు మొదలైన లేహ్యములును.

నారికేళోదకంబు పానకము వల్ల
నీరు మొదలైన యట్టి పానీయములును
ననఁగ వేరైన పంచపదార్థములును
భూరమణుఁ డిష్టసహితుఁడై యారగించె" కవిరా 5_183

"కాచఁపుఁ గూరలున్ మిగులఁ గాఁచిన చారులు నెయ్యి పప్పు ఖాం
గారిన యానవాలు పరమాన్నము కమ్మని పిండివంట క
ర్పూరమువంటి నెయ్యి కడుఁ బొత్తిగ వార్చిన యన్న మువ్వునన్
గూరిన యల్ల మావు పెరుఁగున్ భుజియించె నృపాలుఁ డయ్యెడన్"
కవిరా 5_184

పై యాహార పానీయము లన్నియు నచ్చముగ తెలుగు వారివే. పానీయ ములఁ గూర్చి ప్రత్యేకముగ మరలఁ జెప్పియున్నాడు.

"ఏలా లవంగ నవసుమ
నోలామజ్జక సుగంధ మత కర్పూర
శ్రీలలిత మాధురీ జల
మా లేమకుఁ గ్రోల నిచ్చి రతివలు మఱియున్" కవిరా. 3_103

"వాసితో సీరసంవాసి శోదార సుధారస శైత్యంబు పూరములను
వరదంత శరఫల స్ఫురదంత రుమ్పూగ రపనిశ్వ మిళిత గోరసచయంబు
వేల్ల దేలాచూర్ణ తల్లజై కస్వాదు సంపన్న శర్కర సలిలములును
గలిత కుస్తుంబర లలిత జీరణ ముఖ్య సౌవీర తప్త పిష్టద్రవంబు

మొదలుగాఁ గల పానీయములను బధిక
వితతికి నిదాఘశాంతి గావింపఁ బథము
లందుఁ జలిపందిరులు పెట్టి రతుఁగడుగున
జగతిఁ బుణ్యాత్ము లా గ్రీష్మసమయమునను" కవిరా. 4_13

పచ్చడములు, [1] కప్పుకొనే వారని పరసంపు జోలలు [2] పాడేవారని, కవి తెలుగువారి యలవాట్లనే వర్ణించి యున్నాడు. దధ్యన్నాహారము [3] గైకొనేవారని మఱియొక చోట వర్ణించి యున్నాడు.

విలాసములు :

ఉషాకన్య నిలువుటద్దము ముందు యలంకరించు కొనినదని వర్ణించుటచే నాటికి విలాసములలో నిలువుటద్దము చేరినదని చెప్పవచ్చును. [4] భాగ్యసంపన్నుల మరికొన్ని విలాసములు గమనింపఁదగి యున్నవి.

"పచ్చిటం బలకం బమర్చి చలువల్ పైఁ దాల్పఁగా నిచ్చి ద
ధ్యన్నాహారము గంధలేపము విరుల్ తాంబూలముల్ సొంపు మీ
ఱ న్నవ్యవ్యజనాళపత్ర చరణత్రాణాదులన్ భాగ్యసం
పన్నుల్ విప్రులం గర్చగా నొసఁగి రప్పైశాఖ మాసంబునన్"

కవిరా. 5-48

విప్రులకే యిట్టి విలాసవస్తువుల దానము చేసిరనగా వారెంతటి భాగ్య సంపన్నులో, వారి విలాసములెట్టివో యూహింపఁ దగినదే.

పెళ్లిళ్లు :

తెలుగింట పెళ్లి జరిగితే మొదటిపని శుభలేఖ వ్రాయుట. అది కూడ కావ్యములో చోటు చేసికొనినది.

"శ్రీమత్సమస్త సద్గుణ
ధామాంచితకీర్తి నెన్నఁదగు వసుదేవ
స్వామికి భీష్మక భూప
గ్రామణి తా మ్రొక్కి చేయఁగల విన్నపముల్" అని. 1-95

1. కవిరాజమనోరంజనము. 4-29
2. " " 4-12
3. " " 5-48
4. అనిరుద్ధచరిత్రము. 5-35

"క్షేమం బిక్కొ_డ మీ వరి
ణామము వ్రాయంగవలయు, నా పౌత్రుని పు
త్రీమణిని రుక్మనయనా
కోమలి ననిరుద్ధునకును గూర్పఁగవలయున్" అని. 1_98

ఇది అచ్చమైన తెలుగు శుభలేఖ. ఈ కావ్యములో స్థిరముగ నిల్పబడినది.

పెళ్లి తంతు తు,చ తప్పకుండ తెలుగువారిదే. పది పద్యములలో సాగిన[1] యీ వర్ణన క్రమముగ ఎదురుకోలు, బాసికములఁ గట్టుట, కంకణ బంధనము, తెర పట్టుట, తలఁ బ్రాలు పోసికొనుట, పంచమహా వాద్యధ్వనులు, కాలఁ ద్రొక్కిం చుట, సప్తపది మొదలగునవి తెలుగువారి పెండ్లినే ప్రతిబింబించుచున్నవి. ఆ తరువాత విందులు, శోభనము సైతము తెలుగింటి వారిదే. వర్ణనలెల్లఁ దెలుగులో నుండవచ్చును. కాని స్తోత్రములు, ఆశీర్వచనము సాధారణముగ గీర్వాణ భాషలో నుండును. ఇది తెలుగు వారికి ననూచానముగ సిద్ధించిన యాచా రము. కావుననే నారద మహర్షి ద్వారక కేతెంచి, శ్రీకృష్ణుని దీవించి పలికిన తీరు గీర్వాణమే.

"శ్రీరస్తు! శుభమస్తు! మ
నోరథ సంసిద్ధి రస్తు! సుత్యశ్రీమ
న్నారాయణ భవతే" యని
పారెకు దీవించి పలికె బలజాక్షునితోన్" అని. 4_10

విద్యలు :

స్త్రీ పురుషులు నేర్చెడి విద్యలను గూర్చి కవి వర్ణించినది గూడ నాటి తెలుగువారి లక్షణమే.

"మేరుధనుష్కు_ దేవి స్వరమేళకళానిధి దత్తిలంబు భాం
డీరము కోహళీయకము తీవిగఁ గావ్యము నాటకం బలం

1. అనిరుద్ధచరిత్రము. 1_98 నుండి 107

కారము శాస్త్రముల్ మొదలుగా మఱి యభ్యసనం బొనర్చె శృం
గారపు విద్య ల ద్దనుజకన్యకకున్ పరమానురక్తయై" అని. 2-33

"ఆడఁ బాడ నేర్చి యభినయింపఁగ నేర్చి
సరస కవిత చెప్పఁ జదువ నేర్చి
బాణదనుజపుత్రి బాలిక యయ్యును
సకల కళలయందు జాణయయ్యె" అని. 2-34

మొదట మేరు ధనుష్కుఁ దేవి యైన పార్వతి దనుజ కన్యయైన యుషాదేవికి విద్యలు నేర్పిన తీరు వర్ణించి, తరువాత శిష్యురాలు సకల కళల యందు జాణ యైనదని చెప్పుటలో విశేషమున్నది. గురువు నేర్పినది. శిష్యురాలు నేర్చినది. మొదట కర్తృత్వము గురువునందు, తరువాత కర్తృత్వము శిష్యురాలి యందుఁ జెప్పుటచే, గురు శిష్యులిరువురును విద్యాసక్తులైననే విద్యాభ్యాసము సత్ఫలము నీయగలదని స్పష్టము చేయుట జరిగినది. ఇది విద్యాసక్తులైన భాగ్యవంతుల యింటి బాలిక విద్యాభ్యాస విధానము. ఇక రాజ్యము లేలఁదగిన రాజకుమారుడి విద్యాభ్యాస మెట్లుండవలయునో పురూరవుని విద్యాభ్యాస వర్ణన సందర్భమున కవి ఘటించి యున్నాడు.

"[illegible] న్నేతకు ఋగ్యజుస్సులును సామాథర్వణంబు ల్నిరు
క్తము ఛందంబును జ్యోతిషంబు మఱి శిక్షా కల్పముల్ శబ్దశా
స్త్రము మీమాంస పురాణ సంహితలు ధర్మ న్యాయశాస్త్రంబు లా
దిమవిద్యల్ పదునాలుగుం జతురుపాధిప్రౌఢి నభ్యస్తమై" కవిరా. 2-238

"సకృ దుపదేశమాత్రమున సద్గురు సన్నిధిఁ బ్రాగధీత వి
ద్యకరణి నప్పగించునె కదా మఱి యెన్నఁటికైన విస్మృతం
బొకయెడ నైన లేదు చతురత్తరషష్టి కళాకలాపసా
ధకుఁడయి యొప్పెఁ దద్గ్రహణధారణశక్తి వచింప శక్యమే"
కవిరా. 2-239

"హరి హస్తి ప్రముఖావరోహణము దివ్యాస్త్రప్రయోగోపసం
హరణప్రౌఢి గదాది సాధనఘనాభ్యాసంబు సారస్వతా

> కరవాగ్వృత్తి యుపాయ సవ్యక్తి చమత్కారంబు సాద్గుణ్యవి
> స్ఫురణం బాదిగ నన్నిటం జతురుఁడై శోభిల్లె నుర్వన్నతిన్"
>
> కవిరా. 2_240

పై విద్యలకుఁ దోడు సకలగుణ ప్రవీణత రసజ్ఞశిఖామణియైన పురూరవునికి, మేలిమి పసిండికి నవ్య వికాస పారిజాత కుసుమ గంధ మబ్బినగతి, విఖ్యాతకీర్తి పైత మబ్బినది.[1] ఇందలి యన్ని విద్యలను గాకున్నను చాలవర కానాటి శ్రేష్ఠ ప్రభువులు వీనిని నేర్చెడివారు.

వి నో ద ము లు :

తెలుగు నేలలో నేటికిని పాములాట, గారడీ ప్రదర్శన చెప్పుకొనఁ దగిన వినోదములుగానే మిగిలి యున్నవి. కవి వానిని గూడ కావ్యస్థ మొనర్చినాడు.

> "అసమాస్త్రుం డను గారడీఁ డతివ గర్భాయాన విశ్వావన మం
> త్ర-సముచ్చారణ సేయ నాభివివరాంతస్సీమయందుండి సా
> హస భావంబున నిర్గమించి సఫణంబై యాడు నీలహిరీ
> తి సరోజానన రోమరాజి చెలువొందెం జూడు విస్తీర్ణమై"   అని. 3_101

చెలువ రోమరాజి వర్ణించు నెపమున, కవి యానాటి వినోదమైన గారడీడు పాముల నాడించుటను చక్కగ చిత్రీకరించి యున్నాడు.

రాజకుమారులకుఁ జెప్పుకొనఁ దగిన వినోదము, మృగయా వినోదము (వేట). ఇది తెలుగు వారి కత్యంత ప్రీతి పాత్రమైనది. కావుననే కవి సుద్యుమ్నుని వేటను, ఇరువదినాల్గు గద్యపద్యములలో విపులముగ వర్ణించుట జరిగినది. తెలుగు వారికి తమ వేటకుక్కలకు పేర్లు పెట్టి పిలుచుకొను నలవాటు గలదు. దానిని పై తము కవి వదలుట కిచ్చగించలేదు.

> "బెబ్బులి తుపాకి సుడిగాలి పిడుగు తుమర
> భూతనాథుండు గడిపోతు పోతురాజా

---

1. కవిరాజ మనోరంజనము 2_241

గం(డగొడ్డలి దొంగల మిండగీఁడు
మొదలుగాఁ బేరుగల వేపు లుదుట నడచె" కవిరా. 2-85

విశ్వాసములు :

తెలుగు వారికి గాలిసోకుట, (గహబాధ, శకునములు మొదలగు వానియందు విశ్వాసము గలదు. మం(తములపై. తెగని నమ్మకమును గలదు. "నాథు సుదర్శనంబు వలనన్ మదన (గహ మోక్షమయ్యె బింబాధరకున్"[1] అని (గహ బాధ తొలగుటకు సుదర్శన మం(తమును పరిహారముగా సూచించినా డీ కవి. మం(తసిద్ధికి సాధన మార్గమును,[2] శకున ఫలమును[3] కవి వర్ణించుట జరిగినది.

ఆచారములు :

తెలుగు వారికి (శ్రీ మహావిష్ణువుకు (ప్రీతిగా చాతుర్మాస్య (వత మాచరించుట లోక విదితమే. చాతుర్మాస్య(వతము.[4] శయనైకాదశి,[5] ఉత్థానైకాదశి[6] మధ్య కాలమున నాచరింపబడునది. ఆ నాలుగు మాసముల కాలము (శ్రీమహావిష్ణువు పాలకడలిలో శయనించి యుండును. ఆ కాలమున (వతాచరణము. పుణ్యాధిక్య హేతువని సదాచారుల విశ్వాసము. అట్లే కార్తీకమున శివునికి (ప్రీతిగా నక్త మొనర్చుటయు[7] తెనుగువారికి గొప్ప (వతము, వీని నన్నింటిని కవి తన కావ్యములం దభివర్ణించుట, తన జాతి పై శిష్యమును (పకటించుట కొఱకే.

---

1. అనిరుద్ధచరి(తము. 3-60
2. " " 3-75
3. కవిరాజమనోరంజనము. 5-70
4. అనిరుద్ధచరి(తము. 4-3
5. కవిరాజమనోరంజనము. 4-12
6. " " 4-59
7. " " 4-61

మనస్తత్త్వము :

స్త్రీల మనస్తత్వమును గూర్చి, ముఖ్యముగ తెలుగువారిని గూర్చి కవి చమత్కారముగ వర్ణించి యున్నాడు.

"అల్ల సుధాపయోధి నపురంతరమౌ లవణాబ్ధియందు హ్యా
ద్యల్లఘు రాజధానియగు ద్వారకలో సుఖియించుచుండు నం
వల్లలితాంగి యెప్పుడును బాయక పుట్టినయిల్లు నత్తవా
రిల్లును నేకదేశమగు నింతుల వేడ్కకుం గొఱంతయే" అని 1_55

స్త్రీలకు తెలుగు నేలలో నత్తవారింటి కరుగుట బాధాకరమైన విషయము. లోక సహజమే యైనను తెలుగువారు మరింతగా బాధపడుదురు. ధనవంతు లిల్లం టముఁ దెచ్చుకొనఁ జూతురు. (కొడుకులు లేనిచో) సాధ్యమైనంత వరకు తమ గ్రామమునకు సన్నిహితమైన గ్రామము లందున్న వరునకే తెలుగువారు తమ కూతు నీయ నిచ్చగింతురు. ఇక తల్లిగారిల్లు నత్తవారిల్లు నొకటి యేయైన, స్త్రీలకు మహానందముగ నుండును. కావుననే ఈ తెలుగువారి మనస్తత్వమునే కవి చమ త్కారముగ లక్ష్మీదేవి కాపాదించి, గొప్పగా వర్ణించి యున్నాడు. ఇచట నేకదేశ మను వ్యాకరణ పరిభాష నుపయోగించి కవి చమత్కరించినాడు. తెలుగు జాతి మనస్తత్త్వమును మరియొకచోట వ్యక్తపరచి యున్నాడు. తెలుగు నేలలో నితర జాతులవారి దౌష్ట్యమును సహింపలేని కవి వారిని వ్యంగ్యముగ గర్హించిన తీరు రమ్యమైనది.

"కాంచన వర్ణము కువలయ
సంచారము మాధవ ప్రసన్నతయును బా
లించుచు వానప్రస్థక
గాంచు మధువ్రత కులంబుఁ గంటివె చెలియా ?" అని. 2_50

"పేరుగల జాతులకు నెల్లఁ బెంపు తఱుగ
హెచ్చు మొదవెఁ గుజాతి విజాతులకును
గాలకుటిలంబుఁ జూడుమా కంబుకంఠి
మాన్ప నెవ్వరి వశమమ్మ ! మాధవాజ్ఞ" అని. 2_51

వసంత కాలము రాగా జాతులు పెంపు దఱిగినది. దీనిని కవి చమత్కరించి 'కుజాతి, విజాతి' యని యితర జాతులవారి దౌష్ట్యమును సహింపఁజాలక చేయునది లేక కాల కౌటిల్యమును తప్పుపట్టినాడు. అంతేకాదు అది మాధవాజ్ఞ మాన్ప నెవ్వరి వశమ్ము ? ఇట్లనుటలో వసంతకాల మహిమను నెపముగ బెట్టుకొని 'మాధవుడు' (లక్ష్మీధవుడు = ధనవంతుడు) దుష్టుడని, శ్రీమంతుల దౌష్ట్యమును సైతము కవి యీసడించి యున్నాడు. నాటి మన తెలుగుజాతి, శ్రీమంతుల, దుర్మార్గుల, విదేశీయుల దౌష్ట్యమునకు గుఱియై యేమియు చేయజాలని యధ్వాన్న స్థితిలో మన్నదని కవి చెప్పక చెప్పినట్లయినది. గుణహీనులను కవి యీసడించిన ఘట్టము మఱియు చెప్పుకొనఁదగి యున్నది. మన్మథదూషణ సందర్భమున విరచితము.

"పురహర దేవునిం జెనకఁబోయి త దుగ్ర లలాట నేత్ర భీ
కర దహనార్చులం గలిసి కాలితి వంతట నుండి యైనమం
బరులను బీడపెట్టని కృపాగుణమేటికి లేదు నీకుఁ ? గా
పురుషులు రాజదండనముఁ బొందియు నైజము మానరే కదా !"

అని. 3–28

ఇది పైకిఁ జూడగ మన్మథ దూషణమనిపించును. కాని లోన నారసినచో, కవికి గుణహీనులపై మన్న యీసడింపు మనసు కెక్కక తీరదు.

ఇట్లే కవి తెలుగువచనమును సందర్భము కలిగినపుడెల్ల, కావ్యస్థ వర్ణనలం గూర్చి, తన దేశీయాభిమానమును వెల్లడించి యున్నాడు. నాటి సమాజమునకు, ప్రతిరూపకముగా తనవర్ణనలను చిత్రించి, సమాజము నెడ తనకుగల బాధ్యతను నిర్వర్తించుటే గాక, తన లోకజ్ఞతను చాటుకొని యున్నాడు.

భక్తి :

కనుపర్తి అబ్బయామాత్యుడు మంగళాద్రి నారసింహస్వామి భక్తుడు.

"చదువులకు మేర యెయ్యది
చదివిన మాత్రంబె చాలు నరనవచస్సం

పడఁ దా నేర్చిన కొలఁదిని
యదవఁ గవితఁ జెప్పి, హరికి నర్పింపఁదగున్" అని 1-16

"భగవంతుని సద్గుణములు
బొగడు వివేకంబె తమ కపూర్వైశ్వర్యం
బగుట నరస్తుతి సేయరు
జగతిన్ సత్కవులుతుచ్ఛసంపదకొఱకై" అని. 1-17

అని భావించి అనిరుద్ధచరిత్రమును మంగళాచల నృసింహుని కంకిత మిచ్చినా డీ కవి.

"ప్రాజ్ఞులు ప్రబంధ కల్పనా పాటవంబు
గలుగుటకు సత్ఫలంబుగాఁ దలఁచి కృతులు
చేయుచుందురు జగదేక నాయకునకు
నచ్యుతున కంకితముగఁ గృతార్థు లగుచు" కవిరా 1-14

"ధాతలకు ధాత భువన
త్రాతఁకున్ దాత శౌరి రక్షకుఁడఁట యా
దాతం దాత వ్విడిచి యి
లాతల నేతల నుతించు లాఘవ మేలా." కవిరా. 1-15

యని భావించి కవిరాజ మనోరంజనమును, మంగళాద్రి పతి యాజ్ఞ మేరకు రాజ గోపాల దేవున కంకిత మిచ్చిన భక్తాగ్ర గణ్యుడు కసుపర్తి అబ్బయామాత్యుడు. ఇతడు మహా భక్తుడు.

"ముంగిటి కల్పభూరుహము, మూలధనంబు వివేకనంబులో
బంగరు నావ చేతి కగవడ్డ తలంపుల మానికంబు ముం
గొంగు పసిండి భక్తులకుఁ గోర్కుల పంట జగంబులందు మా
మంగళశైలవల్లభు నమంబగు దైవము లేడు చూడఁగన్" అని. 1-42

అని త్రికరణ శుద్ధిగ విశ్వసించి కొలచి తరించిన మహనీయు డీ కవి. శ్రీమంగ

శాద్రి లక్ష్మీనృసింహుల కటాక్షాంచలామృతవృష్టి సంకురించిన యాతని భాగధేయ సారస్వత పారిజాత సత్ఫలములే అనిరుద్ధచరిత్ర కవిరాజమనోరంజనములు.

"శ్రీమంగళగిరి నరసిం
హామేయకృపావిజృంభి తాద్భుత కవితా
శ్రీమంతుఁడ గానకళా
ధీమంతుఁడ దేవతాస్తుతివ్రతపరుఁడన్" కవిరా. 1-38

అని విస్పష్టముగ తాను భగవత్కృపకు పాత్రుడైనట్లు కవి చెప్పుకొనిన తీ రాతని భక్తిపారమ్యతను చాటుచున్నది. ఇత డెంత విష్ణుభక్తుడో, అంతటి శివభక్తుడు కూడ. బాల్యము నుండియు మంగళాద్రి నారసింహుని యిలవేల్పుగాఁ గొలిచిన వాడగుట చేతఁ దన కావ్యముల రెండింటిని విష్ణుపరకే (మంగళాద్రి నారసింహుడు, రాజగోపాలుడు) యంకిత మొసంగి యున్నాడు. ఒకటి మంగళాద్రిపతికి, రెండవ దాతని యాజ్ఞచే రాజగోపాలునకు నంకితమొనర్చి యున్నాడు. ఈతనికి శివకేశవుల యందు భేద భావము లేదు.

నారదు డేయే క్షేత్రముల దర్శించెనో వర్ణించుచు కవి చెప్పిన పద్యము లీతనికి శివకేశవుల యందభేద భావమున్నట్లు స్పష్టము చేయును. జగన్నాథుని, మంగళాచల నృసింహుని, వెంకటశౌరిని, వరదరాజును, రంగధాముని దర్శించెనని[1] నారద మహర్షి చెప్పి వెనువెంటనే కాశిని, కేదారమును, శ్రీశైలమును, కాళహస్తిని, ఛిదంబరమును, రామేశ్వరాది శైవక్షేత్రముల దర్శించెనని[2] వర్ణించుటచే నీ విషయము సుస్పష్టము కాగలదు.

నారదుడు పురూరవున కొనర్చిన యాత్మ విద్యోపదేశమున సైతము కవికి గల శివకేశవాద్వైత భావము స్పష్టము కాగలదు.

"మాటలు వేయునేల నొక కర్మము సెప్పెద మోక్షదాతపై
పాటిలు విష్ణు శంకరుల భక్తి దృఢంబుగఁ గల్గెనేని నా

1. కవిరాజ మనోరంజనము 1-199.
2. " " 1-200.

నాఁటికి వాని కన్ని సుగుణమ్ములు దామె ఘటింప మర్త్యుఁడౌ
బూటకపు న్విచారములఁ బోవఁగ నేమి ఫలంబు భూవరా" కవిరా. 1-148

అని శివకేశవా ద్వైత ప్రతిపాదనమునకై మరలఁ బోధించి యున్నారు.

"సుగుణం బెఱిఁగి భజించిన
నగు నిర్గుణసిద్ధిసిద్ధుఁడగు నాతనికిన్
జగమెల్లను బ్రహ్మమయం
బుగఁ దోచును సర్వకాలమును నొక్కగతిన్" కవిరా. 1-149.

ఇది అద్వైత భావమును వెల్లడించు యాతని నిర్ణయము. విష్ణుస్తుతి చేసిన వసిష్ఠుడే[1] శివస్తుతి చేసియుండుట[2] యాతని విశుద్ధ భక్తి భావమును వెల్లడించుచున్నది. పురూరవుని చేత చేయించిన విష్ణుస్తవము[3] యాతనికిగల విష్ణుభక్తి పారమ్యమును, పురూరవునితోఁ దనకు తాదాత్మ్యమును భావించిన విధమును వ్యక్త మొనర్చు చున్నది. గర్భబంధ చిత్ర కవిత్వములతో, సర్వతో భద్ర శ్లోక ముతో, గీర్వాణాంధ్ర భాషా శ్లేష కందముతో ననన్య సామ్యమై, పరిఢవిల్లు నా స్తోత్రము నాన్యతో దర్శనీయ ప్రతిభా సముద్దీపిత రచనా విశేషము. త్రివేణీ సంగమ స్నానము భారతీయు లెల్లరు జీవితమునకు పరమార్థముగ భావింతురు.

"కలుగుఁ స్నానము భాగ్యవంతులకు గంగా రంగ దుత్తుంగ భం
గ లస త్పాండిమతోఁ గళిందతనయా కల్లోల మాలా సము
జ్జ్వల నైల్యం బెసెరింప గర్భిత సరస్వత్యూర్మి గౌరంబుతో
నలరం బొల్చు త్రివేణి సార్క మకరోద్య న్మాఘ మాసంబునన్"
కవిరా. 4-152

గంగాభవానియెడ యాతనికిగల భక్తి భావమెల్ల రూపుఁ గట్టినది. విష్ణు నందెంత భక్తియో, శివుని యందంతటి భక్తినే ప్రదర్శించిన ఘట్టములు కో కొల్లలు. త్రిపురారియైన శివుని స్తుతించిన ఘట్టము దానికి తార్కాణము.

1. కవిరాజ మనోరంజనము 2-80 నుండి 84
2. " " 2-205 " 208
3. " " 4-181 " 182

"పూర్వ పశ్చిమ దిగ్భాగముల నలంకృ
తంబులై సూర్య శశి మండలంబు లపుడు
హరుని తేరికి బండికండ్లైన నాటి
చంద మిటువంటిదని తెల్పె జగములకును" కవిరా. 5_227

ప్రభాత వర్ణనమున పురహరుని దర్శించిన తీరు కడురమ్యము.

"జలసంజాత భవాండమండపగత క్ష్మాచక్ర సింహాసన
స్థల ధాత్రీధర శంభులింగములకుఁ శంపాలతా దీపికల్
వెలుఁగఁ గర్జిత మంత్రసూక్తులను ప్రావృట్కాల శైవుం డొన
ర్చె లస న్మేఘ ఘటాంబుధారల నవిచ్ఛి న్నాభిషేక క్రియల్"
కవిరా. 4_27

బ్రహ్మాండము మండపము, క్ష్మాచక్రము సింహాసనము, ధాత్రీ ధరములు శంభులింగములు, శంపాలతలు దీపికలు, ఉఱుములు మంత్ర సూక్తులు, మేఘములు ఘటములు, వర్ష ధారలు, అభిషేక జలధారలు, కాగా ప్రావృట్కాల మనెడు శైవుడు మహాభిషేకము నవిచ్ఛిన్నముగ నొనర్చు చున్నాడు. వర్షావేళలను కవి భావించిన తీ రక్షరలక్షల విలువగట్టదగియున్నది. ఎంతటి బృహద్దర్శనము! కాకున్నచో కవి కంటికి బ్రహ్మాండము మండపమా? "కవిరేవ ప్రజాపతిః" అను నార్యోక్తికిఁ దగిన కవిలోక వంద్యు డీ యబ్బయామాత్యుడు. ఈతని శివభక్తి మున్జగమ్ముల కాదర్శమైనది గదా! ఈతనికి ఋషి భక్తిమెండు. అందును తన గోత్ర ఋషియైన కౌండిన్య మహర్షిపై నీతని కెనలేని భక్తి భావము. కావుననే ఋషులనెల్ల నొక పద్యమున చెప్పుచు, కౌండిన్యుని ప్రథమునిగా వర్ణించి యున్నాడు.

"కౌండి న్యాత్రి వసిష్ఠ గౌతమ మతంగ వ్యాస జాబాలి మా
ర్కండేయ చ్యవ నౌర్వ కణ్వ భృగు భారద్వాజ కుంభీజను
శ్శాండిల్యాది మహామునీంద్రు లెలమిఁ సందీపితానేక మా
ర్తాండ స్ఫూర్తిత తేజు న య్యభవు నందర్శించు నాసక్తితోన్"
కవిరా. 2_137

ఈతడు శ్రీవిద్యోపాసకుడైనట్లు కావ్యగతాంశములవలనఁ దోచుచున్నది. శ్రీవిద్యాప్రతిపాదకమైన యోగవిద్యా విషయముల నీతడు విపులముగ వర్ణించి యున్నాడు. "బ్రహ్మంబు తానయైయుండు సమాధియందుఁ బరమానందులయి పరమ శివోపాసనఁ జేయుచుండి"[1] రట. మిత్రావరుణు లిర్వురు వారి ధ్యాన సమాధిని వర్ణించు నెపమున నీకవి శ్రీవిద్యా సంబంధ యోగమును సాకల్యముగ సుదీర్ఘ వచనమున వివరించి యున్నాడు. పురూరవుడు

"నాద బిందు కళాస్ఫూర్తి పాయకొనఁగ
లోను వెలి యను భేదంబు గానఁబడక
సర్వపరిపూర్ణమగు విష్ణుశబ్ద వాచ్య
సిద్ధ వస్తువు ధ్యానంబు సేయుచుండె" కవిరా. 4_157

నని వర్ణించుటేగాక యా సిద్ధ వస్తువును శ్రీమహావిష్ణువుగా దర్శించి యుండుట చేత, శ్రీవిద్యావిషయిక పరమ శివోపాసనకు దీనికి నభేదము సిద్ధించినది.

వసిష్ఠుడు సైతము యోగమునే యవలంబించినట్లు వర్ణించుట జరిగినది.

"చిద్రూపంబు నివాతదీపకళికా శ్రీ లక్ష్యమై లోన న
క్షుద్రస్ఫూర్తి వెలుంగ వర్తిత నిమేషోన్మేషయై దృష్టి భా
స్వ ద్రూఢిన్ బయలందగింపఁ గరణస్వస్థాత్ముఁడై శాంభవీ
ముద్రాముద్రితలీల విష్ఠ సలిపె న్ముఖ్యప్రకారంబునన్" కవిరా. 2_200

ఇదియు శ్రీవిద్యా సంబంధి యోగవిషయమునే ప్రతిపాదించుచున్నది. దీనివి బట్టి యోగము ద్వారా సమాధియందు దర్శించు చిచ్ఛక్తికి సుగుణరూపము శివకేశవు లలో నెవరైనను గావచ్చునని స్పష్టమగు చున్నది. "సర్వజీవ స్వరూపే చ నార సింహోఽం తరాత్మవాన్" అను సూక్తిని స్మరించి, శ్రీలక్ష్మీనృసింహ భక్తుడైన యబ్బయామాత్యుడు సర్వంబును బ్రహ్మమయంబని, 'బ్రహ్మైవాహ' మ్మని[2]

---

1. కవిరాజ మనోరంజనము. 4_8
2. అనిరుద్ధచరిత్రము. 5_168

అంతర్జ్యోతి నారాయణు' డని.[1] అతఁడు స్ఫూర్తి వెలుఁగు చిద్రూపమని,[2] హృత్కమలాంతర జ్యోతి[3] యని యా పరమాత్మను గుఱితెలిసి కొల్చి తరించిన పుణ్యమూర్తి. అతని కవిత 'రసవివేకనిధాన' మని[4] చెప్పుకొని యున్న మాట నిత్యసత్యము. అతని రెండు ప్రబంధములును రసపుష్టికి, తత్త్వనిష్ఠకు నాశ్రయ భూతములై సకల కవిజన మనోరంజన మొనర్చుచున్నవి.

కందుకూరి వీరేశలింగము పంతులుగా రీ కవిని గూర్చి వెలిబుచ్చిన యభిప్రాయము మిగుల నౌచిత్యతా రమ్యముగ నున్నది. ఇత డా శతాబ్దము నందుండిన ప్రబంధకవీశ్వరు లందరిలోను మిక్కిలి ప్రౌఢుడు. వసు చరిత్రమునకు తరువాత నీతని కవిరాజమనోరంజనముతో సరితూగఁ దగిన ప్రబంధము లొకటి రెండు కంటె ఎక్కువ లేవు"[5] శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు, తమ యనిరుద్ధ చరిత్ర పీఠికలో నీ కవిని గూర్చి ప్రశంసాపూర్వకముగ పలికిన మాటలు పూర్ణ సత్యము లనుట నిర్వివాదాంశము. "ఈతడు ప్రశస్తమైన కవి. ప్రబంధ కవులందరి వోలెకథలను చక్కగా జీర్ణించు కొనినాడు. కేవల కల్పనా కథల వంకబోక పురాణము నందలి యితివృత్తమును దీసికొనినాడు. నరాంకితము చేయక నరసింహాంకితముఁ జేసినాడు. పండితుడు బహుశాస్త్ర కోవిదుడు. ఉపాసకుడు. ధర్మమార్గ ప్రవర్తకుడు. కవిత్వమును తిక్కనవలె నారాధనా విశేషముగ భావించినవాడు. పెద్దన వలె కావ్య నిర్మాణము చేయగలుగుదునను నాత్మ ప్రత్యయము గలవాడు. పూర్వాంధ్ర కవుల కవితా చమత్కారముల నాకళించుకొన్నవాడు. ఒగుదుడుకులు లేక కావ్యమునంతయు నొకేరీతిని నడిపినవాడు. వినయ సంపత్తి గలవాడు.[6]

కనుపర్తి అబ్బయామాత్యుడు సంగీత సాహిత్యము లనేక ముఖములుగఁ బ్రవహింపఁ జేసి, శక్తిని జోడించి నాటి తెలుగునాట, కవితారీతులన్నింటిని

1. కవిరాజమనోరంజనము. 4_158
2. " " 2_200
3. " " 4_8
4. అనిరుద్ధచరిత్రము. 5_110
5. కందుకూరి వీరేశలింగం గ్రంథావళి సంపు. 10. పు. 448
6. అనిరుద్ధచరిత్రము. పీఠిక. పుట. 57, 58

మేళవించి, కావ్య నిర్మాణ మొనర్చిన ధీశాలి. విద్వత్కవి. బహుశాస్త్ర పాండిత్యముతోపాటు, వినయ గాంభీర్యౌదార్యాది సద్గుణ సంపత్తికి మూలాధారమైనవాడు. తాను పుట్టిన తెలుగు నేలపై నెనలేని ప్రేమాభిమానములు గలవాడు. లోకజ్ఞుడు. శ్రీమంగళాద్రి లక్ష్మీనృసింహ కృపాకటాక్ష వీక్షచేఁ బునీతుడైనవాడు. శృంగారము, ధర్మబద్ధమై, తత్త్వచింతనము దానికి వన్నె దేవలయుననెడి లక్ష్య సిద్ధిని సాధించినవాడు. క్షీణ యుగమునందలి ప్రబంధములలోని లోపముల గుర్తెరింగి, తెలుగు ప్రబంధమన్న నిట్లుండ వలయునని, పెద్దన్నత్రోవన, మరి యొక మారు సత్సాహిత్యమును రుచిచూపినవాడు. తన కాలపు సమాజమును తన కావ్యములందుఁ బ్రతిబింబింపఁ జేయుచునే, సమాజ వికాసమునకు పురుషార్థ సాధన మెంత ముఖ్యమైనదో హృదయస్పర్శిగా చిత్రించిన కవివరేణ్యుడు పాలకులెట్లుండ వలయునో ప్రత్యక్షముగ తెలిపిన పరమ రాజనీతివేత్త. తాత్త్విక శ్రేష్ఠుడు. పోతనగారివలె కావ్యములను భగవదంకిత మొనర్చి, మత్తుడైన మంగళాచల నృసింహ భక్తుడు.



# ఉపసంహారము

అబ్బయామాత్యుని కృతుల పరిశీలన మింతటితో ముగిసినట్లే. ఈ పరిశీలన సందర్భమున ప్రబంధావిర్భావ వికాసముల గూర్చియు 18, వ శతాబ్దిలో ప్రబంధ స్వరూప స్వభావముల గూర్చియు నొకటవ యధ్యాయమునందు వివరించుట జరిగినది, తెలుగులో హరివంశముల విస్తరణ, వానియందు ఉషానిరుద్ధుల కథా విశేషమును గూర్చి రెండవ యధ్యాయమున వివరించుట జరిగినది. అబ్బయామాత్యుని జీవిత విశేషములను మూడవ యధ్యాయమున గూర్చుట జరిగినది. అనిరుద్ధ చరిత్రమునందు శ్రీవిద్యా విషయక ప్రస్తావన కలదని నాల్గవ యధ్యాయమున జూపుట జరిగినది. ఐదవ యధ్యాయమున ననిరుద్ధ చరిత్ర మందలి కవితా విశేషములనెత్తి చూపుట జరిగినది. ఆరవ యధ్యాయమున కవిరాజ మనోరంజనమందు వస్తు కల్పన చేసిన తీరును, ఆధారములను, విశేషములను చర్చించుట జరిగినది. ఏడవ యధ్యాయమున కవిరాజ మనోరంజన మందలి వర్ణన వైచిత్రిని విపులముగ పరిశీలించుట జరిగినది. అబ్బయామాత్యుని కృతులలో ప్రతిబింబించిన సామాజిక పరిస్థితుల నెనిమిదవ యధ్యాయమున వివరించుట జరిగినది. కవి, తన రెండు ప్రబంధములందు రసపోషణ మొనర్చిన విధము తొమ్మిదవ యధ్యాయమునను, పాత్ర చిత్రణలో ప్రదర్శించిన నైపుణిని పదవ యధ్యాయమునను పరిశీలించుట జరిగినది. పదునొకండవ యధ్యాయమున కవి వ్యక్తిత్వమును గూర్చి విపులముగ పరిశీలించుట జరిగినది.

శ్రీ కృష్ణ పౌత్రుడైన యనిరుద్ధునికి, దేవారియైన బాణాసురుని పుత్రిక యైన యుషను గూర్చిన కల్యా
రాక్షస జాతుల మధ్య ప్రేమ తత్త్వము

ప్రణయ కళా తపస్విని యూర్వశి ప్రణయమును, ప్రణవమును, తపస్సు చేతనే సాధించిన ధీరోదాత్తుడు, చంద్ర పౌత్రుడునైన పురూరవుడు, రవి శశికుల దీపకుడు. ప్రణయమును ధర్మమును మేళవించిన, రసవిపంచి కవిరాజ మనో రంజనము.

చతుర కవిత్వ తత్త్వపటు సంపదను, శ్రీమంగళాచల నృసింహుని కృపచే సాధించి, సంగీత కళావిధిత్వము నందు రంగరించి, కవిరాజ మనోరంజకములైన ప్రబంధములను తెలుగువారి కందించిన కవితా కళా తపస్వి అబ్బయామాత్యుడు. వేదాంతాది బహుశాస్త్ర కోవిదుడు. లోకజ్ఞుడు. వాఙ్మి.

ఈ సిద్ధాంత గ్రంథమునందు యథా శక్తి యాతని కృతులను, వ్యక్తిత్వ మును బరిశీలించుట జరిగినది. ఇది సమగ్రమని చెప్ప వీలులేదు: ఇంకను ననేక విషయములం బరిశోధించి యీ కవిచంద్రుని ప్రతిభా విశేషములను లోకమునకు చాటవలసి యున్నది.

అనిరుద్ధ చరిత్రము, అబ్బయామాత్యునికి మొదట పేరు తెచ్చినది. కవిరాజ మనోరంజనము కమవర్తి వారి వంశమున కెనలేని ఘనకీర్తిని సాధించి పెట్టినది. విద్వత్కవియైన యీ కవిచంద్రుడు తాను ధన్యుడై, తెలుగులోకమును ధన్య మొనర్చి యున్నాడు.

శ్రీమంగళాచల నృసింహదత్త వరప్రసాదియైన కమవర్తి అబ్బయా మాత్యునికి భక్తిపూర్వక ప్రణతులు. మద్గురు శేఖరులకు హృదయ పూర్వక నమస్కృతులు.

" ఇతి శివమ్ "

# ఉపయుక్త గ్రంథసూచి


1. అప్పకవి, కాకునూరి — అప్పకవీయము, వావిళ్ళ ప్రచురణ 1932

2. అబ్బయామాత్యుడు, కనుపర్తి — అనిరుద్ధచరిత్రము, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాద్.

3. ” ” — అనిరుద్ధచరిత్రము, యం. శేషాచలం అండ్ కంపెనీ, రాష్ట్రపతిరోడ్, సికింద్రాబాద్ 1973.

4. ” ” — కవిరాజమనోరంజనము. కందుకూరి ప్రచురణ 1895

5. ” ” — కవిరాజమనోరంజనము. వావిళ్ళ ప్రచురణ 1929.

6. అమరసింహుడు — అమరకోశము, వావిళ్ళ ప్రచురణ 1934.

7. ” — అమరకోశము, వావిళ్ళ ప్రచురణ 1933.

8. ఆరుద్ర — సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సంపు. 3. యం. శేషాచలం అండ్ కంపెనీ.

9. ” — సమగ్ర ఆంధ్రసాహిత్యం, సంపు. 12 యం. శేషాచలం అండ్ కంపెనీ.

10. ఆర్థర్ అవలన్ — ది సర్పెంట్ పవర్, గణేశ్ అండ్ కో ప్రైవేట్ లిమిటెడ్, ఆరవ ముద్రణ 1958

11. ఎఱ్ఱాప్రెగ్గడ — నృసింహపురాణము, వావిళ్ళ ప్రచురణ మూడవ ముద్రణ. 1953

12. ” — హరివంశము. వావిళ్ళ ప్రచురణ.

13. కాళకవి చెంగల్వ — రాజగోపాల విలాసము, మద్రాస్ గవర్న
మెంట్ ఓరియంటల్ సీరీస్. 1951

14. కాళిదాసు — రఘువంశము, వావిళ్ల ప్రచురణ 1963

15. కాళిదాసు — కుమార సంభవము.
వావిళ్ల ప్రచురణ. 1963.

16. కుంతకుడు — వక్రోక్తి జీవితము, సాహిత్య
అకాడమీ, న్యూఢిల్లీ 1977.

17. కులశేఖరరావు, ఎం. — వివేచన. సంపు: 3. తెలుగుశాఖ.
ఉస్మానియా విశ్వవిద్యాలయము. 1983.

18. కృష్ణరాయలు — ఆముక్త మాల్యద, యం. శేషాచలం
అండ్ కంపెనీ. ప్ర. ముద్రణ. 1970.

19. కృష్ణారావు, జి. వి. — స్టడీస్ ఇన్ కళాపూర్ణోదయ.
శ్రీపరమేశ్వరా పబ్లికేషన్.
ప్రథమ ముద్రణ. 1956.

20, గంగాధర కవి, అద్దంకి — తపతీ సంవరణము.
ప్రథమ ముద్రణ. 1972.

21. గోపాల కృష్ణారావు, కె. — సంస్కృత నాటకము.
ఆం. ప్ర. సాహిత్య అకాడమీ. 1978.

22. చిన్నయసూరి, పరవస్తు — బాల వ్యాకరణము, (దూపి వ్యాఖ్య)
వావిళ్ల ప్రచురణ. 1965.

23. తమ్మయ, సారంగు — 'వై జయంతీ విలాసము' అను
విప్రనారాయణ చరిత్రము.

24. తిక్కన సోమయాజి — ఆంధ్రమహా భారతము, ఉస్మానియా
విశ్వవిద్యాలయము. ఆంధ్రశాఖ.
సంశోధిత ప్రతి. 1968.

25. తిమ్మన, నంది — పారిజాతాపహరణము. ఆం. ప్ర. సాహిత్య అకాడమీ. ప్రథమ ముద్రణ. 1978.

26. దండి — కావ్యాదర్శము. ఆం. ప్ర. సాహిత్య అకాడమీ. 1981.

27. దుర్గయ్య, పల్లా — ప్రబంధ వాఙ్మయ వికాసము. ప్ర. ముద్రణ. 1979.

28. ధూర్జటి — శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము. ఆం. ప్ర. సాహిత్య అకాడమీ. 1968.

29. నన్నయభట్టారకుడు — ఆంధ్రమహాభారతము, ఉస్మానియా విశ్వవిద్యాలయము, ఆంధ్రశాఖ, సంశోధితప్రతి.

30. " " — ఆన్ధ్రశబ్ద చింతామణి. వావిళ్ల ప్రచురణ. 1915

31. నన్నెచోడుడు — కుమారసంభవము, వావిళ్ల ప్రచురణ. 3వ ముద్రణ, 1953

32. నారాయణాచార్యులు, పుట్టపర్తి — వసుచరిత్ర, సంగీత సాహిత్యములు, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, ప్రథమ ముద్రణ. 1974.

33. నారాయణరావు, వెల్చేరు — తెలుగులో కవితా విప్లవాల స్వరూపము విశాలాంధ్ర ప్రచురణాలయము, విజయవాడ 1978

34. నారాయణరెడ్డి, సి. — ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయము – ప్రయోగములు, ప్రథమ ముద్రణ. 1967.

35. నృసింహకవి, సంకుసాల — కవికర్ణరసాయనము. ఆం ప్ర. సాహిత్య అకాడమీ 1967

36. పాపరాజు, కంకటి — ఉత్తర రామాయణము, వావిళ్ల ప్రచురణ

37. పెద్దన, అల్లసాని — మనుచరిత్ర. ఏపిబిడి ప్రచురణ. పునర్ముద్రణ 1970

38. పెద్దన, విన్నకోట — కావ్యాలంకార చూడామణి ప్రకాశకులు: వేదం వెంకటరాయశాస్త్రి. 7 వ ముద్రణ 1972

39. పోతన, బమ్మెర — ఆంధ్రమహాభాగవతము. ఆం. ప్ర. సాహిత్య అకాడమీ 1979

40. భాస్కరరాయలు — శ్రీలలితా సహస్రనామ భాష్యము. (వ్యాఖ్యాత, ఆంధ్రానువాదము. విద్వాన్ పొంగూరు సూర్యనారాయణ శర్మ) 1970

41. మల్లన, మాదయగారి — రాజశేఖర చరిత్ర, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ 1967

42. మహంతయ్య, ఎం. ఎస్. — కన్నడ సాహిత్య చరిత్ర సాహిత్య అకాడమీ న్యూఢిల్లీ 1978

43. మాధవరావు, విన్నకోట — ప్రబంధ వాఙ్మయ పరిణామము– కావ్యరీతులు.

44. మారన — మార్కండేయ పురాణము. వావిళ్ల ప్రచురణ. 1955.

45. మేదినీకరుడు — మేదినీ కోశము. వావిళ్ల ప్రచురణ. 1932.

46. మొల్ల, ఆతుకూరి — రామాయణము. వావిళ్ల ప్రచురణ. 1981

47. యశోదారెడ్డి, పి. — తెలుగులో హరివంశములు. ప్రథమ ముద్రణ. 1973.

48. యశోదారెడ్డి, పి. — ఉత్తర హరివంశము, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ. 1979.

49. రంగాజమ్మ — ఉషా పరిణయము, తంజావూర్ సరస్వతీ మహల్ సీరీస్. 1962.

50. ” ” మన్నారుదాస విలాసము, తంజావూరు సరస్వతీ మహల్ సీరీస్. 1955.

51. రాధాకృష్ణ, సర్వేపల్లి — ఇండియన్ ఫిలాసఫీ, జార్జి అలెన్ & అన్విన్ లిమిటెడ్. 7వ ముద్రణ. 1972

52. రామకృష్ణుడు, తెనాలి — పాండురంగ మాహాత్మ్యము. యం. శేషాచలం అండ్ కంపెనీ ప్రథమ ముద్రణ. 1970.

53. రామకృష్ణరాయణం, గుమ్మడం — భారతి. ( వ్యాసము )సెప్టెంబరు. 1975.

54. రామభద్రుడు, అయ్యలరాజు — రామాభ్యుదయము.

55. రామరాజ భూషణుడు — వసు చరిత్ర, వావిళ్ల ప్రచురణ. 1964.

56. ” ” — వసు చరిత్ర, యం. శేషాచలం అండ్ కంపెనీ. ప్రథమ ముద్రణ. 1970.

57. రామలింగేశ్వరరావు, తుమ్మలపల్లి — శ్రీచక్రవిలసనము. రెండవ ముద్రణ. 1974.

58. రుద్రకవి, కందుకూరి — నిరంకుశోపాఖ్యానము. వావిళ్ల ప్రచురణ. 1964.

59. లక్ష్మీకాంతము, పింగళి — ఆంధ్రసాహిత్య చరిత్ర, ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, రెండవ ముద్రణ. 1976.

60. లక్ష్మీరంజనము, ఖండవల్లి — ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము.
వెంకటరమణ పబ్లికేషన్. 1960.

61. లక్ష్మీసరస్వతి, యేలూరిపాటి — శ్రీహరివంశము (గద్యము)
ప్రథమ ముద్రణ. 1961

62. లీలాజ్యోతి, బొడ్డపాటి — ఉదాత్త సాహిత్య వ్యాసములు.
ప్రథమ ముద్రణ. 1968

63. విద్యానాథుడు — ప్రతాపరుద్రీయము, వావిళ్ల ప్రచురణ.
3 వ ముద్రణ. 1954

64. వీరేశలింగము పంతులు కందుకూరి — కందుకూరి వీరేశలింగకృత గ్రంథములు.
10వ సంపుటము – ఆంధ్రకవులు.
శ్రీ చింతామణి ముద్రాక్షరశాల 1899

65. వేంకటకవి, చేమకూర, — విజయవిలాసము,
వావిళ్ల ప్రచురణ 1962.

66 " " — సారంగధర చరిత్రము

67. వేంకటరమణశాస్త్రి, దువ్వూరి. — భారతి (వ్యాసము) డిశంబరు 1941

68. వేంకట రంగయ్య, మామిడిపూడి — సంగ్రహ ఆంధ్ర విజ్ఞాన కోశము.
సంపు. 1 1958

వేంకటరామనరసింహము కాకర్ల — ఆంధ్ర ప్రబంధములు – అవతరణ వికాసములు

70. " " — సాహిత్య దర్శనము, క్వాలిటీ పబ్లిషర్స్
ప్రథమ ముద్రణ 1979

71. వేంకటశాస్త్రి, మునునూరి. — విద్యార్థి కల్పతరువు, 4వ ముద్రణ 1979.

72. వేంకట సుబ్బారావు దివాకరుని — శ్రీవిద్య సుందరకాండ
వేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాల
నవోదయ కాలనీ, హైదరాబాదు
ప్రథమ ముద్రణ. 1981

73. వేంకటావధాని, దివాకర్ల — ఆంధ్రవాఙ్మయ చరిత్రము,
ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రచురణ
10వ ముద్రణ 1981

74. వేదవ్యాసుడు. — మహాభాగవతము.

75. శంకరభగవత్పాదులు — సౌందర్యలహరి
(చరలువాడవ్యాఖ్య) శ్రీ అరుణా బుక్
హౌస్, ప్రథమ ముద్రణ. 1982

76. ,, ,, — వివేకచూడామణి, వావిళ్ల ప్రచురణ 1967

77. శ్యామల కామశాస్త్రి, కాట్రు — ఆంధ్రవాచస్పత్యము.
ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ. 1968.

78. శేషేంద్రశర్మ, గుంటూరు — కవిసేన మేనిఫెస్టో.
ప్రథమ ముద్రణ. 1977.

79. ,, ,, — షోడశరామాయణ
రహస్యములు వ్యాఖ్యానం.

80. శ్రీనాథుడు — కాశీ ఖండము, వావిళ్ల ప్రచురణ 1962

81 ,, ,, — శృంగారనైషధము,
ఏ పి బిఆర్ ప్రథమ 1976

82 ,, ,, — హరవిలాసము,
వావిళ్ల ప్రచురణ 1966

83 శ్రీరామ అప్పారావు, పోణంగి నాట్య శాస్త్రము,
ప్రథమ ముద్రణ 1959

84 శ్రీరామమూర్తి, గురజాడ — కవి జీవితములు,
వావిళ్ల ప్రచురణ 1913

85 సత్యనారాయణ, విశ్వనాథ .... అల్లసానివాని అల్లిక జిగిబిగి

86 " " .... రామాయణ కల్పవృక్షము

87 " " .... కావ్యానందము, ప్రథమ ముద్రణ 1972

88 సీతారామశాస్త్రి, లంకా .... శ్రీమదద్వైత విజయము 1969

89 సుందరం ఆర్. వి. యస్. .... కన్నడ సాహిత్య చరిత్ర,
(రం. శ్రీ ముగళికి అనువాదము)
ఆం. ప్ర. సాహిత్య అకాడమీ 1977

90 సుప్రసన్నాచార్యులు, కోవెల .... సహృదయ చక్రము,
(సంస్కృతం) 1968

91 " " .... ఉద్దీపన వసుచరిత్ర పీఠిక,
ఆం. ప్ర. సాహిత్య అకాడమీ,
ద్వితీయ ముద్రణ 1980

92 సుబ్రహ్మణ్యము, జీ. వి. .... విజయవిలాసవస్తుతత్త్వము
1 వివేచన (వ్యాసము)
ఉస్మానియా విశ్వవిద్యాలయ,
ఆంధ్రశాఖ డిశంబరు 1976

93 సూరన, పింగళి .... కళాపూర్ణోదయము

94 " " .... ప్రభావతీ ప్రద్యుమ్నము,
ఏ పి బి డి ప్రచురణ
ప్రథమ ముద్రణ 1970

95. సూర్యనారాయణశర్మ పేదాల — అంతరార్థ రామాయణము
ప్రథమ ముద్రణ. 1981

96. సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానము — సాహిత్యపదకోశము, తెలుగు అకాడమీ,
హైదరాబాదు, ప్రథమ ముద్రణ 1978

97. సూర్యనారాయణశాస్త్రి, .... కావ్యాలంకార సంగ్రహము,
సన్నిధానము యం. శేషాచలం అండ్ కంపెనీ
5వ ముద్రణ 1978



98. సోమన, నాచన .... ఉత్తర హరివంశము
ఆం. ప్ర. సాహిత్య అకాడమి,
హైదరాబాదు 1979

99. సోమనాథుడు, పాల్కురికి .... బసవపురాణము, ఆంధ్రగ్రంథమాల
2వ ముద్రణ 1952

100. సోమశేఖరశర్మ, .... విజ్ఞానసర్వస్వము, సంపు. 3, తెలుగు
మల్లంపల్లి భాషా సమితి, హైదరాబాదు 1959.
విజ్ఞాన సర్వస్వము. సంపు. 4 తెలుగు
భాషాసమితి, హైదరాబాదు 1981



## దర్శించిన గ్రంథాలయములు:



1 ఆంధ్ర సారస్వత పరిషత్తు గ్రంథాలయము
2 ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయము
3 కళాశాల గ్రంథాలయము, నాగార్జున ప్రభుత్వ కళాశాల, నల్లగొండ
4 " " మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మ కళాశాల, గద్వాల
5 " " గీతావిజ్ఞానాంధ్ర కళాశాల, నల్లగొండ
6 కేంద్ర గ్రంథాలయ సంస్థ గ్రంథాలయము, నల్లగొండ
7 "సారస్వత నికేతనము", వేటపాలెము
8 శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయము, హైదరాబాదు
9 స్వగృహ గ్రంథాలయము



# తప్పొప్పుల పట్టిక



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| తొలిపలుకు | 17 | సంలోషము | సంతోషము |
| ,, | 18 | నే డిట్ల | నేడిట్లు |
| 9 | 20 | వ్యాప్తినతిదించిరి | వ్యాప్తివందించిరి |
| 9 | 22 | సంస్కృతము | సంస్కృతమున |
| 9 | 24 | ఏది యె ట్లన్నను | ఏది యెట్లున్నను |
| 10 | 11 | మిగిలినవన్నియు | మిఁగిలినవన్నియు |
| 10 | 18 | దేశి పద్ధతితి | దేశి పద్ధతివి |
| 11 | 8 | కన్నడ సాహిత్యముచే | కన్నడ సాహిత్యము |
| 14 | 24 | లక్షణమునుజీవింప | లక్షణము నుజ్జీవింప |
| 15 | 2 | యమపదింపవనని | యమపదింపవలని |
| 25 | 1 | మొనర్చివారు | యొనర్చినారు |
| 40 | అధోజ్ఞాపిక | 1. శ్రీవిద్య సుందరకాండ పుట.... | 1. శ్రీవిద్య సుందరకా ష |
| 45 | 13 | సిఞ్వస్త్రీ | సిఞ్వస్త్రీ |
| 49 | 6 | కవుననే | కావుననే |
| 51 | 8 | శృంగారనైషధ | శృంగారనైషధము |
| 51 | 9 | వియయవిలాసము | విజయవిలాసము |
| 52 | 4 | ముది రూపంబు | ముదిత రూపంబు |
| 52 | 17 | శ్రీవిద్యా | శ్రీవిద్య |
| 53 | 8 | సనము | స్థానము |
| 53 | 17 | రథచక్రమును | రథచక్రములు |
| 54 | 4 | లే నుట | లేదనుట |
| 54 | 4 | యనదది | యన నది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 54 | 13 | వేరని పై్యదుడు | నేరని వైద్యుడు |
| 54 | 17 | పమాగము | పమాగమము |
| 54 | 20 | న్గరకాంతలు | వగరకాంతలు |
| 60 | 1 | పుణ్యా్శ్రమున | పుణ్యాశ్రమమువ |
| 60 | 12 | ద్యుపాలంబన | ద్యుపాలంభన |
| 61 | 20 | చిత్రకళానిపుణ | చిత్రకళానిపుణ |
| 62 | 25 | యన్నిస్థాలి | యగ్నిస్థాలి |
| 63 | 15 | మరియుక | మరియొక |
| 63 | అధోజ్ఞాపిక | 1..... .... .... | 1. పంపక్కృత నాటకము |
| 64 | 5 | ఉరకణకములు | ఉరణకములు |
| 64 | అధోజ్ఞాపిక | 1 .... .... .... | 1. సంవక్కృత నాటకము |
| 64 | ,, | 2..... .... .... | 2. ,, |
| ,, | ,, | 3. .... .... .... | 3, ,, |
| 66 | ,, | 1 .... .... .... | 1. ,, |
| ,, | ,, | 2 .... .... .... | 2. ,, |
| 67 | 3 | తమలో ఎవరు | తమలో నెవరు |
| 70 | 19 | నారదువి | నారదుని |
| 72 | 10 | గలదు | గలవు |
| 77 | 16/17 | గుణగణమ్ముల | గుణగణములు |
| 83 | 6 | వర్ణింపబడుట | వర్ణించుట |
| 83 | 17 | వంతులు | వంతుల |
| 83 | 17 | వైశిష్యము | వైశిష్ట్యము |
| 83 | అధోజ్ఞాపిక | 1 .... .... .... | 1. న్వర్ణహంప |
| ,, | ,, | 2 .... .... .... | 2. శృంగార నైషధము |
| 85 | 23 | ఊర్వశికి | ఊర్వశికి |
| 86 | 12 | వందించును | వందించుటను కల్పించెను. |
| 87 | 4 | విహారంబు | విహారంబుల |
| 87 | 7 | పురూరవశ్చరితయను | పురూరవశ్చరితమను |
| 88 | 10 | యభిప్రాయ | అభిప్రాయ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 95 | 23 | శరదృతువు | శరదృతు |
| 98 | 22 | మిరయ | మరయ |
| 99 | 13 | సిహాసనస్థ | సింహాసనస్థ |
| 100 | 4 | సత్రతప్రభుత్వ | సత్రప్రభుత్వ |
| 101 | 17 | కుంతకుడు | కుంతభుడు |
| 102 | 9 | సందంతంగా | సందంతగా |
| 103 | 23 | జయింపగలవని | జయింపగలవము |
| 104 | 1 | జదళికా | కదళికా |
| 109 | 2 | యాయె | యామె |
| ,, | 10 | యెక్కడి | మెక్కడి |
| ,, | 17 | యెద్దియో | మెద్దియో |
| 110 | 21 | జంచరి | జంచరీక |
| 116 | 4 | పితయై | పితమై |
| ,, | ,, | శాళియే | శాళిమే |
| ,, | 13 | ఎదురుపోలు | ఎదురుకోలు |
| ,, | 21 | తలంఁబ్రాలు | తలఁబ్రాలు |
| ,, | 25 | పరిణమోత్సవ | పరిణయోత్సవ |
| 118 | 5 | యుండుటయుఘ | యుండుటయము |
| ,, | 25 | ప్రతిబంధసంబు | ప్రతిబంధకంబు |
| 119 | 10 | పుష్పలావిక | పుష్పలావికల |
| ,, | 17 | పెలఁబెట్టు | పెలఁగొట్టు |
| ,, | 21 | గడివోము | గడివోమి |
| 121 | 16 | అందే కాధు | అంతే కాదు |
| 124 | 13 | యాచకుడ | యాచకుల |
| 125 | 13 | యమక | యమకము |
| 128 | 8 | పద్యము | పద్యమున |
| ,, | 12 | స్థితప్రజ్ఞని | స్థితప్రజ్ఞాని |
| ,, | 20 | నిర్విదాంశము | నిర్వివాదాంశము |
| 132 | 11 | చల్లగ మన్నవి | చల్లగ మన్నది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ,, | 22 | నాసిమిము | నాసికము |
| 133 | 10 | వీణవాదనము | వీణావాదనము |
| ,, | 14 | మాధురీధరీణ | మాధురీధురీణ |
| ,, | 23 | మంసును | మందును |
| 142 | 12 | డిందినది | డించినది |
| 148 | 5 | సంతాము | సంతానము |
| ,, | 6 | చేయుకై | చేయుటకై |
| 151 | 1 | బిగివు | బిగువు |
| 152 | 17 | మహాస్య | మనహ్య |
| 153 | 5 | పర్ధిషుండు | పరిష్ధుండు |
| ,, | 10 | కటీకలిత | కటకలిత |
| 159 | 1 | బంబు | బంటు |
| ,, | 15 | శాత్రువు | శాత్రవు |
| 160 | 3 | లేదు | లేవు |
| 160 | 24 | పీలు పుష్పవద్వంశ్య | పీట పుష్పవద్వంశ్య |
| 164 | 2 | యగ్ధించ | యర్థించ |
| 168 | 8 | నన్నవలప | నన్న వలిప |
| ,, | 20 | యరం మీంద | యరంగు మీంద |
| 173 | 21 | బిమచు | బుమచు |
| 174 | 11 | భావంబునా | భావంబులు |
| 176 | 25 | వ్యంజకములు | వ్యంజకము |
| 182 | 14 | సంయోగమున నే | సంయోగమున కి |
| 186 | 3 | గిబిగింత | గిలిగింత |
| 187 | 5 | వృత్తి | వృత్తి |
| 188 | 11 | యదు | యుదు |
| 189 | 14 | లేం గురు | లేంజిగురు |
| 193 | 11 | సంభోగమువ | సంభోగమును |
| 198 | 16 | బాలం | బాలం |
| 208 | 16 | వారికి | హరికి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 215 | 2 | గూలునపుడు | గూలునపుడ |
| 225 | 21 | జూచ్చినాడు | తొచ్చినాడు |
| 230 | 18 | భుమి | భువి |
| ,, | 19 | భూవిలో | భువిలో |
| 231 | 4 | నెఱుగదు | నెఱుగడు |
| 237 | 11 | బ్రక్రయైతి | బ్రతికయై |
| 239 | 25 | సిద్ధములవి | సిద్ధమని |
| 249 | 1 | మార్చిన | కూర్చిన |
| 250 | 1 | మం | మంచు |
| 256 | 15 | స్తుతిమొనర్చు | స్తుతి యొనర్చు |
| 263 | 12 | మనోరంజ | మనోరంజన |
| 271 | 25 | సభయున్నట్లు | సభయు నట్లు |
| 281 | 3 | ముద్ర | ముద్రమ |
| 282 | 24 | గ్రహములైనా | గ్రహములైన |
| 283 | 9 | ఆ ధనువు | ధనువు |
| 292 | 3 | చేయుట | తపము చేయుట |
| 296 | 10 | పూర్పి . | పూర్తి |
| 296 | 12 | నెల్ల .... మార్గదర్శమై | తెల్ల .... మాదర్శమై |
| 297 | 16 | మాలితోగ్ర | మాలికోగ్ర |
| 312 | 12 | పిలహి | పిలాహి |
| 313 | 14 | పుణ్యాభిక్య | పుణ్యాధిక్య |
| ,, | 16 | తప జాతి | తన జాతి |
| 315 | 18 | ప్రతిరూపకము | ప్రతి రూపము |
| 317 | 22 | కర్మము | మర్మము |
| ,, | ,, | దాతపై | దాతలై |
| 319 | 13 | వర్షాపేళలును | వర్షాపేళలను |
| 320 | 19 | సుగుణ | సగుణ |
| 321 | 20 | సాహిత్యము | సాహిత్యముల |
| | | లనేక ముఖముగ | నేకముఖముగ |

